శ్రీ శివాభ్యాం నమః. శాస్త్రపద్ధతిననుసరించి వానలు ప్రజలకు సుఖమును

# శ్రీ తారణ సంవత్సర సిద్ధాంత పం

శ్లో॥ శ్రీకల్యాణగుణావహం రిపుహరం దుస్స్వప్న దోషాపహం, గంగాస్నాన విశేషపుణ్యఫలదం గోదానతుల్యం నృణాం ॥ ఆయుర్వృద్ధిద ముత్తమం శుభకరం సంతానసంపత్ప్రదం, నానాకర్మ సుసాధనం సముచితం పంచాంగ మాకర్ణ్యతామ్.

## రాహుకాలము

| వారములు | | మొదలు | వరకు |
|---|---|---|---|
| ఆదివారము | - | 5-30 | 7 |
| సోమవారము | - | 8-30 | 10 |
| మంగళవారము | | 4 | 5-30 |
| బుధవారము | - | 1 | 2-30 |
| గురువారము | - | 2-30 | 4 |
| శుక్రవారము | - | 11-30 | 1 |
| శనివారము | - | 10 | 11-30 |



## గుళికకాలము

| వారములు | | మొదలు | వరకు |
|---|---|---|---|
| ఆదివారము | - | 4 | 5-30 |
| సోమవారము | - | 2-30 | 4 |
| మంగళవారము | | 1 | 2-30 |
| బుధవారము | - | 11-30 | 1 |
| గురువారము | - | 10 | 11-30 |
| శుక్రవారము | - | 8-30 | 10 |
| శనివారము | - | 7 | 8-30 |

పంచాంగకర్త:

## శ్రీ చిరుకుల వెంకటరమణ శాస్త్రిగారిచే గుణింపబడినది.

---

## శ్రీ తారణ సంవత్సర ఫలితాంశము

శనికి రాజత్వ నీరసాధిపత్యములు, గురునకు మంత్రిత్వము, బుధునకు సేనాధిపతిత్వ, అర్ఘాధిపతిత్వ, మేఘాధిపత్యములును, రవికి సస్యాధిపత్యమును, శుక్రునకు ధాన్యాధిపతిత్వము, కుజునకు రసాధిపతిత్వము కలిగియున్నందున నీ తారణసంవత్సరమందు ప్రజలకు కనారోగ్యమున్ను, శస్త్రాగ్నిచోరాదిబాధలున్ను, మారీవిషూచ్యాదిబాధలున్ను గల్గును. వసంతగ్రీష్మఋతువులలో ఎండలు మిక్కుటముగా పశ్చిమవాతముతో నిండియుండును. శ్రావణమాసములోగా మంచివర్షము లుండవు. ఆపైని సస్యానుకూలముగ సువృష్టియుండి నదీనదములు సంపూర్ణముగా ప్రవహించును. మధ్యదేశమందు వరదలబాధ యుండును. ప్రాగీశాన్యదేశములందు కార్తికమున గాలితోగూడిన వర్షములుండును. పసువులకెట్టి అరిష్టములు లేకయుండును. అంత్యసస్యములు 12 వీసముల పంటను, మధ్యసస్యములు 10 వీసముల పంటను, పూర్వసస్యములు 6 వీసముల పంటను గలిగియుండును. మొత్తముమీద పంట 9 వీసములు ఫలించును. వడ్లు, వేరుశెనగ, మినుములు, పెసలు, నువ్వులు అధికముగా ఫలించును, వడ్లలో ఎరుపురంగుగలవాటికి పంటతక్కువగను, తెలుపురంగుగలవాటికి పంట అధికముగను ఫలించును. కందులు, శెనగలు, గోధుమలు, చెరుకు, పసుపు మొదలగు పంటల కరిష్టము గల్గును. వస్తువులన్నిటికి ధరలు గొప్పహెచ్చు తగ్గుదలతో గూడియుండును. జ్యేష్ఠ శు ౪ ది (26-5-44) గోదావరీపుష్కరారంభమున్ను, వైశాఖ బ ౧ (9-5-44) మొదలు ఆషాఢ బ ౧౩ (18-7-44) వరకు శుక్రమౌఢ్యమున్ను, భాద్రపద శు ౪ (22-8-44) మొదలు ఆశ్వయుజ శు ౩ (20-9-44) వరకు గురుమౌఢ్యమున్ను, ఆషాఢ అమావాస్య (20-7-44) సూర్యగ్రహణమున్ను, ఒకతూము వర్షమున్ను గలుగును.

N. B. వర్షయోగములు ధరలు మొదలగు ఫలములు మాసవారీగా మున్ముందు వివరింపబడినవి.

స్వస్తి సర్వేషాం సమస్త సన్మంగళాని భవంతు శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ.

మంత్రీ-గురుఫలం:—వివిధధాన్యయుతా ఖలు మేదినీ ప్రచుర తోయఘనా మదిలా భవేత్, నృపతయో జనపాలన తత్పరా సుర పరౌననుమంత్రిపదంగతే॥ వర్షము లుండుటచే పంటలు బాగుండును. రాజులకు ప్రజలకు సుఖము గల్గును.

సేనాపతి-బుధఫలం:—విపుల సౌమ్య సుఖం శశిజే ప్రభౌ భవతి రాష్ట్రజనేషు విశేషతాం, శశిసుతే యదిఘోటకపాలకే పథిషు ద్రవ్యవతాం నభయం క్వచిత్॥ జనులకు సౌఖ్యము ఏకరీతిగా నుండక, అంతరాంతరములుగా నుండును. చోరబాధలు స్వల్పము.

సస్యాధిపతి-రవిఫలం:—సస్యాధినాథే తరణౌ హి పూర్వం ధాన్యం సమర్ఘం బహవోపిచోరాః, యుద్ధం నృపాణాం జలదా జలాఢ్యా స్వల్పం చ సస్యం బహుభూతహానిః॥ పూర్వసస్యములు చౌకయగును. చోర, యుద్ధాదిబాధ లధికమగును. అధికవృష్టియుండును.

ధాన్యాధిపతి-శుక్రఫలం:—అతివృష్టి స్సుభిక్షంచ ఫలితా ధాన్యజాతయః, మానవా నీరుజాస్సర్వే శుక్రేధాన్యాధిపే సతి॥ అతి వృష్టిగల్గి సకలధాన్యములు బాగా ఫలించును. ఆరోగ్యవంతులై ప్రజ లుందురు.

అర్ఘాధిపతి-బుధఫలం:—అర్ఘాధినాథే రజనీకరాత్మజే వృష్ట్యర్ఘ సస్యాని బహూనిచ స్యుః, కుమారపాషండజలేంద్రజాలికాః ప్రభూతయస్స్యుర్న తథాపరేజనాః॥ అధికవృష్టి, ధరలధికము, మాయావుల కధికప్రాబల్యము గల్గియుండును.

మేఘాధిప-బుధఫలం:—అమృతరశ్మిసుతే యదివారిపే బహుజలం తుష ధాన్యరసాదికం, ద్విజవరా యజనోత్సుకచేతసో వివిధ సౌఖ్యయుతా ధరణీతలా॥ అధికవృష్టి, వరి, వేరుసెనగ మొదలగునవి బాగా ఫలించును. ప్రజలు స్వధర్మనిరతు లగుదురు.

రసాధిప-కుజఫలం:—యది ధరాతనయో రసపో భవే న్నరసరాశి యుతా జనతా శుభా, నరపతిర్వివభోజనతాపదోన జలదో బహువృష్టి రోఘని॥ అధికవృష్టి, రసవస్తుసమృద్ధి, క్షేమారోగ్యప్రాప్తిగల్గును.

నీరసాధిప-శనిఫలం:—అయఃపిండాది లోహానాం కృష్ణ ద్రాదివస్తునాం, అర్ఘవృద్ధిః ప్రజాయేత మందే నీరసనాయకే॥ [illegible] ము, తిలలు, మినుములు మొదలగువాటిధరలు పెరుగును.

పురోహిత-రవిఫలం:—పురోహితే యదా సూర్యే పురాణాం భూభృతాం సదా, సుఖం స్యాద్గో ద్విజాతీనాం బహుసస్యార్ఘ వృష్టయః॥ ప్రజలకు, గోవులకు సుఖము గల్గును.

పరీక్షక-శనిఫలం:—పరీక్షకే సూర్యసుతే బుద్ధిహీనాః పరీక్షకాః, అనర్ఘమల్పవృష్టిశ్చ కృష్ణద్రవ్య సమృద్ధితా॥ అల్పవృష్టి, ధరలు మందము.

గణక-చంద్రఫలం:— గణకే ఋక్షనాథేన్యుర్గణకాస్సౌమ్య బుద్ధయః, సర్వసస్యాన్వితా ధాత్రీ రాజానో నయశాలినః॥ పంటలు బాగా పండును.

గ్రామపాలక-గురుఫలం:—గ్రామాణాం పాలకేజీవే సుఖినో గ్రామవల్లభాః, గ్రామాస్స్యుర్ధనధాన్యాదిసమృద్ధాః సుఖజం ఫలం॥ గ్రామపాలకులు సుఖముగానుండి ప్రజలకు సుఖమును కలుగజేతురు. ధనధాన్యసమృద్ధి గల్గును.

దైవజ్ఞుడు-బుధఫలం:—దైవజ్ఞే చంద్రసుతే దైవజ్ఞాస్సర్వ శాస్త్ర తత్వజ్ఞాః, సమ్యగ్విచార్య సకలం వదంతి పృథ్వీభృతాం నిత్యం. తా. దైవజ్ఞులు శాస్త్రప్రకార్యాలోచనచే రాజులను ప్రజలను సుఖముగా చేకూర్తురు.

పశుపాలకత్వము, స్థానసంరక్షకత్వము ఒకరికే సంభవించుట వల్ల నందున పశువులు సుఖముగానుండి క్షీరవృద్ధిగలుగును.

పూర్వ, మధ్య, అంత్య సస్యాధిపతులు ముగ్గురు క్రమముగా రవి, బుధ, శుక్రులై శుభులైనందున అన్నిపంటలు బాగుగా పండును.

మేఘఫలం:—నిరంతరం మహావర్షం మస్త్రదేశే మహాజలం, భవంతి సర్వధాన్యాని కాలమేఘస్య లక్షణం॥ మంచివర్షము, సస్యసమృద్ధి గల్గును.

ఆఢక ప్రమాణం:—షష్టియోజనవిస్తీర్ణం శతయోజనమున్నతం, ఆఢకస్య ప్రమాణంతు దేవమానేన గణ్యతే॥ ఈ ఆఢకము-అర్ద్రాది జ్యేష్ఠ కు ౮ పర్యతం కేళినీహస్తగతమగుటచే సస్యసమృద్ధిన్నీ, అనంతరము సస్యారిష్టమును గలుగజేయును.

వర్ష విభాగము:— నవభాగాస్సముద్రేషు పర్వతేషుచపంచచ, ధరాయాం సప్తభాగాశ్చ ఏవం వర్షతిచ త్రిధా॥ భూనాహాసుడు శంఖుడగుటచే సౌఖ్యమున్ను, హేమమాలి యనువాయువు వల్ల సువృష్టి సస్యవృద్ధులున్ను గల్గును.

మౌఢ్యనిర్ణయము:—వైశా బ ౧ (9-5-44)నుంచి ఆషాఢ బ ౧౩ (18-7-44) వరకు ప్రాగస్తమిత శుక్రమౌఢ్యము. భాద్రపద శు ౪ (22-8-44)నుంచి ఆశ్వయుజ శు 3 (20-9-44) వరకు పశ్చాదస్తమితగురుమౌఢ్యము.

ఈ కాలములు శ్రీ సూర్యసిద్ధాంతానీతములు. ఇందు బాల్యవార్ధక్యములుండును - పాశ్చాత్యపద్ధతిచే వైశా. బ ౧౪ నుంచి శ్రావణ. శు౧౩ వరకు, శుక్రమౌఢ్యమున్ను, శ్రావణ. బ౧౩ నుంచి భాద్రపద. బ౧౩ వరకు గురుమౌఢ్యమున్ను యుండును. కాని పాశ్చాత్యపద్ధతిలో బాల్యవార్ధక్యము లుండవు. పాశ్చాత్యరీతి భారతీయులకు గ్రాహ్యముగాదు. [గోదావరీపుష్కరారంభము.

పుష్కర నిర్ణయము:—జ్యేష్ఠ శు ౪ శుక్రవారం (26-5-44)

రాబోవు పార్థివసంవత్సర రాజాదిసూచన:— రాజా సురుః, మంత్రీ శుక్రః, సేనాధిపతిః గురుః, సస్యాధిపః చంద్రః, ధాన్యాధిపః శ్శనిః, అర్ఘాధిపః గురుః, మేఘాధిపః గురుః, రసాధిపః బుధః, నీరసాధిప శ్చంద్రః, పశుపాలకః గోపాలః, స్థానసంరక్షకః కృష్ణః, నాలుగు తూముల వర్షము, 14 వీసముల పంట, రాత్రియం దార్ద్రాప్రవేశము.

### కందాయఫలములు

| అశ్వి | భ | కృ | రో | మృ | అర్ద్ర | పున | పుష్య | అశ్లే |
|---|---|---|---|---|---|---|---|---|
| ౨ | ౫ | ౦ | ౩ | ౬ | ౧ | ౪ | ౭ | ౨ |
| ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ |
| ౧ | ౪ | ౨ | ౦ | ౩ | ౧ | ౪ | ౨ | ౦ |
| మ | పూఫ | ఉఫ | హ | చి | స్వాతి | విశా | అనూ | జ్యేష్ఠ |
| ౫ | ౦ | ౩ | ౬ | ౧ | ౪ | ౭ | ౨ | ౫ |
| ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ |
| ౩ | ౧ | ౪ | ౨ | ౦ | ౩ | ౧ | ౪ | ౨ |
| మూ | పూషా | ఉషా | శ్ర | ధ | శ | పూభా | ఉభా | రే |
| ౦ | ౩ | ౬ | ౧ | ౪ | ౭ | ౨ | ౫ | ౦ |
| ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ |
| ౦ | ౩ | ౧ | ౪ | ౨ | ౦ | ౩ | ౧ | ౪ |

శ్లో॥ ఏకశూన్యే మహావ్యాధి ర్మధ్యశూన్యే మనోవ్యథా,
అంత్యేశూన్యే ఫలం స్వల్పం త్రిశూన్యే నిష్ఫలం భవేత్.
విషమే వృద్ధిలాభస్స్యా త్సమేతు సమతా భవేత్,
శూన్యే శూన్యత్వ మాప్నోతి కందాయఫల మీదృశం.

సంవత్సర ఫలాని:— అశ్వినీ, పుష్య, స్వాత్యభిజిత్తులకు ఆయ ప్రక్షేపం-భరణి, ఆశ్లేష, విశాఖ, శ్రవణములకు అర్ధలాభం-కృత్తిక, మఖ, అనూరా, ధనిష్ఠలకు మనస్తాపం-రోహిణి, పూర్వ ఫల్గుని, జ్యేష్ఠ, శతభిషములకు రాజపూజ్యత-మృగ, ఉత్తర ఫ, మూల, పూర్వాభాద్రలకు యుద్ధభయం-ఆర్ద్ర, హస్త, పూషా, ఉత్తరాభాద్రలకు భూషణం-పునర్వ, చిత్ర, ఉషా, రేవతులకు రోగభయం.

చాంద్రార్ఘ్యలు— భాద్రపద, కార్తిక, ఫాల్గునములందత్యర్ఘ-నైరాశ్య, శ్రావణ, మార్గశిర, మాఘమాసములందు సమర్ఘ-చైత్ర, జ్యేష్ఠ, ఆషాఢ, ఆశ్వయుజ, పుష్యములందు శూన్యార్ఘ.

సౌరార్ఘ్యలు:— మిథున, సింహ, కుంభమాసములం దత్యర్ఘ-మీన, కర్కాటక, తులా, ధనుర్మాసములందు సమర్ఘ, మేష, వృషభ, కన్యా, వృశ్చిక, మకరమాసములందు శూన్యార్ఘ.

రవిచార ఫలం:— చైత్ర బ ౫ గురువారం (13-4-44) రవికి మేష ప్రవేశఫలం— తిథిఫలం శుభము, వారఫలం సువృష్టి, కాలఫలం, అనర్ఘత, చోరరోగాగ్ని బాధలు గల్గును.

ఆర్ద్రాప్రవేశఫలం:— ఆషాఢ శు ౧ బుధవారం (21-6-44) సూర్యుడార్ద్రానక్షత్రమందు ప్రవేశించుటకు ఫలం. తిథిఫలం-శుభం, వారఫలం సుఖం, నక్షత్రఫలం దుర్భిక్షం అనావృష్టి, యోగఫలం సస్యవృద్ధి, కరణఫలం అతివృష్టి, లగ్నఫలం అతివృష్టి.

మకరసంక్రాంతి:— పుష్య బ ౧౪ శనివారం (13-1-45) ఉదయాది ఘ ౩౭-౧౬ లకు, అమావాస్యాతిథి, పూ-షా నక్షత్రము, వ్యాఘాతయోగము, చతుష్పాత్కరణము, సింహలగ్నమందు రవికి మకర సంక్రమణమైన ఫలం. సంక్రాంతి పురుష లక్షణం॥ త్రిశీర్షం ద్విముఖం చైవ చతుర్వక్త్రం త్రినేత్రకం, లంబకర్ణం రక్తదంతం లంబభ్రూ దీర్ఘ నాసికం, అష్టబాహుం ద్విపాదంచ వికృతం కృష్ణవర్ణకం, శతయోజన మాన్నత్యం విస్తీర్ణం ద్వాదశస్మృతం, ఏవంరూపం సువిజ్ఞేయం సంక్రాంతేః పురుషస్యహి॥ అస్యపురుషస్య-రాక్షసనామధేయః చండాలారిష్టం, నిర్మలోదకస్నానం-శుభం, పర్ణవస్త్ర



ధారణం-సుఖం, కృష్ణాగరుగంధం-కలహారిష్టం, పాటలీపుష్పం-యశోహానిః, హేమాభరణం-స్వర్ణహానిః, దారుపాత్రే భక్షణం-అర్ఘనాశః, మధ్వాహారం-ప్రజాపీడా, ఖర్జూరఫలభక్షణం-ఆరోగ్యం, అజవాహనం-అజనాశః, అంకుశాయుధం-యుద్ధం, పూర్వభ్రతం-ప్రజారోగ్యం, ఛత్రధారణం-గజారిష్టం, [illegible]దిగ్గమనం-సర్పారిష్టం, ఊర్ధ్వముఖచేష్టా-ప్రజాసౌఖ్యం, సుప్తావస్థా-ప్రజాపీడా.

పక్షఫలం:— కృష్ణపక్షే యదా పుష్య [illegible] భాస్కరః, సువృష్టిః క్షేమమారోగ్యం సుభిక్షం సస్యసంపదః॥ [illegible] ఫలం సస్యనాశః. వారఫలం—రోగ, చోరశస్త్రాదిబాధా, లగ్నఫలం. దేశారిష్టం, ముహూర్తఫలం-కలహప్రదః, కాలఫలం. దుర్భిక్షం.

పుణ్యకాల నిర్ణయం:— "[illegible] పూర్వభాగే, పరభాగే నిశీథేవా, మకరసంక్రమే, [illegible] పుణ్యం, [illegible] పూర్వార్ధం [illegible] పంచనాడ్యః పుణ్యతమాః"— ఈవచనమువల్ల ప్రకృతము పుష్య బ ౩౦ ఆదివారం ఉదయాది ౫ ఘడియలు, సంక్రమణప్రయుక్త స్నానాదికర్మలకు, పుణ్యతమమున్ను, ఆనాడు మధ్యాహ్న పర్యంతం పుణ్యతరమున్ను, ఆనాటి సాయంకాలమువరకు పుణ్యకాలమున్ను అగును.

చంద్రచార ఫలం:— భరణ్యాది మణ్డలఫలం-సస్యవృద్ధి, జ్యేష్ఠ శుక్ల ప్రతిపద్యుక్త భౌమవారఫలం— దుర్భిక్షరోగ, చోరాగ్ని బాధ. ఆషాఢపంచమీయుక్త భానువారఫలం-అనావృష్టి దుర్భిక్షములు, తచ్ఛుక్లనవమీయుక్త చిత్రానక్షత్రఫలం-సర్వసస్యసమృద్ధిః.

సూర్యగ్రహణం:— ఆషాఢ బ ౩౦ గురువారం, రాహుగ్రస్త సూర్యగ్రహణము, ధూమ్రవర్ణము, నైరృతిస్పర్శ, వాయవ్య మోక్షం. గ్రహణమాసఫలం—[illegible] చీనదేశముల కరిష్టము. [illegible] వైశ్యశూద్రజాతుల కరిష్టము. వాయుమండలఫలం—అధిక వాయువు వలన దేశోపద్రవము. అనావృష్టి, లోకమున జాడ్య బాధలు.



| | ఘ. వి | | గం. ని |
|---|---|---|---|
| ఉదయాది స్పర్శకాలము | ౬-౦ | ఉద. | 9-3 |
| మధ్యకాలము | ౮-౮ | | 9-54 |
| మోక్షకాలము | ౧౧-౩౦ | | 11-15 |
| ఆద్యంతపుణ్యకాలము | ౫-౩౦ | | 2-12 |

ఈకాలములు సూర్యసిద్ధాంతానీతములు. పాశ్చాత్యపద్ధతిచే స్పర్శ గం. 9-30 మోక్షం 1-0 పుష్య పూర్ణిమనాడు శ్రీసూర్యసిద్ధాంతరీతిచే గ్రహణములేదు. పాశ్చాత్యపద్ధతిచే స్పర్శ 9-0 మోక్షం 9-24. పాశ్చాత్యరీతి భారతీయులకు గ్రాహ్యముగాదు.

రాజపూజ్యావమానములు

| | పూ. | అ. | | పూ. | అ. |
|---|---|---|---|---|---|
| మేషం | ౩ | ౧ | తుల | ౩ | [illegible] |
| వృషభం | ౬ | ౬ | వృశ్చికం | ౩ | ౧ |
| మిథునం | ౨ | ౬ | ధనుస్సు | ౬ | ౧ |
| కర్కాటకం | ౫ | ౬ | మకరం | ౨ | ౪ |
| సింహం | ౧ | ౫ | కుంభం | ౫ | ౪ |
| కన్య | ౪ | ౫ | మీనం | ౧ | [illegible] |

## ఆదాయ వ్యయములు

| | ఆ. | వ్య. | | ఆ. | వ్య. |
|---|---|---|---|---|---|
| మేషవృశ్చికములకు | ౧౪ | ౧౪ | సింహమునకు | ౮ | ౧౪ |
| వృషభతులలకు | ౮ | ౮ | ధనుర్మీనములకు | ౨ | ౮ |
| కన్యామిథునములకు | ౧౧ | ౫ | మకరకుంభములకు | ౫ | ౨ |
| కర్కాటమునకు | ౫ | ౫ | | | |

**కుజచారఫలం:—**అబ్దాది చైత్రశు౬వరకు మృగశిర చారమువల్ల సుభిక్షము,దూది ధర పెరుగుట. తదాది, వైశా శు ౨ వరకు ఆర్ద్రా చారఫలము నువ్వులు,మినుములు, పెసలు, ఇనుము, పొగాకులకుధరలు పెరుగును. తదాది వైశా బ ౧౦ వరకు పునర్వసు చారఫలం–మహిషాది పశువులకరిష్టము.తదాది జ్యేష్ఠ బ ౩ వరకు పుష్యమిచారఫలం–లోకమున చోర, రోగాగ్ని బాధలు, తదాది.ఆషాఢ శు ౧౧ వరకు ఆశ్రేషాచారఫలం–వర్ష ప్రతిబంధకము, ధాన్యములకు ధర పెరుగుట. ఆషాఢ శు ౧౧ ప్ర॥ శ్రావణ శు ౩ ప॥ వర్షాభావము,నువ్వులు పెసలు మొదలగు ధాన్యములు తగ్గిపోవుటయు గలుగును. శ్రావణ శు ౩ ప్ర॥ బ ౧౦ ప॥ అల్పవృష్టి, ప్రజాపీడ, తైలాదులకు ధర పెంపు గలుగును. శ్రావణ బ ౧౦ ప్ర॥ భాద్రపద బ ౧ ప॥ వర్షావరోధము, చతుష్పాత్పీడ, అశ్వాదులకు మహార్ఘత గలుగును. భాద్రపద బ ౧ ప్ర ఆశ్వయుజ శు ౬ వఱకు అల్పవృష్టి, శుష్కధాన్యాదులకు, నెయ్యి,బెల్లం ఉప్పు వీటికి ధర పెంపున్నూ గలుగును. అశ్వయుజ శు ౬ మొదలు బ ౧౩ వఱకు లోకమునకు తీవ్రమైన రోగాదిపీడలు, బియ్యము, గోధుమలు వీటికి ధర పెంపున్నూ గలుగును. ఈ బ ౧౩ మొ॥ కార్తిక బ ౨వరకు అనావృష్టిన్ని,తదాది మార్గశిర శు ౬ వఱకు విశాఖయందు కుజచారముచే దూది గోధుమలు వీటికి ధర పెరుగును. మార్గశిర శు ౬ ప్ర॥ బ ౧౦ ప॥ సుభిక్షమున్నను పశుపక్ష్యాదులు పీడనొందును. తదాది పుష్య శు ౧౫ వ॥ స్వల్పవృష్టియు, రోగాది భయములున్నూ గలుగును. అనంతరం మాఘ శు ౨ ప॥ ద్విజక్షత్రియవర్ణములకు పీడయు, వడ్లు మొదలగు ఉలకగల ధాన్యముల కత్యర్ఘము గలుగును. అనంతరం ఫాల్గున శు ౭ ప॥ మేఘములు బాగుగ వర్షించును. పశువులు స్వల్ప క్షీరప్రదములుగ నుండును. ఈభూమి అన్నపూర్ణయై యుండును. శాలితిలాజ్యమాషాదులకు ధరలు పెరుగును. ఫాల్గున శు ౭ ప్ర॥ బ ౧౧ ప॥ రోగాభివృద్ధి, ధాన్యసమృద్ధి,వర్షాభావములు గలుగును. అనంతర మబ్దాంతము సర్వవస్తుసమృద్ధి గలిగి ధాన్యములు, శర్కర మొదలగు మధురపదార్థములు సమృద్ధిగ నుండును.

**కుజాస్తమయఫలం:—**ఆశ్వయుజ శు ౪ గురువార మస్తమించినందున గోధుమలకు, శనగలకు ధర లత్యధికముగ పెరుగును.

**కుజోదయఫలం:—**పుష్య బ ౧౦ మంగళవారమున కుజు డుదయించినందున 'ధనుషి రసాతలవృష్టిః' అనగా వాపీకూపాదులు జలప్రపూర్ణము లగును.

**బుధచారఫలం:—**అబ్దాది చైత్ర శు ౯ ప॥ రేవతియందు బుధుడుండుటచే కుంకుమాదులకు ధర పెరుగును. అనంతరం బ ౧ వఱకు అశ్వినియం దున్నందున గోధుమలు,యవలు, చెఱకు, పాలు, నెయ్యి మొదలగు రసవస్తువులకు ధరలు నిలిచియుండును. అనంతరం వైశాఖ బ ౧ వఱకు భరణియందు ఏనుగులకు పీడ, చండాలురకు నాశము, లోకమున తీవ్ర రోగపీడ, లోకవైరమును, ధాన్యాదులకు ధర పెంపు గలుగును. వైశాఖ బ ౧ మొదలు బ ౧౩ వఱకు తిరిగి అశ్వినియందుండుటచే పూర్వోక్త అశ్వినీచారఫలము గలుగును. వైశాఖ బ ౧౩ ప్ర॥ జ్యేష్ఠ శు ౧౧ ప॥ పూర్వోక్త భరణీసంచారఫలము గలుగును. జ్యేష్ఠ శు ౧౧ బ ౪ ప॥ రోహిణియందు విప్రపీడ, మేఘాల్పత, జనులకు [illegible], జ్వరాదిబాధలు, కలహములు గలుగును. తదాది బ ౧౩ పర్యంతము దూది, నువ్వులు, నూలు వీటికి ధర పెరుగును. ఈ బ ౧౩ మొ॥ ఆషాఢ శు ౫ వఱకు సుభిక్షము, గాలి, వాన బాగుండును. ఆషాఢ శు ౫ మొ॥ శు ౧౧ వఱకు గోధుమలు, నువ్వులు, మినుములు మొదలగువాటికి ధరల నిలకడ, వర్షాధిక్యత, ప్రజాసుఖము గలుగును. ఈ శు ౧౧ మొ॥ బ ౪ వఱకు శిశుపీడ, దూది, నూలు వీటికి ధర తగ్గును. ఈ బ ౪ మొ॥ ౧౨ వఱకు జనుల కైకమత్యత, రాజులకు భయము, జయము గలుగును. ఈ బ ౧౨ ప్ర॥ శ్రావణ శు ౪ ప॥ మహావర్షము, శుష్కధాన్యోత్పత్తి గలుగును. ఈ శు ౪ మొ॥ శు ౧౪ వఱకు అల్పవృష్టి, ధాన్యనాశము, ప్రజాభయము గలుగును. ఈ శు ౧౪ మొ॥ అశ్వయుజ శు ౧౦ ప॥ రాజులకు యుద్ధం,సస్యములకు బాధ, అన్నసమృద్ధి తప్పదు. ఈ శు ౧౦ మొ॥ బ ౫ ప॥ మినుములు, పెసలు తగ్గిపోవును. ఈ బ ౫ మొ॥ బ ౧౩ వఱకు సుభిక్షము, ధాన్యవృద్ధి, ఆరోగ్యము, వర్షము గలుగును. ఈ బ ౧౩ ప్ర॥ కార్తిక శు ౫ ప॥ వేశ్యలు, శిల్పులు, బ్రాహ్మణులు, వీరికి పీడ, అల్పవృష్టి గలుగును. ఈ శు ౫ ప్ర॥ శు ౧౪ ప॥ మందవృష్టి గలుగును. ఈ శు ౧౪ ప్ర॥ బ ౬ ప॥ సుభిక్షము, వ్యాధి, భయము గలుగును. బ ౬ మొ॥ బ ౩౦ వఱకు సుభిక్షము, పక్షిపీడ, ప్రజాసుఖము గలుగును. కార్తిక బ ౩౦ ప్ర॥ మార్గశిర శు ౭ ప॥ చెఱకు, వడ్లు, నెయ్యి వీటికి ధర పెంపు, జనుల కారోగ్యము గలుగును. ఇది మొదలు మాఘ శు ౯ వఱకు పశుపక్ష్యాదులకు, బాలురకు పీడగలుగును.మాఘ శు ౯ మొ॥ బ ౧ వరకు ధాన్యం మందము, వర్షము, వ్యాధి గలుగును. బ ౧ మొ॥ బ ౭ వఱకు సస్యనిష్పత్తి, బాలుర కరిష్టము గలుగును. ఈ బ ౭ మొ॥ ఫాల్గున శు ౧ వరకు బెల్లము, అవిశె, ధాన్యము, శనగలు వీటికి మందమువల్ల నష్టము గలుగును. ఫాల్గున శు ౧ ప్ర॥ గోపీడయు, శు ౧౦ ప్ర॥ బ ౨ వ॥ శూద్రులకు రోగము, బ ౨ ప్ర॥ బ ౭ ప॥ క్షేమారోగ్యములు, బ ౭ ప్ర॥ అబ్దాంతం ప్రభువుల కరిష్టము, పశుపక్ష్యాదుల కారోగ్యము గలుగును.

**బుధోదయఫలం:—**చైత్ర శు ౭ వైశాఖ బ ౫ పశుపీడ, ధాన్యములకు ధర పెంపు. ఆషాఢ బ ౧౦ సుఖం. భాద్రపద బ ౬ పశునాశం, కార్తిక బ ౮ రాజభయం సుభిక్షం, పుష్య బ ౧ సుభిక్షమున్నూ గలుగును.

**బుధాస్తమయఫలం:—**వైశాఖ శు ౪ సుభిక్షం, జ్యేష్ఠ బ ౯ స్వల్పవృష్టి శ్రావణ బ ౧౨ అల్పవృష్టి, ఆశ్వయుజ శు ౧౩ చోరభయం, అతివృష్టి, మార్గశిర బ ౯ రాజభయం, రోగభయం, మాఘ బ ౧౦ వాణిజ్యలాభము తగ్గుటయు గలుగును.

## గురుచారము : గురుని నక్షత్రచారము

అబ్దాది జ్యేష్ఠ శు ౪ ప॥ ఆశ్రేషయందు సంచరించుటచే లోకమునకు ఘోరమయిన భయము, అనావృష్టి, దుర్భిక్షములు గలుగును. జ్యేష్ఠ బ.౪ మొదలు ఆశ్వయుజ బ ౮ వఱకు మఘ,పుబ్బలయందుండుటచే సుభిక్షము, క్షేమము, ఆరోగ్యాది శుభములు లోకమునకు గలుగును. అనంతర మబ్దాంతము ఉత్తరయం దుండుటచే సస్యానుకూలవృష్టి, జనులకు సుఖమున్నూ గలుగును

సింహరాశిస్థితఫలము

అబ్దాది జ్యేష్ఠ శు ౪ వ॥ గురుని కర్కాటకరాశిచారఫలము

ఈ కాలమున పశువులు క్షీరప్రదములై మేఘములు మంచివృష్టి ప్రదములై యుండును. జను లారోగ్యవంతులై యుందురు. లోకము సుభిక్షముగ నుండును. సస్యాభివృద్ధి యగును. ద్విజు లెల్లపుడు స్వధర్మతత్పరులై యుందురు. జ్యేష్ఠ శు ౪ ప్ర॥ కార్తిక శు ౭ వ॥ సింహరాశిస్థితగురుఫలం—సింహమందుండు కాలమున సజ్జనులు బ్రాహ్మణాదులు రాజభృత్యులచే బాధపడుదురు. లోకమున అతివృష్టి, సర్వభయము గలుగును. రాజులు యుద్ధమున నశింతురు.

సింహరాశిస్థితిఫలం:—పశువులు పాలను ఎక్కువగనిచ్చును. భూమి మంచివర్షములవల్ల జలపూర్ణమై యుండును. లోకమున దేవతలకు, బ్రాహ్మణులకు, సత్పురుషులకు మంచి పూజ్యతగలుగును. ప్రజలందు అన్యోన్యవివాదములు, రోగములు పెరుగును. పశువులకు ధర పెరుగును. గోధుమలు, తిలలు, మినుములు, నెయ్యి, వడ్లువీటికి ధరలు బాగుగ పెరుగును. బంగారము, వెండి, రాగి, ప్రవాళాదిరత్నములు వీటికి ధర నిలిచియుండును. లోకము సుభిక్షముగ నుండును. ఆషాఢ శ్రావణ, భాద్రపద, ఆశ్వయుజమాసములందు మేఘాడంబరము హెచ్చుగను, వర్షము తక్కువగను ఉండును. కార్తికమునుండి కాలము బాగుండును.

అనంతర మబ్దాంతము కన్యారాశి స్థితిఫలము:—కన్యయందు గురు డుండుకాలమున సంపూర్ణ సస్యార్ఘఫలాదులు చేకూరును. ప్రభువులు, ప్రజలుగూడ నెల్లపుడు మంచి ఐశ్వర్యవంతులై సుఖింతురు. బ్రాహ్మణు లెల్లప్పుడు స్వధర్మతత్పరులై యుందురు.

గురుని కన్యారాశిభోగకాలమున తమోనామక మేఘము వర్షించును. ఏడుమాసములు లోకము రోగబాధలచే దుఃఖవంత మగును. అనంతరము సుభిక్ష మగును. కన్యాప్రవేశ మయినతర్వాత కార్తికము మొదలు పై సంవత్సర వైశాఖము పర్యంతం ధాన్యము దాచినవారికి లాభము గలుగును. భాద్రపదము మొదలు రెట్టింపుగ లాభించును. పశువులకు పీడలు గలుగును. గోధుమలు, వడ్లు, శర్కర, నూనె, మినుములు వీటికిన్నీ బెల్లము, చెరకురసము మొదలగు మధురపదార్థములకున్నూ ధరలు బాగుగ పెరుగును. సౌరాష్ట్రమండలమున శూద్రులకు, అంత్యజులకు, కష్టములు గలుగును. దక్షిణదేశమున ఖండవృష్టిన్నీ, మ్లేచ్ఛదేశములం దుత్పాతములున్నూ భేదపాట శృంగాటక దేశములందు పరచక్రభయమున్నూ, యుద్ధమున్నూ, సర్వభయము, అగ్నిభయం, మేఘాల్పత, రసాల్పతయు గలుగును. మరుదేశమున ఛత్రభంగము చైత్రమునగాని, వైశాఖమునగాని గలుగును. గోధుమలు, నెయ్యి, తైలము వీటికి ధర పెరుగును. వస్త్ర, కంబలధాతువులకు, అన్నాదులకు సమమయిన ధరకలుగును. ఆషాఢమున ధాన్యసంగ్రహము చేసిన భాద్రపదమున చతుర్గుణలాభము గలుగును.

గుర్వస్తమయఫలం:—భాద్రపద శు ౪ మంగళవారమున గురుడు సింహమున నస్తమించుటచే లోకమున ప్రాణములకును ధనములకున్నూ హాని గలుగును. అందు జననష్టమున్నూ గలుగును.

గురూదయఫలం:—ఆశ్వయుజ శు ౩ బుధవారమున గురు డుదయించుటచేత అల్పవృష్టి, జననష్టమున్నూ గలుగును. ధాన్యలాభము బాగుండును. ఆశ్వయుజమం దగుటచే సుఖము గలుగునని గ్రంథాంతరమున నున్నది.

గురువక్రఫలం:—గురుడు కన్యారాశియందు వక్రించుటచే వర్తకలాభము తగ్గును. కాని పుణ్యకార్యాచరణాదులచే లాభము గల్గును.

శుక్రచారఫలం – అందు శుక్రాస్తఫలం:—వైశాఖ బ ౧ మంగళవారమున భరణియందు శుక్రాస్తమయమగుటచే పశుపీడ గలుగును. మనుష్యగణ నక్షత్రమగుటచే రోమకపట్టణమున అగ్నిభయమున్నూ, కొంకణమున పీడయు, సింధులాట దేశములందు దారిద్ర్యమున్నూ, ఉత్తరమున దుర్భిక్షమున్నూ, ద్రవిడమున విరోధమున్నూ, ఘూర్జరమున సుభిక్షమున్నూ, వనస్పతిఫలోదయమున్నూ లోకమున అస్తమయాది ఒకమాసముపర్యంతమును ధాన్యాదులకు ధర అధికమగుటయు, అనంతరము సమముగ నుండుటయు, నెయ్యి, నూనె, అన్నము, మొదలగువాటికి వృద్ధియు, పట్టుదారము వృద్ధియగుటయు, రాజులకు సుఖమున్నూ, ప్రజల కారోగ్యమున్నూ, ఆనందమున్నూ కలుగును. పర్వతప్రాంతములం దాడంబరము పెరుగును. మేషమందగుట సర్వధాన్యములకు ధర పెరుగును.

శుక్రోదయఫలం:— ఆషాఢ బ ౧౩ మంగళవారమం దగుట, కర్కాటకమందగుటచే అతివృష్టియు, ధాన్యనాశము, చోరభయము, పుష్యమియందు గనుక దుర్భిక్షము బ౧౩ యందగుటచే గూఢ దుర్భిక్ష మేగాక వాతాదులవలన భయము, మేఘద్వారమందగుటచే మేఘవృద్ధి, వర్షము ప్రజానందము ధాన్యాదులకు సమార్ఘతయు గలుగును.

శుక్రనక్షత్రచారఫలం:—అబ్దాది వైశాఖ శు ౪ వ॥ లోకమున సుఖము చేకూరును. తదాది శు ౧౪ వ॥ బ్రాహ్మణజాతియందు లోకమునకు విరోధమున్నూ యవలు, తిలలు, మాషములు, (మినుములు) వీటియొక్క అల్పతయు అనగా ఇవి ప్రియమగుటయు గలుగును. వైశాఖ శు ౧౪ ప్ర॥ బ ౧౧ వ॥ ధాన్యములకు, పుష్పములకు ధర బాగుగ పెరుగును. వైశాఖ బ ౧౧ ప్ర॥ [illegible] వ॥ ఆవాలు మినుములకు అల్పతచే ధర పెంపు, సర్వధాన్యాభివృద్ధి అనగా పైరను వచ్చే దాళ్వా మొదలగు ధాన్యాదులు వృద్ధియగును. జ్యేష్ఠ శు ౬ ప్ర॥ బ ౨ వ॥ జనుల కారోగ్యముగ నుండును. సర్వధాన్యములకు ఎక్కువ ధర పెరుగును. ఈ బ ౨ ప్ర॥ బ ౧౪ వ॥ ధాన్యాదులకు అధికధర గలుగును. జ్యేష్ఠ బ ౧౪ ప్ర॥ ఆషాఢ శు ౯ వ॥ అల్పవృష్టి గలుగును. ఆషాఢ శు ౯ ప్ర॥ బ ౬ వ॥ అన్ననాశము, సుఖనాశమున్నూ అగును. ఈ బ ౬ ప్ర॥ శ్రావణ శు ౨ వ॥ దుర్భిక్షమున్నూ, లోకమున చోరభయమున్నూ, గలుగును. శ్రావణ శు ౨ ప్ర॥ శు ౧౩ వ॥ వర్షాభావ మగును. శ్రావణ శు ౧౩ ప్ర॥ భాద్రపద బ ౧ వ॥ లోకమున కష్టములు గలుగును. బ ౧ ప్ర॥ బ ౧౨ వ॥ గొప్ప మేఘాచ్ఛాదన మగును. ఈ బ ౧౨ ప్ర॥ ఆశ్వయుజ శు ౭ వ॥ రోగాభివృద్ధి యగును. శు ౭ ప్ర॥ బ ౫ వ॥ లోకమున క్షేమసుభిక్షాదులు చేకూరును. ఈ బ ౫ ప్ర॥ బ ౩౦ వ॥ ధాన్యముల కెక్కువధర పెరుగును. ఈ బ ౩౦ ప్ర॥ కార్తిక శు ౧౨ వ॥ అల్పవృష్టిన్నీ పశుపీడయు గలుగును. తదాది మార్గశిర బహుళ ౧౨ పర్యంతం లోకమున భయమున్నూ, ఛత్రపతులకు నష్టమున్నూ గల్గును. మార్గశిర బ ౧౨ ప్ర॥ అబ్దాంతము లోకమున సుఖమున్నూ సుభిక్షమున్నూ గలుగును.

శనిచారఫలం:—అబ్దాది జ్యేష్ఠ శుద్ధ ౭ వ॥ వృషరాశిస్థితిఫలం.—వైరావర్త దేశీయులకు ధనసుఖములు హరించబడును. సర్వదేశములందును ధరలు పెరిగియుండును. సకలజనుల మనస్సులందును దుఃఖ

వైరాగ్యములు గలుగును. అన్ననాశ మగును. పశువుల కరిష్టము గలుగును. ధాన్యము, అర్థము నశించి జనులకు సర్వశూన్యమగును. ఈవిధముగ సర్వదేశములందును జనులు వికలులై పరిజనులతోగూడ బాధనొందెదరు. రసవస్తువులు కృశించును.

మిథునరాశిస్థితిఫలం:—జ్యేష్ఠ శుద్ధ ౮ మొద లబ్దాంతము సర్వదేశములందును నెయ్యి, దూది, లోహం, ఉప్పు, నువ్వులు, బెల్లం వీటికి ధర పెరుగును. మంజిష్ఠ, బంగారము, ఎద్దులు, గుఱ్ఱములు, ఏనుగులు, సర్వధాన్యములకు సమధరగలుగును. సప్తద్వీపములందును సముద్రమందును సకలజనులకున్నూ, హితము సుఖము గలుగును. నరేంద్రులు సర్వసౌఖ్యములు పొందెదరు. మేఘము లెల్లయెడలను ప్రసరించి వర్షములు బాగుగ గురియును.

శనస్తమయఫలం:—జ్యేష్ఠశుద్ధ ౭ సోమవారమున శనస్తమయమగుటచే పశుపీడ గలుగును.

శన్యుదయఫలం:—ఆషాఢ శు ౧౪ బుధవారమున శన్యుదయమగుటచే అతిసుభిక్షము గలుగును.

శనినక్షత్రచారఫలం:—అబ్దాది ఆషాఢ బ ౧౩ ప॥ మృగశిరానక్షత్రమున శనియుండుటచే మత్స్యచీనయవన దేశములకు హాని గలుగును. ఆషాఢ బ ౧౩ ప్ర॥ మాఘ బ ౬ ప॥ ఆర్ద్రాస్థితఫల:—వైద్యులకు దొంగలకు తిలఘాతకులకు నాశము గలుగును. అనంతర మబ్దాంతము మృగశిరయందలిఫలము పూర్వోక్తమే.

రాహుచారఫలము:—అబ్దాది పుష్యశుద్ధ ౬ ప॥ కటకరాశిస్థితిఫలం—రాహువుకర్కటకమందు బలీయుడైయుండుటచే లోకమున దొంగలవల్ల ఎక్కువ భయము గలుగును. పుష్య బ ౬ ప్రభృత్యబ్దాంతము మిథునరాశిస్థితిఫలం:—మిథునము రాహువునకు ఉచ్చయగుటచే నెయ్యి,ధాన్యం, మాణిక్యములు వీటికి ధరలు సమముగనుండును.

## జగల్లగ్న వర్షలగ్నముల విచారము

| | | | |
|---|---|---|---|
| శు | ల ర బు | శ | కు |
| | జగల్లగ్నం | | గు రా |
| | | | |
| | చ | | |

| | | | |
|---|---|---|---|
| ర బు చ | | శ | కు |
| శు | వర్షలగ్నం | | గు రా |
| కే | | | ల |
| | | | |

ఫలము:—వర్షలగ్నమునకు సప్తమమున శుక్రుడుండుటచేత జగల్లగ్నమునకు చతుర్థమున గురురాహువులుండుటచేతను పంటలు బాగుగనే పండును. అపరధాన్యము లనగా మినుములు,కందులు మొదలగు కాయధాన్యములు బాగుగ పండును. జగల్లగ్నము మేషమగుటచే తూర్పున దుర్భిక్షము, రాజవిరోధము గలుగును. దక్షిణభూమి సుభిక్షముగ నుండును. పంట మంచి రసవంతముగ నుండును. మఱియు ధాన్యవిక్రయమువలన లాభమును, పూర్ణ మేఘోదయము, నెయ్యి,నూనె మొదలగువస్తువులకు పచారీదినుసులకు వెల అధికమగును. ఉత్తరమున సుభిక్షము, రాజులకు తొందరలు గలుగును. మధ్యదేశమున మంచి వర్షమున్ను, ధాన్యాభివృద్ధియు గలుగును. వర్షలగ్నము సింహమగుటచే దక్షిణమున క్రూరజంతుబాధ గలుగును. ఆరుమాసములు ధాన్యాదుల ధర సమముగ నుండును. లోకమున ధనవృద్ధి యగును. పశ్చిమదేశమున ధాతువస్తువ్రక్రయమున్ను, పంటపెసరున్ను ధర పెరుగును. ఉత్తరదేశమున మహా వర్షములు గురిసి నదినదము లెక్కువగా ప్రవహించును. రాజులకు ప్రజలకు సుఖము గలుగును. ప్రాగ్దేశమున ధనాధివృద్ధిన్ని గలుగును. అబ్దాది ఆరు మాసములకైన స్తర్క లాభాదులు పెరుగును. లోకమున సుఖము గలుగును. అబ్దాది ఆరుమాసములు మధ్యదేశమున రాజయుద్ధము అధిక సైన్యభయంకరముగను. జగల్లగ్న వర్షలగ్నములబట్టి విచారించగా చైత్రమున ఫలము సామాన్యముగ నుండియు యుద్ధాదిభయము ప్రారంభమగును. వైశాఖ జ్యేష్ఠాషాఢములయందు యుద్ధభయము తీవ్రముగ నుండును. లోకము దుర్భిక్షముగ నుండును. శ్రావణ భాద్రపదములందు వర్షములు గలిగి యుద్ధాదిభయములు తగ్గును. ధరలు క్రమముగ పెరుగును. ఆశ్వయుజ కార్తికములందు సామాన్యవృష్టిగలిగి లోకసుఖము సామాన్యముగ నుండును. మార్గశిరాది అబ్దాంతముక్రమముగ సుభిక్ష సుఖలాభాదులు చేకూరును.

## ౨ వర్షయోగములు - ధరలు మొదలగు ఫలితములు

చైత్రమాసము—ఇందు శుక్లపక్షమున ప్రత్తి, నూనె మొదలగువాటికి ధర పెరిగి బహుళమున తగ్గును. ధాన్యాదులు పచారీదినుసులు పేరుశనగ వస్త్రాలకు శుద్ధమున ధరలుతగ్గి బహుళమున పెరుగుచు నిలకడలేక నుండును. మిర్చి, పొగాకు, నారసంచులు, పసుపు మొదలగువాటికి మాసమంతయు ధరలు పెరిగియుండును. పశ్చిమవాతారంభమై ఎండ అధికముగ నుండును గాని వర్షములు తక్కువ. చైత్రపూర్ణిమప్రాంతమున స్వల్పవృష్టి గలుగును. యుద్ధభయ మారంభస్థితిలో నుండును.

వైశాఖమాసం—శుక్లపక్షమున ప్రత్తి నూలు మొదలగువాటికి క్రమముగ ధరలు తగ్గి బహుళ ౬ ప్రాంతమునుండి తిరిగి పెరుగును. ధాన్యము, పసుపు. జొన్నలు, మినుములు, పెసలు, నువ్వులు మొదలగువాటికి శుక్లమున పెరిగి శుద్ధ ౧౦ నుండి బ॥ ౧౦ వఱకు తగ్గును. మిగతా అపరధాన్యములకు, వేరుశనగనూనె, పొగాకు, మిర్చి వస్త్రాలకు మాసమంతయు ధర తగ్గియుండును. ఈ మాసాదినుండి బ॥౫ వఱకు దేశభేదముచే నచ్చటచ్చట అర్ధవృష్టి గలుగును. బ॥౧ మొ॥ ౫ వఱకు మధ్యదేశమంతటను మంచివర్షములు గురియును. యుద్ధభయము పెరుగును.

జ్యేష్ఠమాసము:—శుక్లపక్షమున ప్రత్తి, నూలు, వస్త్రములు, వెండి మొదలగువాటికి క్రమముగా ధరలు తగ్గి బ॥ ౬ నుండి తిరిగి పెరుగును. ధాన్యాదులు, పసుపు వస్త్రాలకు మాసాదిని నిలకడగ పెరిగిబహుళమున తీవ్రముగ క్రమమున పెరుగును. నువ్వులు, నూనె, వేరుశనగ, పెసలు, మినుములు, ఆముదాలు, పొగాకు, మిర్చి వస్త్రాలకు మాసమంతయు ధరలు పెరిగియుండును. ఈమాసమున వర్షయోగములు కానరావు. యుద్ధ, చోర, రోగాది భయములుండును. అగ్నిభయము గూడ అచ్చటచ్చట గలుగును.

ఆషాఢము:—ఈమాసమంతయు ధాన్యాదులు, అపరధాన్యములు నువ్వులు,నూనె,పసుపువస్త్రా అన్నింటికిని ధరలు తగ్గియేయుండును. దూది,వస్త్రములు, వెండి,బంగారము మొదలగు లోహజాతికి శుక్లమున ధరలు పెరిగి క్రమముగా బహుళమున తగ్గిపోవును. కందులు, మిర్చి, పొగాకు, కలపలకు ఈమాసాదిలో తగ్గి మాసాంతమున పెరుగును. ఈమాసములో శు॥ ౧౦ ప్రాంతమునను బ॥ ౧౨ ప్రాంతమునను దేశభేదముచే వర్షము లుండును. బ॥౧౨ నుండి ౩౦ లోగా దేశమంతటను అపారమయిన సంపూర్ణవృష్టి గలుగును.

శ్రావణమాసము:—కందులు, మిర్చి, పొగాకు వగైరాలకు శుక్లమున తగ్గియుండి బహుళమున పెరుగును. దూది, వస్త్రములు నూలు, వగైరాలకున్నూ శుద్ధమున తగ్గి బహుళమున పెరుగును. నల్ల ధాన్యములు అనగా పెసలు, మినుములు, అనుములు, వగైరాలకు శుద్ధమున పెరిగి బహుళమున తగ్గును. వెండి, బంగారము మొదలగు లోహములకు, నూనెలకు మాసమంతయు ధర పెరిగియుండును. మాసాదిలో మంచివర్షముండును. మధ్యలో సామాన్యసస్యాను కూలవృష్టి గలుగును. మాసాంతమున సంపూర్ణవృష్టి గలుగును. యుద్ధ భయము సామాన్యము.

భాద్రపదము:—శుక్లమున ధాన్యము, పసుపు; మిర్చి, పొగాకు వగైరాలకు ధరలు పెరిగి బహుళమున తగ్గును. దూదివస్త్రములు, నెయ్యి, నూనె, నువ్వులు, ఆముదాలు వగైరాలకు శుద్ధమున తగ్గి బ॥ ౫ నుండి క్రమముగా పెరుగును. మినుములు, పెసలు, కందులు, కలప, పచారిదినుసులు, పంచదార, బెల్లము వగైరాలకు ఈమాస మంతయు ధరలు మందముగా నిలబడియుండును. వర్షములు చాల తక్కువగ నుండును.

ఆశ్వయుజము:—ఇందు దూది, కలప, పొగాకు, మిర్చి, వగైరాలకు మాసాదిలో పెరిగి మాసమధ్యమున తగ్గి తిరిగి మాసాంతమున పెరుగును. ధాన్యములు, పెసలు, మినుములు, కందులు, ఆముదాలు, నూనె, వేరుశనగలకు మాసాదిలో తగ్గి మాసమధ్యములో పెరిగి తిరిగి మాసాంతమున తగ్గును. శుద్ధ ౩ నుండి ౯ మధ్యలోను, బ॥ ౩ నుండి ౩౦ లోగాను దేశమంతటను సంపూర్ణముగ వర్షించును.

కార్తికమాసము:—ఈశుద్ధమున ధాన్యములు, యవలు, గోధుమలు, వెండి, దూది మొదలగువాటికి ధర పెరిగి ౧౫ నుండి బ॥ ౮ వరకు క్రమముగ తగ్గి తిరిగి మాసాంతమున అన్నిటికి పెరుగును. పసుపు, పొగాకు మిర్చి మొదలగు రసవస్తువులకు శుద్ధమున పెరిగి బహుళమున తగ్గును. మినుములు, పెసలు, ఆముదాలు, వేరుశనగ, నూనెలు, నువ్వులు మొదలగువాటికి శుద్ధ ౧ పంచమి మధ్యలో పెరిగి తదాది ౧౫ లకు తగ్గి బహుళమున నిలవబడియుండి ౩౦ ప్రాంతమున తిరిగి పెరుగును. శు॥ ౫ లోగా దేశభేదముచే స్వల్పవృష్టియు, తదాది అధికవాయువును ౧౫ ప్రాంతమున స్వల్పవృష్టిన్నీ గలిగి బహుళమున వర్షాభావమే అయినను బహుళ ౩౦ ప్రాంతమున స్వల్పముగ వర్షించునని తోచెడిని.

మార్గశిరమాసము:—ఇందు దూది వస్త్రములు, ఉన్ని మొదలగువాటికిన్ని, పంచదార, పటిక బెల్లం మొదలగు పచారి దినుసులకున్నూ మాసాదిలో ధరలు పెరిగి శు॥ ౬ నుండి ౧౫ వ॥ ధరలు నిలిచి బహుళమున పూర్తిగ తగ్గును. ధాన్యము, నువ్వులు, నూనె, ఆముదాలు, వేరుశనగలకు మాసాదిలో తగ్గి ౧౫ వరకు నిలిచియుండి బహుళమున పూర్తిగ ధర పెరుగును. మినుములు, పెసలు, కందులు, మిర్చి, పొగాకు, పసుపు, నారసంచులు, కలపలకు మాసమంతయు ధరలు పెరిగియే యుండును. శుద్ధ పాడ్యమి మొ॥ శు॥ ౬ లోగా సువృష్టియు, తదాది బ॥ ౫ వఱకు అనావృష్టియు, తదాది మాసాంతము వఱకు తిరిగి స్వల్పవృష్టియు గల్గును. యుద్ధములు తగ్గనారంభించును.

పుష్యమాసము:—జొన్నలు, ఉలవలు, పెసలు, కందులు మొదలగు అపరధాన్యాదులకు మాసాదిలో ధరలు పెరిగియుండి క్రమముగా మాసాంతమున ధరలుతగ్గును. దూదివస్త్రములు, ఉన్ని మొదలగువాటికి మాసాదిలో తగ్గియుండి క్రమముగ మాసాంతమున ధరలు పెరుగును. మిర్చి, పొగాకు, వేరుశనగ, నువ్వులనూనెలకు శుక్లమున తగ్గియుండి కృష్ణపక్షమున ధరలు పెరుగును. శు ౧౫ ప్రాంతమున దేశభేదముచే మంచివర్షములు కురియును. ఇతరకాలములో వర్షము లుండవు.

మాఘమాసము:—ఇందు కలప, దూది, ఉన్ని వస్త్రములకు మాసమంతయు ధర తగ్గియుండును. వేరుశనగ, ఆముదాలు, నువ్వులు నూనె మొదలగువాటికి శుద్ధమున ధర పెరిగి బహుళమున తగ్గును. ధాన్యము, పసుపు, మినుములు, పెసలు మొదలగువాటికి శుద్ధమున ధరలు తగ్గి, బహుళమున పెరుగును. పొగాకు, మిర్చి, గోధుములు పీటికి మాసమంతయు ధరలు పెరిగియేయుండును. ఈమాసాంతమున మంచివర్షములుండును.

ఫాల్గునమాసము:—ఇందు కలప, వస్త్రములు, దూది వీటికి మాసమంతయు ధర పెరిగియేయుండును. గోధుమలు, ధాన్యము, చెఱకు, బెల్లం, పచారీదినుసులు మొదలగువాటికి శుక్లమున ధరలుండి బహుళమున తగ్గును. అపరములకు, నూనెలకు శుద్ధమున ధరయుండి బహుళమున తగ్గును. పొగాకు, పసుపు, మిర్చి మొదలగువాటికి మాసమంతయు ధరలు తగ్గియుండును. ఈమాసాదిలో శు ౨ ప్రాంతమున దేశభేదముచే స్వల్పవృష్టియు బ ౮ నుండి సర్వత్ర మంచివర్షమున్నూ కురియును.

## పంచాంగ శ్రవణ ఫలం

శ్లో॥ కన్యావనీకాంచనదిగ్గజానాం గవాంసహస్రం సతతం ద్విజేభ్యః,
దత్వాఫలం యల్లభతే మనుష్య స్తత్ఫలాన్యబ్దఫలాని శృణ్వన్
రాజామంత్రీ సస్యనాథో రసానా, మీశాస్సార్ఘం స్వామినో
నీరసానాం, అర్ఘాధీశః కించ మేఘాధినాథో దద్యుః శ్రేయశ్శృణ్వ
తాం తత్ఫలాని.

## (శ్రీ) మధ్వ పుణ్యదినములు

[చైత్ర శు ౨ ఆది] వేదవ్యాస తీ. పు. ౬ గురు కవీంద్ర,, ౧౩ గు సత్యవ్రత,, బ ౩ మం వాగీశ,, బ ౧౨ గు సత్యవిజయ,, [వైశాఖ శు ౩ మం] విద్యాధిరాజ,, [జ్యేష్ఠ శు ౩ గు] సత్యసంగ,, బ ౨ గు సత్యపూర్ణ,, బ ౩ శు రఘువీర,, [ఆషాఢ శు ౯ శు సత్యాధిరాజ,, బ ౫ సో శ్రీవిజయ,, [శ్రావణ శు ౧ శు] రాఘవేంద్ర,, శు ౮ గు సత్యవర,, [భాద్రపద శు ౧౦ మం] సత్యేష్టకామ,, బ ౩౦ ఆమాధవ. [ఆశ్వ శు ౮ ఆది] సత్యపరాయణ ,, [కార్తిక శు ౧౦ గురు] సత్యవీర ,, శు ౧౧ శు వేదనిధి ,, బ ౩ శుక్ర విద్యానిధి ,, ,, ౧౪ మంగ పద్మనాభ ,, [మార్గశిర శు ౧౧ ఆది] సత్యనిధి ,, శు ౧౨ సోమ రఘునాథ ,, [పుష్య శు ౧౨ మం] రఘూత్తమ ,, బ ౬ గురు సత్యకామ ,, బ ౮ శు నరహరి ,, బ ౧౪ శని విద్యాధీశ్వర తీర్థ పు. బ ౩౦ ఆది పురందరదాస ,, [మాఘ శు ౯ సోమ మధ్వ నవమి గురు మధ్వరాయజయంతి [ఫాల్గున శు ౨ బుధ] సత్యబోధ తీ. పు. శు ౪ శుక్ర వ్యాసరాజ తీ. పు. శు ౬ ఆది సత్యవ్రత తీ. పు.

## (శ్రీ) వైష్ణవతిరునక్షత్రములు

[చైత్ర శు ౭ శని] యతిరాజసంపత్ తిరునక్షత్రము ,, శు ౧౪ శు శ్రీరంగనాచార్ తిరు ,, బ ౩౦ శని పెరియపెరుమాళ్ తిరు ,, [వైశాఖ శు ౩ మం] ఉయ్యకొండార్ తిరు ,, శు ౬ శు వడుగనంబి తిరు శు ౮ శ శ్రీ చక్రవర్తి తిరుమఘనార్ తిరు ,

ఈ వారములందు ఆయా తిథులున్నప్పుడు మృత్యుయోగ మనబడును.

| ఆది | సోమ | మం | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|
| ౧ | ౨ | ౧ | ౩ | ౪ | ౨ | ౫ |
| ౬ | ౭ | ౬ | ౮ | ౯ | ౭ | ౧౦ |
| ౧౧ | ౧౨ | ౧౧ | ౧౩ | ౧౪ | ౧౨ | ౧౫ |

ఈ వారములందు ఈ నక్షత్రము లున్నపుడు దగ్ధయోగ మనబడును.

| భర | చిత్త | ఉ-షా | ధని | ఉ-ఫ | జ్యేష్ఠ | రేవ |
|---|---|---|---|---|---|---|

ఈ వారములందు ఈ తిథు లున్నపుడు దగ్ధయోగ మనబడును.

| ౧౨ | ౧౧ | ౫ | ౩ | ౬ | ౮ | ౯ |
|---|---|---|---|---|---|---|

ఈ వారములందు ఈ తిథు లున్నపుడు విషయోగ మనబడును.

| ౪ | ౬ | ౭ | ౨ | ౮ | ౯ | ౭ |
|---|---|---|---|---|---|---|

ఈ వారములందు ఈ తిథులున్నపుడు హుతాశనయోగ మనబడును

| ౧౨ | ౬ | ౭ | ౮ | ౯ | ౧౦ | ౧౧ |
|---|---|---|---|---|---|---|

ఈ వారములందు ఈ నక్షత్రము లున్నపుడు యమ ఘంటయోగ మనబడును.

| మఘ | విశా | ఆర్ద్ర | మూల | కృత్తి | రోహి | హస్త |
|---|---|---|---|---|---|---|

ఈవారములందు ఈనక్షత్రము లున్నపుడు ఉత్పాతయోగమనబడును.

| విశా | పూ-షా | ధని | రేవ | రోహి | పుష్య | ఉ-ఫ |
|---|---|---|---|---|---|---|

ఈవారములందు ఈనక్షత్రము లున్నపుడు మృత్యుయోగ మనబడును.

| అనూ | ఉ-షా | శత | అశ్వి | మృగ | ఆశ్లే | హస్త |
|---|---|---|---|---|---|---|

ఈవారములందు ఈనక్షత్రము లున్నపుడు కాణయోగ మనబడును దీనికే రంధ్రయోగమనికూడ పేరు.

| జ్యేష్ఠ | అభిజిత్ | పూ-భా | భర | ఆర్ద్ర | మఘ | చిత్త |
|---|---|---|---|---|---|---|

ఈ వారములందు ఈ నక్షత్రము లున్నపుడు గ్రహజన్మనియోగ మనబడును.

| భర | చిత్త | ఉ-షా | ధని | ఉ-ఫ | జ్యేష్ఠ | రేవ |
|---|---|---|---|---|---|---|

ఈ పైన వ్రాయబడిన అన్నియోగములకును ఆనందాదియోగ ములకున్ను అపవాద కలదు. "కుయోగా స్తిథివారోత్థా స్తిథిభోత్థా భవారజాః, హూణవంగఖశేష్వేవ వర్జ్యాస్త్రితయజా స్తథా" అని ముహూర్తచింతామణి. కనుక ఈ ఆంధ్ర దేశమునకు పైయోగములు గాని ఆనందాదియోగములుగాని ప్రధానముగా చూడదగినవి గావు.

## ౬౦ సంవత్సరముల వివరణము

ప్రభవ, విభవ, శుక్ల, ప్రమోదూత, ప్రజోత్పత్తి, ఆంగీరస, శ్రీముఖ, భావ, యువ, ధాత, ఈశ్వర, బహుధాన్య, ప్రమాధి, విక్రమ, వృష, చిత్రభాను, స్వభాను, తారణ, పార్థివ, వ్యయ, సర్వజిత్తు, సర్వధారి, విరోధి, వికృతి, ఖర, నందన, విజయ, జయ, మన్మథ, దుర్ముఖి, హేవిళంబి, విళంబి, వికారి, శార్వరి, ప్లవ, శుభకృతు, శోభకృతు, క్రోధి, విశ్వావసు, పరాభవ, ప్లవంగ, కీలక, సౌమ్య, సాధారణ, విరోధికృత్, పరీధావి, ప్రమాదీచ, ఆనంద, రాక్షస, నళ, పింగళ, కాళయుక్తి, సిద్ధార్థి, రౌద్రి, దుర్మతి, దుందుభి, రుధిరోద్గారి, రక్తాక్షి, క్రోధన, అక్షయ.

కార్యసిద్ధిప్రశ్న — ప్రశ్న అడిగే కాలమునందుండు ప్రతిపదాది తిథిని - భానువారాదివారమును - అశ్విన్యాదినక్షత్రమును - ఉదయాది రా జాములలో తత్కాలగతజాములను - గ్రామాది రా జకృ్యాలలో ప్రశ్న అడిగేవారు నిలిచియుండు దిక్కును కల్పి లెక్కించి వొకటిగా చేర్చిన మొత్తమును ౮ చే భాగించగా మిగిలిన సంఖ్య ౧-౨-౩ అయితే ఇరువదిరెండుదినములలో కార్యమగును. ౨-౭ కార్యముకాదు. ౪-౬ మూడుదినములలో కార్యమగును. ౫ అయితే శీఘ్రముగా కార్యమగును.

### ౧. అంగస్ఫురణము

శిరసి-భూలాభః. లలాటే-స్థానవృద్ధిః. భ్రూమధ్యే ప్రియసమాగమః. నాసాక్షిమధ్యే సహాయలాభః. నేత్రాగ్రే-ఇష్టవస్తుప్రాప్తి కాల విళంబః. నేత్రాంతే-ధనలాభః నేత్రోర్ధ్వభాగే-యుద్ధజయః. నాసికాయాం-ప్రీతిః సుఖంచ. గండస్థలే-స్త్రీలాభః. కర్ణే ప్రియవార్తాశ్రవణం. ఓష్ఠయోః - ఇష్టవస్తుభోజనప్రాప్తిః. కంఠే-భోగః. అంసే-భోగవృద్ధిః. భుజయోః-మిత్రలాభః. హస్తయోః-ధనలాభః వక్షసి-విజయః. స్తనయోః-ప్రియవస్తులాభః. హృదయే - దుఃఖం. ఆంత్రే-ధనప్రాప్తిః నాభ్యాం-స్థానభ్రంశః నాభేరధఃప్రదేశే-స్త్రీలాభః, పార్శ్వయోః-ఆనందః. పృష్ఠే-పరాజయః. కట్యాం-సంతోషః, బలంచ. కట్యధోభాగే-వాహనప్రాప్తిః. శిశ్నేయోనౌ - సంతానప్రాప్తిః. ఊర్వోః పృష్ఠభాగే-దోషః. ఊర్వోః పురోభాగే - సహాయలాభః. జానౌ-శత్రుసంధిః. జంఘయోః-నష్టం. పాదయోః-స్థానలాభః. పాదాగ్రయోః-లాభసహితం ప్రయాణం॥

ఈ అంగస్ఫురణమున పురుషులకు కుడిపార్శ్వమున, స్త్రీలకు యెడమ పార్శ్వమున స్ఫురణమైతే మిక్కిలి శుభము-పురుషులకు యెడమపార్శ్వమున స్త్రీలకు కుడిపార్శ్వమున స్ఫురణమైతే మిక్కిలి అశుభము-కలుగును. అశుభఫలములకు సువర్ణదానము చేయ తగినది.

### ౨. శుభ శకునములు

ముత్తైదువ - కన్య - వేశ్య - ఇద్దరు బ్రాహ్మణులు-మంగళ వాద్యము - ఫలం-పుష్పములు - గోడుగు - చెరుకు-అన్నము-పాలు-పెరుగు-మాంసము- పొగలేనిఅగ్ని - స్త్రీ-కల్లు- తేనె-యేనుగు-యెద్దు మద్యము - గుఱ్ఱము - చలువవస్త్రములు - అక్షతలు - మొదలైన మంగళవస్తువులు యెదురుగా వచ్చునంతట శుభము కలుగును.

### గ్రహప్రవేశ విషయమైన చక్రములు

| వృషభచక్రం రవిభాత్ | | కలశచక్రం రవిభాత్ | |
|---|---|---|---|
| ౩ మృత్యు | ౪ అర్థకృత్ | ౧ శీర్షచ్ఛేదం | ౪ నిర్ధనం |
| ౪ దుర్దశా | ౪ ధాన్యం | ౪ ప్రవాసః | ౪ గర్భస్రావం |
| ౪ స్థైర్యం | ౩ సంపద | ౪ అభయః | ౩ శ్రియం |
| ౩ భ్రమణం | ౩ పశువృద్ధి | ౪ ధాన్యం | ౩ శతాయుః |

### కల్యాణగణితము

వేదాంగ మగు జ్యోతిషమునకు ప్రమాణరాజ మగు శ్రీసూర్య సిద్ధాంతమునకు ఆంధ్రానువాదరూపమగు గ్రంథము ౧౧౮ పదకములలో, గణితక్రమమెరుకుండ సులభముగా గ్రహసాధన వివరింపబడినది. వెల రు ౫ లు. వలయువారు గ్రంథకర్త: దైవజ్ఞ సార్వభౌమ, **చివుకుల వేంకటరమణశాస్త్రి**, వేమూరు—గుంటూరుజిల్లా.

N. B. ఈ పంచాంగమందలి ప్రతివిషయమున్నూ సవిమర్శకముగా సరియగు శాస్త్రప్రమాణములబట్టి వ్రాయబడి నవిగాన ఎల్లరున్నూ ఆచరింపనగును. సందేహములకు శక్తివంచనలేక సమాధానము లీయబడును.

## వర్షవిషయక కార్తెప్రవేశ వాహనఫలాది చక్రము

| ఇంగ్లీషు తేది 1944 | ఫార్సీ తేది ౧౩౫౩ | మాసం తిథి | వారం | కార్తె | ప్రవేశకాలం ఘ-వి. | స్త్రీ. పుం. నపుంవివరం | జలరాశి వివరం | వాహనం | ఫలం. |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 30 మార్చి | ౨౬ అర్దిబే | చైత్ర శు ౬ | గు | రేవతి | ౨౭-౩౭ | పుం. పుం. | నిర్జల | మూషక | అనావృష్టి |
| 13 ఏప్రిల్ | ౯ ఖుర్దాద్ | బ ౫ | ,, | అశ్విని | ౦-౪౦ | పుం.నపుం. | ,, | గజ | ,, |
| 26 ,, | ౨౨ ,, | వైశాఖ శు ౪ | బు | భరణి | ౪౨-౩౫ | పుం. పుం. | అర్ధజల | ఛాగ | ,, |
| 10 మే | ౫ తీరు | బ ౨ | ,, | కృత్తిక | ౨౯-౫౭ | పుం.నపుం. | పాదజల | మహిష | అల్పవృష్టి |
| 24 ,, | ౧౮ ,, | జ్యేష్ఠ శు ౨ | ,, | రోహిణి | ౨౩-౫౩ | పుం. పుం. | నిర్జల | జంబుక | అనావృష్టి |
| 7 జూన్ | ౧ అమర్దాద్ | బ ౧ | ,, | మృగశిర | ౨౨-౪౦ | ,, ,, | ,, | మూషక | ,, |
| 21 ,, | ౧౫ ,, | ఆషాఢ శు ౧ | ,, | ఆర్ద్ర | ౨౫-౫ | స్త్రీ. స్త్రీ. | పాదజల | అశ్వ | అల్పవృష్టి |
| 5 జూలై | ౨౯ ,, | శు ౧౪ | ,, | పునర్వసు | ౨౯-౭ | ,, పుం. | అర్ధజల | ఛాగ | ,, |
| 19 ,, | ౧౨ షహరేవర్ | బ ౧౪ | ,, | పుష్యమి | ౩౨-౫౫ | ,, స్త్రీ | పూర్ణజల | గజ | పూర్ణవృష్టి |
| 2 ఆగష్టు | ౨౬ ,, | శ్రావణ శు ౧౩ | ,, | ఆశ్లేష | ౩౩-౫౦ | ,, పుం | ,, | మండూక | ,, |
| 16 ,, | ౯ మెహర్ | బ ౧౩ | ,, | మఘ | ౩౦-౧౨ | ,, స్త్రీ | ,, | గర్దభ | అర్ధవృష్టి |
| 30 ,, | ౨౩ ,, | భాద్ర. శు ౧౧ | ,, | పూ.ఫ | ౨౧-౧౦ | ,, పుం | అర్ధజల | జంబుక | పాదవృష్టి |
| 13 సెప్టెం | ౬ ఆబాన్ | బ ౧౧ | ,, | ఉ.ఫ | ౫-౩౦ | ,, స్త్రీ | నిర్జల | మూషక | అనావృష్టి |
| 26 ,, | ౧౯ ,, | ఆశ్వ శు ౯ | మం | హస్త | ౪౨-౪౬ | స్త్రీ. పుం. | ,, | గజ | అల్పవృష్టి |
| | ౧౩౫౪ | | | | | | | | |
| 10 అక్టో | ౩ ఆజార్ | బ ౯ | ,, | చిత్ర | ౧౪-౨౬ | స్త్రీ. స్త్రీ. | అర్ధజల | మయూర | పూర్ణవృష్టి |
| 23 ,, | ౧౬ ,, | కార్తి. శు ౬ | సో | స్వాతి | ౩౮-౪౭ | స్త్రీ. పుం. | నిర్జల | మూషక | అనావృష్టి |
| 5 నవంబ | ౨౯ ,, | బ ౫ | ఆది | విశాఖ | ౫౬-౪౮ | స్త్రీ.నపుం. | పాదజల | అశ్వ | ,, |
| 19 ,, | ౧౩ దై | మార్గ. శు ౪ | ,, | అనూ | ౮-౨౭ | పుం.నపుం. | అర్ధజల | మండూక | అల్పవృష్టి |
| 2 డిశంబ | ౨౬ ,, | బ ౩ | శని | జ్యేష్ఠ | ౧౫-౦ | స్త్రీ.నపుం. | ,, | మహిష | ,, |
| 15 ,, | ౧౦ బహ॥ | బ ౩౦ | శు | మూల | ౧౯-౦ | పుం.నపుం. | నిర్జల | గజ | అనావృష్టి |
| 28 ,, | ౨౩ ,, | పుష్య శు ౧౪ | గు | పూషా | ౨౧-౨౦ | ,, పుం. | అర్ధజల | ఛాగ | స్వల్పవృష్టి |
| 1945 | | | | | | | | | |
| 10 జనవరి | ౬ ఇస్పంది | బ ౧౧ | బు | ఉషా | ౨౨-౪౫ | ,, నపుం. | ,, | మూషక | అనావృష్టి |
| 23 ,, | ౧౯ ,, | మాఘ శు ౧౦ | మం | శ్రవణం | ౨౬-౦ | ,, పుం. | ,, | అశ్వ | ,, |
| 5 ఫిబ్రవరి | ౨ ఫర్వర్ధి | బ ౮ | సో | ధనిష్ట | ౩౧-౩౮ | ,, నపుం. | నిర్జల | మండూక | ,, |
| 18 ,, | ౧౫ ,, | ఫాల్గున శు ౬ | ఆది | శతతార | ౪౧-౨౫ | ,, పుం. | పాదజల | మూషక | ,, |
| 3 మార్చి | ౨౮ ,, | బ ౪ | శని | పూభా | ౫౬-౪౮ | స్త్రీ. పుం. | పూర్ణజల | గజ | అర్ధవృష్టి |

### అమృత యోగములు

ఆ॥ రో-ఉత్తర-ఉషా-ఉభా-హస్త-రేవతి-శ్రవ-మూల

సో॥ మృగ-స్వాతి-రేవతి-పున-శ్రవ

మం॥ రోహి-మూల-అశ్వి-ఉఫ-ఉషా-ఉభా

బు॥ పూషా-పూఫ-పూభా-కృ-ఉఫ-ఉషా-ఉభా

గు॥ అశ్వి-పుష్య-స్వా-మ

శు॥ మూ-హ-రే-అనూ-స్వా-ఉఫ-ఉషా-ఉభా

శ॥ మ-స్వా-కృ-రో-శత

### మరణ యోగములు

ఆ॥ అనూ-జ్యే-మ-విశా-ధని

సో॥ విశా-కృ-మ-పూభా-ఉషా

మం॥ శత-ఆర్ద్రి-విశా-పూభా

బు॥ ధని-మూల-రే-అశ్వి-హ

గు॥ మ-రో-శత-ఆర్ద్రి-విశా-పూఫ

శు॥ పుష్య-రో-జ్యే-శ-అశ్వి-మ

శ॥ ఉఫ-హ-చి-ఉషా-పూభా-ఉభా-రే

### వార దుర్ముహూర్తములు

| ఆ | సో | మం | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|
| ఘ | ఘ ఘ | ఘ ఘ | ఘ ఘ | ఘ ఘ | ఘ ఘ | ఘ ఘ |
| ౨౭-౨౮, | ౧౭-౧౮, | ౭-౮, | ౧౫-౧౬, | ౧౧-౧౨, | ౭-౮, | ౧-౨ |
| | ౨౩-౨౪, | ౪౩-౪౪, | | ౨౩-౨౪, | ౧౭-౧౮, | ౩-౪ |

## ద్విపాది త్రిపాది నక్షత్రములు

### దుష్టతిథ్యాదులయందు మరణము-దోషము శాంతి

రో, కృ, మృ, శ్రవ, ఉత్తర, చిత్ర, విశా, ఉషా, భరణి యీ నక్షత్రములందు, మృతిపొందినచో వారు 3 మాసములవరకును, పుని, పూభా, ఉభా, రేవ, శత, యీ నక్షత్రములందు మృతిపొందిన వారు ౬ మాసములవరకును పాడువేయవలెను. ౧-౨-౬-౮-౧౧-౧౨-౧౪-౩౦ ఈ ౮ తిథులయందును, శుక్ర, శని, ఆది, మంగళ వారములయందును, మృతినొందినయెడల శాంతిచేయవలెను.

### వాస్తుపురుష స్థితి

భాద్రపద, ఆశ్వయుజ, కార్తికమాసములయందు తూర్పు శిరస్సుగాను, మార్గశీర్ష, పౌష, మాఘమాసములయందు దక్షిణ శిరస్సుగాను, ఫాల్గున, చైత్ర, వైశాఖమాసములయందు పశ్చిమ శిరస్సుగాను, జ్యేష్ఠాషాఢశ్రావణమాసములయం దుత్తరశిరస్సుగాను ఎడమప్రక్కను శయనించుచుండును. కాన అతనిదృష్టి ప్రసరించిన దిక్కునందును, పాదములున్న దిక్కునందును, గృహము కట్టకూడదు. ఇది మాసవాస్తు. దినవాస్తు సూర్యోదయం మొదలు పగలు నాలుగు జాములయందున్ను, ఉత్తరదిక్కు మొదలుకొని నాల్గుదిక్కుల యందున్ను ఎడమప్రక్కను పరుండును. రాత్రియందున్ను ఈ ప్రకారమే పరుండును. అతని శిరము పాదములున్న దిక్కులయందున్ను, చూచుచున్న దిక్కులయందున్ను యిల్లు కట్టరాదు.

### గండపురుషస్థితి

గండపురుషుడు కార్తిక, ఆషాఢ, ఫాల్గున, వైశాఖమాసముల యందు ఆకాశమునను, మాఘ, భాద్రపద, చైత్ర ఆశ్వయుజమాసములలో పాతాళమునను, జ్యేష్ఠ, శ్రావణ, మార్గశీర్ష, పుష్యమాసములలో భూమియందును ఉండును. రజోదర్శనము ప్రసూతి మొదలగునవి సంభవించినపుడు గండపురుషుడు భూమియం దుండెనేని దోషమధికమగుటచే విశేషశాంతిచేయవలెను. మిగతకాలములో దోషము సామాన్యము.

### స్త్రీ ప్రథమరజస్వల అయిన తిథులు నక్షత్రములు వాని గుణదోషములు

తిథులు: పాడ్యమియందు మహాపాపినియును, విదియయందు పుత్రవతియును, తదియయందు సౌఖ్యవతియును, చవితియందు వ్యభిచారిణియును, పంచమియందు శుభప్రదురాలును, షష్ఠియందు వికృత సంచారిణియును, సప్తమియందు శుభప్రదురాలును, అష్టమియందు వికృతసంచారిణియును, నవమియందు విశేషకష్టియును, దశమియందు పుత్రవతియును, ఏకాదశియందు శుచి కలదియును, ద్వాదశియందు పరులను దూషించునదియును, త్రయోదశియందు పుత్రవతియును, చతుర్దశియందు కోపనయును, పూర్ణిమామావాస్యలందు దుష్టచారిణియును అగును.

నక్షత్రములు: భరణి, ఆశ్లేష, పుబ్బ, పూషా, పూభా యీ నక్షత్రముల ౧-వ పాదము భర్తృనాశనము, ౨-వ పాదము పుత్రనాశనమును, 3-వ పాదము ధననాశనమును, ౪-వ పాదము అశుభమును గలిగించును. మరియు కృత్తిక, ఆర్ద్ర, పున, మఘ, జ్యేష్ఠ యీ నక్షత్రములయొక్క ౧-వ పాదము మంగళమును గలిగించును. రెండవపాదమునకైన ౨౫ గురకు భోజనము పెట్టవలెను. క్రూర పాదములందును, ఆది, మంగళ, శనివారములయందును, దుష్టకాలములయందును, దుష్టతిథులయందును, దుష్టయోగములయందును రజస్వల అయినయెడల యథావిధిగా శాంతి చేయవలెను.

### పాదచ్ఛాయవలన ప్రొద్దు తెలుసుకొను పద్ధతి

| | | | |
|---|---|---|---|
| మేషము, కన్య, | 4 | తుల, మీనం, | 4 |
| వృషభము, సింహము, | 3 | వృశ్చికం, కుంభం, | 3 |
| మిథునము, కటకము, | 2 | ధనుస్సు, మకరం, | 2 |

సాయనసూర్యుడు ఏరాశిలో నుండునో ఆ రాశి తాలూకు ఈ గుణకములను పాదచ్ఛాయలలో మేషాది 6 రాసులలో కలుపుటయు, తులాది 6 రాసులలో తీసివేయుటయు చేయగా స్ఫుటమగు భాజకమగును. ఆ దినమందలి దినార్ధము 7 చే గుణించగా స్ఫుటమగు భాజ్యమగును. ఈ భాజ్యమును భాజకముచే భాగించగా లబ్ధము ఘడియ విఘడియలు అగును. ఇవి మధ్యాహ్నములోపల గడచినవియు, మధ్యాహ్నానంతరమందు శేషించినవియు కాగలవు.

### పురశ్శుక్రదోషము

నూతన వధువు, గర్భిణీస్త్రీ, శిశుసహిత యగు స్త్రీయును శుక్రుడు తూర్పుదిక్కున నున్నపుడు పశ్చిమదిక్కునుంచి వాయవ్య దిక్కునకు ఉత్తరమునకు ఈశాన్యమునకు తూర్పుదిక్కునకు ప్రయాణము చేయగూడదు. పశ్చిమదిక్కునందు శుక్రుడున్నప్పుడు తూర్పుదిక్కునుంచి ఆగ్నేయమునకు దక్షిణమునకు నైఋతిదిక్కునకు పశ్చిమమునకు వెళ్లగూడదు. ఈ పురశ్శుక్రదోషము ఏకగ్రామమందు, దుర్భిక్షమందు, రాజవిప్లవమందు వివాహసమయమునను తీర్థయాత్రలకు వెళ్లునపుడు దోషముకాదు. భరద్వాజాంగిరస భృగ్వత్రి వత్స కాశ్యప వాసిష్ఠ గోత్రజులవారి నీపురశ్శుక్రదోషమెప్పుడును బాధింపదు.

### తిథివారవిశేషములయందు చేయఁగూడని పనులు

సప్తమినాడు, తైలసేవ, నీలవస్త్రధారణ, ఇతరులతో కలహించుట, రాగిపాత్రతో నీరుత్రాగుట చేయగూడదు.

**1, 6, 11** ఈ తిథులయందు, తలంటు (అభ్యంగనము) కూడదు.

**3, 8, 14** ఈ తిథులయందు, క్షౌరము చేయించుకొనగూడదు.

**4, 9, 13** ఈ తిథులయందు, శూద్రులు మాంసభక్షణచేయకూడదు.

**5, 10, 15, 30** ఈ తిథులయందు, స్త్రీని సేవింపకూడదు.

ఆదివారము అభ్యంగనమున్ను; మంగళవారమున క్షౌరమున్ను; బుధవారమున స్త్రీసేవయు కూడదు. చిత్ర, హస్త, శ్రవణ నక్షత్రములందు తైలమును వదలవలెను. మఘ, కృత్తిక, ఉభ, ఉషా, ఉభాలందు స్త్రీని సేవించకూడదు. అష్టమినాడు కొబ్బరికాయను, నవమినాడు (సొర) ఆనపకాయను, దశమినాడు పొట్లకాయను, ఏకాదశినాడు అనుములను, ద్వాదశినాడు శెనగలను, త్రయోదశి నాడు వంకాయనున్ను భక్షించకూడదు.

## శంకుస్థాపనాది ముహూర్తములకు శుభమైన తిధి వార నక్షత్రాదులు

| ముహూర్తముల పేరు | తిథులు. | వారములు | నక్షత్రములు | లగ్నములు | విశేషవిషయములు |
|---|---|---|---|---|---|
| శంకుస్థాపన లేక స్తంభప్రతిష్ఠ | ౨-౩-౫-౭-౧౦-౧౩-౧౫ | సో-బు-గు-శు-శ | రో-మృ-హ-రే-అనూ-ఉఫ-పుష్య-శ్రీ ఉషా-ఉభా-చి-పున-ధ-శ-అశ్వి-స్వా | వృష-మి-కన్య-ధను-కుం-మీ | చతుర్థ శుద్ధి, అష్టమశుద్ధి |
| గృహప్రవేశము | ౨-౩-౫-౭-౧౦-౧౩-౧౫ | సో-బు-గు-శు | రో-మృ-ఉఫ-చిత్ర-అనూ ఉషా-ధ-శత-ఉభా-రే | వృష-కుం-మీ-కన్య-ధ-మి | అష్టమ, చతుర్థశుద్ధులు |
| నిషేకము | ౨-౩-౫-౭-౧౦ | సో-బు-గు-శు | అశ్వి-రో-ఉఫ-హ-స్వా-అనూ-మూల-ఉషా-శ్ర-శత-ఉభా | వృ-మి-కర్కా-సిం-తు-ధను-కుం-మీన | లగ్నశుద్ధి |
| గర్భాధానము | ౨-౩-౫-౭-౧౦ | సో-బు-గు-శు | రో-ఉఫ-హ-స్వాతి-అనూ-ఉషా-శ్రవ-శత-ఉభా-ధని-మృగ | వృ-మి-క-సిం-తు-ధను-కుంభ | లగ్నశుద్ధి-సప్తమమందు పాపగ్రహములు లేకుండుట-పర్వవర్జము |
| పుంసవనము | ౨-౩-౫-౭-౧౦-౧౩-౧౫ | సో-బు-గు-శు | అశ్వి-రో-మృ-పున-పుష్య-ఉఫ-హ-చి-స్వా-అనూ-మూ-ఉషా-శ్ర-ధ-శ-ఉభా-రే | మే-ధ-మి-మీ | నవమశుద్ధి-మూడవ మాసము |
| సీమంతము | ౨-౩-౫-౭-౧౦-౧౩-౧౫ | ఆ-బు-గు-గు | అశ్వి-రో-మృ-పున-పుష్య-ఉఫ-హ-చి-స్వా-అను-మూ-ఉషా-శ్ర-ధ-శ-ఉభా-రే | మే-ధ-మీ | ౪-౬-౮-మాసములు-నవమశుద్ధి |
| జాతకర్మ | ౨-౩-౫-౭-౧౦-౧౩ | సో-బు-గు-శు | రో-ఉభా-ఉషా-స్వా-పున-శ్ర-ధని-శత ఉఫ-అశ్వి-హ-పుష్య-అనూ | వృష-తు-మి-క-ధ-మీన-కటక | అష్టమశుద్ధి |
| డోలారోహణము | ౨-౩-౫-౭-౧౮-౧౩ | సో-బు-గు-శు | అశ్వి-రో-మృ-ఉఫ-ఉషా-ఉభా-పున-పుష్య-మఘ-పుబ్బ-పూషా-ఉషా-శ్ర-ధ-శ-రే-పూభా-హ-చి-స్వా-వి-అనూ | వృ-మి-కర్కా-కన్య-తు-ధను-మీ | ౧-౩-౫ మాసములు శుభము-అష్టమశుద్ధి |
| నామకరణము | ౨-౩-౫-౭-౧౦-౧౩ | సో-బు-గు-శు | అశ్వి-రో-ఉఫ-ఉషా-ఉభా-స్వా-పున-శ్ర-ధ-శ-హ-పుష్య-అనూ | వృ-తు-మి-కన్య-ధను-మీన-కటక | అష్టమశుద్ధి |
| అన్నప్రాశనము | ౨-౩-౫-౭-౧౦-౧౩ | సో-బు-గు-శు | అశ్వి-రో-మృ-పున-పుష్య-ఉఫ-ఉషా ఉభా-హ-చి-స్వా-అనూ-శ్ర-ధ-శత-రే | వృ-మి-కర్కా-క-తు-ధను-మీ | పురు॥కు ౬-౮-౧౦ మాసాలు, స్త్రీలకు ౫-౭-౯ మాసా॥ శుభం. దశమశుద్ధి, లగ్నమందు పాపగ్రహాలు లేకుండుట |
| కర్ణవేధ | ౨-౩-౫-౭-౧౦ | సో-బు-గు-శు | అశ్వి-మృ-పున-పుష్య-హ-చి-అనూ-శ్ర ధ-శ-రే-ఆర్ద్ర-ఉఫ-ఉషా-ఉభా | వృ-మి-కర్కా-క-తు-ధ-మ | ౬-౮ మాసములయందు శుభము-అష్టమశుద్ధి |
| కేశఖండనము | ౨-౩-౫-౭-౧౦ | సో-బు-గు-శు | అశ్వి-మృ-పున-పుష్య-హ-చి-స్వా-శ్ర-ధ-శ-రేవతి | వృ-మి-కర్కా-క-తు-ధ-మీ | ఉత్తరాయణం-పూర్వాహ్ణము |
| అక్షరస్వీకారము | ౨-౩-౫-౭-౧౦ | సో-బు-గు-శు | అశ్వి-పున-పుష్య-హ-చి-స్వాతి. అనూ-ఆర్ద్ర-శ్ర-రేవతి | మే-కర్కా-తు-మ | ఉత్తరాయణం, ౫-వ సం॥ అష్టమశుద్ధి, సూర్యుడు చరస్థిర రాసులయం దుండగా |
| విద్యారంభము | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩ | ఆ-సో-బు-గు-శు | అశ్వి-మృ-ఆర్ద్ర-పున-పుష్య-ఆశ్లే-పూఫ-పూషా-పూభా-హ-చి-స్వా-శ్ర-మూల | మే-కర్కా-తు-మ | అనధ్యయనములను విడిచి పెట్టవలెను. శస్త్రవిద్యాభ్యాసమునకు-ఆది-మంగళ వారములు శుభము. |
| కంచుకధారణము | ౨-౩-౫-౧౦-౧౩ | సో-బు-గు-శు | అశ్వి-పున-పుష్య-ఉఫ-ఉషా-ఉభా-హస్త-చి-స్వా-అనూ-శ్ర-రే | వృ-మి-కర్కా-క-తుల-ధ-మ-కుం | పూర్వాహ్ణమందు శుభము |
| ఉపనయనము | ౨-౩-౫-౭-౧౦ | బు-గు-శు | అశ్వి-రో-మృ-పున-పుష్య-ఉఫ-ఉషా-అనూ-రే-ఉభా-హ-చి-స్వా-శ్ర-ధ-శత | కేంద్రమున పాపగ్రహాలు లేని లగ్నం | అష్టమశుద్ధి-లగ్నమందుపాపగ్రహములు లేకుండుట-పూర్వాహ్ణము |

| ముహూర్తముల పేరు | తిథులు | వారములు | నక్షత్రములు | లగ్నములు | విశేష విధులు |
|---|---|---|---|---|---|
| వివాహము | ౨-౩-౫-౭-౧౦ ౧౩ | బు-గు-శు | రో-మృ-మ-స్వా-హ-అనూ-రే-ఉఫ ఉషా-ఉభా-మూల | వృ-మి-కర్కా-కన్యా తు-ధ-మీ-మే | సప్తమశుద్ధి |
| నవవస్త్రధారణము | ౨-౩-౫-౭-౧౦ ౧౧-౧౩ | బు-గు-శు | అశ్వి-ఉఫ-ఉషా-ఉభా-హ-చి-స్వా-రో పున-పుష్య-అనూ-ధ-రే | వృ-మి-కర్కా-క-తు-ధ-మీ-మ-కుం | [illegible] శుద్ధి |
| ప్రయాణము | ౨-౩-౫-౭-౧౦ ౧౩ | సో-బు-గు-శు | మృ-అశ్వి-పుష్య-పున-హ-అనూ-శ్ర మూల-ధ-రే | మే-వృ-కర్కా-తు-ధ-మక-మీనం | పంచమశుద్ధినాం మూల-తిథి శూల-నక్షత్రశూలలు కల దిక్కులు విడువవలెను. |
| గృహారంభము | ౨-౩-౫-౭-౧౦-౧౩-౧౫ | సో-బు-గు-శు | అశ్వి-రో-పుష్య-ఉఫ-ఉషా-ఉభా-చి-స్వా-పున-మృ-మూ-హ-అనూ-శ్ర-శ-ధ-రే | కర్కా-వృ-మ-మీ | పూర్వ, ఆగ్నేయ, ఉత్తర దిక్కులు విడువవలెను. |
| బీజావాపనము | ౨-౩-౫-౭-౧౦ ౧౧-౧౩ | సో-బు-గు-శు | రో-హ-చి-స్వా-పుష్య-ఉఫ-ఉషా-ఉభా-మూల-ధ-రే-అశ్వి-మృ-అనూ-మఘ-శ్ర-శ | వృ-మి-కర్కా-క-తుల-ధను-మీనం | శుభగ్రహదృష్టిగల లగ్నము శుభమైనది |
| దేవతాప్రతిష్ఠ | ౨-౩-౫-౭-౧౦ ౧౩ | సో-బు-గు-శు | శ్ర-ధ-శ-ఉత్తరాత్రయం-అనూ-పున హ-చి-రే-మృ-అశ్వి-రో | వృ-మి-కన్య-తు-ధ-మీ | ౮ శుద్ధి ఉత్తరాయణం పూర్వాహ్ణము శుభము |
| వృక్షలతాది స్థాపనం | ౨-౩-౫-౭-౧౦ | సో-బు-గు-శు | అశ్వి-రో-పుష్య-హ-ఉత్తరాత్రయం రే-పున-మూ-స్వా-శత | వృ-కట-కన్యా-తులా ధను-మీ | ౮ శుద్ధి, లగ్నమునకు శుభదృష్టి |
| ఔషధసేవ | ౨-౩-౫-౭-౧౦ ౧౩ | ఆ-సో-బు-గు-శు | అశ్వి-పుష్య-హ-చి-మృ-అనూ-రే-శ్ర-ధని-శత-స్వా-పున-మూ | మిథు-కన్యా ధను-మీనం | ౭, ౮, ౧౨ శుద్ధి లగ్నమున శుభులు |
| వాణిజ్యము | ౨-౩-౫-౭ | ఆ-సో-బు-గు-శు | అశ్వి-రో-మృ-హ-చి-అనూ-ఉత్తరాత్రయం-పుష్య-రే | వృ-మి-కట-కన్యా తు-ధను-మీ | ౧౧-వ స్థానములు శుద్ధి |

ఈ ముహూర్తములకు ఏకవింశతి మహాదోషములను వదలిపెట్టవలెను. పంచకరహితముగ నుండవలెను. చంద్రతారాబలము లుండవలెను. పాపగ్రహములు అనగా రవి, చంద్ర, కుజ, రాహు, కేతు, క్షీణచంద్ర, పాపయుతబుధులు లగ్నమునకు ౩-౬-౧౧ స్థానములయందును, శుభగ్రహము లగు గురు, శుక్ర, పూర్ణచంద్రులు, పాపయుతుడు కాని బుధుడు, లగ్నమునకు ౧-౨-౪-౫-౭-౯-౧౦-౧౧ స్థానములయందును ఉండిన శుభము. చంద్రుడు పాపియైనను, శుభుడైనను లగ్నమునం దుండకూడదు.

## పంచకమును తెలిసికొను పద్ధతి

శుక్లప్రతిపత్తు మొదలు తిథిసంఖ్యయును, ఆదివారము మొదలు వారసంఖ్యయును, అశ్విన్యాదిగా నక్షత్రసంఖ్యయును, మేషాదిగా లగ్నసంఖ్యయును గలిపి, తొమ్మిదిచే భాగించగా శేషము పంచకమనబడును. అందు ౧ మిగిలెనేని మృత్యుపంచకము, ౨ మిగిలెనేని అగ్నిపంచకము, ౪ మిగిలెనేని రాజపంచకము, ౬ మిగిలెనేని చోరపంచకము, ౮ మిగిలెనేని రోగపంచకము. శేషసంఖ్యలు నిష్పంచకములు (శుభమయినవి). మతాంతరము : తిథిసంఖ్య శుక్లపక్షములో శుక్లప్రతిపత్తునుండియు, కృష్ణపక్షములో కృష్ణప్రతిపత్తునుండియు గణించుట గలదు. మార్తాండగ్రంథరీత్యా గతతిథులను లగ్నసంఖ్యను కలిపి తొమ్మిదిచే భాగించగా శేషము ముందుచెప్పిన ప్రకారముగా చూచుకొనుట కూడ గలదు. ధ్రువకము కలుపుట శాస్త్రసమ్మతము కాదు.

## ప్రసవ విషయము

అశ్విని, భరణి, కృత్తిక, రోహిణి, ఆర్ద్ర, పుష్యమి, ఆశ్లేష, మఖ, పుబ్బ, ఉత్తర, విశాఖ, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, రేవతి యీ నక్షత్రములందు ప్రసవించినచో వెంటనే శాంతి చేయవలెను. ఇందు గుర్తించబడిన నక్షత్రములందు ప్రసవించినచో హోమశాంతి చేయవలెను. తిథిసంధి, నక్షత్రసంధి, లగ్నసంధులందున్నూ శాంతి చేయవలెను. వారదుర్ముహూర్తమందున్నూ, వర్జ్యమందున్నూ ప్రసవించిననూ శాంతి చేయవలెను.

**N. B.** ఈ పంచాంగమందలి ప్రతివిషయమున్నూ సవిమర్శకముగా సరియగు శాస్త్రప్రమాణములబట్టి వ్రాయబడినవి గాన ఎల్లరున్నూ ఆచరింపనగును. సందేహములకు లిఖితవంతమగు సమాధానము తీయబడును.

## బల్లిపాటునకు ఫలములు

శిరస్సు-కలహము, ముఖము-బంధుదర్శనము, కనుబొమ్మల నడుమ-రాజానుగ్రహము, పై పెదవి-ధనవ్యయము, క్రింది పెదవి-ధనలాభము, ముక్కుచివర - రోగము, కుడిచెవి-దీర్ఘాయువు, ఎడమచెవి-వర్తకలాభము, నేత్రము-బైదు, గడ్డము-రాజదండనము, నోరు-భయము, కంఠము - శత్రుహాని, కుడిభుజము - ఆరోగ్యము - ఎడమభుజం-స్త్రీసంగమము, కుడిముంజేయి-కీర్తి, ఎడమముంజేయి-రోగము, స్తనయుగ్మము-దోషము, ఉదరము-ధాన్యలాభము, రొమ్ము, నాభి-ధనలాభము, ప్రక్కలు-సుఖము, పాదము-ప్రయాణము, వీపు-శుభము, గోళ్లు-ధనవ్యయము, లింగము - దారిద్ర్యము, జుట్టుకొన-మృత్యువు. ఈ ప్రదేశములయందు తొండప్రాకినను ఫలమిట్లే యని తెలియునది.

సెప్టెంబరు / అక్టోబరు 1944 — తులామాసం — ఆశ్వయుజమాసం — అక్టోబరు ౧౩౫౪ ఫ॥

| | | | |
|---|---|---|---|
| 18 | ౩ | ౧౩ | శు॥ ప్ర-సో౩౧-౩ ఉఫ౧౧-౧౪ శుక్ల ౪౯-౪౯ బ౩౧-౩ ౮౪-౧౨ త్యా౪-౨౬ యోగః దౌహిత్రికృతమహాలయః శరన్నవరాత్రారంభః కలశస్థాపనం స్తన్యవృద్ధిగౌరీవ్రతం ౪ క్రాం భో౪-౫౯ చ౨౯ [ప్రీతిద్వితీయా తు క్రాం భో౪-౪౯ |
| 19 | ౪ | ౧౪ | ద్వి॥ మం౩౫-౫౮ హ౧౭-౩౯ బ్ర౫౧-౩ బా౩-౩౦ ౮౯-౨౨ అహః౩౦-౧౪ ఉ౩ రవిః౫౫-౧౨ చంద్రో॥ ఉత్తరశృంగః |
| 20 | ౫ | ౧౫ | తృ॥ బు౪౦-౧౫ చి౨౩-౩౦ ఐ౫౧-౪౩ తై౮-౬౮౮-౯ త్యా౪-౨౦ సరుమాధ్యనివృత్తిః భో౪-౩౯ మవ్వాల్ చ౧ |
| 21 | ౬ | ౧౬ | చ॥ గు౪౩-౩౮ స్వా౨౮-౩౩ వై౫౧-౪౧ వ౧౧-౫౬ ౭౧౩-౯ త్యా౪-౧౬ భో౪-౨౯ చ౨ |
| 22 | ౭ | ౧౭ | పం॥ శు౪౫-౪౯ విశా౩౨-౩౦ వి౫౦-౩౮ బ౧౪-౪౩ ౮౧౨-౪౯ ఉపాంగలలితావ్ర॥ భో౪-౧౮ [ధ్యా॥ సమా॥ భో౪-౮ |
| 23 | ౮ | ౧౮ | ష॥ శ౪౬-౪౨ అనూ౩౫-౧౩ ప్రీ౪౮-౩౬ కౌ౧౬-౧౫ ౮౯-౨౬ అహః౩౦-౪ ఉఫ౪ రవిః౯-౫ తులాయనంపత్తిణ్యాన |
| 24 | ౯ | ౧౯ | స॥ ఆ౪౬-౨౦ జ్యే౩౬-౪౨ ఆయు౪౫-౩ ౨౧౬-౩౧ త్యాజ్యాభావః భో౩-౫౮ చ౫ [గౌరీవ్రతం రావే భో౩-౪౮ చ౬ |
| 25 | ౧౦ | ౨౦ | అ॥ సో౪౪-౪౪ మూ౩౭-౦ సౌ౪౧-౩౦ భ౧౫-౩౨ ౮౨-౫౩ త్యా౪-౧ అనధ్యాయః సరస్వతీపూజా దుర్గాష్టమీ గజ |
| 26 | ౧౧ | ౨౧ | న॥ మం౪౧-౫౯ పూషా౩౬-౬౧౩౬-౩౩ బా౧౩-౨౧౭౦-౩౮ త్యా౩-౫౬ ౨౫-౩౦ త్యా౩-౫౨ అహః౨౯-౫౮ హస్తా౧ రవిః౪౨-౪౬ స్వారోచిషమన్వాదిః మహానవమీ సుదశావ్రతం దుర్గాహోమః బలిదానం చ శవే భో౩-౩౭ |
| 27 | ౧౨ | ౨౨ | ద॥ బు౩౮-౧౦ ఉషా౩౪-౧౩ అతి౩౦-౪౮ తై౧౦-౫౮ ౧౩-౫౦ త్యా౩-౪౯ విజయదశమీ శమీపూజా రాజ్ఞాం పట్టాభిషేకః సరస్వత్యుద్వాసనం సోపపదం బుద్ధజయంతీ ద్వదశీవ్రతారంభః కేక్రాం భో౩-౨౭ చ౮ [చ౯ |
| 28 | ౧౩ | ౨౩ | ఏ॥ గు౩౩-౩౩ శ్ర౩౧-౩౦ సుక౨౪-౨౧ వ౫-౫౧ ౮౧౧-౨ త్యా౩-౪౬ సర్వేషాం౧౧ గోపద్మవ్రతారంభః భో౩-౧౭ |
| 29 | ౧౪ | ౨౪ | ద్వా॥ శు౨౮-౧౬ ధ౨౮-౫౫ ధృ౧౭-౨౧ బం-౫౪ ౮౧౫-౪ ద్వాదశీతిథిః శక్రధ్వజోత్థాపనం గో౧౨ పద్మనాభ౧౨ భో౩-౭ |
| 30 | ౧౫ | ౨౫ | త్ర॥ శ౨౨-౩౩ శత౨౪-౧౩ శూ౯-౫౬ తై౨౨-౩౩ ౮౯-౧౭ త్యా౩-౪౪ అహః౨౯-౪౮ హ౨ రవిః౬-౧౦ షడశీతిముఖః ౪౬-౪౦ తిథిద్వయం అనధ్యయన౩ భో౨-౫౬ చ౧౧ [కౌముదీపూజా అక్షక్రీడా కోజాగరీ పునే భో౨-౪౬ చ౧౨ |
| 1 | ౧౬ | ౨౬ | చతు॥ ఆ౧౬-౩౪ పూభా౨౦-౬గం౨-౧౮ వ్యా౫౨-౧౩ వ౧౬-౩౪ ౮౧౨-౩౯ త్యా౩-౪౩ పూర్ణిమా తిథిః అన్వాధానం |
| 2 | ౧౭ | ౨౭ | పూ॥ ○ సో౧౦-౩౦ ఉభా౧౫-౫౪ ధ్రు౪౬-౪౫ బ౧౦-౩౦ ౮౧౪-౮ త్యా౩-౪౪ యాగః రవే భో౨-౩౬ చ౧౩ |
| 3 | ౧౮ | ౨౮ | కృ॥ ప్ర-మం౪-౩౨ రే౧౧-౩౦ వ్యా౩౯-౧౧ కౌ౪-౨ ౮౯-౫౦ త్యా౩-౪౫ అహః౨౯-౪౦ హ౩ రవిః౨౮-౫౭ అపమృత్యుధ్యాయః భో౨-౨౬ చ౧౪ |
| 4 | ౧౯ | ౨౯ | తృ॥ బు౫౩-౪ అశ్వ౮-౮ హ౩౨-౩ వ౨౬-౧౫ శేషః౨-౩౦ ౮౧-౩౫ చంద్రోదయోమావ్రతం భో౨-౧౫ చ౧౫ |
| 5 | ౨౦ | ౩౦ | చ॥ గు౪౯-౨౦ భ౫-౦ వ౨౫-౨౫ బ౨౧-౩౧ ౮౪-౩౧ త్యా౩-౫౦ భో౨-౫ చ౧౬ |
| 6 | ౨౧ | ౧ | పం॥ శు౪౫-౪౯ కృ౨-౩౩ సి౧౯-౨౫ కౌ౧౭-౩౪ ౮౧౨-౧౧ త్యా౩-౫౪ అహః౨౯-౩౪ హ౪ రవిః౫౧-౪౦ భో౧-౫౫ |
| 7 | ౨౨ | ౨ | ష॥ శ౪౧-౨౮ రో౧-౨౮ వ్య౧౪-౧౭ గ౧౩-౩౮ ది౧౪-౫౬ త్యా౩-౫౮ భో౧-౪౫ చ౧౮ |
| 8 | ౨౩ | ౩ | స॥ అ౪౦-౫౭ మృ౦-౩౫ వ౯-౫౨ భ౧౧-౧౨ ది౨౨-౩ త్యా౪-౩ ఆర్ద్రాశక్రాం భో౧-౩౪ చ౧౯ |
| 9 | ౨౪ | ౪ | అ॥ సో౪౧-౫౪ ఆ౧-౧౭ పరి౬-౨౭ బా౧౧-౨౫ ౮౨-౪౮ అనధ్యాయః పునరాక్రాం భో౧-౨౪ చ౨౦ |
| 10 | ౨౫ | ౫ | న॥ మం౪౩-౫ పున౩-౧౪ శి౪-౨ తై౧౨-౩౦ ది౨౪-౧౭ త్యా౪-౧౩ అహః౨౯-౨౬ చిత్రా౧ రవిః౧౪ భో౧-౧౪ చ౨౧ |
| 11 | ౨౬ | ౬ | ద॥ బు౪౫-౩ పుష్య౬-౨౪ సి౨-౩౫ వ౧౪-౧౮ రా౧౧-౧౭ త్యా౪-౧౭ భో౧-౪ చ౨౨ |
| 12 | ౨౭ | ౭ | ఏ॥ గు౪౯-౯ ఆశ్లే౧౦-౪౫ సా౨-౫ బ౧౭-౨౦ రా౧౩-౫౯ త్యా౪-౨౧ సర్వేషాం౧౧ భో౦-౫౩ చ౨౩ [౦-౪౩ చ౨౪ |
| 13 | ౨౮ | ౮ | ద్వా॥ శు౫౩-౪౦ మ౧౬-౫౬ శు౨-౨౫ కౌ౨౧-౨౪ ౮౮-౪౬ త్యా౪॥ ౨౪ అహః ౨౯-౨౦ చిత్రా ౨ రవిః-౩౬-౧౪ భో |
| 14 | ౨౯ | ౯ | త్ర॥ శ౫౮-౪౯ పూఫ౨౨-౯ శు౩-౨౨ గ౨౬-౧౫ ౮౧౨-౪౨ త్యా౪-౨౬ శనిత్రయోదశీ యమదీపం భో౦-౩౨ పాత౧౧ |
| 15 | ౩౦ | ౧౦ | చతు॥ ఆ౬౦-౧౦ ఉఫ౨౮-౩౯ బ్ర౪-౪౩ భ౩౧-౯ రా౨౨-౪౧ త్యా౪-౨౬ అనధ్యయన నరకచతుర్దశీ స్నా॥ చంద్రోదయకాలే కర్తవ్యః మాసశివ. భో౦-౨౧ చ౨౬ [అన్వాధానం, దీపావళీ ధనలక్ష్మీపూజా భో౦-౧౦ చ౨౭ |
| 16 | ౩౧ | ౧౧ | చతు॥ సో౪-౯ హ౩౫-౮ ఐ౬-౧౦ శ౪-౯ రా౨౭-౫౬ త్యా౪-౨౪ అహః౨౯-౧౨ చిత్రా౩ తులాయాం, రవిః ౫౭-౩౦ |
| 17 | ౧ | ౧౨ | అమా॥ ● మం౯-౧౦ చిత్ర౪౧-౧౦ వై౭-౨౪ నా౯-౧౦ శేషః౧-౩ ౮౨౭-౧౪ యాగః పిండపితృయజ్ఞః ఉదయాది ౭-౩౦ ప॥ విషువత్పుణ్యకాలః ఘూర్జరవత్సరాదిః స్వాత్యర్ఘ్యంగః రాత్రౌ చతుర్దశ్యామేక ర్తవ్యః క్రాం భో౫-౨౪ |

| కుజచారః | | | | రాహుకేతుచారౌ నస్తః |
|---|---|---|---|---|
| కు౧సో-హ౪కు౫౩ | ౭ఆ-పూఫ౪బు౪౦ | ౧౩శ-చి౧బు౪౩ | ౧౧గు-స్వా౨కు౩౪ | చంద్రోచ్చచారః |
| ౪గు-పశ్చాదస్తమితః | ౧౦-బుఉఫ౧బు౨౪ | ౧౪సో-చి౨బు౪౧ | ౧౪ఆ-స్వా౩కు౧౮ | కు౬శఉఫ౪చంద్రోచ్చ౪౨ |
| ౬శ-చి౧కు౫౭ | కు౧౨కు-ఉఫ౨కబు౫౨ | గురుచారః | బ॥ ౩బు-స్వా౪కు౨ | |
| ౧౧గు-చి౨కు౫౯ | ౧౩శ-ప్రాగస్తమితః | కు౩బు-ప్రాగుదితః | ౫కు-విశా౧కు౪౬ | |
| బ౩బు-చి౩తుకు౨ | ౧౫సో-ఉఫ౩బు౧౨ | ౬శ-పూ౪గు౫౩ | ౮సో-విశా౨కు౨౨ | |
| ౮సో-చి౪కు౨ | బ౩-బుఉఫ౪బు౨౬ | బ౮-సోఉఫ౧గు౨౬ | ౧౧గు-విశా౩కు౬ | |
| ౧౩శ-స్వా౧కు౧ | ౫కుహ౧బు౩౭ | శుక్రచారః | ౧౩శ-విశా౪వృకు౫౦ | |
| బుధచారః | ౬-హ౨బు౪౨ | కు౩బు-చి౩తుకు౨౨ | ౩౦మం అనూ౧కు౩౪ | |
| కు౪గు-పూఫ౩బు౪౧ | ౯మం-హ౩బు౪౫ | ౬శ-చి౪కు౬ | శనిచారః | |
| | ౧౧గు-హ౪బు౪౫ | ౮సో-స్వా౧కు౫౦ | కు౧౩శ-ఆర్ద్రా౩శని॥ ౨౭ | |

| | | | శ |
|---|---|---|---|
| | బ౧౪సో-తు ర | | రా |
| | బ౩బు-తు కు | | |
| కే | కు౧౨కు-క బు | | గు బు |
| | బ౧౩శ-వృ క | | |
| | | కు | ర కు |

అక్టోబరు నెల 1944

18 ౨ ౧౩ శు-ప్ర॥బు౧౩-౩౦స్వా౪౬-౨౮విష్క౮-౮బ౧౩-౩౦ శేం-౪౫ పునస్త్యాజ్యాభావః ద్వితీయాతిథిః చంద్రోదయః ఉత్తరశృంగః కార్తికస్నానారంభః గోక్రీడసంబలిప్రతిపత్ యమద్వితీయా భగినీహస్తభోజనం కుక్రాం భో౫-౧౩

19 ౩ ౧౪ ద్వి॥గు౧౬-౫౨వి౫౦-౪౩ప్రీ౮-౧౦కౌ౧౬-౫౨డి౧-౨౭త్యా౪-౧౭తృతీయాతిథిః భో౫-౨ జిలకాజీ చ౧

20 ౪ ౧౫ తృ॥శు౯-౭అనూ౫౩-౪౮ఆయు౭-౧౮గ౯-౭డి౧-౧౪త్యా౪-౧౨అహః౨౯-౪ చిత్ర౪౪రవిః౧౪-౩౬చతుర్థీతిథిః త్రిలోచనగౌరీవ్రతం భో౪-౫౧ చ౨ [౪-౪౦చ౩

21 ౫ ౧౬ చ॥శ౨౦-౫శ్యే౫౫-౩౫సౌ౫-౩౦భ౨౦-౫డి౮-౧౩త్యా౪-౭పంచమీతిథిః నాగచతుర్థీ దూర్వాగణపతివ్రతం భో

22 ౬ ౧౭ పం॥ఆ౯-౪౬మూ౫౬-౯శో౨-౪౧అతి౫౬-౨౮బా౯-౪౬రా౨౩-౯షష్ఠీతిథిక్షీణతస్రంధారణం రానేభో౪-౨౯

23 ౭ ౧౮ మ॥సో౧౮-౧౩పూషా౫౫-౩౨సుక౫౪-౨౨తై౧౮-౧౩డి౯-౫౪త్యా౩-౫౮అహః౨౮-౫౬స్వా౧ రవిః ౩౮-౪౭ వృశ్చికాయనం సప్తమీతిథిః వహ్నిపూజా శవే భో౪-౯౯చ౫ [భో౪-౮చ౬

24 ౮ ౧౯ స॥మం౧౫-౩౩ఉషా౫౩-౫౩ధృ౪౮-౪౫వ౧౫-౩౩డి౧౪-౫౯త్యా౩-౫౩అష్టమీతిథిః ఉభయానధ్యాయః కేక్రాం

26 ౯ ౨౦ అ॥బు౧౧-౫౪శ్ర౫౧-౧౬శూ౪౨-౨౩బ౧౧-౫౪డి౩-౨౭త్యా౩-౪౯గోష్టాష్టమీ భో౩-౫౭ చ౭

26 ౧౦ ౨౧ న॥గు౭-౨౩ధని౪౭-౫౯గం౩౫-౨౬కౌ౭-౨౩డి౦-౪౩అహః౨౮-౫౦స్వాతి౨ రవిః౫౮-౫౦కృతయుగాదిః అక్షయ నవమి విష్ణుత్రిరాత్రవ్రతం భో౩-౪౬ [బోధనైకాదశీతులసీపద్మవ్రతంభీష్మపంచకవ్రతగవేసవే భో౩-౩౫ చ౯

27 ౧౧ ౨౨ ద॥శు౨-౧౪పీష్యా౫౪-౨౮శత౪౪-౪కృ౨౮-౪గ౨-౧౪డి౪-౪౮త్యా౩-౪౪రా౩౦-౧౨అవమ స్మార్తగృహస్థానాం

28 ౧౨ ౨౩ ద్వా॥శు౫౦-౪౩పూభా౪౦-౭ధ్రు౨౦-౨౩బ౨౩-౪౨ శే ౨-౪౪ పు॥భావః యతీ, విధవ, ముగ్ధ, వైష్ణవైకాదశి స్వాయంభువమన్వాదిః క్షీరాబ్ధిద్వాదశి భో౩-౨౪ చ౧౦

29 ౧౩ ౨౪ త్ర॥అ౪౪-౩౯ఉభా౩౫-౫౧వ్యా౧౨-౩౨కౌ౧౭-౪౧డి౨-౨౫భో౩-౧౪చ౧౧ [అధ్యయన౩నై...౦త౧౪భో౩-౩

30 ౧౪ ౨౫ చతు॥సో౩౮-౪౫రే౩౧-౪౪హ౪-౪౩వ౫౨-౧౭గ౧౧-౪౨డి౩-౪౮త్యా౩-౪౪అహః౨౮-౪౨స్వా౩రవిః౧౮-౨౨

31 ౧౫ ౨౬ ○పూ॥మం౩౩-౮అశ్వ౨౭-౫౨సిద్ధి౯-౩౬భ౫-౫౬డి౧౮-౩౧త్యా౩-౪౫రా౨౧-౫౩ అన్వాధానం సింధుస్నానం వ్యాసపూజ జ్వాలాతోరణందకుసావర్ణిక మన్వాదిః భో౨-౫౨ చ౧౩ [కృత్తికాదీపోత్సవః భో౨-౪౧చ౧౪

నవంబరు నెల 1944

1 ౧౬ ౨౭ కృ-ప్ర॥బు౨౮-౮భ౨౪-౩౫వ్య౪౨-౪౫బాం-౩౮రా౨౪-౩౯త్యా౩-౫౦ ప్రతిపత్తిథిః యోగః అరుణాచలాది క్షేత్ర

2 ౧౭ ౨౮ ద్వి॥గు౨౩-౫౨కృ౨౧-౫౯వరీ౩౬-౩౧గ౨౩-౫౨త్యాజ్యాభావః అహః౨౮-౩౮స్వా౪ రవిః౩౭-౪౨ భో౨-౩౦

3 ౧౮ ౨౯ తృ॥శు౨౦-౨౮రో౨౦-౧౬పరి౩౦-౫౯భ౨౦-౨౮డి౦-౫౧త్యా౩-౫౩రా౫-౩౦త్యా౩-౫౭తిథిద్వ భో౨-౯చ౧౬

4 ౧౯ ౩౦ చ॥ శ౧౮-౮మృ౯-౩౩శి౨౬-౨౦బా౧౮-౮రా౧౨-౫త్యా౪-౨పంచమితిథిః కవె భో౨-౯చ౧౭ [౧-౫౮

5 ౨౦ ౧ పం॥ఆ౧౬-౫౫ఆర్ద్ర౯-౫౬సి౨౨-౩౩తై౧౬-౫౫రా౨౨-౧౨అహః౨౭-౩౨విశాఖ౧౪॥౫౬-౪౮షష్ఠీతిథిఃభో

6 ౨౧ ౨ మ॥సో౧౭-౦పున౨౧-౩౬సా౯-౪౭వ౧౭-౦రా౧౪-౨త్యా౪-౧౨సప్తమీతిథిః రాక్రాం భో౧-౪౭ చ౯

7 ౨౨ ౩ స॥మం౧౮-౨౧పుష్య౨౪-౩౦శు౧౮-౧బ౧౮-౨౧రా౩౦-౧౨త్యా౪-౧౬అష్టమీతిథిః ఉభయానధ్యాయః భో౧-౩౬

8 ౨౩ ౪ అ॥బు౨౦-౫౭ఆశ్లే౨౮-౩౫శు౧౭-౧౧కౌ౨౦-౫౭శే౨-౫౯పునస్త్యాభా-యూన్యతి-ఇంద్రసా॥మన్వాదిః భో౧-౨౫

9 ౨౪ ౫ న॥గు౨౪-౪౧మ౩౩-౪౨బ్ర౧౭-౧౨గ౨౪-౪౧డి౧-౮త్యా౪-౨౦రా౨౭-౧౮త్యా౪-౨౪అహః౨౮-౨౪విశా౨౪వి

10 ౨౫ ౬ ద॥శు౨౯-౧౭పూఫ౩౯-౩౭వి౧౭-౫౨భ౨౯-౧౭రా౩౧-౧౩భో౧-౪చ౨౩ [౧౫-౦నవమీతిథిః భో౧-౧౪ చ౨౨

11 ౨౬ ౭ ఏ॥శ౩౪-౩౧ఉఫ౪౬-౬వై౯-౩బ౧-౫౪ శే౪-౧పునస్త్యా-భావః సర్వేషాం ౧౧ భో౦-౫౩చ౨౪

12 ౨౭ ౮ ద్వా॥ఆ౩౯-౫౪హ౫౨-౪౦వి౨౦-౨౭కౌ౭-౧౨డి-౨౩త్యా౪-౨౬అహః౨౮-౧౮వి॥౩౪రవిః౩౩-౪భో౦-౪౨చ౨౫

13 ౨౮ ౯ త్ర॥సో౪౫-౨౮చి౫౮-౫౫ప్రీ౨౧-౪౨గ౧౨-౨౮డి౧౪-౪౫త్యా౪-౨౫భో౦-౩౧ [రాత్రికృష్ణాంగారక౧౪భో౦-౨౦

14 ౨౯ ౧౦ చతు॥మం౪౯-౩౦స్వా౬౦-౧౦ఆ౨౨-౩౩భ౧౭-౧౬డి౧౪-౮త్యా౪-౨౨అనధ్యయన ౩ త్రేతాయుగాంతః మాసశివ

15 ౩౦ ౧౧ అ●బు౫౨-౫౮స్వా౪-౧౩సా౨౨-౪౫చతు౨౧-౧౪డి౯-౧౫త్యా౪-౧౮అహః౨౮-౧౨విశా౪ వృశ్చికే రవిః౫౧-౨ అన్వాధానం పిండపితృయజ్ఞః గోత్రిరాత్రవ్రతం విశా॥వృ॥కాం॥భో౦-౯చ౨౮

| కుజచారః | ౭మం-స్వా౨బు-౨౭ | ౧౨ఆ-అనూ౪బు-౫౮ | బ-౨గు-జ్యే౩శు-౫౬ | చంద్రోచ్చచారః |
| --- | --- | --- | --- | --- |
| శు-౧బు-స్వా౨శు-౫౮ | ౯గు-స్వా౩బు-౧౮ | ౩౦బు-జ్యే౧బు-౫ | ౫ఆ-జ్యే౪శు-౪౦ | శు౬సో-హా౧చంద్రోచ్చ౩౮ |
| ౬సో-స్వా౩శు-౫౩ | ౧౨శ-స్వా౪బు-౧౨ | గురుచారః | ౮బు-మూ౧శ-శు౨౪ | |
| ౧౨శ-స్వా౪శు-౪౬ | ౧౪సో-వి-౧బు-౫ | శుబ-ఉఫ౨కన్యాశు౫౭ | ౧౧శ-మూ౨శు-౮ | శ |
| బ-౨గు-వి-౧శు-౩౮ | ౧౫మం-వి౨బు-౫౮ | బ-౧౩సో-ఉఫ౩గు-౧౬ | ౧౩సో-మూ౩శు-౫౨ | |
| ౭మం-వి-౨శు-౯ | బ-౨శు-వి౩బు-౫౫ | శుక్రచారః | శనిచారః | బ౩౦ బు వృ ర |
| ౧౨ఆ-వి-౩శు-౧౮ | ౪శ-విరవ్య-బు౫౧ | శు-౩శు-అనూ౨శు-౧౮ | శు-౧బువక్రారంభః | బర శ వృ బు — రా |
| బుధచారః | ౬సో-అనూ౧బు-౫౦ | ౬సో-అనూ౩శు-౧ | బ-౧బు-ఆర్ద్రా౨వక్రనిః౧౨ | శుర బు క గు |
| శు-౧బు-చి-౩శు-బు-౩౬ | ౮బు-అనూ౨బు-౫౦ | ౮బు-అనూ౪శు-౪౫ | రాహుకేతుచారౌ | కే — బర బు ధ శు — గు |
| ౩శు-చి-౪బు-౩౨ | పశ్చాదుదితః | ౧౨శ-జ్యే౧శు-౯ | శు-౨గు-పునర్వసు రాహుః | |
| ౫ఆ-స్వా-౧బు-౨౭ | ౧౦శు-అనూ౩బు-౫౨ | ౧౫మం-జ్యే౨శు-౧౩ | ఉషా౨కేతుః ౯ | శు — ర శు బు |

నవంబరు ౧౯౪౪ — నవంబరు 1944 · మార్గశిర ౧౩౫౪ ఫ॥ · కార్తీక ౧౩౫౪ ఫ॥

16 ౧ ౧౨ శు॥ ప్ర-౫౫-౧౭ విశా౮-౪౦ శో ౨౨-౫౭౦౨౪-౭ది౮౯-౧౩ త్యా౪-౧౩ యాగఃఉదయాది౭-౨పర్యంవిష్ణుపదపుణ్య కాలః రక్రాం వక్రాం భో౫-౩౧చ౨౯

17 ౨ ౧౩ ద్వి॥శు౫౬-౧౮అనూ౧౧-౫౭అతి౨౦-౩౦బా౨౫-౪౭ది౨౬-౨౬త్యా౪-౮చంద్రోదయఃఉత్తరశృంగః భో౫-౧౯

18 ౩ ౧౪ తృ॥శ౫౬-౦జ్యే౧౪-౩సు౧౭-౫౫తై౨౬-౯త్యాజ్యాభావః భో౫-౮జిలహేజ్ చ౧ [చ౩౦

19 ౪ ౧౫ చ॥ఆ౫౪-౨౬మూ౧౪-౪౭ధృ౧౪-౨౨వ౨౫-౧౩ది౧౦-౪౪త్యా౪-౩ రా౧౦-౩౪ త్యా౩-౫౮ అహః౨-౪౮అనూ ౧౪విః ౮-౨౭కపర్ది గణపతివ్రతం రావే భో౪-౫౭చ౨

20 ౫ ౧౬ పం॥సో౫౧-౪౧పూషా౧౪-౨౪శూ౯-౫౦బ౨౩-౩రా౬-౫౦త్యా౩-౫౪నాగ౫శవేభో౪-౪౫చ౩

21 ౬ ౧౭ ష॥మం౪౭-౫౮ఉషా౧౩-౦౫౦౪-౨౮వృ౫౪-౭కౌ౧౯-౫౬ది౨౨-౩౬త్యా౩-౫౧సుబ్రహ్మణ్యషష్ఠీ చంపాష్ఠీ కేక్రాం భో౪-౩౪ చ౪

22 ౭ ౧౮ స॥బు౪౩-౨౪శ్ర౧౦-౩౮ధ్రు౫౧-౪౨౫౧౫-౪౧-౭౨౦-౭ త్యా౩-౪౮అహః౨౭-౫౮అనూ౨౪విః౨౫-౪౭ధనురయ నం మిత్రసప్తమీ భో౪-౨౩

23 ౮ ౧౯ అ॥గు౩౮-౧౩ధని౭-౩౪వ్యా౪౪-౨౦భ౧౦-౪౮ది౨౪-౨౯అనధ్యాయఃకాలభైరవాష్టభో౪-౧౨చ౬

24 ౯ ౨౦ న॥శు౩౨-౩౫శత౩-౫౫పూభా౫౬-౮హ౩౬-౪౧బా౫-౨౪ది౧౮-౫౨త్యా౩-౪౪ఉదయకల్పఃనంద౯భో౪-౦చ౭

25 ౧౦ ౨౧ ద॥శ౨౬-౪౧ఉభా౫౫-౪౭వ౨౮-౫౧౫౨౬-౪౧ది౨౨-౨౨అహః౨౭-౫౬అనూ౩౪విః౪౨-౫౦దశమీతిథి భో౩-౪౯

26 ౧౧ ౨౨ ఏ॥ఆ౨౦-౪౪రే౫౧-౩౫సి౨౧-౧భ౨౦-౪౪ది౨౩-౪౧త్యా౩-౪౩తిథిద్వయం సర్వేషాం౧౧భో౩-౩౮౯ [చ౨౦

27 ౧౨ ౨౩ ద్వా॥సో౧౫-౧అశ్వ౪౭-౪౧శ్య౧౩-౭బా౧౫-౧౮౧౦-౨౬త్రయోదశీతిథిఃరుక్మాంగద౧౨మత్స్య౧౨భో౩-౨౬

28 ౧౩ ౨౪ త్ర॥మం౯-౩౭భ౪౪-౧౫వరీ౫-౩౭వ౫౨-౪౮తై౯-౩౭ది౧౦-౧౮ త్యా౩-౪౬అహః౨౭-౫౨ అనూ౪౪విః౫౮ ౩౦ అనధ్యయన౩హనుమద్వ్రితంఅనంగ౧౩౪వేశవేభో౩-౧౫చ౧౦ [గురు కళ్యాణానందభారతీ పట్టాభిషేకః

29 ౧౪ ౨౫ చతు॥బు౪-౪౦కృ౪౧-౨౯శ౫౧-౫౫వ౪-౪౦ది౧౨-౫౨త్యా౩-౪౯అన్వాధానం దత్తజయంతిభో౩-౪చ౧౨శ్రీజగ

30 ౧౫ ౨౬ పూ॥○సం-౨౭పిష్యా౫౬-౩౨శో౩౯-౨౯సి౪౬-౪బం-౨౭ది౨౦-౯త్యా౩-౫౨రా౨౫-౨౩అవమయాగఃభో

ధనుర్మాసం ౧౯౪౪ డిశంబరు

1 ౧౬ ౨౭ ద్వి॥శు౫౪-౪౪మృ౩౮-౩౧సా౪౧-౪తై౨౫-౫౧రా౩౧-౪౪త్యా౪-౧కేవేభో౨-౪౧చ౧౪ [౨-౫౩

2 ౧౭ ౨౮ తృ॥శ౫౩-౪౧అర్ద్రా౩౮-౩౯శు౩౬-౫౮వ౨౪-౧౨శేషః౩-౩౫పునస్త్యాజ్యాభావఃఅహః౨౭-౫౦జ్యే౧౪విః౧౫-౦

3 ౧౮ ౨౯ చ॥ఆ౫౩-౫౩పునర్౦-౭శు౩౩-౫౦బ౨౩-౪౭ది౯-౨౦త్యా౪-౫రాక్రాంభో౨-౧౯చ౧౬ [భో౨-౩౦

4 ౧౯ ౧ పం॥సో౫౫-౨౩పుష్య౪౨-౩౫బ్ర౩౧-౪౦కా౨౪-౩౮ది౦-౫౨త్యా౪-౧౦౪వేభో౨-౧౭

5 ౨౦ ౨ ష॥మం౫౮-౯ఆశ్లే౪౬-౨౪వి౩౦-౩౧౫౨౬-౪౬ది౧౬-౩౮ త్యా౪-౧౫అహః౨౭-౪౬ జ్యే౨ విః ౩౧-౧౫శువే భో౧-౫౬ చ౭౧

6 ౨౧ ౩ స॥బు౬౦-౧౦మ౫౧-౯వై౩౦-౧౫భ౩౦-౧౫ది౧౮-౫౧త్యా౪-౨౦త్రిద్యుస్పృక్ భో౧-౪౫చ౧౯

7 ౨౨ ౪ స॥గు౨-౨౨పూఫ౫౭-౧౧వి౩౦-౪౨బ౨-౨౨ది౧౩-౧౬త్యా౪-౨౪ఉభయానధ్యాయఃత్రిస్పృష్టకాఃభో౧-౩౪

8 ౨౩ ౫ అ॥శు౭-౧౩ఉఫ౬౦-౦౧ప్రీ౩౧-౪౪కా౭-౧౩ది౧౭-౮త్యా౪-౨౬అహః౨౭-౪౪ జ్యే౩విః౪౭-౨౦ రామకల్పః

9 ౨౪ ౬ న॥శ౧౨-౨౮ఉఫ౩-౪౦ఆయు౩౩-౪౨౧౨-౨౮ది౨౬-౫౬త్యా౪-౨౬దశమీతిథిఃభో౧-౧౧చ౨౧ [భో౧-౨౨

10 ౨౫ ౭ ఓ॥ఆ౧౭-౫౦హ౧౦-౧౦సౌ౩౪-౧౯భ౧౭-౫౦రా౪-౩౨త్యా౪-౨౫శూన్యతిథిఃభో౧-౦చ౨౩

11 ౨౬ ౮ ఏ॥సో-౨౨-౫౭చి౧౬-౨౭శో౩౫-౧౭బా౨౨-౫౭రా౪-౪త్యా౪-౨౩ఏకాదశీతిథిఃసర్వేషాం౧౧భో౦-౪౮చ౨౪

12 ౨౭ ౯ ద్వా॥మం-౨౭-౨౧స్వా౨౨-౬అతి౩౫-౪౨తై౨౭-౨౧రా౯-౩౦త్యా౪-౧౯అహః౨౭-౪౨జ్యే౪౪విః౩-౧౦ద్వాదశీ

13 ౨౮ ౧౦ త్ర॥బు-౩౦-౪౭విశా౨౬-౪౯సు౩౫-౨౧వ౩౦-౪౭రా౯-౪౫మాసశివరాత్రిభో౦-౨౬-చ౨౬ [తిథిఃభో౦-౩౭

14 ౨౯ ౧౧ చతు॥గు-౩౩-౨అనూ౩౦-౨౬ధృ౩౪-౪భ౧-౫౪రా౧౭-౧౯త్యా౪-౯భో౦-౧౫చ౨౭

15 ౧ ౧౨ అ॥●శు-౩౩-౫౭జ్యే౩౨-౪౫శూ౩౧-౪౭ చతు౩-౩౦ త్యాజ్యాభావః అహః౨౭-౪౦మూ౧ధనుషీరవిః ౧౯-౦ అన్వాధానం పిండపితృయజ్ఞః ప్రవేశాది౧౬వడశీతిపుణ్యకాలః రక్రాంవక్రాంభో౦-౪చ౨౮

| కుజచారః | | గురుచారః | |
|---|---|---|---|
| శు౨శు-విశాఖవృశ్చి౬ | ౪అ-జ్యే౩బు౩౬ | | బ-౪అ-ఉషా౨మశు౩౦ |
| ౬మం-అమాగశు౫౩ | ౭బు-జ్యే౪బు౨౫ | బ౭బు-ఉఫ౪గు౧౫ | ౭బు-ఉషా౩శు౨౦ |
| ౧౧అ-అనూ౨శు౪౦ | ౯శు-మూ౧ధబు౩౯ | | ౯శ-ఉషా౪శు౧౧ |
| బ౨శు-అనూ౩శు౨౬ | ౧౨సో-మూ౨బు ౪౧ | శుక్రచారః | ౧౨మం-శ్రశు౩ |
| ౭బు-అనూ౪శు౧౨ | బ౨శు-మూ౩బు౮ | శు౧గు-మూ౪శు౪౭ | ౧౪గు-శ్ర౨శు౫౪ |
| ౧౦అ-జ్యే౧శు ౫౬ | ౭బు-మూ౪బు౩౦ | ౪అ-పూషా౧శు౩౩ | |
| ౩౦శు-జ్యే౨శు౩౫ | ౭గు-పశ్చాదస్తమితః | ౭బు-పూషా౨శు౨౦ | శనిచారోనాస్తి |
| బుధచారః | ౧౦అ-వక్రారంభః | ౧౦శ-పూషా౩శు౭ | రాహుకేతుచారానస్తః |
| శు౨శు-జ్యే౨బు౨౦ | ౧౪గు-మూ౩వబు౪౫ | ౧౨సో-పూషా౪శు౫౪ | చంద్రోచ్చచారః |
| | | ౧౫గు-ఉషా౧శు౪౨ | శు౭బు-హ౨చంద్రోచ్చ౩౩ |

| | | | శ |
|---|---|---|---|
| | బ౩౦శు-ధరవిః | | రా |
| కే | శు౯శు-ధనుబు బ౪అ-మకశు | | |
| శు | ౪ బు కు | | గు |

డిశంబరు నెల 1944 — ధనుర్మాసం మార్గశిర నెల — ౧౩౫౪ ఫసలి

16 | ౨ | ౧౩ | శు॥ ప్ర-౪౩ ౩-౩౭ మూ ౩౩-౫౩ గం౨౮-౨౭ కిం౩-౪౭ రా ౨-౮ త్యా౪-౫౮ రా ౩౦-౧౩ త్యా౪-౦ యోగః ధనుర్మాసా
రంభః రక్రాంభో౫-౮చ౨ [శృంగః భో౪-౫౮చ౩౦

17 | ౩ | ౧౪ | ద్వి॥ ఆ౩౨-౧ పూషా౩౩-౫౦ వృ౨౪-౧౬ బా ౨-౪౯ శేషః ౧-౫౩ రా ౨౫-౩౭ త్యా౩-౫౫ చంద్రోదయః ఉత్తర

18 | ౪ | ౧౫ | తృ॥ సో౨౯-౧౬ ఉషా౩౨-౩౪ ధ్రు౧౯-౬ తైం-౩౮ రా ౧౪-౩౭ త్యా౩-౫౧ అహః౨౭-౩౬ మూ౨౪ రవిః౩౪-౪౪ భో

19 | ౫ | ౧౬ | చ॥ మం౨౫-౩౧ శ్ర౩౦-౨౬ వ్యా౧౩-౧౧ భ౨౫-౩౧ రా౧౨-౨౦ త్యా౩-౪౮ చతుర్థీతిథిః భో౪-౩౬ [౪-౪౭ మొహరం

20 | ౬ | ౧౭ | పం॥ బు౨౦-౫౮ ధని౨౭-౨౮ హ౬-౩౨ వ౫౩-౫ బా౨౦-౫౮ రా౧౬-౪౮ త్యా౩-౪౬ తిథిద్వయం భో౪-౨౫చ౩

21 | ౭ | ౧౮ | ష॥ గు౧౫-౪౯ శత౨౩-౫౬ సి౫౧-౫౮ తై౧౫-౪౯ రా ౧౧-౧౮ త్యా౩-౪౪ అహః౨౭-౩౪ మూ౩౪ రవిః ౫౦-౨౦ సప్తమీ
తిథిః భో-౪-౧౪చ౪౪ [నధ్యాయః భో౪-౩చ౫

22 | ౮ | ౧౯ | స॥ శు౧౦-౧౪ పూభా౧౯-౫౮ వ్య౪౪-౫ వ౧౦-౧౪ రా ౧౪-౪౪ త్యా౩-౪౩ మకరాయనం పక్షిణ్యనధ్యాయః అష్టమ్య

23 | ౯ | ౨౦ | అ॥ శ౪-౨౩ వ్యా౫౪-౪ ఉభా౧౫-౪౮ వరీ౩౬-౯ బ౪-౨౩ రా౧౬-౧౦ త్యా౩-౪౩ అవమస్వాధ్యాయం భో౩-౫౩

24 | ౧౦ | ౨౧ | ద॥ ఆ౫౨-౩౯ రే౧౧-౩౯ ప౨౮-౧౮ తై౨౫-౩౩ రా౩౦-౪౮ త్యా౩-౪౪ భో౩-౪౨చ౭ [చ౬

25 | ౧౧ | ౨౨ | ఏ॥ సో౪౭-౧౬ అశ్వ౭-౪౩ శి౨౦-౪౨ వ౧౯-౫౭ శేషః౨-౬ రా౨-౪౪ త్యా ౩-౪౬ అహః౨౭-౩౬ మూ౪౪ రవిః౫-౧౬
సర్వేషాం వైకుంఠఏకాదశి శ్రీ రంగాదిపుణ్యక్షేత్రేషుద్వారదర్శనం రైవతమన్వాదిః భో౩-౩౧చ౮

26 | ౧౨ | ౨౩ | ద్వా॥ మం౪౨-౮ భ౪-౧౦ సి౧౩-౨౮ బ౧౪-౫౨ రా౫-౯ త్యా౩-౪౮ భో౩-౨౦చ౯ [చ౧౦

27 | ౧౩ | ౨౪ | త్ర॥ బు౩౮-౨౫ కృ౧-౧౫ శో౫౭-౩౭ సా౬-౪౪ కా౧౦-౨౬ రా౧౨-౪ త్యా౩-౫౧ భో౩-౯ [౨౧-౨౦ కేవేభో౨-౫౮

28 | ౧౪ | ౨౫ | చతు॥ గు౩౫-౧౯ మృ౫౭-౪౨ శుం౦-౩౭ శు ౫౪-౩౨ గ౬-౫౨ ది ౧౨-౩౬ త్యా౩-౫౫ అహః౨౭-౩౮ పూషా౧ రవిః

29 | ౧౫ | ౨౬ | పూ॥ ○ శు౩౩-౧౪ ఆ౫౭-౩౫ బ్ర౫౦-౪౫ భ౪-౧౬ ది౧౮-౪౦ త్యా౪-౦ అన్వాధానం హిమశోధన ౧౫౪వేళ క్రాం
భో౨-౪౮చ౨౧

30 | ౧౬ | ౨౭ | కృ॥ ప్ర-౪౩౨-౧౭ పున౫౮-౪౨ ఐ౪౭-౧౨ బా౨-౪౫ రాం-౩౦ త్యా౪-౫ యోగః రాక్రాంపువేభో౨-౩౭ [భో౨-౨౬

31 | ౧౭ | ౨౮ | ద్వి॥ ఆ౩౨-౩౮ పుష్య౬౦-౧౦ వై౪౪-౪౩ తై ౨-౨౭ ది౧౯-౨౬ త్యా౪-౧౦ అహః౨౭-౪౦ పూషా౨ రవిః ౩౬-౨౫

1 | ౧౮ | ౨౯ | తృ సో౩౪-౨౦ పుష్య౧-౧౫ విష్కం౪౩-౧౪ వ౩-౨౯ రా౭-౩౦ త్యా౪-౧౪ హూణవత్సరాదిః భో౨-౧౫చ౧౫

2 | ౧౯ | ౩౦ | చ॥ మం౩౭-౧౯ ఆశ్లే౪-౫౧ ప్రీ౪౨-౪౨ బ౫-౫౦ రా౯-౩౧ త్యా౪-౧౯ భో౨-౪చ౧౬ [౧-౫౩చ౧౭

3 | ౨౦ | ౧ | పం॥ బు౪౧-౧౮ మ౯-౩౪ ఆయు౪౨-౫౮ కౌ౯-౧౮ రా౩-౪౫ త్యా౪-౨౨ అహః౨౭-౪౨ పూషా౩ రవిః౫౨-౧౦ భో

జనవరి నెల 1945 — పుష్యమాసం — ౧౩౫౪ ఫసలి

4 | ౨౧ | ౨ | ష॥ గు౪౬-౧౦ పూఫ౧౫-౧౨ సౌ౪౩-౫౧ గ౧౩-౪౪ రా౭-౨౩ త్యా౪-౨౫ భో౧-౫౩చ౧౮

5 | ౨౨ | ౩ | స॥ శు౫౧-౩౫ ఉఫ౨౧-౩౦ శో౪౫-౭ భ౧౮-౫౨ రా౧౭-౩ త్యా౪-౨౬ భో౧-౩౨చ౧౯

6 | ౨౩ | ౪ | అ॥ శ౫౭-౭ హ౨౮-౪ అతి౪౬-౯ బా౨౪-౨౧ రా౨౨-౨౮ త్యా౪-౨౬ అనధ్యాయః తిస్రష్టకాః భో౧-౨౦చ౨౦

7 | ౨౪ | ౫ | న॥ ఆ౬౦-౧౦ చి౩౪-౨౮ సు౪౭-౩౮ తై ౨౯-౪౦ రా ౨౨-౪ త్యా౪-౨౪ అహః౨౭-౪౬ పూషా౪ రవిః ౭-౧౨ త్రిద్యు
స్పృక్ ౧-౧౦చ౨౧

8 | ౨౫ | ౬ | న॥ సో౨-౧౩ స్వా౪౦-౨౦ ధృ౪౮-౧౯ గ౨-౧౩ రా౨౭-౪౪ త్యా౪-౨౦ భో౦-౫౯చ౨౨

9 | ౨౬ | ౭ | ద॥ మం౬-౩౨ విశా౪౫-౯ శూ౪౮-౧౩ భ౬-౩౨ రా౨౮-౧౧ త్యా౪-౧౬ షడశీతిముఖః౪౩-౫౨ భో౦-౪౮చ౨౩

10 | ౨౭ | ౮ | ఏ॥ బు౯-౪౯ అనూ౪౯-౧౩ గం౪౭-౧౫ బా౯-౪౯ శేషః౦-౧౫ పునస్త్యాజ్యాభావః అహః౨౭-౪౮ ఉషా౧ రవిః
౨౨-౪౫ సర్వేషాం ౧౧ భో౦-౩౭చ౨౪

11 | ౨౮ | ౯ | ద్వా॥ గు౧౧-౫౮ జ్యే౫౧-౫౫ వృ౪౫-౧౭ తై౧౧-౫౮ ది౩-౫౧ త్యా౪-౧౧ తిల౧౨ భో౦-౨౬చ౨౫

12 | ౨౯ | ౧౦ | త్ర॥ శు౧౨-౪౬ మూ౫౩-౨౦ ధ్రు౪౨-౨౩ వ౧౨-౪౬ రా౨౧-౨౪ త్యా౪-౬ చతుర్దశీతిథిః అవధ్యయన రమాసశివ
రాత్రిః సంక్రాంరావేభో౦-౧౬చ౧౬

13 | ౧ | ౧౧ | చతు॥ శ౧౨-౧౯ పూషా౫౩-౩౩ వ్యా౩౮-౨౮ శ౧౨-౧౯ ది౧౭-౨౫ త్యా౪-౧ అహః౨౭,౫౨ ఉషా౨ మకరే రవిః౩౮-
౧౬ దర్శతిథిః అన్వాధానం శవేరాక్రాం భో౦-౬చ౨౭

14 | ౨ | ౧౨ | ● అమా॥ ఆ౧౦-౩౭ ఉషా౫౨-౩౭ హ౩౩-౩౭ నా౧౦-౩౭ ది౧౩-౧౪ త్యా ౩-౫౬ ప్రతిప త్తిథిః యోగః పిండపితృ
యజ్ఞః ఉదయాదుత్తరాయణపుణ్యకాలః షాష్ఠ్యండాది దానాని సంక్రాం క్రాంభో౪-౩౬చ౨౮

కుజచారః శు౫బు జ్యే౩
శు౩-౧౦ఆ జ్యేష్ఠ౩
౧౫శు-మూ౧ధశు౨౨
బ౫బు-మూ౨శు౧-౯అ
మూ౩శు౪౦ ౧౦మ-ప్రాగు
దితః ౧౩శు-మూ౪శు౧౮
బుధచారః శు౫బు-
మూ౨వబు౧.

౧౦ఆ మూ౧వబు౬-౧౫శు
జ్యేష్ఠవృబు ౩౭- బ౧౪
ప్రాగుదిత-౪మం-వక్రత్యా
గః బ౭శు-మూ౧ధ బు॥బు
౩౯-బ౧౨గు-మూ౨బు౧౭
౩౦ఆ-మూ౩బు౫౫
గురుచారో నాస్తి శుక్రచార
శు౨ఆ-శ్ర౩శు౪౫

౫బు-శ్ర౪శు౩౭
౯శ-ధ౧శు౩౨
౧౨మం-ధ౨శు౨౮
౧౫శు-ధశుం౦శు౨౫
బ౩సో-ధ౪శు౨౪
౬శు-శత౧శు౨౫
౯అ-శత౨శు౨౭
౧౧బు-శత౩శు౩౨

౧౪శ-శత౪శు౩౯
శనిచారః
శు౬గు-ఆర్ద్ర౧వశ౭
రాహుకేతుచారౌ
శు౬గు-పున౩మిధునేరా
ఉషా౧ధనుషీకేతుః
చంద్రోచ్చచారః
శు౭శు-హ౩చంద్రోచ్చః౯

| | | | శ |
|---|---|---|---|
| | | బ౧౪-శమరవిః శు౧౫-శుగశు శు౧౫-శుకుం శు శు౬-గుమి రాధ కేతుః | రా |
| కేశు | | | |
| ర బు | శు | | గు |

జనవరినెల 1945 — మకరమాసం — ౧౩౬౪ సం॥

| | | | |
|---|---|---|---|
| 15 | ౩ | ౧౩ | శు॥ ప్ర॥ సో॥౭-౪౯ శ్ర౫౦-౪౧వ౨౭-౫౭బ౭-౪౯డి౨-౧౭ త్యా౩-౫౨ చంద్రోదయః ఉత్తరశృంగః మాఘస్నానారంభః భో౪-౨౬చ౨౯ [అవమ భో౪-౧౭సఫర్ చ౧ |
| 16 | ౪ | ౧౪ | ద్వి॥మం౪-౫విష్కం౫౫-౪౦ధని౪౭-౫౧సి౨౧-౩౪కౌ౪-౫౭౦-౧౩త్యా౩-౪౯ అహః౨౭-౫౪ ఉషా౩రవిః౫౪-౦ |
| 17 | ౫ | ౧౫ | తృ॥బు౫౪-౨౬శత౪౪-౨౪వ్య౧౪-౩౫వ౨౭-౫డి౪-౪౯త్యా౩-౪౬రా౩౧-౨౬త్యా౩-౪౪పుందరభో౪-౭చ౨ |
| 18 | ౬ | ౧౬ | పం॥గు౪౮-౪౩పూభా౪౦-౩౦వరీ౭-౧౧పరి౫౨-౨౪బ౨౧-౩౪ శేషః౩-౬పునస్త్యాజ్యాభావఃభో౩-౫౮చ౩ |
| 19 | ౭ | ౧౭ | ష॥శు౪౨-౪౧ఉభా౩౬-౧౫శి౫౧-౩౨కౌ౧౫-౪౨ది౨-౪౮త్యా౩-౪౩భో౩-౪౮చ౪ |
| 20 | ౮ | ౧౮ | స॥శ౩౬-౪౬ రే౩౨-౩ సి౪౩-౩౬గ౯-౪౩-డి౪-౯ త్యా౩-౪౩ అహః౨౭-౫౮ ఉషా౪రవిః ౯-౩౫కుంభాయనం వైవస్వతమన్వాదిః రథసప్తమీ సూర్యచంద్రవ్రతం భో౩-౩౮చ౫ |
| 21 | ౯ | ౧౯ | ఆ॥అ౩౧-౪ అశ్వ౨౮-౩పా౩౫-౫౪భ౩-౫౫ది౧౮-౪౩ త్యా౩-౪౪రా౨౨-౩౬ త్యా౩-౪౬ అనధ్యాయః భీష్మాష్టమీ భీష్మపంచకవ్రతంభీష్మతర్పణంభో౩-౨౯ |
| 22 | ౧౦ | ౨౦ | స॥సో౨౫-౪౭భ౨౪-౨౭సు౨౮-౩౪కౌ౨౫-౪౭రా౨౪-౫౫...-౪౮నవమీతిథిఃభో౩-౨౦చ౭ |
| 23 | ౧౧ | ౨౧ | ద॥మం౨౧-౩కృ౨౧-౨౪ధృ౨౧-౪౧గ౨౧-౩రా౩౧-౪౫త్యా౩-౫౧అహః౨౮-౪శ్రీ౧౪రవిః౨౬-౦ తిథిద్వయంసుదర్శనవ్రతంభో౩-౧౦చ౮ [భీమైకాదశి, తిలపద్మవ్రతంభో౩-౧౯౯ |
| 24 | ౧౨ | ౨౨ | ఏ॥బు ౧౭-౪రో౧౯-౪బ౧౫-౨౪భ౧౭-౪ శేషః౩-౪౨రా౪-౩౬త్యా౩-౫౪ద్వాదశీతిథిః సర్వేషాంభీష్మైకాదశి |
| 25 | ౧౩ | ౨౩ | ద్వా॥గు ౧౪-౧మృగ౧౭-౪౦వ్య౯-౫౩ బా౧౪-౧౮౧౦-౨౫త్యా౩-౫౯ త్రయోదశీతిథిః శ్వే॥ కల్పఃకేవేభో౨-౫౧ |
| 26 | ౧౪ | ౨౪ | త్ర॥శు ౧౨-౨ఆర్ద్రా౧౭-౯వై౫-౬తై౧౨-౨౮౯-౩౪ త్యా౪-౩ అహః౨౮-౧౦శ్రీ౨రవి౪౨-౦అ॥యనరకు.వే |
| 27 | ౧౫ | ౨౫ | చతు॥శ౧౧-౧౫పున౧౮-౯వి౧-౯ప్రీ౫౬-౫౨వ౧౧-౧౫రా౧౦-౪౦రాక్రాం కే వేభో౨-౩౨చ౧౧భో౨-౪౨ |
| 28 | ౧౬ | ౨౬ | పూ॥ ○ ఆ౧౧-౪౪పుష్య౨౦-౧౧ఆయు౫౬-౨౨బ౧౧-౪౪రా౨౫-౪౩ త్యా౪-౧౩సద్యస్నానయోగః భో౨-౨౩ సింధుస్నానంవ్యాపూజాతిలపాత్రకంచుక కంబళాదిదానాని [ద్వితీయాతిథిఃభో౨-౧౩చ౧౪ |
| 29 | ౧౭ | ౨౭ | కృ॥ప్ర సో౧౩-౨౬ఆశ్లే౨౩-౨౫సౌ౫౫-౨౯కౌ౧౩-౨౬రా౨౭-౨౫త్యా౪-౧౮అహః౨౮-౧౪శ్రీరవిః౫౮-౨౦ |
| 30 | ౧౮ | ౨౮ | ద్వి॥మం ౧౬-౨౫మ౨౭-౫౩శో౫౫-౩౪గ౧౬-౨౫రా౨౧-౨౬త్యా౪-౨౨తృతీయాతిథిఃర వేభో౨-౪చ౧౫ |
| 31 | ౧౯ | ౨౯ | తృ॥బు ౨౦-౩౦పూఫ౩౩-౨౦అతి౫౬-౧౬భ౨౦-౩౦రా౨౪-౫౩త్యా౪-౨౫శూన్యతిథిఃభో౧-౫౪చ౧౬ |
| 1 | ౨౦ | ౩౦ | చ॥గు ౨౫-౨౫ఉఫ౩౯-౩౦సు౫౭-౩౧బా౨౫-౨౫త్యాజ్యాభావఃచతుర్థీతిథిఃభో౧-౪౫చ౧౭ |
| 2 | ౨౧ | ౧ | పం॥ శు-౩౦-౫౦హ౪౬-౬ధృ౫౯-౦తై౩౦-౫౦డి౨-౪౮త్యా౪-౨౬ఆహః౨౮-౨౨శ్రీ౪రవిః౧౪-౫౦భో౧-౩౫ |
| 3 | ౨౨ | ౨ | ష॥శ౩౬-౧౪ చి౫౨-౩౮ శూ౬౦-౧౦ గ౩-౩౨ డి౮-౧౭ త్యా౪-౨౬ భో౧-౨౬ చ౧౯ |
| 4 | ౨౩ | ౩ | స॥ఆ౪౧-౧౭స్వా౫౮-౪౪శూ౦-౧౯ధృ౮-౪౫ది౮-౩ త్యా౪-౨౪ భో౧-౧౬ చ౨౦ |
| 5 | ౨౪ | ౪ | అ॥సో౪౫-౩౨వి౬౦-౧౦గం౧-౧౦బా౧౩-౨౪ది౧౩-౫౪ త్యా౪-౨౦ అహః౨౮-౨౮ ధని౧ రవిః౩౧-౩౮సీతాష్టమీ. త్రిస్పృక్కాః. భో౧-౭ చ౨౧ |
| 6 | ౨౫ | ౫ | న॥మం౪౮-౪౬విశా౩-౪౯వృ౧-౨౩తై౧౭-౯డి౧౪-౩౦త్యా౪-౧౬ ర.వే. భో౦-౫౭ చ౨౨పాతమన్య౧ |
| 7 | ౨౬ | ౬ | ద॥బు౫౦-౫౦అనూ౭-౫౭ధ్రువ౦-౪౬వ్యా౫౮-౨౬వ౯-౪౮ది౨౨-౩౭త్యా౪-౧౨ భో౦-౪౮చ౨౩ [భో౦-౩౮ |
| 8 | ౨౭ | ౭ | ఏ॥గు౫౧-౨౮జ్యే౧౦-౫౦హర్ష౫౬-౫౦బ౨౧-౯ త్యాజ్యాభావః అహః౨౮-౩౪ధని౨రవిః౪౮-౩౬ సర్వేషాం౧౧ |
| 9 | ౨౮ | ౮ | ద్వా॥శు౫౦-౫౨మూ౧౨-౩౨వజ్ర౫౩-౧౬కౌ౨౧-౧౦డి౮-౨౫త్యా౪-౭రా౮-౬త్యా౪-౨రా.వే. భో౦-౨౯చ౨౫ |
| 10 | ౨౯ | ౯ | త్ర॥శ౪౯-౨పూషా౧౨-౫౮సి౪౮-౪౩గ౯-౫౭రా౪-౯త్యా౩-౫౭సనిత్యకల్పః. శనిత్రయోదశి. భో౦-౧౯చ౨౬ |
| 11 | ౩౦ | ౧౦ | చతు॥ఆ౪౬-౪ఉషా౧౨ ౧౮వ్య౪౩-౨౧భ౧౭-౩౩ది౨౨-౧త్యా౩-౫౩ అనధ్యయనత్రయం. కలియుగాంతః మహాశివరాత్రిః కే.క్రాం.ష క్రాం.శ.వే. భో౦-౧౦ చ౨౭ |
| 12 | ౧ | ౧౧ | ● అమా॥సో౪౨-౬శ్ర౧౦-౩౫వరీ౩౭-౧౪చతు౧౪-౫డి౨౦-౧౦త్యా౩-౫౦అహః౨౮-౪౦ధని౩ కుంభే రవిః౬-౨ ఉదయాది విష్ణుపదపుణ్యకాలః ద్వాపరయుగాదిః అన్వాధానం పిండపితృయజ్ఞః మకర భో౦-౧ చ౨౮ |

ఫిబ్రవరినెల 1945 — కుంభమాసం — ౧౩౬౪ సం॥

| | | | |
|---|---|---|---|
| కుజచారః | ౭శ-పూషా౧బు౨౬ | ౧౧గు-శ్ర౨బు౧౮ | ౨౨మం-ఉభా౧కు౧౧ |
| కు౨మం-పూషా౧కు౨౩ | ౯సో-పూషా౨బు౫౦ | ౧౩శ-శ్ర౩బు౧౧ | ౫కు-ఉభా౨కు౪౬ |
| ౭శ-పూషా౨కు౫౩ | ౧౨గు-పూషా౩బు౯ | ౩౦సో-శ్ర౪బు౩ | ౯మం-ఉభా౩కు౩౨ |
| ౧౨గు-పూషా౩కు౨౦ | ౧౪శ-పూషా౪బు౧౮ | గురుచారః | ౧౩శ-ఉభా౪కు౩౦ |
| ౨౧సో-పూషా౪కు౪౮ | ౨౧సో-ఉషా౧బు౨౭ | కు౧౦మం-వక్రారంభః | శనిచారః |
| ౬శ-ఉషా౧కు౧౬ | ౩బు-ఉషా౨మకరే౨౮ | శుక్రచారః | ౨౬శ-మృ౪వక్రీశనిః౫౫ |
| ౧౦బు-ఉషా౨మకరే౩౮ | ౫-కుఉషా౩బు౨౯ | కు౨మం-పూభా౧కు౪౯ | రాహుకేతుచారౌనస్తః |
| ౩౦సో-ఉషా౩కు౧ | ౭ఆ-ఉషా౪బు౨౭ | ౭శ-పూభా౨కు౩ | కు౮-హారచంద్రో౨౫ |
| బుధచారః | ౯మం-శ్ర౧బు౨౩ | ౧౦మం-పూభా౩కు౨౦ | |
| కు౪బు-మూ౪బు౪౮ | ౧౦బు-ప్రాగస్తమితః | ౧౩కు-పూభా౪మీనేర౩ | |

| | | | |
|---|---|---|---|
| | | | రా<br>శ |
| కు | ౨౩౦సో-కుం౪<br>౨౧౦బు-మకకు<br>౨౩బుమబుధః<br>కు౧౩-కుమీకు | | |
| ర | | | |
| కు బు<br>కే | | | గు |

ఫిబ్రవరి 1945

| | | | |
|---|---|---|---|
| 13 | ౨ | ౧౨ | శుక్ల-ప్రతి॥మం౩౭-౨౬ధని౮-౨ప౩౦-౨౫కిం౯-౪౬ది౨౫-౩ త్యా౩-౪౭ యోగః ర.క్రా.కుంభ భో౪-౭ చ౨౯ |
| 14 | ౩ | ౧౩ | ద్వి॥బు౩౨-౯శత౪-౪౫శ౨౩-౧౧బా౪-౪౭ది౯౯-౪౫ త్యా౩-౪౫ చంద్రోదయః సమశృంగః భో౩-౫౮ చ౩౦ |
| 15 | ౪ | ౧౪ | తృ॥గు౨౬-౨౫ పూభా౧-౨ ఉభా౫౬-౦ సి౧౫-౩౫ గ౨౬-౨౫ ది౨౩-౨౬ త్యా౩-౪౪ అహః౨౮-౪౬ ధని౪ రవిః౨౩-౩౬ తృతీయాతిథిః భో౩-౫౦ రబ్యులవల్ చ౧ |
| 16 | ౫ | ౧౫ | చ॥శు౨౦-౨౮రే౫౨-౪౬సా౭-౪౮శు౫౨-౧౦భ౨౦-౨౮ది౨౪-౫౭ త్యా౩-౪౩ తిథిద్వయం భో౩-౪౧ చ౨ |
| 17 | ౬ | ౧౬ | పం॥శ౧౪-౩౩అశ్వి౪౮-౪౨శుక్ల౫౨-౧౦బా౧౪-౩౩రా౧౦-౩౩షష్ఠీతిథిః భో౩-౩౩ చ౩ [భో౩-౨౫ |
| 18 | ౭ | ౧౭ | ష॥ఆ౮-౫౦భ౪౪-౫౪బ్ర౪౪-౪౨తై౮-౫౦ది౧౧-౧౧ త్యా౩-౪౫ అహః౨౮-౫౨శత౧౪ రవిః౪౧-౨౫ మీనాయనం |
| 19 | ౮ | ౧౮ | స॥సో౩-౩౨విష్కం౫౫-౬కృ౪౧-౪౧వ౩౭-౩౯వ౩-౩౨ది౧౩-౧౮ త్యా౩-౪౭ అవమ అనధ్యాయః దుర్గావ్రతం భో౩-౧౬ చ౫ [నాబ్దాదిః భో౩-౮ చ౬ |
| 20 | ౯ | ౧౯ | న॥మం౫౪-౩౭రో౩౯-౧౧వై౩౧-౧౨బా౨౬-౩౭ది౨౦-౧ త్యా౩-౫౦రా౨౩-౫౨ త్యా౩-౫౩ బార్హస్పత్యమా |
| 21 | ౧౦ | ౨౦ | ద॥బు౫౧-౩౪మృ౩౭-౩౨వి౨౫-౨౬తై౨౩-౫౮రా౨౯-౨౨ త్యా౩-౫౮శ.క్రాం. భో౨-౫౯ చ౭ |
| 22 | ౧౧ | ౨౧ | ఏ॥గు౪౯-౩౫ఆర్ద్రా౩౬-౫౭ప్రీ౨౦-౩౦వ౨౦-౩౪శే౨-౧౮పునస్త్యాజ్యాభావః అహః౨౯-౦శత౨౪ రవిః౦-౧ సర్వేషాం౧౧ కే.వే. భో౨-౫౧ చ౮ [రా.క్రాం భో౨-౪౩ చ౯ |
| 23 | ౧౨ | ౨౨ | ద్వా॥శు౪౮-౫౨పున౩౭-౩౦ఆయు౧౬-౨౮బ౧౯-౧౩ది౭-౧౩ త్యా౪-౨ రా౨౯-౩ త్యా౪-౭ నృసింహద్వాదశి |
| 24 | ౧౩ | ౨౩ | త్ర॥శ౪౯-౯పుష్య౩౯-౧౪సౌ౧౩-౨౩కౌ౧౯-౫శే౨-౧౨పునస్త్యాజ్యాభావః భో౨-౩౪ చ౧౦ |
| 25 | ౧౪ | ౨౪ | చతు॥ఆ౫౧-౯ఆశ్లేష౨-౧౫శో౧౧-౧౯గ౨౦-౧౪ది౧౨-౫౦ త్యా౪-౧౨అహః౨౯-౮శత౩ రవిః౧౮-౩౪ అనధ్యనయ౩ కామదహనం భో౨-౨౬ చ౧౧ [హోళికోత్సవః బ్రహ్మసావర్ణికమన్వాదిః శు. వే. భో౨-౧౮ చ౧౨ |
| 26 | ౧౫ | ౨౫ | పూ○సో౫౪-౯మ౪౬-౨౮అతి౧౦-౧౨భ౨౨-౩౯ది౧౪-౨౧ త్యా౪-౧౭ అన్వాధానం హోళికోత్సవః దారుబ్ర |
| 27 | ౧౬ | ౨౬ | కృ-ప్ర॥మం౫౮-౧౪పూఫ౫౧-౪౧సుక౧౦-౧బా౨౬-౧౧ది౮-౧౨ త్యా౪-౨౧ యోగః భో౨-౯ చ౧౩ |
| 28 | ౧౭ | ౨౭ | ద్వి॥బు౬౦-౧౦ఉఫ౫౭-౪౪ధృ౧౦-౩౧తై౩౦-౪౮ది౧౧-౨౯ త్యా౪-౨౪అహః౨౯-౧౪శత౪ రవిః౩౭-౧౦ త్రిద్యుస్పృక్ చాతుర్మాస్యద్వి భో౨-౧ చ౧౪ |

మార్చి 1945

| | | | |
|---|---|---|---|
| 1 | ౧౮ | ౨౮ | ద్వి॥గు౩-౨౩హ౬౦-౧౦శూ౧౧-౩౮గ౩-౨౩ది౨౧-౪ త్యా౪-౨౬ భో౧-౫౨ చ౧౫ |
| 2 | ౧౯ | ౨౯ | తృ॥శు౭-౪౧హ౪-౨౪గం౧౩-౪ధ౮-౪౧ది౨౬-౩౫ త్యా౪-౨౬ బ్రహ్మకల్పః భో౧-౪౪ చ౧౬ |
| 3 | ౨౦ | ౩౦ | చ॥శ౧౪-౧చి౧౦-౫౬వృ౧౪-౨౭బా౧౪-౧ది౨౬-౨౦అహః౨౯-౨౨ పూభా౧౪ విః౫౬-౪౮ పంచమీతిథిః |
| 4 | ౨౧ | ౩౧ | పం॥ఆ౧౮-౫౩స్వా౧౬-౫౫ధ్రు౧౫-౩౦తై౧౮-౫౩రా౨-౫౦ త్యా౪-౨౨శూన్యతిథిః భో౧-౨౭ చ౨౦ [భో౧-౩ |
| 5 | ౨౨ | ౧ | ష॥సో౨౩-౪విశా౨౨-౨౭వ్యా౧౫-౫౪వ౨౩-౪ రా౩-౪౫ త్యా౪-౧౮ షష్ఠీతిథిః భో౧-౯ చ౧౯ |
| 6 | ౨౩ | ౨ | స॥మం౨౬-౯అనూ౨౬-౫౩హర్ష౧౫-౪బ౨౬-౯రా౧౩-౧౦ త్యా౪-౧౩ స్వాధ్యాయః భో౧-౧౦ చ౨౦ [చ౨౧ |
| 7 | ౨౪ | ౩ | అ॥బు౨౭-౫౯జ్యే౩౦-౮వజ్ర౧౪-౨౮కౌ౨౭-౫౯ త్యాజ్యాభావః అహః౨౯-౩౨ పూభా౨ రవిః౧౫-౮ భో౧ ౨ |
| 8 | ౨౫ | ౪ | న॥గు౨౮-౩౨మూ౩౨-౭సి౧౨-౧౭గ౨౮-౩౨ది౨౭-౫౯ త్యా౪-౮ రా౨౬-౫౩ త్యా౪-౩ రా.వే కే క్రాం భో౦-౫౩ |
| 9 | ౨౬ | ౫ | ద॥శు౨౭-౪౯పూషా౩౨-౫౪వ్య౯-౩౨భ౨౭-౪౯ శేషః౦-౩౦ రా౨౩-౯ త్యా౩-౫౮ భో౦-౪౪ చ౨౩ |
| 10 | ౨౭ | ౬ | ఏ॥శ౨౫-౫౧ఉషా౩౨-౨౮వరీ౫-౦బా౨౫ ౫౧రా౧౨-౩౫అహః౨౯-౩౮ పూభా౩ విః౩౫-౩ ఏకాదశీతిథిః |
| 11 | ౨౮ | ౭ | ద్వా॥ఆ౨౨-౪౭శ్ర౩౦-౫౮పం౬-౭వ౫౪-౨౧తై౨౨-౪౭రా౧౦-౫౪ ద్వాదశీతిథిః భో౦-౨౬ చ౨౫ [భో౦-౩౫ |
| 12 | ౨౯ | ౮ | త్ర॥సో౧౮-౪౯ధ౨౮-౩౬సిద్ధ౭-౪౭వ౧౮-౪౯రా౧౬-౦ త్యా౩-౪౮ తిథిద్వయం అనధ్య॥త్ర. మా॥శివ. భో౦-౧౭ |
| 13 | ౩౦ | ౯ | చతు॥మం౧౪-౪శత౨౫-౨౯సా౪౦-౪౨శ౧౪-౪ రా౧౦-౪౮ త్యా౩-౪౫ అహః౨౯-౪౬ పూభా౪ మీనే రవిః ౫౫-౨౦ దర్శతిథిః భో౦-౮ చ౨౭ [యాది ౧౧-౨౦పర్యంతం షడశీతిపుణ్యకాల మీన భో౪-౧ చ౨౮ |
| 14 | ౧ | ౧౦ | ● అమా॥బు౮-౪౨పూభా౨౧-౪౮శుభ౩౩-౧౩నా౮-౪౨రా౧౪-౨౪ త్యా౩-౪౪ యోగః. పిండపితృయజ్ఞః, ఉద |
| 15 | ౨ | ౧౧ | స్వస్తిశ్రీపార్థివసం॥చైత్రశుక్ల ప్ర॥గు౨-౫౫ఉభా౫౪-౦శుక్ల౨౫-౩౦బవ౨-౫౫రా౧౫-౫౨ త్యా౩-౪౩ |

| | | | |
|---|---|---|---|
| కుజచారః | ౩గు-ధని౨బు౪౬ | ౭మం-పూభా౪మీనే౩౦ | ౭సో-రే౨శు౨౫ |
| శు౪శు-ఉషా౪శు౨౭ | ౫శ-ధని౩శుం భే౩౬ | ౯గు-ఉభా౧బు౨౯ | ౧౩శ-రే౩శు౫౫ |
| ౯మం-శ్ర౧శు౪౭ | ౭సో-ధని౪బు౨౭ | ౧౧శఉభా౨బు౨౯ | బు౪శ-రే౪శు౧ |
| ౧౪ఆ-శ్ర౨శు౮ | ౧౦బు-శత౧బు౧౮ | ౧౩సో-ఉభా౩బు౩౮ | ౮బు-వక్రారంభః |
| ౨౨గు-శ్ర౩శు౩౦ | ౧౨శు-శత౨బు౯ | ౩౦బుఉభా౪బు౪౬ | శనిచారః |
| ౬సో-శ్ర౪శు౪౯ | ౧౪ఆ-శత౩బు౧ | గురుచారః | ౨౨బు-శనివక్రత్యాగః |
| ౧౧శ-ధని౧శు౧౦ | ౧౫సో-శత౪బు౫౩ | శు౧౫సో-ఉఫ౩వక్రీ. | - రాహుకేతుచారౌ |
| ౩౦బు-ధని౨శు౨౯ | ౨౨బు-పూభా౧బు౪౪ | గు౪౪ | శు౧౧గు-పున౨రాహుః |
| బుధచారః | ౩శు-పూభా౨బు౩౪ | శుక్రచారః | పూషా౪కేతు ౪౦ |
| శు౧మం-ధని౧బు౫౫ | ౫ఆ-పూభా౩బు౨౨ | శు౨బు-రేవ౧శు౩౮ | శు౯మం-౯౧చంద్రో౨౧ |

| | | | |
|---|---|---|---|
| శు | | | శ రా |
| ర | బ౧౪మం మీనే రవిః | | |
| శు బు | శు౫౪ శుం బు; బ౭మం మీ బు | | |
| కే | | | గు |

సంచిక
35

# ఆంధ్రపత్రిక
## తారణ ఉగాది సంచిక

సంవత్సరము
1944—45

## విషయానుక్రమణిక



**త్రివర్ణ చిత్రములు**—వసంతము (ముఖపత్రచిత్రము)—శ్రీ దేవీప్రసాదరాయచౌదరిగారు; భాస్కరాచార్యులు , లీలావతి—తోట వేంకటేశ్వరరావుగారు.
**సాధారణ చిత్రములు**—మందహాసవదనారవిందుడైన మహాత్ముడు ; అఘోరవీరభద్రస్వామి ; కొండాపురములో దొరికిన ప్రాచీనవస్తుసంగ్రహము (హైదరాబాదు ఆర్కశాఖవారి సౌజన్యముతో) ; గోదావరి పుట్టుపెంపులు ; తిరుపతికొండలమీద కొత్తమోటారురోడ్డు ; ఇతర చిత్రములును.

శ్రీ

# ప్రస్తావన

కాల మనంతము. ఎన్నియో మహాయుగములు గడచినవి, మరెన్నియో గడువనున్నవి. అనంతమగు నీకాలవాహినియందు చిక్కి ప్రపంచ మనేక పరిణామములకు లోనగుచున్నది. విశ్వవ్యాప్తమగు నొక మహాపరిణామము నేడు మన కన్నుల యెదుట ప్రత్యక్షమగుచున్నది. ప్రాణికోటి కర్మబద్ధము. సత్వరజస్తమోగుణములలో కడపటి రెండుగుణములే సర్వసాధారణముగ ప్రపంచమున రాజ్యమేలుచుండును. ప్రపంచేతిహాసమునందితః పూర్వ మెన్నడును కనివినియెరుగని నేటి మహాసంగ్రామము రాజస, తామసగుణప్రేరితమనుట కేవిధమగు సందియమును లేదు.

ఈసంగ్రామ మారంభమై రమారమి అయిదు వత్సరములు కావచ్చినది. ఇందు మడసినవారి సంఖ్యఇప్పటికే లక్షలనుమించి కోట్లలో బడినది. ఈ మారణహోమ మింకెంత కాల మీతీరున జరుగవలెనో, ఇంకెన్ని కోట్ల ప్రజ లీమహాయజ్ఞమున బలిసమర్పణము కావలసియున్నారో విషయజ్ఞులు సైత మిదమిత్థమని చెప్పలేకున్నారు. స్వార్థపరాయణత్వమూ, పశుబలాధిక్యమూ ఈఘోరవిపర్యయమునకు మూలకారణములు. సత్య,ధర్మచ్యుతు లీసమరమునకు ప్రథమసోపానములు. ఈ సంగ్రామకారణమున భయము,సంశయము, అవిశ్వాసము, ఆశాభంగము ఎల్లెడల మానవహృదయమున చీకటులల్లుపెట్టినవి. విలుప్తధర్మాచారులును, దురాశాపూరితులునైన అక్షరాజ్యాధిపతులకు అపజయము రూఢమని వర్తమాన పరిస్థితులు వ్యక్తముచేయుచున్నవి. యుద్ధారంభమున ఆసురికశక్తి సంపన్నుడైన హిట్లరు ఐరోపాఖండమునందు తా సాధించిన విజయపరంపరలచే ప్రపంచమును దిగ్భ్రమనొందించెను. ప్రతాపోదయుడైన రష్యనుల శౌర్యాగ్నిని చవిచూచునంతవరకు ఐరోపాఖండమున హిట్లరు ఎత్తినకత్తికి ఎదురులేకపోయినది. తదుపరి ఆఫ్రికాయందు రోమెల్ పరాజయమునకు రష్యాలో నాజీపరాభవము తోడైనది. జగమునంతను గుప్పిటబట్టదలచిన హిట్లరుమనోరథ మంతటితో భగ్నమైనది. ఈ దుర్వ్యవసాయమున హిట్లరుకు సైదోడైన ముసోలినీ పదభ్రష్టు డయ్యెను. ఇటలీయందు సైతము జర్మనులు అపజయమునే కుడుచుచున్నారు. ఫ్రాన్సు తీరమందు మిత్రసేనా నివహములు దిగుటతో మూడువైపులనుంచి జర్మనీ ముట్టడి ప్రారంభమైనది. ఐరోపాయుద్ధమున కిది చరమాధ్యాయమైనప్పటికిని, తీవ్రతర సంగ్రామము లికముందే చెలరేగగలవు.

ఇక ఆసియాఖండమున జపానుస్థితియైనను ప్రస్తుత మేమంత ఆశావంతముగ లేదు. పసిఫికుసముద్రమున తా మిదివరకు జయించిన దీవుల నొక్కొక్కటిగ దిగి అమెరికనులకు సమర్పించుకొనుచున్నారు. ఏడేండ్లు యుద్ధమును కొనసాగించి చైనాను వంచలేకపోయిరి సరికదా, చైనాలో జపానీయులు క్రొత్తగా సాధించినవిజయములు సైతము శూన్యము. బర్మా ఇండియా సరిహద్దులలో జపానువా రీమధ్య పెద్దయెత్తునలలపెట్టిన 'భారత దండయాత్రాసంరంభము' సైతము మొగ్గలోనే తుంచివేయబడినది.

కట్టకడకు విజయలక్ష్మి మిత్రకరగ్రహణము చేయు నను ఆశ కలుగుచున్నను, ఇంతటి మహాత్యాగముతో సముపార్జింపబడిన ఈ విజయము లోకకల్యాణమునకు, ప్రపంచశాంతిసంరక్షణకు ఎంతవరకు ఉపకరించునన్న విషయమై శాంతికాముకుల కనేక సందియములు కలవు. భవిష్యత్ప్రపంచ వ్యవస్థపట్ల బ్రిటిషురాజ్యాంగవేత్తల విచిత్రవైఖరి పరాధీన జాతులకు ప్రోత్సాహమును పురిగొల్పుట లేదు సరిగదా, అస్వతంత్ర ప్రజాహృదయమున నిరాశను, నిస్పృహను దాదుకొల్పినది. బ్రిటిషుప్రధానామాత్యుడు విన్‌స్టన్ చర్చిల్, అమెరికా సంయుక్తరాష్ట్రాధ్యక్షుడు రూజ్వెల్టు గారలుభయులుచేరి సృష్టించిన అట్లాంటికు ప్రణాళిక సమస్తజాతులకును అమెరికా అధ్యక్షుడు నిర్వచించిన చతుస్స్వాతంత్ర్యములను ప్రసాదించునని యావత్ప్రపంచ మర్రులుసాచినవి. ధర్మసంస్థాపనమే బ్రిటిషువారినీ యుద్ధమునకు పురికొల్పెననియు, బలయుతులు-దుర్బలులు, శ్వేతులు-శ్వేతేతరులు, పాలకజాతులు-పాలితప్రజలు అను భేదములు సమసి, నిఖిల వసుమతీప్రజలును స్వపరిపాలన మనుభవించగలరని యువ్విళ్ళూరిన ఆసియాఖండవాసులకు బ్రిటిషు ప్రధానామాత్యుడు చేసినబహిరంగ ప్రకటనలు అశనిఘాతమువలె తోచినవి. 'బ్రిటిషుసామ్రాజ్యవిచ్ఛిత్తికై నే నీ అమాత్యపదవిని అంగీకరించలేదు.' 'అట్లాంటిక్‌ప్రణాళికసూత్రములు భారతదేశమునకు అనువర్తింపవు' అని విన్‌స్టన్ చర్చిలు ఎలుగెత్తి ఘంటాపథముగ చాటిన మాటలు నలుబదికోట్ల భారతీయులకే గాక, వివిధదేశములందలి స్వాతంత్ర్యసమారాధకులకు, భారతమిత్రులకూ విషాదమును, ఆశ్చర్యమును కలుగజేసినవి. అమెరికారాజ్యాంగవిదులింతకంటె ఉదారముగ మాటాడుచున్నను, వీరి యౌదార్యము మాటలను దాటి, కార్యరూపమును దాల్చునని భావించుట కవకాశము కనుపించుటలేదు.

ఆసియా, ఐరోపాలందలి తక్కిన దేశములవలె భారతవర్ష మంతటి ప్రత్యక్ష సమరాంగణముగ మారకపోయినను, యుద్ధమువలన కలిగెడి యనర్థములన్నిటిని భారతప్రజ లనుభవించుచునే యున్నారు. ఒక్క బెంగాలురాష్ట్రమునందే క్షామదేవత ఇరువదిలక్షల ప్రాణులను బలిగొన్నది.

## పాఠకమహాశయులకు

తీవ్ర యుద్ధపరిస్థితులలో కాగితానికి వచ్చిన కటికకాటకం వల్ల, సాధ్యమైనంతవరకు ప్రయత్నించిన్నీ విఫలులమై, గతసంవత్సరం (స్వభాను) ఉగాది సంచికను ప్రచురింపనేలేకపోయినాము. ఆంధ్ర పత్రిక జీవితంలో కనివిని యెరుగని ఈ సంఘటనకు మేము అమిత విచారపాత్రులయినాము. ఈ యేడాది దేవుని దయవల్ల ఆ చిక్కు తొలగి, యథాప్రకారంగా, సమధికోత్సాహంతో సంచికా ప్రచురణకు ప్రారంభించి, ఉగాదినాటికి సరిగ్గా ఆంధ్ర మహాజనులకు సమర్పింపదలపగా, ఇందుకు అత్యవసరమైన ప్రభుత్వానుమతి బహుజాగుగా, బహుప్రయాస మీద లభించినందుమూలాన ఇంత కాలయాపనకు కారణమయింది. ఈ ఉభయసంఘటనలమూలంగానూ మా పాఠకులకు కలిగిన ఆశాభంగానికి ఎంతయు విచారిస్తూ, వారి క్షమాపణ నర్థిస్తున్నాము. సాధనసామగ్రి సవ్యంగా లభించనందువల్ల ఎప్పటివలె ఎక్కువపుటలను, ఎక్కువ చిత్రాలను వేయలేకపోయినందుకుకూడ మేము చాలా చింతిస్తున్నాము. —సంపాదకుడు.

రాయలసీమయందును, మలబారులోను కాటకమువలన ప్రజలు దుర్భర కష్టములకు లోనైరి. దేశమున డబ్బుచలామణి హెచ్చినదేగాని, దేశీయులకు కడుపునిండ ఆహారముగాని, కట్టుకొనుటకు బట్టగాని లభించుటలేదు. సస్యశ్యామలమును, సర్వసమృద్ధము నగు దేశమున అన్నవస్త్రములకు రెంటికిని కరవేర్పడుట విస్మయజనకము. యావత్ప్రపంచముతోబాటు వర్తమానమున భారతప్రజల కీయగచాట్లు అనివార్యములే యని సరిపెట్టుకొనినప్పటికిని, దేశముయొక్క రాజకీయభవితవ్యమైనను ఆశాజనకముగ నున్నదేమో యన్న, అది ఇంతకంటె అంధకారబంధురమై కనుపట్టుచున్నది. ప్రధాన రాష్ట్రము లైదింట నామమాత్ర ప్రజాప్రభుత్వములైనను లేవు. సూర్లకొలది ఆర్డినెన్సుల సృష్టించుకొని రాజప్రతినిధి నిరంకుశ ప్రభుత చలాయించుచున్నాడు. నిజమైన ప్రజాప్రతినిధులు చెఱసాలలలో నిర్బంధ మనుభవించుచున్నారు. 'కేవల మనారోగ్యకారణములచే'మాత్రము గాంధిజీ నేడు చెఱవిడిపింపబడినాడు.

ఏనిమిత్తమున నైననేమి, ఆధునిక భారతనిర్మాతలలో అగ్రగణ్యుడును,పరిశుద్ధాంతరంగుడు నగు మహాత్ముని పునఃసందర్శనభాగ్యమబ్బినందులకు, వారి దివ్యసాన్నిధ్య మమరినందుకు, వారి హితోపదేశము సమకూరినందులకు యావద్భారత మానందాశ్రువుల రాల్చినది. దేశభక్తు లెల్లరును మహాత్మునియం దచంచల భక్తివిశ్వాసములను ప్రకటించినారు. గాంధిజీ నిర్బంధవాసముచే పునీతమైన ఆగాఖానుమందిరము—కస్తూరిబా, మహదేవుల సమాధుల కునికిపట్టయిన ఆగాఖానురాచనగరు భారతప్రజకు పవిత్ర యాత్రా స్థలమైనది.

నిర్బంధమునం దుండి మహాత్ముడు రాజప్రతినిధి, భారతప్రభుత్వములకు వ్రాసిన లేఖలును, ప్రభుత్వముతరఫున గాంధిజీ కందజేయబడిన ప్రత్యుత్తరములును ప్రచురింపబడినవి. గాంధి జపానుపక్షపాతియనియు, 1942 ఆగస్టులో దేశమున చెలరేగిన అల్లరులు కాంగ్రెసు ప్రేరితములనియు నేల నాలుగుచెరగులా బ్రిటిషుప్రభుత్వపు ఏజెంట్లు జేగంటలలో చేసిన ప్రచార మెంత బూటకమో, కాంగ్రెసుపైనను, గాంధిజీపైనను మోపబడిన ఆరోపణ లెంతటి యభూతకల్పనలో ఈ యుత్తరప్రత్యుత్తరముల వల్ల లోకమునకు వ్యక్తమైనది. గాంధిమహాత్ముడు నెయ్యమునకు చెయిజాచెను. భారతప్రభుత్వము కయ్యమునకు కాలుదువ్వెను. నయమూ, వినయమూ ఒకవంక; అధికారమూ, అహంకారమూ వేరొకవంక. గాంధి మహాత్ముని శుద్ధసాత్త్వికతేజమును, సత్య ధర్మ స్వరూపమును ఈ లేఖల ద్వారా మరొకమారు సుప్రతిష్ఠితములైనవి. ప్రపంచమున గాంధీజీ ప్రతిష్ఠ వేయిమడుంగు లధికమైనది. వ్యక్తిగౌరవమునైనను పాటించక పాలకులు వీనిమూలమున తమ అల్పజ్ఞతయును, అధికారదర్పమును బయటపెట్టుకొనినారు.

ఈ లేఖలవల్ల ప్రభుత్వమువారి చిత్తశుద్ధిని శంకింపవలసివచ్చుచున్నది. క్రిప్సు ప్రతిపాదనలు ఉపసంహరింపబడలే దనియును, భారతీయులలో నైకమత్యము పొసగిన మరుక్షణము స్వపరిపాలనము వారికి దత్తము చేయబదు ననియును పై కెంత బాహాటముగ ప్రకటించుచున్నప్పటికిని ఆంతర్యములో బ్రిటిషువారు చిన్నమెత్తు అధికారమునైన కోల్పోవుట కిష్టపడుట లేదని స్పష్టమైనది. తమ చేతులారా అధికారమును భారతీయుల పరము చేయుటకు బ్రిటిషు ప్రభుత్వ మంగీకరింపకపోవచ్చును. కాని, భారతస్వాతంత్ర్యోద్యమసత్త్వము వల్లనేమి, భావి ప్రపంచ పరిస్థితుల బలప్రభావములవల్ల నేమి, అనుదిన భానూదయమువలె భారత స్వాతంత్ర్య భానూదయము కూడ అచిరకాలములోనే సంభవించక తప్పదు. కాని, బ్రిటిషు ప్రజలకును, భారతప్రజానీకమునకును కాలాంతరములచే నేర్పడిన గత రెండు శతాబ్దముల సంబంధము స్థిరమైన స్నేహముగ పరిణమించవలె నన్న బ్రిటిషుప్రభుత్వ మిటీవలగనే తన కర్తవ్యమును నిర్వర్తించుట పరమధర్మము.

భారత స్వాతంత్ర్యోద్యమము వలెనే స్వరాష్ట్ర పరిస్థితికూడ నేడయోమయముగ నున్నది. తక్కిన రాష్ట్రములవారితోబాటు ఆంధ్రదేశమునందలి కాంగ్రెసు నాయకులు, దేశభక్తులు చాలామంది కారాగారముల మ్రగ్గుచున్నారు. రాయలసీమ ప్రజలు గతవత్సరము తీవ్రమైన క్షామ బాధకు లోనైరి. ఆంధ్ర మహాసభ, బొంబయి ఆంధ్రసభ ఆదిగాగల ప్రజాసంస్థలు క్షామనివారణకై ప్రశంసనీయ మగు సేవ లొనర్చినను, ఈ ప్రాంతమున ఏటేట సంభవించు కాటకమునకు శాశ్వత నివారణోపాయము నాలోచించవలసిన బాధ్యత ప్రభుత్వమువారిపై నున్నది. తుంగభద్రా ప్రాజెక్టు నిర్మాణము విషయమై అడ్వొకేటు శ్రీ కొంతి రామమూర్తి పంతులుగారు చేయుచున్న కృషి ఫలించుటయేకాక, త్వరగా కార్యరూపమును దాల్చునని ఆశించుచున్నాము.

ఆంధ్రదేశము మొత్తముమీద సుభిక్షమని చెప్పదగియున్నను, వ్యావసాయికముగను, పారిశ్రామికముగను అభివృద్ధిచెందవలసిన ప్రాంతములు విశేషముగ కలవు. ఇరిగేషను, విద్యుచ్ఛక్తి ప్రాజెక్టుల నిర్మాణము వల్లను,ఆధునికములును అభివృద్ధిదములు నైన వ్యవసాయపద్ధతులను ప్రవేశపెట్టుటవల్లను, ఆయాప్రాంతముల కనుకూలించు పెద్ద పెద్ద పరిశ్రమలను స్థాపించుటవల్లను రాష్ట్రముయొక్క ఐశ్వర్యమును, తద్వారా ప్రజల ఆర్థికప్రమాణమును వృద్ధిచేయవలసియున్నది. ఇదియంతయు యుద్ధము ముగిసి, దేశదృష్టి నిర్మాణకార్యములకు మరలిన పిమ్మటగాని సాధ్యపడకపోవచ్చును.కాని, అందులకైనను ఆంధ్రు లిప్పటినుండి ఆయత్తులు కావలసిన అవసర మెంతేని కలదు.

యుద్ధకారణమున తెలుగుదేశమున పుస్తకప్రకటనమును, పత్రికల వ్యాప్తికిని, సినిమాచిత్రోత్పత్తికిని కొంత దెబ్బతగిలినను మొత్తముమీద ఆంధ్రకళలకు,ఆంధ్రసారస్వతమునకు ఈరెండుమూడేండ్లుగ ఎక్కువనష్టము వాటిల్లలేదు. గత సంవత్సరమున కవిసన్మానములు, నటసన్మానములు, వార్షికసభలు, సమావేశము లనేకప్రాంతములలో జరిగినవి. పద్యకవిత్వమునకంటె గద్యకవితపై ప్రజలలో ఆదరణ హెచ్చినది. దైనందినప్రజాజీవితము సారస్వతమునందును, కళలందును ప్రతిబింబించిననేగాని వీనివలన సంఘమున కెక్కుడు ప్రయోజనము లేదనెడి అభిప్రాయము ప్రబలినది.

ఆంధ్రదేశముయొక్క బహుముఖాభివృద్ధి ఆంధ్రరాష్ట్రసంసిద్ధితోగాని సాధ్యముకాదని ఇదివరకే తేటపడినది. వర్తమాన భారతపరిస్థితులలో ఆంధ్రరాష్ట్రసమస్య అడుగున బడియుండవచ్చును. కాని, తరుణములో రాష్ట్రనిర్మాణము చెయిజారి పోకుండగ ఆంధ్రు లప్రమత్తులై మెలంగవలెనని హెచ్చరించుచున్నాము.

తారణసంవత్సరము అఖిలాంధ్రావనికి శాంతి సౌఖ్యదాయినియై, స్వరాష్ట్రముతోడి ఆంధ్రజాతిని పార్థివ కందిచ్చుగాత!

# సదసద్విచారము

శ్రీ శొంఠి వెంకటరామమూర్తి

"ఉండుటయా, లేక ఉండకపోవుటయా? — ఇదీ ఇప్పుడు వచ్చిన ప్రశ్న."

అని షేక్సుపియరు మహాకవికి ఒక ఆశంకవచ్చినది.

జీవితపరాకాష్ఠను, జీవితపరమోచ్ఛదశను పరిశీలనగా పరికింపగలిగిన భారతదేశము ఈ ఆంగ్లేయ మహాకవి ఆశంకకు ఇట్లని సమాధానము చెప్పుచున్నది:

"ఉండుటయు, ఉండకపోవుటయుకూడ."

తర్కశాస్త్రమునందు మధ్యాపవాదసూత్రమని ఒక సూత్రమున్నది. ఆసూత్రముప్రకారము దేవదత్తుడు యజ్ఞదత్తుడుగా కానువచ్చును; లేదా కాకనుపోవచ్చును. కాని, యజ్ఞదత్తుడు అయి యజ్ఞదత్తుడు కాకనుపోవుట మాత్రము అసంభవము. భారతీయుల భావవీచికలు ఈ మధ్యాపవాదసూత్రమును గట్టిగా వ్యతిరేకించుచున్నవి. ఈ సూత్రమును నిక్షేపముగాను, నిరభ్యంతరముగాను నిరాకరించు ఒక తర్కపద్ధతిని మధుసూదనసరస్వతి యను నొక వంగదేశ తార్కికుడు పదునాలుగవ శతాబ్దిలోనే లేవదీసి, ఎదురులేకుండ విస్తరింపజేసెను. బ్రహ్మపదార్థము ఉండను ఉన్నది, లేనులేదు అనెడి ఉభయసామంజస్యము మన ఉపనిషత్ప్రవక్తలయిన మహాఋషులు చిరకాలముగా ఘోషించుచున్నదే. ఈ పరమసత్యమునే మధుసూదనసరస్వతి అంతకంటెను స్థిరమయిన స్వరూపములో, విశదముగా ప్రతిపాదించినాడు.

ఈ ఉండుట, ఉండకపోవుట అను సమష్టి స్వభావము స్థూలదృష్టికి అసంబద్ధముగా కనిపించు ఒక విరోధాభాసమువలె నున్నది. విరోధాభాసమనునది అసలు సత్యములో ఒక రేఖాస్వరూపమయినది కానే కాదు; సత్యములో అది ఒక వైశాల్య స్వరూపమైనది. ఉదాహరణకు చూడుడు: ఒక నూలుపోగు అటు కేవలము నీలముగా ఉండవచ్చును; లేదా, ఇటు కేవలము ఎఱ్ఱగా ఉండవచ్చును. అంతేకాని నీలముగాను, ఎఱ్ఱగానుకూడ ఉండుటకు మాత్రము సాధ్యము లేదు. పడుగుపేకలు కలిపి మగ్గములో వేసి వస్త్రము నేయునప్పుడు పడుగు నీలముగాను, పేక ఎఱ్ఱగాను ఉండవచ్చును. ఉండి, నేత పూర్తియై వస్త్రము సంపూర్ణముగా తయారైన పిమ్మట ఆవస్త్రము ఎరుపు నీలములు రెండును కలిసినదయి ఉండిన ఉండవచ్చును. కేవలము నీలముగానో, ఎరుపుగానో ఉండునప్పటికంటె ఇటువంటి మిశ్రణ ఉన్నప్పుడే ఆవస్త్రము అందముగా కనుపించును. ఒక భూతల మెప్పుడయినను కేవలము పొడుగుతోమాత్రమే కాని, వెడల్పుతో మాత్రమేకాని ఉండగలదేమో ఎవరైనను నిరూపింపగలరా? జీవితము కేవల రేఖాత్మకమయిన సత్యకంటె మిక్కిలి సంక్లిష్టమయినది. కాబట్టి దానిని వైశాల్యాత్మక సత్యములతోమాత్రమే పూర్తిగా వర్ణింపనగును.

మన జీవితములో మన దృష్టి కనుక్షణము కనపడుచున్న వందలాది విరోధాభాసములలో రెండు ప్రబలమైన విరోధాభాసములను ఇక్కడ మచ్చునకు చూపుచున్నాను.

భారతదేశములో మనము కన్నులార గాంచుచున్న ఘనమైన విరోధాభాసములలో అసలు భారతదేశమే ఒక ఘనమైన విరోధాభాసము.

ఈ భరతఖండము ఒక బ్రహ్మాండ ఖండమువలె బహువిశాలమును అయియున్నది; ఒక చిన్న దేశమువలె బహుసంకుచితమును అయియున్నది.

భరతఖండము మహావిశాలమై బహునిబిడమైన ఒక పెద్ద అరణ్యమువలెను అలరారుచున్నది; ఇంటిపట్టులందు ఉల్లాసముకొరకు వేసికొను ఒక చిన్న ఉద్యానవనమువలెను దీపించుచున్నది.

భరతఖండము బహు ముదకబారిన ఒక పురాణ వృక్షము. కాని, అది ఇంకను గొడ్డు పోలేదు. నిత్యయౌవనముతో నవనవలాడుచు నవవసంతోదయములందు అది యింకను యథాప్రకారముగానే మొగ్గదొడిగి, పూచి, కాయుచునేయున్నది.

భరతఖండము ఒకప్పుడు దివ్యసౌధములలో హంసతూలికాసనములందు కూర్చొని, అమూల్యాంబరాభరణముల నలంకరించుకొని, పరిచారికాసందోహసపర్యలను సమృద్ధిగా నందుకొనుచు, ఇష్టమృష్టాన్నములను ఇచ్ఛాప్రకారముగా నారగించుచు దివ్యసుఖములందు తేలియాడుచున్న రాకుమారివలె విరాజిల్లుచుండును; ఇంకొకప్పుడు చింకిపాతలతో, చివికిచివికి జీర్ణించిన శిథిలశరీరముతో, వీథులలో దుమ్మనక ధూళియనక కూర్చొని, వచ్చిపోవువారి కాళ్లుకడుపులు పట్టుకొని బిచ్చమడుగుచున్న భిక్షుకురాలివలె బీదమొగము వేసికొని యుండును.

భరతఖండము ఒకవంక దయారసతరంగితాంతరంగమైన తల్లివలెను ఉండును; ఇంకొకవంక సరససల్లాపములతో ఉల్లసమాడుచు వినోదించుచున్న ప్రేయసివలెను ఉండును.

భరతఖండము ఒకందున సర్వతోముఖము, సర్వతోమయము; ఇంకొకందున కేవలము వ్యక్తిస్వరూపము.

మనము చూచుచున్న అనేక విరోధాభాసములలో ఇంకొక ఘనమైన విరోధాభాసము నటరాజు!

ఈ ప్రపంచమునకే జీవనాడిగా ఉన్న ఆ నటరాజు తన తాండవ నాట్యమందు సర్వాంగముగా సకలలోకములును దద్దరిల్లిపోవునట్లు గడగడ కంపించిపోవును; కంఠములో నిలిచిపోయిన గరళముతో కాలి మాడిపోవును; తన కదలికలతో అండపిండబ్రహ్మాండమునందలి ఎముకఎముకలోతునకును దిగిపోవును; తాను అలంకరించుకొన్న అహిరాజముల కదలికలకు లయబద్ధముగా తానును కదలును. ఇంతయినను ఆయన ఈ శక్తినంతను ఒక్క చిరునవ్వులో, ఒక్క మందహాసములో నిక్షిప్తముచేసి నిశ్చల హృదయముతో నివ్వటిల్లుచున్నాడు.

కాబట్టి, ఈ విరోధాభాసములకు మనము బెదరనేల? నిజమునకు చూడబోయినచో, ప్రతిసత్యము ఒక చిన్న విరోధాభాసమే; సంపూర్ణసత్యము కానే కాదని నా నమ్మకము.



# "హిస్ మాస్టర్స్ వాయ్స్"

## సంగీత మండలమున ప్రకాశించు దీప్తతారలు




మీకు సర్వదా
సంగీత సుధ నొసగు చున్నారు

M. SAMUEL

# Scientific Industry is Key Industry.

---

We have indentified ourselves with the progress of Scientific and Industrial Research for the past decade and half in bringing out Precision Standard Scientific Instruments.

Articles from our Workshops meet every requirement for efficient service, dependability and finish.

---

*The Range of our Manufactures Include :*

**Laboratory Furniture - Gas and Water Taps**
**Equipment for:— Bacteriological, Chemical,**
**Industrial, Pathological, and Physical Laboratories,**
**Semi-scale Industrial Apparatus, Autoclaves,**
**Sterilizers, Incubators, Serological Baths,**
**Distilled Water Stills, Balances, Microscopes. Etc.**

---

Large stocks of Chemicals C. P. and A. R. Quality,
Manufactured by us are available for immediate delivery.

It pays to obtain all your requirements from a single source.
Consult us for any of your Scientific and Industrial problems.

---

## THE ANDHRA SCIENTIFIC CO., LTD.,

| MASULIPATAM | MADRAS | BOMBAY |
|---|---|---|
| Head Office and Works. | 4, Blacker's Road, Mount Rd. | 12, Rampart row, Fort. |
| Telegram.—LABORATORY. Telephone 47. | Telegram:—PRECISION. Telephone 86275, | Telegram:— SCIENTIST |



# మన రాజకీయసమస్య



= శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య =

మన దేశాన్ని పాలించే అధికారం బ్రిటిషువారిచేతిలోనే ఉండవలసిందా, లేక మన చేతులలోకి రావలసిందా? అనేదే మన రాజకీయసమస్య.

బ్రిటిషువారు సుమారు మూడువందల యాభైసంవత్సరాల క్రిందట వర్తకానికై మన దేశానికి రావడం, నూట యాభై సంవత్సరాలకాలం వర్తకంతోనే తృప్తిపొందిఉండడం, అటుపిమ్మట దేశంలోని రాజకీయాలలో ప్రవేశించి ఆ కాలంలో మనలను పాలిస్తున్న నవాబులయొక్కయు, మహారాజులయొక్కయు చేతకానితనాన్ని ఆధారం చేసుకొని సామదానభేద దండోపాయాలను సమయానుకూలంగా ప్రయోగించి 1858 నాటికి దేశానికంతా సార్వభౌములు కావడం అందరికీ తెలిసిన విషయమే. మన దేశానికి ఆరువేలమైళ్ల దూరమందుండినీన్నీ, జనసంఖ్యలో మనకంటె ఎంతో తక్కువవారైనప్పటికిన్నీ మనపై వారు ఏకచ్ఛత్రాధిపత్యం వహించగలగడం ప్రపంచంలోని అద్భుతవిషయాలలో ఒకటి అని చెప్పక తప్పదు. వారికి గల చాకచక్యానికి ఇది ప్రబలనిదర్శనం. 1858 తర్వాత రెండుతరాలవరకు వారి పరిపాలన నిరంకుశంగానూ, నిశ్శాస్త్రవంగానూ వెలిగింది. అదే వారి ఉచ్చస్థితి. ఆ కాలంలో మన కేలాటి రాజకీయసమస్యా ఉండినదిలేదు. మన సౌభాగ్యానికి బ్రిటిషుపరిపాలనతప్ప మరొక సాధనం లేదనిన్నీ, మన శ్రేయస్సునూ, కళ్యాణాన్నీ కోరియే భగవంతుడు వారి అధికారాన్ని మన దేశంలో స్థాపితమగునట్లు చేశాడనిన్నీ ప్రజాసామాన్యమే కాకుండా ప్రముఖులు, నాయకులు, దేశాభిమానులు, విద్యాధికులు, జమీందారులు, సంస్థానాధీశులు వివిధమతములవారు హృదయపూర్వకంగా విశ్వసించియుండిరి. విక్టోరియా మహారాణివారియెడల ఆకాలపు ప్రజలు చూపిన భక్తి నమ్రతలు అసమానములు.

క్రమక్రమంగా ఈ నమ్మకం సడలింది. ఇరవైయోశతాబ్దం ప్రారంభంతో మన రాజకీయాలలోకూడా మార్పు ప్రారంభం అయింది. అధికారం బ్రిటిషువారి చేతులలో శాశ్వతంగా ఉండవలసిందేనా, భారతీయుల పరం ఎందుకు కాగూడదు అనే తర్కం బయలుదేరింది. ప్రస్తుతం ఈసమస్యకు ఉన్నంత ప్రాధాన్యం మరే సమస్యకూ లేదు. ఈసమస్య పరిష్కారంఅయితేనేగాని తక్కిన సమస్య లేవీ పరిష్కారంకాజాలవు. అందరి దృష్టిపథంలో ఉండేది ఇది ఒక్కటే.

అధికారం భారతీయుల పరం కావలె ననే వాదం ఎందుకు బయలుదేరిందో, ఆ వాదంలో ఉండే సబబుసందర్భాలు ఏలాటివో కొంచెం విమర్శించవలసిఉన్నది.

1. ఈవాదం కొంతవరకు ప్రపంచపరిస్థితులలోని మార్పుల మూలంగా పుట్టింది. పందొమ్మిది ఇరవై శతాబ్దాలలో ఐరోపాఖండంలోనూ, ఇతరఖండాలలోనూ బయలుదేరిన రాజకీయఉద్యమా లన్నిటిలో 'జాతీయోద్యమం' ప్రధానమైనది. ప్రతి 'జాతి'కీ (Nation) కూడా రాజకీయస్వాతంత్ర్యాన్ని అనుభవించే హక్కు (Right) ఉన్నదనిన్నీ, ఈ హక్కుకు విరుద్ధంగా ఒక జాతివారు మరొక జాతివారిని జయించి పాలించడం అధర్మమనిన్నీ ఈ ఉద్యమాభిలాషుల ప్రధానసూత్రాలు. వీరు సామ్రాజ్యాలను, సామ్రాజ్య తత్త్వాలను ఖండించేవారు. ఈ సూత్రాలను అమెరికా ఐరోపా ఖండాలలో అనేకజాతులవారు అనుసరించి, వాటిని నిలబెట్టుటకై అన్నివిధము లైన త్యాగములనూ గావించి, తుదకు స్వాతంత్ర్యాన్ని సంపాదించారు. 19-వ శతాబ్దప్రారంభాన ప్రఖ్యాతిగాంచి యుండిన స్పెయిన్ పోర్చుగల్ టర్కీ ఆస్ట్రియాసామ్రాజ్యాలు దీని ఫలితంగా శిథిలములై పోయినవి. ఈ దెబ్బ కొంతవరకు రషియాసామ్రాజ్యానికి కూడ తగిలింది. ప్రస్తుతం దక్షిణఅమెరికాలో ఉన్న బ్రెజీలు, అర్జెంటైనా, చిలీ మొదలైన రాజ్యాలూ, ఐరోపాఖండంలోని బెల్జియం, ఇటలీ, జర్మనీ, గ్రీసు, రుమేనియా, బల్గేరియా, సర్వియా, హంగెరీ, జకొస్లొవేకియా, పోలెండు, ఫిన్‌లాండు మొదలైన రాజ్యాలూ ఈవిధంగా ఏర్పడ్డవే. పేరుకు బ్రిటిషుసామ్రాజ్యంలో ఉన్నా, నిజంగా సంపూర్ణస్వాతంత్ర్యం అనుభవిస్తున్న ఐర్లాండు, దక్షిణఆఫ్రికా, కనడా, ఆస్ట్రేలియా, న్యూజీలెండు రాజ్యాలుకూడ ఈ ఉద్యమఫలితంగా ఏర్పడ్డవే. 1900 ప్రాంతాన నుండి మన దేశంలో బయలుదేరిన రాజకీయసమస్యయు, స్వరాజ్య ఉద్యమమూ ఈ 'జాతీయోద్యమం'లోని ఒక అంతర్భాగమని చెప్పవచ్చును. తన బాగోగులను నిర్ణయించుకొనే సర్వాధికారం ప్రతిజాతికీ ఉండవలె ననే వాదం పాశ్చాత్యజాతులకు వర్తించినట్లే భారతజాతికికూడా వర్తించవలె ననే అభిప్రాయం పాశ్చాత్యవిద్యలతో సంపర్కం కలిగిన భారతీయవిద్యాధికులలో ప్రప్రథమాన పుట్టి క్రమక్రమంగా సామాన్యజనులలో వ్యాపించింది. రాకపోకలు, వర్తకవ్యాపారసంబంధాలు అత్యంతంగా అభివృద్ధిగాంచిన ఈ

కాలంలో ప్రజాస్వామ్యం ప్రపంచమంతా వ్యాపించితీరుతుంది. మనకు కూడా ఒక రాజకీయసమస్య ఏర్పడడానికి ఇదొక ప్రధానకారణం. అన్ని జాతులకూ ధర్మంగాను, జన్మహక్కుగాను పరిగణింపబడుతుండే లక్షణం మనకు మాత్రం వర్తించకపోవడం ఏమిటి ?

2. ఈసమస్య తీవ్రరూపం పొందడానికి మరికొన్ని కారణాలు కూడా ఉన్నవి. బ్రిటిషు పరిపాలనవలన మనకు లాభాలు మాత్రమే కలిగినవా? నష్టాలుకూడ కొన్ని కలిగినవి కావా? నష్టాలకంటె లాభాలు ఎక్కువా, తక్కువా? అనే విమర్శ దేశంలో బయల్దేరింది.

(అ) బ్రిటిషుపరిపాలనవలన కొన్ని విషయాలలో దేశానికి మహోపకారం కలిగిం దని అందరూ అంగీకరించవలసిందే. దేశమంతా ఒకే కేంద్రప్రభుత్వానికి లోబడడం, ఆసేతుహిమాచలపర్యంతం శాంతిభద్రతలు నెలకొనడం, ప్రజలందరూ ఒకేవిధమైన శాసనాలకూ, కోర్టులకూ, వ్యవహారాలకూ అలవాటుకావడం, విద్యాధికులందరికీ ఇంగ్లీషుభాష సామాన్యభాష కావడంచేత రాష్ట్రానికీ రాష్ట్రానికీ సన్నిహితసంబంధం ఏర్పడి భారతీయులంతా ఒకేజాతివా రనే భావం పెరగడం, దేశమందంతటా ఒకేప్రభుత్వం ఉండడంచేత సుంకాలు మొదలగు ఆటంకములు లేక బాహుళ్యంగా వర్తకవ్యాపారాలు వృద్ధికావడం, ఇనుపదారులు, పోస్టు టెలిగ్రాఫు మొదలగు సౌకర్యాలు ఏర్పడడం, వ్యవసాయానికి అనుకూలించే నీటివసతులు విరివికావడం, క్షామబాధ తగ్గడం — ఇవంతా బ్రిటిషు పాలనమూలంగా కలిగిన లాభాలు. బ్రిటిషుపాలన లేకుంటే ఈలాంటి లాభాలు కలిగిఉండవా అనే వాదం అప్రస్తుతం.

(ఆ) కాని, ఆధునికకాలంలో నాగరికతకు ప్రఖ్యాతిగాంచిన ప్రభుత్వాలు చేసినట్టిన్నీ, చేస్తున్నట్టిన్నీ మహాకార్యాలు బ్రిటిషుపరిపాలకులు భరతఖండంలో ఇదివరకు చేయలేకపోయిరి. ఇది వారి పాలనలోని గొప్ప లోపం. ప్రస్తుతం మన రాజకీయ సమస్య అతితీవ్రరూపం ధరించడానికి ఈ లోపమే ముఖ్యకారణం. బ్రిటిషువారు వారికి స్వంతమైన ఇంగ్లండు దేశాన్ని పాలించుకొంటున్నారుగదా? గత నూరు సంవత్సరాలమధ్యన ఆదేశంలోని ప్రజల భోగభాగ్యాలు వృద్ధికావడానికి అచ్చటి ప్రభుత్వంవారు లెక్కలేని ఏర్పాటులను గావించారు. నూరు సంవత్సరాలక్రిందట శుష్కదరిద్రులుగా ఉండి సౌఖ్యమన్న ఏమో ఎరుగని బ్రిటిషు కార్మికులు ఈ ఏర్పాటులమూలంగా మనలో శ్రీమంతులు కూడా అనుభవించని ఐశ్వర్యాన్ని అనుభవిస్తున్నారు. విద్య లేనివాడు ఒక్కడుకూడ ఆదేశంలో లేడు. ఆరోగ్యవిషయంలో చెప్పవలసిందే లేదు. ఇంగ్లండుదేశాన్ని పాలించే ప్రముఖులే మన దేశాన్ని కూడా పాలిస్తున్నారుగదా ? అయినా, ఇంగ్లీషువారి భోగభాగ్యాలు వృద్ధిగాంచినట్లు మన భోగభాగ్యాలు వృద్ధికాకపోవడానికి కారణం ఏమిటి? ఈవృద్ధి ఒక ఇంగ్లండులోనేకాదు కనుపిస్తుండడం. ఫ్రాన్సు, జర్మనీ, ఇటలీ, బెల్జియం, హాలెండు, డెన్మార్కు మొదలైన దేశా లన్నిటిలో ఈ నూరుసంవత్సరాల మధ్యన ప్రభుత్వంవారి శాసనాలమూలాన ప్రజల సౌఖ్యం ఎన్నోరెట్లు పెరిగింది. ఈదేశాలన్నీ కలియుగవైకుంఠాలుగా మారిపోయినవా అనే భ్రమ అందరికీ కలిగేటట్లు అక్కడి పరిస్థితులు మారిపోయినవి. అన్ని దేశాలూ ప్రభుత్వంవారి సహాయాన ముందంజ వేస్తూఉంటే మనంమాత్రం వెనుకబడిఉండడం ఏమిటి? స్వాతంత్ర్యం ఉన్న దేశాలకూ, లేని దేశాలకూ ఉండే భేదమే ఇది.

(ఇ) మనుష్య జన్మానికి ఫలం అవ్యక్తంగా ఉండే శక్తులు వ్యక్తం కావడమని అందరూ అంగీకరిస్తున్నారు. ప్రతిమనుష్యునియందును ఏవో కొన్ని శక్తులు లీనములై ఉన్నవి. ఈశక్తులు బహిర్గతం కావడమే మానవజీవితానికి ఆదర్శం. ఇదే దానియొక్క పరమావధి. ఎవరు ఏవిధంగా ఉత్తీర్ణులు కావలెనో ఆవిధంగా ఉత్తీర్ణులు కావడానికి కావలసిన అవకాశాలు, వసతులు సంఘంలో నిర్మాణంకావలసిఉంది. అట్టి వసతులు లేనినాడు మనుష్యుడు పరిపూర్ణతను సంపాదించలేడు. మనం రోజూ చేసే కర్మలే ఈవసతులు. తెలివితేటలు, శక్తిసామర్థ్యాలు ఎక్కువగా ఉపయోగించవలసిన పనులను మనం చేస్తూఉంటే మన శరీరం, మనస్సు, బుద్ధి పరిపక్వం పొందగలవు. సామాన్యమైన పనులను చేయడంలోనే మన కాలం అంతా వినియోగం అయితే మన శక్తిసామర్థ్యాలు సామాన్యంగానే ఉంటవి. మనది కర్మప్రపంచం. పరాయివారగు బ్రిటిషువారు మనకు పరిపాలకులు కావడంచేత మనలో ఉండే శక్తులు ఎంతవరకు వ్యక్తం కావలసి ఉన్నవో అంతవరకు వ్యక్తంకాలేకపోతున్నవి. వారి దృష్టిలో మనం కొంచెం తక్కువజాతివారం; కొన్ని పనులు చేయడానికీ, కొన్ని పదవులను సంపాదించి అనుభవించడానికీ మనకు యోగ్యతలేదు. సైన్యంలో మనం అనుచరులుగా ఉండవలసినవారమేకాని నాయకత్వం వహించడానికి అర్హులంకాము. రాష్ట్రాలను పాలించే గవర్నరులు కావడానికీ, దేశాన్ని పాలించే గవర్నరుజనరలుకావడానికీ మనలో ఎవరికీ యోగ్యత లేదు. మామూలు పోలీసు సివిల్ సర్వీసు ఉద్యోగాలలో కొన్ని స్థానాలు బ్రిటిషువారికి ప్రత్యేకింపబడిఉండడంచేత అట్టి పదవులకు మనం అర్హులమైనా నాటిని అనుభవించడానికి అవకాశాలు లేనివాళ్లం అయ్యాం. వర్తకవ్యాపారాదులలో మనకు గల బుద్ధికుశలతను మన ఇష్టానుసారంగా ఉపయోగించడానికి వీలులేదు. బ్రిటిషువర్తకుల పోటీ మనకు నష్టకరమైనప్పటికిన్నీ ఆ పోటీకి లోబడే మనం మన వ్యాపారాదులను చేయవలసిఉన్నది. 1935 లో పార్లమెంటువారు గావించిన ఇండియా పరిపాలక చట్టంలోని **(Government of India Act, 1935)** 'రక్షణలు' అన్నీ ఈలాంటివే. ఈ 'రక్షణల'ను అమలులో ఉంచడానికి గవర్నరులకు, గవర్నరుజనరలుకు ప్రత్యేకఅధికారాలు ఎన్నో ఉన్నవి. మన

దేశంలోనే మనకు సంపూర్ణవ్యక్తిత్వం లేకపోవడంచేత బ్రిటిషు సామ్రాజ్యంలోని స్వతంత్రరాష్ట్రాలవారు మనలను నిమ్న జాతులుగా పరిగణిస్తున్నారు. తక్కిన దేశాలలో కూడా మనకు కలుగుతుండే గౌరవం ఈలాంటిదే. అత్యున్నతంగా పెరిగి పుష్పఫలశోభితం కావలసిన వృక్షం గిటకబారిపోవడం ఏలాగో మన స్థితి ఆలాటిది.

(ఈ) బ్రిటిషువారు పరిపాలకులున్నూ, మనం పరిపాలితుల మున్నూ కావడంచేత మనకూ వారికీ ఏవిషయమందైనా అభి ప్రాయభేదం కలిగినప్పుడూ, మన సౌభాగ్యానికీ వారి సౌభాగ్యానికీ పరస్పరసంఘర్షణ కలిగినప్పుడూ వారి పట్టే సాగుతుంది. ఎప్పుడూ వారిదే పైచెయ్యి. ఏదైనా ఒక కార్యక్రమంవల్ల మనకు లాభ మున్నూ, వారికి నష్టమున్నూ కలిగే పక్షాన అట్టి కార్యక్రమం ఆచరణలోనికి రానేరాదు. మనకు నష్టమున్నూ, బ్రిటిషువారికి లాభమున్నూ కలిగే కార్యక్రమం తప్పకుండా ఆచరణలోనికి వస్తుంది. బుద్ధిపూర్వంగా మనం నష్టం పొందవలె ననికాని, తాము లాభం సంపాదించవలె ననికాని వారు కోరుటకాదు దీనికి కారణం. ఇది మనుష్యస్వభావం. ప్రతిమనుష్యుడూ తన లాభాన్ని కోరి, అందుకు కావలసిన ప్రయత్నాల నన్నిటినీ చేసుకోవడంలో విప రీతం ఏమీ లేదు. బ్రిటిషువారు ఈలాగు చేస్తున్నారంటే ఆశ్చర్య పడడానికి కారణం ఏమిఉన్నది? ఇది మానవప్రకృతి. బ్రిటిషువారు సామాన్యమానవమాత్రులేగాని సర్వసంగపరిత్యాగం చేసిన మహా యోగులు కారు. స్వాతంత్ర్యం అనుభవిస్తున్న దేశాలలోకూడా అధికారం ధనికవర్గంవారి చేతులలో ఉండడంచేత కార్మికుల సౌఖ్యం ఎంతవరకు వృద్ధికావలెనో అంతవరకు వృద్ధికావడం లేద నిన్నీ, ఈ అధికారం అంతా కార్మికుల వశం కావడమే ధర్మ మనిన్నీ చెప్పేవారు ఈకాలంలో ఎందరో ఉద్యమిస్తున్నారుకదా? స్వాతంత్ర్యం కల దేశాలలో రాజకీయసమస్య లేకపోలేదు. ఇదే వారి సమస్య.

మన సౌభాగ్యానికీ, వారి సౌభాగ్యానికీ వైరుద్ధ్యం కలిగి నప్పుడు వారి మాటే గెలుస్తుందని చెప్పడానికి ఎన్నో నిదర్శనా లున్నవి. నూరు నూటయాభై సంవత్సరాల క్రిందటివరకు మనం ఒక వ్యవసాయంమూలానమాత్రమే కాకుండా పరిశ్రమల మూలానకూడా సుఖంగా జీవిస్తూవచ్చాం. నూలు వడకడం, బట్టలు నేయడం, లోహపు సామానులను తయారుచేయడం మొదలైన పరిశ్రమలు పట్టణాల్లోనూ, పల్లెలలోనూ ఎందరికో జీవనాధారంగా ఉండేవి. 18-వ శతాబ్దపు ఆఖరుభాగాన్నుండి ఇంగ్లండుదేశంలో ఈలాటి పరిశ్రమలు అభివృద్ధిగాంచినవి. యంత్రసహాయంవల్ల వారు అతి బాహుళ్యంగా బట్టలు మొదలైన వివిధసామగ్రులను తయారుచేయ సాగిరి. ఇట్లు తయారైన సామానులను ఇతరదేశాలలో అమ్మి లాభం సంపాదించుకోవడం వారికి చాలా అవసరం అయింది. తమకు కలిగిన ఈ అవసరాన్ని తీర్చుకొనే ఉద్దేశంతో వారు వారి సామానులను మన దేశానికి తీసుకొనివచ్చి చౌకగా అమ్మ టకు ప్రారంభంచేశారు. ఈ పోటీకి నిలబడలేక మన పరిశ్రమలన్నీ క్రమక్రమంగా నశించిపోయినవి. మనకు వ్యవసాయం ఒక్కటే జీవనోపాధిగా పరిణమించింది. మన అవసరాలనుకూడా బ్రిటిషు ప్రభుత్వంవారు గుర్తించి ఉండినయెడల మన పరిశ్రమలను వారు రక్షించి ఉండి ఉందురు. కాని వారట్లు చేయకపోవడమేకాక, వ్యవసాయం ఒక్కటే మనకు జీవనాధారంగా ఉండడం ఎంతో లాభకర మనిన్నీ, పరిశ్రమలకు కావలసిన వసతులుగాని, నేర్పు గాని మనకు లేదనిన్నీ వాదించి, ఇదేవలెనని మన పరిశ్రమాభివృద్ధికి ఎన్నో ఆటంకాలు కలిగిస్తూవచ్చారు. ఇప్పటికికూడా ఈ విష యంలో వారి దృష్టి పూర్తిగా మారలేదు. మారేటట్లుకూడా కని పించదు. ఒక పరిశ్రమల విషయంలోనే కాకుండా చెలామణీ విషయంలో కూడా వారికి లాభకరములైన విధానాలనే మన దేశంలో ప్రవేశపెట్టారు. మన లాభం వారికి అప్రధానం అయింది. వీటిమూలంగా మనకు కలిగిన నష్టాలకు ఏదో ఒక సమాధానం చెప్ప డమేకాని, నష్టం రాకుండా చేయడానికి వారు సిద్ధపడినవారు కారు. బ్రిటిషువారి చేతిలో అధికారం ఉన్నంతవరకూ ఈ సంఘ ర్షణ తప్పదు. ఇంగ్లండు దేశానికిన్నీ, మన దేశానికిన్నీ ఆర్థిక పరి స్థితులలో ఎంతో భేదం ఉన్నది. ఈ కారణంచేత మనకు లాభ కరమైన దంతా వారికి లాభకరం కాజాలదు; వారికి లాభకరమైన దంతా మనకు లాభకరం కాజాలదు. ఈవైరుద్ధ్యం ఉన్నందునను, ఇట్టి వైరుద్ధ్యంవల్ల కనడా, ఆస్ట్రేలియా, న్యూజీలెండు, ఐర్లండు, దక్షిణఆఫ్రికా మొదలగు రాష్ట్రాలలోని ప్రజలకు విస్తారనష్టం కలుగుచుండినందునను ఈ ప్రజలు బ్రిటిషు వారి దాస్యానుండి విముక్తికోరి తుదకు ఆ విముక్తిని సంపాదిం చిరి. 18-వ శతాబ్దంలో ఇంగ్లండుపరిపాలనలో ఉన్న పదమూడు అమెరికన్ కాలనీలు బ్రిటిషుప్రభుత్వంపై తిరుగబడి, ఏడు సంవత్సరముల కాలం స్వాతంత్ర్యయుద్ధం సాగించి, తుదకు ఇంగ్లండునుండి వేరై పోవుటకు కూడ ఇదే కారణం.

(ఉ) బ్రిటిషు పరిపాలనలో మరొక గొప్ప లోపం ఉంది. వారు పరాయివారు కావడంచేత మన మతాలలోను, సాంఘిక ఆచా రాలలోను జోక్యం కలిగించుకోడానికి సాహసించరు. ఒకప్పుడు ఈ సాహసం వీరికి ఎక్కువగా ఉండేది. బెంటింకుప్రభువు గవ ర్నరు జనరలు అయినది లగాయతు సిపాయీల తిరుగుబాటువరకు (1828-58) నా రీతివిషయాలలో సాహసించి ఆధునికకాలానికి అను గుణములైన మార్పులను కొన్నిటిని చేశారు. సతీదురాచారాన్ని మాన్పించారు; స్త్రీ పునర్వివాహాన్ని ఆమోదించారు; శిశుహత్యలను, నరబలులను నిషేధించారు. కాని, సాంఘిక వ్యవహారాలలో జోక్యం కలిగించుకోవడంచేతనే సిపాయీలు తిరుగబడ్డా రనిన్నీ, ఈ కారణంచేతనే ప్రజలనేకులు సిపాయీలకు తోడ్పడ్డారనిన్నీ వారు భావించి 1858 మొదలు ఈలాటి జోక్యాన్ని మాను

కొన్నారు. మన దేశంలో ప్రస్తుతం ఎన్నో సాంఘిక దురాచారాలు కన్పిస్తున్నవి. ఇవి దురాచారాలు అన్న మాటను బ్రిటిషుప్రభుత్వం వారు కూడా అంగీకరిస్తున్నారు. వీటిని పూర్తిగా మాన్పించుటకు ప్రభుత్వసహాయం, శాసనం అవసరం అన్నమాట వారు నుత్తరగనిది కాదు. వర్ణభేదాలు, అస్పృశ్యత మొదలగువాటిని శాసనసహాయం లేనిదే పూర్తిగా నిర్మూలించుట కష్టసాధ్యం. ఇవన్నీ ప్రచార మాత్రంచేత అదృశ్యాలయ్యేవి కావు. కాని ఇట్టి శాసనాలను చేయడానికి పరాయిప్రభుత్వంవారు వెనుకతీయడం సహజం. ఇంతటి బాధ్యతను వారు వహించరు; వహించడానికి ఇష్టపడరు. ప్రజలు ఏమనుకొంటారో అనే భయం వారిని పట్టి పీడిస్తూ ఉంటుంది. జాతీయప్రభుత్వానికి ఇంతటి భయం ఉండదు. ప్రజల అభిప్రాయాన్ని మార్చడానికి వీరికి శక్తి ఉంటుంది; ఇష్టం ఉంటుంది. ప్రస్తుతం మన దేశంలో ఒక విషమపరిస్థితి ఏర్పడ్డది. ఒకప్పుడు సదాచారాలుగా ఉండినవి ఈ కాలానికి దురాచారాలైనవి. ఇవి మారితేనేగాని మనం బాగుపడలేము. బ్రిటిషువారు వీటిని మాన్పేట్టు లేదు. ఈ సంస్కరణాలు జరగడానికి అధికారం మన చేతులలోకి రావలసివున్నది.

(ఈ) ఈ సందర్భంలో మనం మరొక విషయంకూడా గమనించవలెను. అధికారంలో ఉండేవారు ఏలాగైనా తమ అధికారాన్ని నిలబెట్టుకోడానికి ప్రయత్నిస్తారు. వారి ప్రధానోద్దేశం ఇదే. నిలబెట్టుకొన్న అధికారాన్ని ఎల్లప్పుడూ సద్వినియోగం చేయడం వారి దృష్టిలో అంత ప్రధానం కాదు. సద్వినియోగమే వాంఛితమనిన్నీ, తమ అధికారం శాశ్వతంగా నిలబడ్డా నిలబడక పోయినా అధికారంలో ఉన్నంతవరకూ దానిని ప్రజల సౌభాగ్యానికి వినియోగించడమే న్యాయమనీ, ధర్మమనీ అనుకొని తదనుసారంగా ప్రవర్తించేవారు లక్షకు ఒకరుకూడ ఉండరు. అధికార సద్వినియోగంవల్ల తప్పకుండా తమ అధికారం శాశ్వతం కాగలదనే నమ్మకం వారికి ఉంటేనేగాని ఎవరూ ఈమోస్తరుగా చేయరు. అట్టి నమ్మకం కుదరడం కష్టం. సద్వినియోగం చేయకపోయినా ఒకొకప్పుడు అధికారం చాలాకాలం నిలబడడమున్నూ, సద్వినియోగం చేసినా అది నిలబడకపోవడమున్నూ మనం చూస్తూనే ఉన్నాం. ఇది మానవజీవితంలోని ఒక విశేషం. పుణ్యం చేసినవాడే బాగుపడ్తున్నాడా? పాపాలు చేసినవారు మహదైశ్వర్యం అనుభవిస్తున్నారు కారా? అధికారాన్ని ఏలాగైనా నిలబెట్టుకొందాం అనే ఉద్దేశం రాజ్యాలను చేసేవా రొక్కరిలోనే కనుపించడం లేదు. అధికారంలో ఉన్నవారందరికీ ఇదొక లక్షణం. కుటుంబాలలోను, వ్యాపారసంస్థలలోను, విద్యాసంస్థలలోను మనకిది అనుభవమే. ప్రస్తుతం బ్రిటిషుపరిపాలకుల ప్రధానోద్దేశం ఈలాటి దని చెప్పడంలో క్రొత్త ఏమీ లేదు. అయితే గడచిన ఇరవైముప్పై సంవత్సరాల మధ్యన ఈ ఉద్దేశం వారిలో మరింత బలవత్తరం అయింది. దీనిని సాధించుకోడానికే వారు సర్వప్రయత్నాలు చేస్తున్నారు. స్వరాజ్యోద్యమం దేశంలో బలిష్ఠంకావడం, దాని మూలంగా వారికి ఎక్కడలేని ఒత్తిడి కలగడం దీనికి ప్రధాన కారణం. తమ అధికారాన్ని నిలబెట్టుకొంటే లెక్కలేని విషయాల నన్నిటినీ నెమ్మదిగా తర్వాత ఆలోచించవచ్చు ననే సంకల్పం వారిలో బయలుదేరింది.

ఈ సంకల్పాన్ని సాధించడానికి వారు ప్రస్తుతం భేదోపాయాన్ని ఎక్కువగా ఉపయోగిస్తున్నారు. దండోపాయానికంటే ఇదే వారికి లాభకరంగా కనుపిస్తున్నది. కాని ఈ ఉపాయ ప్రయోగంవలనాలాన మన పరిస్థితులు రోజుకు రోజూ ప్రమాదకరాలు అవుతున్నవి.

ఇతరదేశాలలో ఉన్నట్లే మన దేశంలోకూడా ఎన్నో భేదాలు ఉన్నవి. మతభేదాలు, వర్ణభేదాలు, కులభేదాలు, వర్గభేదాలు, భాషాభేదాలు, రాష్ట్రభేదాలు — వీటి నన్నిటినీ మనం చూస్తున్నాం. ఈ భేదాలను ఆసరాచేసుకొని వాటికి మరికొంత దోహదం కలిగిస్తే తమ అధికారాన్ని సులభతరంగా నిలబెట్టుకోవచ్చు ననే నమ్మకం వారిలో ఏర్పడ్డది. ఈభేదాలను వారు కల్పించారని చెప్పడం పొరబాటు. ఇవి సృష్టిలోనే ఉండేవి. వీనిని పోగొట్టడం ఎవరి తరమూ కాదు. అగ్ని, జలం, వాయువు మొదలైన మహాభూతములవలె సంఘంలో ఉండే భేదాలు మహాశక్తులు. వీటిని సంఘంయొక్క సౌఖ్యానికి ఉపయోగించవచ్చు; సంఘం చెడిపోవడానికి ఉపయోగించవచ్చు. ప్రస్తుతం మన దురదృష్టం ఏమిటంటే-అధికారంలో ఉండేవారు వీటిని మన అభివృద్ధి అరికట్టడానికి ఉపయోగిస్తున్నారు. వాటియొక్క ఉగ్రతను తగ్గించడానికి ఎంత పాటుపడవలెనో అంత పాటు వారు పడడం లేదు. అధికారంలో ఉన్నవారికి ఎక్కువ పలుకుబడి ఉంటుంది కాని, అధికారంలో లేని ప్రజానాయకులకు అంత పలుకుబడి ఉంటుందా? దయ్యంకూడా దెబ్బకు లొంగిపోతుంది. సాంఘిక భేదాల దుర్వినియోగం అనే వ్యాపారాన్ని కొట్టడానికి ప్రభుత్వం వారు చాలా స్వల్పంగా కృషిచేస్తున్నారు. కాని మునుప్రయోగంలో చాలాభాగం దానికి మరింత ఆవేశాన్ని కలిగిస్తున్నది.

అమెరికాదేశం (United States) మన దేశానికంటే చాలా పెద్దది. అక్కడి ప్రజలలో ఎన్నో జాతిభేదాలు, మతభేదాలు ఉన్నవి. ఇంగ్లీషువారు, జర్మనులు, ఇటాలియనులు, ఐరిషువారు, పోలులు, జ్యూలు — యూరోపుఖండంలో ఎన్ని జాతులున్నవో అన్ని జాతులవారూ ఆదేశంలోకి వచ్చి స్థిరనివాసాలు ఏర్పరచుకొన్నారు. జాతిభేదంతోపాటు మతభేదం వారిలో ఉంది. కాని ఆ దేశంలోని ప్రభుత్వం ఈ భేదాలవల్ల దేశానికి ఏలాటి ప్రమాదం కలుగకుండా ఉండేటట్లు ఎంతో కృషిచేస్తున్నది. చాలావరకు ఈకృషి విద్యాసంస్థలద్వారా జరుగుతుంది. అందరూ ఒకే పాఠ

శాలలో చదవవలసిఉన్నది. కులాన్నిబట్టి, జాతినిబట్టి పాఠశాలలను విడదీయడం ఆ దేశంలోనివారు ఎరుగరు. వార్తాపత్రికలద్వారా, ఇతరసాధనాలద్వారా జరుగుతుండే ప్రచారంమూలాన తాము వేరు వేరు జాతులమనే అభిప్రాయం మారి, అందరూ అమెరికనులు అనే అభిప్రాయం రెండుమూడుతరాలలో వారందరియందు వ్యాపిస్తూవస్తున్నది. నిజం ఆలోచిస్తే వారిలో ఉన్నన్ని భేదాలు మనలో లేవు. కాని "మనమంతా భారతీయులం; దేశాభిమానానికంటే గొప్ప సుగుణం వేరొకటి లేదు; ఒక్కొక్క భేదం ఒక్కొక్క విశేషాన్ని సూచిస్తుంది; ఈవిశేషగుణాన్ని అందరి ఉపయోగంకొరకూ వినియోగించవలెను"అని ప్రబోధం చేసే పాఠశాలలు,విద్యాసంస్థలు మన దేశంలో ఎక్కడ ఉన్నవి? ప్రభుత్వంవారు అట్టి ప్రచారాన్ని ఎంతవరకు చేస్తున్నారు ?

దీనినిబట్టి తేలేది ఏమిటంటే, ప్రస్తుత రాజకీయ పరిస్థితుల మూలాన మనలో ఉండే భేదాలయొక్క తీక్షణం రోజురోజుకూ వృద్ధికావడం తప్పదు. దీనిని తగ్గించడానికి అధికారం భారతీయుల హస్తగతం కావలసిఉన్నది.

పై విషయాల మూలాన మన రాజకీయ సమస్యయొక్క స్వభావం ఎట్టిదో, ఆ సమస్య ఏ పరిస్థితుల మూలాన పుట్టిందో, దానిని పరిష్కరించడంలో జాతీయవాదులు చేసే సూచనలు ఏలాటివో స్పష్టంఅయింది.

పరిపాలనాధికారం బ్రిటిషువారి చేతులలోనుండి భారతీయుల చేతులలోకి మారవలసిఉన్నదని చాలామంది అంగీకరిస్తున్నారు. బ్రిటిషువారుకూడా ఇదే తమ ఆదర్శం అని చెప్తున్నారు. ఆదర్శం ఒక్కటైనా రాజకీయసమస్య పరిష్కారం కాకపోవడానికి కారణాలు తెలుసుకోవలసి ఉన్నది.

బ్రిటిషువారికీ, మనకూ ఒక విషయంలో గొప్ప భేదం ఏర్పడ్డది. ఆ భేదం సులభంగా అదృశ్యం అయ్యేటట్లు లేదు.

ఆదర్శానికీ ఆచరణానికీ ఉండే భేదమే ఈ భేదం. భరతఖండంమీద పాలించే అధికారం భారతీయులకు ఉండడం ఆదర్శమే; కాని అది వెంటనే గాని, కొద్దికాలంలో కాని ఆచరణలో ఉంచదగ్గ ఆదర్శం కాదని వారి అభిప్రాయం. ఆదర్శంగురించి తగాదాలు ఏవీ లేవు. తగాదాలన్నీ ఆచరణాన్నిగురించే.

మానవజీవితంలో అంతా ఈభేదం సర్వసామాన్యంగా కనపిస్తుండేదే. మనం కోరతగ్గదానికీ, కోరుతూ ఉండేదానికీ భేదం అందరి అనుభవంలో ఉన్న విషయమే. మితభోజనం కోరతగ్గది అని తత్వరీత్యా అందరం అంగీకరిస్తాం; కాని అమితంగా భోజనం చేస్తుంటాం. మితవ్యయం చేయడం మంచిదని వాదిస్తాం; కాని అమితవ్రయం చేస్తుంటాం. నీతిమార్గంలో వెళ్లడమే ఆదర్శం అని ఒప్పుకొంటాం; అవినీతిమార్గాల్లో నడుస్తుంటాం. ఆదర్శం, ఆచరణ ఏకం కావడమే మోక్షం. భరతఖండం స్వతంత్రంగా వుండడమే ఆదర్శమని బ్రిటిషువారు అంగీకరిస్తున్నారు. కాని, ఆచరణలోకి వచ్చేటప్పటికి వారు వెనుకతీస్తున్నారు. అంటే వారు సామాన్య మానవులవలె ప్రవర్తిస్తున్నారన్నమాట.

మానవప్రకృతిలో మరొక లక్షణంకూడా ఉన్నది. ఆదర్శాన్ని ఆచరణలో ఉంచడానికి సంపూర్ణంగా ఇష్టం లేనప్పుడు ఆ ఇష్టంలేనితనాన్ని కప్పిపుచ్చడానికి అనేక కారణాలను కల్పిస్తుంటాం. ఈ కల్పిత కారణాలు (Rationalisation) యథార్థాలని నిరూపించడానికి మన తార్కికశక్తినంతా వినియోగిస్తాం. మన ఆచరణను ఇతరులు నిందిస్తారనే భయం, మనలను ఇతరులు హేళన చేస్తారనే సందేహం బాధిస్తూ ఉంటవి. ఆలాటివి లేకుండా చేసుకోడానికి ఎన్నో యుక్తులను పన్నుతుంటాం. మనుష్యమాత్రులందరిలో కనబడే ఈ స్వభావం బ్రిటిషువారిలో కూడా కనిపిస్తున్నది.

వారేం చెప్తున్నారంటే, "మా సామ్రాజ్యాన్ని ఏలాగైనా నిలబెట్టుకోవడం మా ఉద్దేశం కాదు. ఆ ఉద్దేశాన్ని మేము ఎప్పుడో వదలుకొన్నాం. మేము మా దేశంలో ఏలాటి స్వరాజ్యాన్ని అనుభవిస్తున్నామో ఆలాటి స్వరాజ్యం అన్ని జాతులవారియొక్క జన్మహక్కు అన్నమాట మేము ఎన్నడో చెప్పాం. ఇతరుల కిదొక కొత్త విషయమేమో కాని, మా కిది చాలా పాతదే. ఈ సిద్ధాంతాన్ని అనుసరించి మే మిదివరకే కనడా, ఆస్ట్రేలియా, న్యూజీలెండు, దక్షిణఆఫ్రికా, ఐర్లాండులకు స్వరాజ్యం ప్రసాదించాం. ఇందులో నివసించేవారు పాశ్చాత్యులు, శ్వేతవర్ణులు కావడంచేత మేము ఈలాగు చేశామనిన్నీ, నల్లవారి విషయంలో మేము మరొక విధముగా ప్రవర్తిస్తామనీ మీ రనుకోవద్దు. ఈ స్వరాజ్యప్రసాదం మేము బుద్ధిపూర్వకంగా చేయలేదనిన్నీ, ఐర్లండు దక్షిణాఫ్రికాలలో యుద్ధాలమూలంగా చేయవలసి వచ్చిందనిన్నీ మీరు భావించవద్దు. భరతఖండ విషయంలో కూడా మేము మా అధికారాలను వదలుకొనుటకు సంసిద్ధులుగా ఉన్నాం. అయితే ఎప్పుడు వదలుకొందాం ? వెంటనేనా, మరి కొంతకాలం అయినతర్వాతనా అనేదే మాచింత. కాలాన్ని గురించి ఎందుకు ఆలోచించవలసివచ్చిందంటే : నూటయాభై సంవత్సరాలుగా మే మీభరతఖండంలో ఉన్నాం. దేశానికి మహోపకారం చేశాం. పరాయివారు—జర్మనులు, జపాన్‌వారు, రషియనులు—దేశంపై దండెత్తి రాకుండా ప్రజలను రక్షించాం. వెంటనే మేము మా అధికారాన్ని వదలుకొని వెళ్లిపోయినయెడల భారతీయులు వారి దేశాన్ని స్వయంగా రక్షించుకోగలరా?అందుకు కావలసిన సైన్యం, నౌకాబలం, విమానబలం, మందుగుండుసామానులు తయారుచేయడానికి కావలసిన పరిశ్రమాగారాలు, ధనసంపత్తి, బుద్ధిసూక్ష్మము, నేర్పు భారతీయులకు లేవుగదా? ఇవన్నీ దేశంలో

కల్పించిగదా మేము వెళ్లిపోవుట మంచిది? లేనియెడల కష్టపడి కనిపెంచిన పిల్లపక్షిని రెక్కలురాకపూర్వమే తల్లిపక్షి వదలి వెళ్లిపోవడం వంటిదికదా మాపని? ఇది నీచకృత్యం, సందార్హ్యం. గనుక స్వరాజ్యం మా ఆదర్శం. కాని అది ఇప్పుడు ఆచరణయోగ్యంకాదు. రక్షణకు సంబంధించిన ఈ అనుకూలపరిస్థితులు ఏర్పడ్డతర్వాత ఎవరూ చెప్పవలసిన అవసరం లేకుండా మా అంతట మేము వెళ్లిపోతాం."

"ఇంతేకాదు. నూటయాభై సంవత్సరాలుగా మా అండను ఉండి మా సంరక్షణలో నమ్మి, మమ్మల్ని తల్లిదండ్రులుగా భావిస్తున్న జనం భరతఖండంలో ఎంతో ఉన్నది. వారింకా ప్రాజ్ఞులు కాలేదు. బాల్యావస్థలోనే ఉన్నారు. వారిని రక్షిస్తామనీ, ప్రాజ్ఞులను చేస్తామనీ మేము వాగ్దానం చేశాం. మామాటను నిలుపుకోవడం మాకు విధి. చెప్పినమాటను తప్పడంకానీ, చేసిన ప్రతిజ్ఞను దాటడంకానీ నీతిమార్గం కాదుగదా? మే మిప్పు డీ దేశాన్నుండి వెడలిపోయినపక్షాన నిమ్నజాతులు, క్రైస్తవులు, ఆంగ్లో-ఇండియన్లు వీరిగతి నిర్గతియేకదా! వీరిని ప్రాజ్ఞులనుజేసి, అగ్రజాతులలో చేరిన హిందువులమూలంగా వీరి కెట్టి ప్రమాదమూ సంభవింపని పరిస్థితులను ఏర్పరచి మేము మామూటా ముల్లా కట్టుకొని వెళ్లగలం. ప్రయాణానికేమో మే మిదివరకే సిద్ధంగా ఉన్నాం."

"గత మూడునాలుగుసంవత్సరాలలో మీ రాజకీయాలయందు ఒక విపరీతమైన మార్పు కలిగిందన్నమాట మీరు మరువకూడదు. స్వరాజ్యవాదులు దీనిని గమనిస్తున్నట్లు లేదు. జిన్నా నాయకత్వాన మహమ్మదీయులంతా పాకిస్థానం అనే స్వతంత్రరాజ్యాన్ని భరతఖండంలో ఒకటిరెండు ప్రదేశాలలో స్థాపించడానికి తీర్మానం చేసుకొన్నారు. మహమ్మదీయులు ఈలాటి పట్టు పట్టడానికి స్వరాజ్యోద్యమమే కారణం. వారి పట్టే గెలిస్తే నూటయాభైసంవత్సరాలుగా మేము కష్టపడి ఏర్పరచిన భరతఖండరాజకీయ ఏకత్వం అదృశ్యం అయిపోవడమేకదా? ఈ ఏకత్వంవల్ల మీ కెంతటి లాభం అనుభవించిందీ మీకే తెలుసును. దీనికిబదులు జిన్నా కోరేటట్టి పాకిస్థానం స్థాపితమైతే, రక్షణవిషయంలోనూ, వర్తకవ్యాపారంలోనూ ఎన్నికష్టాలు కలుగుతాయో ఆలోచించండి. పాకిస్థాన ఉద్యమం మహమ్మదీయులు వదలుకొనేవరకుగాని, ఈవిషయంలో మహమ్మదీయులకూ హిందువులకూ రాజీ కుదిరేవరకుగాని మేము దేశంలో ఉండి రాజకీయఐక్యతను కాపాడవలసిఉన్నదికదా? ఈ రాజీ కుదరడమే తరువాయిగా మేము వెళ్లిపోవుటకు సిద్ధంగా ఉన్నాం"

"సంస్థానాధీశులు మాకు చిరమిత్రులు. అనేకతరాలుగా వారికీ మాకూ పొత్తు కుదిరి ఉన్నది. సర్వకాలసర్వావస్థలందూ వారికి సహాయం చేస్తామనీ, శత్రువులవల్ల—బాహ్యశత్రువులవల్లగాని, అంతశ్శత్రువులవల్లగాని—ఎట్టి భయం లేకుండా రక్షిస్తామనీ అభయం ఇచ్చిఉన్నాం. మేము వెళ్లిపోవడం వారి కెంతమాత్రమూ ఇష్టములేదు. వారిని రక్షించగల ప్రభుత్వం దేశంలో మరొక్కటి ఏర్పడగలదనే నమ్మకం మాకూ వారికీ కలిగి, అట్టి ప్రభుత్వం ఏర్పడ్డతర్వాతగదా మేము వెళ్లిపోవడం శ్రేయస్కరం"

"ఇప్పుడా రేపా అని మేము కొంచెం తర్జనభర్జన చేయడానికి ఇంకా కారణాలున్నాయి. ఈకాలంలో ప్రపంచంలో ఏ దేశంకూడా సంపూర్ణస్వాతంత్ర్యం కోరడం ఉచితం కాదు. ఉచితం కాకపోవడమేకాకుండా ఇతరదేశముల సహాయం లేనిదీ స్వాతంత్ర్యం కాపాడుకోవడం అసాధ్యం. అమెరికాసహాయం లేకుండా మేమున్నా, మాసహాయం లేకుండా అమెరికాయున్నా ఒక నిమిషంకూడా స్వాతంత్ర్యం రక్షించుకోలేమన్నమాట ఇప్పుడు జరుగుతున్న యుద్ధంమూలంగా స్పష్టం అయిందికదా? రష్యావంటి మహారాజ్యానికి విజయాలు రావడం మాఅందరి సహాయం ఉండబట్టేకదా? ఇక చైనామాట చెప్పవలసిందేమున్నది? పెద్దపెద్ద దేశాల స్థితే ఈలాగు ఉన్నప్పుడు చిన్నవగు బెల్జియం, హాలెండు, పోలెండు మొదలగువాటినిగురించి ప్రత్యేకంగా చెప్పవలసింది లేదు. గనుక ఈకాలంలో మీరు కోరతగ్గది సంపూర్ణస్వాతంత్ర్యం కాదు. మన క్షేమాన్ని కోరే మిత్రులతోటి సంబంధమే అందరికీ వాంఛనీయం. ఏకాకిగా వుండడం ఎంతమాత్రం మంచిదికాదు.

"ఇదే మీకు అంగీకారం అయితే బ్రిటిషుసామ్రాజ్య సమితిలోని సభ్యత్వానికంటే వాంఛనీయమైన సభ్యత్వం మరొకటి మీకు లేదు గదా? నూటయాభై సంవత్సరాలుగా మీకూ మాకూ పరిచయం వుంది. మనం ఒక కుటుంబంలోనివారంగా ప్రవర్తించాం. మీ కష్టసుఖాలు మేము బాగా ఎరుగుదుం. మా శక్తిసామర్థ్యాలు మీకు తెలిసినవే. ఈలాటి సందర్భంలో సంపూర్ణస్వాతంత్ర్యాన్ని కోరడం మాని, మా సామ్రాజ్యసమితిలోనే వుండడం ఉత్తమమార్గం. ఉభయులకూ లాభకరం. ప్రపంచానికి కూడా ఇది శ్రేయస్సు. తూర్పు ఆఫ్రికా, సింహళం, బర్మా, మలయా, ఆస్ట్రేలియా, న్యూజీలెండు మొదలగువాటిని శత్రువుల చేతులలో పడకుండా రక్షించడం మాకు విధి. ఇది మాపైన భగవంతుడు వేసిన బాధ్యత. ఈ ప్రదేశాలన్నిటికీ మధ్యన భరతఖండం వుంది. భరతఖండం స్వతంత్రమార్గాన్ని అనుసరిస్తే వీటియొక్క రక్షణమాట ఏమిటి? ఇప్పుడే మేము మీ దేశాన్ని వదలినయెడల ఈ రక్షణకు ప్రమాదం కలుగుతుంది కదా."

"ఈ విషయాలన్నిటినీ మీరు నెమ్మదిగానూ, నిష్పక్షపాతంగానూ, ఉద్రేకపూరితులు కాకుండానూ ఆలోచిస్తే మీ రాజకీయ సమస్య మీ రనుకొన్నంత సులభంగా పరిష్కారం చేయతగ్గది కాదనిన్నీ, ఆదర్శం వాంఛనీయమైనా ఆచరణయోగ్యం కావడానికి చాలాకాలం పట్టుననిన్నీ మీరే ఒప్పుకోవలసివస్తుంది. ఒప్పుకొంటారని కూడ మేము నమ్ముతున్నాము."

# మన రాజకీయ సమస్య

బ్రిటిషువారి వాదం సులభంగా కొట్టివేయవలసిన వాదం కాదు. ఆలోచించతగ్గ విషయా లందులో ఎన్నో వున్నవి. కాని, ఈ వాదాన్ని అనుసరిస్తే మన రాజకీయసమస్య ఎన్నటికీ పరిష్కారంకాదు. సమస్య సమస్యగానే ఉంటుంది. కాలం పోను పోను సమస్య క్లిష్టతరం కావడం తప్పదు. కొత్తపేచీలు బయలుదేరుతవి. ఈ రోజు చేయతగ్గ పనిని రేపటికి వాయిదావేసే అలవాటు పట్టుబడ్డ తర్వాత ఆ 'రేపు' ఎన్నటికీ రాకపోవడం, ఆ పని ఎప్పుడూ జరగకపోవడం అందరి అనుభవంలో ఉండే విషయమే. పది సంవత్సరాల క్రిందట మనం స్మరించని క్లిష్టవిషయా లెన్నో ఈ కాలయాపనవలన ప్రస్తుతం మన సమస్యను ఆవరించియుండడం అందరికీ తెలిసిందే.

దేశాన్ని రక్షించుకొనే శక్తి మనకు లేదనడం గొప్ప పొరబాటు. లక్షలకొలది— కోట్లకొలదికూడాను— యోధానుయోధులను తయారుచేయుటకు కావలసిన వసతులు మన కున్నవి. గత ప్రపంచయుద్ధంలోను, ప్రస్తుత ప్రపంచయుద్ధంలోను ఐచ్ఛికంగా ఎందరు భారతీయులో సైన్యంలో చేరి ప్రతి యుద్ధరంగమందూ— ఉష్ణదేశాలలోనూ, చలిదేశాలలోనూ — అసమానములగు ధైర్యసాహసములను ప్రకటించి జగద్విఖ్యాత మగు యశస్సును సంపాదించారు. భారతయుద్ధమునాటి వీరుల సంతతివార మని ఋజువు చేశారు. ఈలాటివారు దేశమం దంతటా ఉన్నారు. వారిని సైన్యంలో చేర్చి, ఆధునికకాలపు యుద్ధ విధానాలను వారికి నేర్పుటకు కంకణము కట్టుకొన్న భారతజాతీయ ప్రభుత్వము ఏర్పడ్డ మరు నిమిషానికి అసంఖ్యాకములగు సైన్యములు తయారు కాగలవు. ఇట్టి సైన్యాన్ని పరాయిప్రభుత్వంవారు ఎన్నటికీ తయారుచేయలేరు. ఇట్టి సైన్యంమూలాన తమ అధికారానికి భంగం కలుగుతుం దనే భయం వారికి ఉండడం సహజం. వ్యవసాయమే ప్రధానవృత్తిగా ఉన్నట్టి మన దేశంలో సైన్యసామగ్రిని తయారు చేయడానికి కావలసిన పరిశ్రమలను స్థాపించడం ఏలాగు అనే సంశయానికికూడ అవకాశం లేదు. ఇరవైఅయిదు సంవత్సరాలకు పూర్వం రషియాదేశం ప్రస్తుతం మనదేశం ఉన్న స్థితిలో ఉండినది. ప్రజానాయకు లగు లెనిన్, స్టాలిన్ లోనైన వారు పరిపాలనాధికారం వహించిన కారణాన అంతా మారిపోయింది. 1789 లో ఫ్రాన్సుదేశమందు సంభవించిన మహావిప్లవంలో కూడా బహుసత్వరంగా జాతీయసైన్యం సమకూర్చబడ్డది. సామ్రాజ్యాధికారంలో వున్నవా రెవ్వరూ తమ ఏలుబడిలో వుండే ప్రజలను స్వతంత్రంగా దేశాన్ని రక్షించుకొనేటట్లు తర్ఫీదు చేశారన్నదానికి ఎక్కడా నిదర్శనంలేదు. ఎక్కడా జరగనిది మన దేశంలో జరుగుతుం దని అనుకోవడం ఆకాశంలో భవనాలను నిర్మించడంవంటిదే.

పూర్వకాలంలో మనం మన దేశాన్ని రక్షించుకోలేకపోయినా మనిన్నీ, పరాయివారికి దాసులు కావడం మనకు సైజమైపోయిం దనిన్నీ పాశ్చాత్యులు మనలను ఎత్తిపొడవడం మామూలైపోయింది. ఇదంతా నిజమని నమ్మేవారు మనలోకూడా లేకపోలేదు. ఇది నిజం కాదు. రాజపుత్రులు, మహారాష్ట్రులు సిక్కులు, కాకతీయ సామ్రాజ్యంలోని ఆంధ్రులు, విజయనగరసామ్రాజ్యంలోని ఆంధ్రకర్ణాటకులూ దేశస్వాతంత్ర్యానికై ఎన్నియుద్ధములు చేసినదీ చరిత్రచాటుచున్నది. యుద్ధములలో జయాపజయములు దైవాధీనములు. యుద్ధం చేయకుండా దేశాన్ని శత్రువులపాలు గావించినట్లుగాని, దేశాన్ని శత్రువులు జయించినతర్వాత వారిపై తిరుగబడకుండా వుండినట్లుగాని మన దేశచరిత్రలో ఎప్పుడూ జరిగివుండలేదు. ఒకప్పుడు మనం మనదేశాన్ని రక్షించుకోలేకపోయినంత మాత్రాన ఎన్నటికీ మనకు ఈ శక్తి రాజాలదని అనుకోవడం గొప్పపొరబాటు. స్వాతంత్ర్యానికి వునికిపట్టని పాశ్చాత్యులు చెప్పే ఐరోపాఖండంలోని దేశాల స్థితి ఎట్టిది? పోలెండు, జెకోస్లోవేకియా, గ్రీసు, సర్బియా, బల్గేరియా, రుమేనియా, ఇటలీ, బెల్జియం, జర్మనీ, ఫిన్‌లాండు, ఐర్లాండు, లితుఏనియా, ఇస్తోనియా, లాట్వియా, నార్వే అంటే ఆ ఖండంలోని రాజ్యాలలో మూడువంతు లన్నమాట—ఇవన్నీ ఇటీవలివరకూ ఏదో ఒక సామ్రాజ్యానికి లోబడి ఉండి కొత్తగ స్వాతంత్ర్యం సంపాదించిన దేశాలే. వీటిలో అనేకాలు ప్రస్తుత యుద్ధంలోనూ, గతయుద్ధంలోనూ శత్రువశము లయినవే. కాని ఇవన్నీ స్వాతంత్ర్యం గల దేశాలు కావడమే ధర్మమనిన్నీ, వీటియొక్క స్వాతంత్ర్యాన్ని పునరుద్ధరించడమే తమ ఆశయమనిన్నీ ఇటీవల కదా రూజ్వెల్టు చర్చిల్ గార్లు అట్లాంటికుప్రణాళికద్వారా ప్రకటించారు. మన కొక్కరికేనా ఈ శక్తి గాని, అర్హతగాని లేకపోవడం ఇవి మనకు వున్నవని యుక్తులచేతను, హేతువాదంచేతను ఋజువు చేయడానికి సాధ్యమా? హేతువాదంచేత అన్ని సత్యాలను ఋజువు చేయడానికి వీలులేదు. హృదయ పరివర్తనంవల్లనూ, ఆత్మవికాసంవల్లనూ మనం ఎన్నో సత్యాలను ప్రత్యక్షంగా చూడగలుగుతాం. బ్రిటిషువారిలో నిజమైన హృదయ పరివర్తనం కలిగినయెడల ఒక క్షణంలో మన శక్తి, మన అర్హత వారికి గోచరం అవుతుంది. దక్షిణఆఫ్రికా, కనడా, ఆస్ట్రేలియా, న్యూజిలెండు, ఐర్లాండులకు స్వాతంత్ర్యప్రసాదం చేసినప్పుడు స్వాతంత్ర్యాన్ని రక్షించుకొనే శక్తి వారికి ఎంతమాత్రం ఉండినది ఇప్పుడు కూడా వారికి ఆశక్తి ఎంతమాత్రం వుంది?

స్వాతంత్ర్యం వహించిన భరతఖండం ఏకాకిగా ఉంటుందనిన్నీ, ప్రపంచశ్రేయస్సును కోరజాలదనిన్నీ, బ్రిటిషు సామ్రాజ్యసమితిలోని సభ్యత్వాన్ని వదలుకొంటుం దనిన్నీ అనుకోవడకూడా పొరబాటే. ఈకాలంలో ఏదేశంకూడా ఏకాకిగా ఉం

తన స్వాతంత్ర్యాన్ని రక్షించుకోజాల దనే అంశం భారతీయ నాయకులంతా ఎరిగిందే. ఈ సత్యాన్ని వారు పాటినట్లు మరెవ్వరూ పాట లేదు. ప్రపంచశాంతిని కోరే సమస్తదేశాలతో సన్నిహిత సంబంధాలు ఏర్పరచుకోవడానికి వారు సిద్ధపడినవారే. బ్రిటిషు సామ్రాజ్య సమితిలోని సభ్యత్వంవల్ల ఆ శాంతి కుదురుతుం దని నమ్మకం కలిగినప్పుడు ఎవరుకూడా ఆ సభ్యత్వాన్ని వదలుకోరు. కాని ఎవరితో మైత్రి చేసుకోవడం అనే విషయం నిర్ణయించు కోవడంలో భరతఖండానికికూడా స్వాతంత్ర్యం ఉండవలెననేదే జాతీయవాదుల వాదం. ఈ స్వాతంత్ర్యం న్యూజీలెండుకు ఉండ వచ్చునట! డెన్‌మార్కుకు, గ్రీసుకు ఉండవచ్చునట! భరతఖం డానికి మాత్రం ఉండకూడదట! బలవంతపు సభ్యత్వం సభ్యత్వం కానేకాదు.

అస్పృశ్యులు మొదలగువారియెడల అధికసంఖ్యాకులగు అగ్రవర్ణములవారు పూర్వకాలంలో అపచారాలు ఎన్నో చేశా రనిన్నీ, బ్రిటిషువారి పరిపాలన తొలగి భారతీయుల పరిపాలన స్థాపింపబడినయెడల అల్పసంఖ్యాకులగు వీరి స్థితి మరింత దుర్భ రమగు ననీ వాదించడం కువాదంకాని మరియొకటి కాదు. కాలం మారింది. అగ్రవర్ణములలో హృదయపరివర్తనం, పశ్చాత్తాపం కలి గింది. అస్పృశ్యులు బలవంతు లయ్యారు. బ్రిటిషువారు ఉన్నా లేకపోయినా అస్పృశ్యత నిర్మూలం అవుతుంది. బ్రిటిషువారు వీరికి చేయగల సహాయం అత్యల్పం. దేశంలో ఉండే నలభై కోట్ల జనంలోనూ ఇప్పుడుండే భేదాలు అంతరించేవరకూ తాము పాలకులుగా ఉండడం ధర్మం అనే సిద్ధాంతం నిజమే అయితే శాశ్వతంగా బ్రిటిషువారు మన దేశంలో ఉండవలసి ఉంటుంది. పైన సూచించినట్లు మనుష్యకోటిలోని భేదాలు ఎప్పటికీ పోజాలవు. సృష్టికి ఇది ఒక ప్రధానలక్షణం. బ్రిటిషువారిలోనూ, ఇతరపాశ్చాత్యులలోనూ భేదాలు లేవా? ప్రస్తుతకాలంలో పాశ్చాత్యప్రపంచాన్నంతా ఉర్రూతలాడిస్తూ కొత్త రాజకీయ సమ స్యలు పుట్టుటకు కారణభూతమైన మార్క్సు (Marx) సిద్ధాం తానికంతా ఈభేదాలేకదా ఆధారం. పరాయిప్రభుత్వంమూలాన భేదాలు ఎన్నటికీ సమసిపోజాలవు; వృద్ధికావడానికి ఎక్కువ అవ కాశాలు ఏర్పడుతవి.*

సంస్థానాధీశులకును, ప్రజానాయకులకును గల భేదాలు కూడ ఇట్టివే. ప్రజాప్రభుత్వం ఒక్కటే క్రమమైన ప్రభుత్వం అని విశ్వసించినట్టియు, ఆ ప్రభుత్వాన్ని తమ దేశంలో స్థాపించ డానికి నిరంకుశులగు తమ ప్రభువులతో యుద్ధాలు చేసి ఒక ప్రభు వుయొక్క శిరస్సును ఛేదించి, ఇద్దరు ప్రభువులను సింహాసనచ్యుతు లను గావించి దేశమునుండి బహిష్కరించినట్టియు బ్రిటిషువారు భరతఖండంలోని సంస్థానాధీశుల నిరంకుశత్వం నిలబెట్టడం తమ విధి యని వాదించడంకంటె విపరీతం మరొక్కటి లేదు. బ్రిటిషువారికీ, సంస్థానాధీశులకూ మధ్యన ఏర్పడ్డ ప్రాచీనకాలపు ఒడంబడికలలో తాము ఈరాజులను ఏదో కొంతకాలంమాత్రమే కాకుండా శాశ్వ తంగా రక్షించడానికి వాగ్దానం చేసి ఉన్నారు. ఈ సందర్భంలో బ్రిటిషువారి వాదమే సహేతుకం అయ్యేపక్షాన ఎన్నటికైనా భరతఖండానికి స్వాతంత్ర్యం రావడం సాధ్యమా?

పాకిస్థానానికీ, భరతఖండ స్వాతంత్ర్యానికిన్నీ ముడిబెట్టడం కూడా ఈలాంటిదే. తొమ్మిదికోట్ల మహమ్మదీయులు ఏకగ్రీవంగా పాకిస్థాన్ స్థాపనాన్ని కోరి, అందుకుగాను వారి సమస్తశక్తులనూ వినియోగించి తుదకు ప్రాణత్యాగంకూడా చేయడానికి సిద్ధపడ్డప్పుడు బ్రిటిషువారుమాత్రం ఆ మహాఆవేశాన్ని ఆపి, దేశంయొక్క రాజ కీయఐక్యతను రక్షించగలరా? పాకిస్థాన్ ఆందోళన ముదిరినయెడల మార్గాంతరం ఏమీ లేక బర్మాను భరతఖండాన్నుంచి వేరుచేసినట్లు పాకిస్థానాన్నికూడా వేరుచేయరని అనుకోవడానికి అవకాశాలు లేవు. క్రిప్సు ప్రణాళికలో ఈ వేరుపరచుట ఒక ప్రధానసూత్రం అని అందరికీ తెలిసిందే. ఇటీవల భారత రాజకీయసమస్యను విమ ర్శించుటకు మన దేశానికి వచ్చిన బ్రిటిషుప్రముఖులలో అనేకులు—కూప్‌లాండు మొదలైన విద్వాంసులు—పాకిస్థాన్‌పక్షంగా ప్రచారం చేస్తున్నారు. భరతఖండంలో ఒక 'డొమినియన్' బదులు అయి దారు 'డొమినియన్లు' ఏర్పడడంవల్ల బ్రిటిషువారికి కలిగే నష్టం ఏమీ లేదు. దాని మూలంగా రాజకీయలాభాలు కొన్ని కలుగ వచ్చును.

గనుక, ఆలోచించి చూస్తే మన దేశాన్ని పాలించుకునే అధికారం మన చేతులలోకి రావడం ఆదర్శంమాత్రమేకాకుండా ఆచరణయోగ్యం అని స్పష్టం అవుతున్నది. బ్రిటిషువారిలో కొంత ఔదార్యం, కొంత హృదయపరివర్తనం, కొంత సమదృష్టి కలిగితే, ఇది స్వల్పకాలంలోనే సాధ్యం అవుతుంది.

---

* ఈ విషయాలలో కొన్నిటిని విక్రమసంవత్సర (1940-41) ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలో 'మైనారటీల సమస్య' అనే వ్యాసంలో విమర్శించాను. పాఠకులు ఆవ్యాసాన్ని చదవడం మంచిది.








# శ్రీతారణ సంవత్సరము

మామిత్రులకు కళాప్రియులకు తెలుగువారందరికీ

చిరాయురారోగ్య సంపత్కరమగుగాక!!!

# యుద్ధము - జాతీయత



= శ్రీ కోటంరాజు రామారావు =

౧

ఏ దేశంలోనైనా జాతీయాభిమానం సలక్షణంగా, సాకల్యంగా ఉన్నదా లేదా అంటే, యుద్ధసమయమే అందుకు విశుద్ధమైన పరీక్షాసమయం. అప్పుడే దాని నిజస్వరూపం కన్పిస్తుంది. ఇటువంటి సంగ్రామసమయంలో మూడు ముఖ్యసమస్యలు ప్రత్యక్షమవుతాయి: (1) జాతీయస్వాతంత్ర్యమును కాపాడుకొనడం ఎట్లా? (2) తమ జాతికి చెందిన సొంత రాజ్యభాగములను భద్రంగా కాపాడుకొనుట ఎట్లా? (3) మున్ముందు ఎక్కువ సౌఖ్యాభివృద్ధులతో పెంపొందుటకు తగిన సాధనమార్గము లేవి? ఈ మూడు ముఖ్యాంశములను గమనించవలెను. ప్రస్తుత మహాసంగ్రామమువల్ల అనేక పరాధీనరాజ్యాలలో బ్రహ్మాండమైన, ప్రచండమైన రాజకీయోద్వేగతరంగములు నూతన శక్తిస్వరూపములవలె బయలుదేరుచున్నవి. ఇవి కాలక్రమేణ విజృంభించుటవల్ల యీ పరాధీనరాజ్యాలను తమ అధికారంక్రింద ఉంచుకొనుచున్న సామ్రాట్ప్రభుత్వపీఠములకే చాలా నష్టదాయక మగును.

ఫ్రెంచి సామ్రాజ్యం సగం హరించిపోయింది. ఇప్పుడు ఫ్రాన్సులోని ఫ్రెంచిప్రజలే జర్మనుల ఆజ్ఞలకు బద్ధులైయున్నారు. ఈ దుష్కరవిషమపరీక్షలో చాలా అసాధారణమైన ప్రభావం చూపించి ఇంగ్లాండుదేశం నిలువబడగల్గినది. గడచిన యుద్ధంలో కలిగిన భయోత్పాతములకంటె ముందు జరుగనున్న యుద్ధంలో తమ కెక్కువ ముప్పు వాటిల్లదని ఆంగ్లేయుల అభిప్రాయం. కాని ప్రపంచాని కంతటికీ ఇంగ్లండుదేశమే నాయకత్వం ఇకముందు కూడా వహిస్తూఉండగలదని వాదించడం మనకు తెలియని విషయంలో జోస్యం చెప్పుట యగును. లెక్కింపజాలని విషయమును నొక్కివక్కాణించుట యగును. ప్రస్తుతం ఇంగ్లాండుతో అమెరికా ఎక్కువ కలిసిమెలిసి వ్యవహరిస్తోంది. అందువల్ల యీజాయింటు వ్యవహారంలో భాగస్వామ్యం గల అమెరికాకుకూడా కొంత ఆధిపత్యం సంక్రమించవచ్చును. ఈ యుద్ధంలో జయప్రదంగా శత్రువును ఎట్లాగైనా సాధించి గట్టెక్కి, పూర్వమువలెనే ఇక ముందుకూడా తాను సామ్రాజ్యాన్ని హాయిగా అనుభవిస్తూ సామ్రాజ్యసంపదను హరిస్తూ సుఖంగా కాలక్షేపం చేయడమే సర్వసాధారణంగా ప్రతిఆంగ్లేయుడూ కోరుకొనే విషయం. అంతకంటే వానికి కావలసినది మరొకటి లేదు. రష్యాసంగతి అటుంచ నిచ్చి మిగతా ప్రపంచమును పరిశీలిస్తే, ఇంగ్లిషువాళ్లు చాలా ఎక్కువ స్వజాత్యభిమానమును కనబరచినట్లు వ్యక్తమౌతుంది. ఇటలీలో ముసులోనీప్రభ పోయింది. ఇప్పుడా ఇటలీలోనే అక్షరాజ్యాల సేనలున్నూ, మిత్రమండలిసేనలున్నూ యుద్ధం చేస్తున్నాయి. ఉభయులపక్షంలోను ఇటాలియను సైనికులు సొంపులేని యుద్ధం చేస్తున్నారు. వారి సామ్రాజ్యం స్వాహా అయిపోయింది. యుద్ధానంతర నూతన ప్రభుత్వపీఠములలో ఇటలీకి ఏ తృతీయ స్థానమో లభించి అది చాలా వెనుకబడి పోగలదు. స్పెయిను దేశంలో నిన్నమొన్నటివరకు స్వదేశాంతఃకలహం జరిగి, చాలా నీరస స్థితిలో ఉంది. అందువల్ల తుమ్మితే ఊడిపోయే ముక్కులాగున యీ యుద్ధంలో చేరకుండా తటస్థంగా ఉంది. కాని, తటస్థంగా ఉన్నంతమాత్రంచేత యుద్ధానంతరం ఇటలీకంటె ఎక్కువ గౌరవస్థానం స్పెయినుదేశానికి లభింపబోదు. ఒకవేళ దానికంటె పోర్చుగలు రాజ్యమే ఎక్కువ గౌరవదశ పొందవచ్చు. అయిరోపాఖండంలోని ఉత్తరప్రాంతంలో ఉన్న చిన్నరాజ్యాలు కొన్ని చాలాకాలంవరకు సమష్టిగా గాని, దేనికది స్వతంత్రంగా గాని సమర్థమైన స్వరక్షణసైనికబలమును సమకూర్చుకొని యుండలేదు. అవి యన్నియు ఇప్పుడు అంతర్ధానమైనాయి. అవి ఒకప్పుడు స్వతంత్రరాజ్యాలే. కాని యిప్పుడవి హిట్లరుకులోబడిన పరాధీనరాజ్యాలుగా ఉన్నాయి. కాబట్టి చిన్న చిన్నరాజ్యాలు సమష్టిబలమును సమకూర్చుకొన్ననే తప్ప అట్టి చిన్నరాజ్యాలకు నిలువనీడలేదనే విషయం ఈ తార్కాణంవల్ల దివ్యంగా బోధపడుతోంది. యుద్ధం సాగినకొలదీ, యీ నిరంతర యుద్ధధాటికి జర్మనుజాతి తాళజాలక, ఏకముఖంగా నిలువబడలేక, భిన్నముఖములుగా చీలిపోయి, శిథిలమైపోవుటకు సిద్ధముగానున్నదని చెప్పిన వార్తలన్నియు నీలివార్తలైనాయి. సవ్యంగానో, అపసవ్యంగానో మొత్తంమీద స్వజాత్యభిమానదీక్షలో ఇతరజాతులవారి కెంతమాత్రమూ తీసిపోదు అని జర్మనుజాతి రుజువుచేసింది.

వారి దేశంలో వారి ప్రభుత్వవిధానం ఎటువంటిదైతేనేమి, వారి స్వదేశాభిమానంమాత్రం సుస్థిరంగానే ఉంది. ఇదివరలో తురుష్కులు యుద్ధరంగంలోకి దిగినవారే. కాని, యీపర్యాయం మాత్రం యుద్ధం అంటే సిద్ధం అని దూకకుండా, సమరావేశం లేకుండా దూరంగా తొలగిఉంటున్నారు. టర్కీని యుద్ధంలోనికి దింపవలెనని లాలించేవారు లాలిస్తున్నారు; బెదరించేవారు బెదరిస్తున్నారు. టర్కీ యుద్ధంలోకి దిగకుండా ఉభయపక్షాలవారికీ అందరాని మ్రాని పండులాగున ఉంది. తురుష్కులకుకూడా దీక్షగా తటస్థభావంతో తొలగిఉండడమే సుఖప్రదంగా ఉంది. ఈమహాసంగ్రామంలో రష్యాదేశము ప్రపంచచరిత్రలో కని విని యెరుంగని కథాఘట్టమును చూపించింది. ఈసంగ్రామంలోనికి రష్యా దిగక పోయినట్లయితే, యుద్ధం యీసరికే పూర్తిఅయిపోయేది. కాని, రష్యనుపరాక్రమంతోబాటు యుద్ధంకూడా సాగుతుంది. రష్యా జయించేవరకు యుద్ధం సాగుతుంది. రాజ్యాంగవేత్తలకు, ప్రవక్తలకుకూడా వారి ఊహలు, వారి అంచనాలు రష్యావిషయములో పనికిరానివైనాయి. వారు వేసిన లెక్కలన్నీ ముక్కచెక్కలైనాయి. రష్యారాజ్యాలలో అనేక జాతులవారు, అనేకమతాలవారు ఉన్నారు. దేశవైశాల్యం ఒక్కతీరుగా లేదు. ప్రజల ఆర్థిక సంపత్తిలో అనేకవ్యత్యాసములు ఉండేవి. ఇటువంటి వ్యత్యాస వైపరీత్యములు గల యీప్రజాసమూహము బ్రహ్మాండమైన ఏకజాతిగా, ఏకముఖంగా తయారైంది. సంగ్రామసమయంలో స్వదేశాభిమానం యింతటి బ్రహ్మాండమైన భూభాగంలో అవిచ్ఛిన్నంగా ఆవిర్భవించడమే అద్భుతమైన జాతీయైకమత్యోదయమునకు ప్రబలనిదర్శనము. సజాతీయప్రజకే స్వజాత్యభిమానము ఉండగలదనే ప్రాత రాజకీయసిద్ధాంతములన్నియు గాలికెగిరిన ధూళివలె ఎగిరిపోయినవి.

అటు అమెరికాఖండంలో సంయుక్తరాష్ట్రములలోకూడా అనేకజాతులవారు కలగూరగంపవలె చేరియున్నారు. అటువంటి పంచకోలకషాయంవంటి దేశంకూడా యీయుద్ధకాలంలో ఒక్కమాటమీద నిలువబడి వ్యవహరింప గలిగింది. ఆ దేశంలో అనేక రాజకీయమతాలవారున్నారు. భాగ్యభోగ్యాలలో అనేకఅంతస్తులవారున్నారు. అనేకరకాల జాతులవారున్నారు. అయినప్పటికీ వారందరూ ఏకముఖంగా, ఏకదీక్షగా యుద్ధవిజయమునకై కృషిచేస్తున్నారు. అప్పుడప్పుడు కొన్ని కార్మికసమ్మెలు జరిగినప్పటికీ అవి ఆర్థికవ్యవహారవివాదములేగాని రాజకీయవైమనస్యములు కావు. అమెరికాసంయుక్తరాష్ట్రములవారు కేవలం ద్రవ్యలాభాలు లెక్కచూచుకుంటూ వ్యవహరించేవారే యని చిరకాలంనుంచి ఒక అసహ్యభావం, అనుమానం వారియెడల యితరులలో వ్యాపించియున్నప్పటికీ దక్షిణఅమెరికాఖండంలోని రాజ్యాలు యీ అమెరికాసంయుక్తరాష్ట్రములపక్షముననే చేరి తమ అభిమానమును ఆ సంయుక్తరాష్ట్రములయెడలనే చూపించినవి. ఈ లాటినుఅమెరికనురాజ్యాలను తమ వైపుకు ఆకర్షించుకొనగల్గుట అమెరికా సం.రా.ప్రభుత్వాధిపతుల సామర్థ్యప్రభావమనియే చెప్పవచ్చును. దక్షిణఅమెరికారాజ్యాలువారిపక్షంచేరడం కేవలంఅభిమానసూచకం. అది శాస్త్రార్థం చేసిన పనియే గాని, అందులో ఫలితార్థం విశేషించి లేదు. ఎన్ని యిక్కట్లు వచ్చినప్పటికీ లెక్కచేయక చైనా ప్రజలు జపానువారిని ఎదిరించి పోరాడుచునేయున్నారు. వారికి ఉన్నది భగవంతుడిచ్చిన భుజబలం.ముష్టిబలంతోనే అకుంఠిత దేశభక్తితోవారు శత్రువును ఎదిరింపగల్గుచున్నారు. ఆధునికాయుధసాధనములతో కూడిన సమరయంత్రమునకు లొంగి లోబడకుండా చైనావారు ధీరులై వీరులై నిలబడ్డారు. జపానుఈ యుద్ధంలో బాగానే నెగ్గుకొని వచ్చింది. జపాను ప్రభుత్వచక్రమును తిప్పుతున్న రాజకీయవేత్తలు అపారమైన రాజ్యకాంక్షతో సాగించుచున్న యీసంగ్రామములో జపానుసైనికులు అమానుషమైన స్వార్థత్యాగం చూపించి తమ ప్రాణాలను బలియిస్తున్నారు. ఇంతవరకూ జపానువారు జయించినదంతా సులభంగా జయించారు. స్వల్పవ్యయప్రయాసలతో అధికరాజ్యం ఆక్రమించారు. వారు కొత్తగా జయించి ఆక్రమించిన ప్రాంతాలలోనుంచి వారిని వెళ్లగొట్టవలెనంటే చాలా ప్రబలప్రయత్నం చెయ్యాలి. ఇది మాటలతో అయ్యే పని కాదు. జపానుయొక్క ఉత్తరగతిని నిర్ణయించగలిగేది చైనా ప్రజలే గాని మిగిలిన మిత్రమండలి కాదు.

బ్రిటిష్ సామ్రాజ్యంలో చేరియున్న అధినివేశరాజ్యాలలో, శ్వేతజాతుల అధినివేశములలో జాతీయైకమత్యం ఉన్నది. ఇది ఆత్మప్రాణరక్షణార్థమైన స్వాభిమానము. ఈ అధినివేశరాజ్యాలలో కెనడాదేశానికి కాలం అత్యంత సుఖప్రదంగా వెళ్లిపోతున్నది. నిత్యకృత్యవ్యవహారంలో ప్రత్యక్ష కార్యావసరముల కన్నింటికీ కెనడాదేశం అమెరికాతో చేరిన అంతర్భాగంగానే వ్యవహరిస్తోంది. అయినప్పటికీ అలంకారంగా బ్రిటిష్ సామ్రాజ్యపతాకమును పైన ప్రతిష్ఠించి ఎగురవేస్తున్నారు. కెనడాలోని ఫ్రెంచివారందరూ యుద్ధారంభదశలో ఒక్కమాటమీద ఏకముఖంగా నిలబడ్డారు. కాని, ఫ్రాన్సును జర్మనుఅధికారంలోనుంచి విమోచించుటకై మిత్రరాజ్యాలు రెండోరంగం త్వరగా ప్రారంభించక తామసించుచుండుటవల్లను,* స్వతంత్రఫ్రెంచి పాలకవర్గములోనే కొన్ని తగాదాలు తలయెత్తుటవల్లను, ఫ్రెంచిరాజ్య భవిష్యద్విధానమును మిత్రరాజ్యాలవారు సరిగా నిర్ధారణచేసి చెప్పకపోవుటవల్లను, కెనడాలోని ఫ్రెంచివారి మనస్సులో కొంతఆందోళన కలిగింది. బ్రిటిష్ దక్షిణాఫ్రికా ప్రారంభంలో సంకోచిస్తూ వెనుకాడుతూ ఉండినప్పటికీ, యిప్పుడు సంపూర్ణయుద్ధ సహాయం చేయుటకు స్మట్సుమాటప్రకారంగానే నడుస్తోంది.

* దరిమిలాను మొన్న జూను 6-వ తారీఖునాడు రెండోరంగం ప్రారంభమైంది. —సంపాదకుడు.

జర్మనునాజీపక్షాభిమానం గలవారి మాట సాగకుండా అణచివేయడమైనది. ఈయుద్ధంలో జయించిన తర్వాత ఆఫ్రికాఖండంలోని విజయఫలితంలో విశేషభాగం బ్రిటిష్‌దక్షిణాఫ్రికాకు ఎక్కువగా లభిస్తుంది. ఈయుద్ధంలో ఒకప్పుడు ఆస్ట్రేలియాగుమ్మంలోకి జపానువాళ్లు వచ్చారన్న దినములలో బ్రిటిష్ సంబంధమువల్ల ఆస్ట్రేలియా తన కేదో మహోపకారం కలుగుతుందని నమ్మలేదు. ఆసందర్భపరిస్థితిలో అమెరికావారినే వేడుకొని, అమెరికా చిత్తానుసారమే ప్రవర్తించుటకు ఆస్ట్రేలియా సిద్ధమైంది. ఆస్ట్రేలియాను తక్షణం కాపాడి రక్షించినట్లయితే, అమెరికాతోనే రాజకీయబాంధవ్యము లన్నీ ఏర్పాటుచేసికొనుటకుకూడా ఆస్ట్రేలియా సిద్ధమైంది. ఆసియాఖండ ఆగ్నేయభాగంలో ఉన్న యీ ఆస్ట్రేలియా భవిష్యత్తున్నూ, న్యూజీలాండుయొక్క భవిష్యత్తున్నూ ఏమి కానున్నదో యీ యుద్ధమే నిర్ణయించాలి. కాని, యీ సందర్భంలో ఒక్క విషయం ముఖ్యంగా గమనించవలసినది కలదు. ఎటువంటి దుర్భరకష్టాలు యీయుద్ధసమయంలో సంభవించినప్పటికీ యీ అధినివేశరాజ్యాలను తెల్లవాళ్లే అనుభవించాలిగాని ఆసియాఖండ నల్లజాతులవాళ్లు అక్కడ విస్తరించి కాపురాలుచెయ్యకూడదనే ద్వేషభావముమాత్రము పోలేదు. అటువంటి అవ్యక్తఘోరణిని వర్జిస్తేనేగాని ఈఅధినివేశాలు సురక్షితంగా ఉండజాలవు.

ఇటు జపానువారి ఆక్రమణలో నున్న బర్మా, మలయావంటి బ్రిటిష్‌రాజ్యభాగములలో ప్రభుత్వంమాత్రం చేతులుమారింది. ఎట్లాగైతేనేమి, బర్మాకు స్వపరిపాలనాస్వాతంత్ర్యం వ్రాసి యివ్వబడి కాగితాలమీద కన్పిస్తోంది. కాని, బ్రిటిషువారుమాత్రం బర్మాజనాన్ని ఆకర్షించగల మనోహరమైన స్వాతంత్ర్యప్రదాన ప్రకటనలనుచేసి, జపానువాళ్లమీద బర్మావారు తిరుగుబాటుచేయునట్లుగా ప్రోత్సహించి పురికొల్పలేకపోయినారు. డచ్చివారికి చెందిన యీస్టుయిండీసుదీవుల విషయంకూడా అంతే అయింది. యుద్ధానంతరం యీస్టుయిండీస దీవులను యథాపూర్వస్థితిలోనే తిరిగిహాలండు దేశానికి మిత్రరాజ్యాలవారు ఒప్పజెప్పదలచియున్నారా? ఇవ్వదలచినట్లుగానే కన్పిస్తోంది. సయామురాజ్యం జపానువారి పక్షంలో చేరినందుకు యుద్ధానంతరము మిత్రమండలి సయామునకు ప్రాయశ్చిత్తం చెయ్యకుండా ఉండదు. ఫ్రెంచి ఇండోచైనా తిరిగి ఫ్రెంచి కాలనీగా తయారవుతుందని చెప్పజాలము. యుద్ధంలో మిత్రరాజ్యాలు జయించిన అనంతరము పైజెప్పినరాజ్యాలను చైనాకు యీనాంగా యివ్వడానికి ప్రత్యేకించి ఉంచారు.

ఆసియాఖండంలోను, ఆఫ్రికాఖండంలోను అరబ్బీరాజ్యాల సంఘీభావ మొకటి ప్రధానవిషయంగా తలయెత్తుచున్నది. ఈఅఖిల అరబ్బీజాతులసమష్టిభావమును సామ్రాజ్యాధికారాభిలాషులగు రాజకీయవేత్తలు ఎంత ద్వేషించినప్పటికీ, ఎంత నిరసనభావంతో వ్రాతలు వ్రాసినప్పటికీ యీ అఖిలప్రపంచ అరబ్బీ సమ్మేళనోద్యమము మందగించుటలేదు. ప్రచండమైన మహోద్యమంగా వ్యాపిస్తోంది. ఈ పర్యాయము యీ ఉద్యమమునకు స్థిరస్థాయి ఏర్పడుతుంది. ఈ పర్యాయము యీ ఉద్యమమునకు కావలసిన తోడ్పాటుగాని, చేయూతగాని సోవియటురష్యా మూలంగా లభిస్తుంది; యితర మిత్రరాజ్యాలవల్ల కాదు. లెబెనానులో ఫ్రెంచి అధికారం లేకుండా పూర్తిగా హఠాత్తుగా తొలగించడమైనది. లెబెనాను విమోచనం పొందింది. చాలా చిత్రంగా, నాటకంలో సీను మారినట్లుగా, ఒక్క రోజులో స్వాతంత్ర్యాధికారం సంపాదించుకొని ప్రతిష్ఠించుకొన్నది. దీనిని బట్టిచూడగా మధ్యప్రాచ్యములోను,సన్నిహితప్రాచ్యములోను గలఫ్రెంచిసామ్రాజ్యభాగములో ఒక్కయీ దెబ్బతోటు పొడిచినట్లుగా లెబెనాను తన స్వపరిపాలనాధికారమును తాను ఫ్రెంచివారి చేతిలోనుండి ఊడలాగుకొన్నది.ఫ్రెంచిఅధికారమును లెక్కచేయక ధిక్కరించినది. యుద్ధకాలంలో సిరియా స్వతంత్రరాజ్యంగానే ఉండవలెనని నిర్ణయింపబడినది. అరబ్బీ జాతీయైకమత్యమును వృద్ధిపొందించుటకు సిరియాలోని స్వజాత్యభిమానమే మూలకందముగా నున్నది. అరాబియా రాజ్యంలో గనుల సంపద సమృద్ధిగా ఉన్నంతకాలము, విమానరహదారు లనేకము అరాబియా రాజ్యంమీదుగా పోవుచున్నంతకాలము అరాబియారాజ్యం స్వతంత్రరాజ్యంగా ఉండడం మనోవ్యాకుల కారణంగానే ఉంటుంది. ఈ యుద్ధకాలంలో యీజిప్టురాజ్యం తటస్థంగా ఉండి లాభం పొందుతున్నది. వ్యాపారంవల్ల ఆర్థికలాభం కలుగుతోంది. రాజకీయాధికార విషయంలో సగం స్వాతంత్ర్యం కలిగి ఉంటున్నది. రామెలు సేనాని, అలెగ్జాండరుసేనాని, మాంటుగామెరీ, వావెలు, ఆకిన్లెక్కు మున్నగువారు ఉత్తరాఫ్రికాలో యుద్ధవ్యూహాలు నడిపిస్తూఉంటే, సర్కసు చూచినట్లుగా, యీజిప్టు ప్రభుత్వం భద్రాసనంమీద కూర్చుండి పరికించి చూచింది. ఈ యుద్ధంలో మిగిలిన రాజ్యాల కన్నింటికీ ప్రసక్తి ఉంది కాని యీజిప్టుకు ఏ జోక్యమూలేదు. అరబ్బీరాజ్య సమ్మేళనోద్యమములో యువకుడైన యీజిప్టురాజుకు అందరికంటే ఎక్కువ ఆధ్వర్యం వహించాలనే ఆశ ఉండడంచేత యీసమ్మేళనంలో యీజిప్టురాజ్యం సౌమ్యంగా, చక్కని భాగస్వామిగా సంచరిస్తుందని తోచదు. ఏమైనప్పటికీ, యీజిప్టురాజ్యమును సంపూర్ణ సర్వాధికారరాజ్యముగా బ్రిటిషువారు దానిని మార్పుచెయ్యాలి. యుద్ధానంతరబాధకములు కొన్ని తొలగిపోవలెనంటే ఆపని బ్రిటిష్‌వారు చెయ్యాలి. ఈసందర్భంలో ఒక చిన్నవిషయం మనవి చేయవలసియున్నది. ఈజిప్టులో బ్రిటిష్ అధికార ధిక్కారం చేసిన వాఫదుపార్టీవారికి అధికారప్రతిష్ఠ చేసిన బ్రిటిష్‌వారు భారతదేశంలో కాంగ్రెసునాయకులను జెయిలులో బంధించి ఉంచినారు.

ఉత్తరాఫ్రికాలో మూరుజాతివారును, అరబ్బీజాతివారును

ఆల్జీరియాలోను, మొరాకోలోను స్వపరిపాలనా స్వాతంత్ర్యము కొరకై పోరాటం ఇంకా సాగించలేదు. అక్కడ యీయుద్ధసమయంలో మిత్రమండలి సేనలన్నియు కేంద్రీకరింపబడియుండుటయే అందుకు కారణము. కాని, ఆల్జీరియనులు స్వతంత్ర ఫ్రెంచి పరిపాలకవర్గమునకు చాలా చిక్కులు కల్పించుచునేయున్నారు. అబిసీనియాకు గత 10 సం.లనుండియు అనేకఅవస్థలు మారినప్పటికీ ఎట్లాగైతేనేమి ఇప్పు డొకవిధమైన స్వాతంత్ర్యం లభించింది. కాని, ఆరాజ్యాన్ని రక్షించే అధికారమంతా బ్రిటిష్‌వారిదే. బ్రిటిష్‌వారి రక్షణలో ఉండుటకై ప్రాతపురాణంగా ఆంగ్లో-అబిసీనియా పత్రమొకటి వ్రాసికొనబడి యున్నది. అటువంటిరాజ్యం ఆర్థికంగా గాని, రాజకీయ స్వాతంత్ర్యంలోగాని జయపూరు సంస్థానం కంటెను,జోద్పూరు సంస్థానంకంటెను ఎక్కువైనదికాదు. ఆఫ్రికా ఖండంలో బ్రిటిష్‌వారికి గల వలసరాజ్యాల నన్నింటినిగాని, ఫ్రెంచివారికిగల వలసరాజ్యాల నన్నిటినిగాని, ఇతరయూరోపియను దేశాలవారికి గల వలసరాజ్యాల నన్నింటినిగాని యిప్పుడు సవిస్తరంగా ప్రస్తావించవలసిన పనిలేదు. కాఫీ, తేయాకు, రబ్బరు పండించి, గనులలోని ఖనిజములను త్రవ్వి, తమయజమానులగు అధిపతి రాజ్యాలవారికి సప్లయి చేస్తూఉండడమే యీ వలసరాజ్యాలవారి పని. ఈ వలసరాజ్యాల విషయంలో ప్రస్తుతం గాని, మున్ముందుగాని జాతీయభావమనేది చెప్పదగినదీ చర్చించదగినదీ ఏమిన్నీ ఉండజాలదు.

## ౩

పరాధీనరాజ్యంలోని ప్రజలు స్వాతంత్ర్యంకొరకై ఆవేదన పడుతూ, అభీష్టసిద్ధికై అయికమత్యమును సాధించి, అప్రతిహత ప్రయత్నం చేసినప్పుడే ఆ పరాధీనరాజ్యంలోని ప్రజలయందు నిజమైన జాతీయభావము ప్రస్ఫుటమగుచున్నట్లుగా యెంచవచ్చునని సిద్ధాంతీకరించే యెడల అటువంటి లక్షణము లేవియున్నూ యీయుద్ధ పరిస్థితులందు భారతదేశ విషయంలో పైకి కన్పించుటలేదు. ఒకవైపున జిన్నాగారు పాకిస్తానుప్రచారం చేస్తున్నారు. దేశంలో అనేక పార్టీలు భిన్నముఖంగా చీలియున్నవి. వివిధమతసంఘములవారు స్వసంఘుస్వామ్యస్వాతంత్ర్యములకై నిరంతరాందోళన చేస్తున్నారు. కాంగ్రెసుఅనుచరులే కొందరు, కొలదిమందియైనప్పటికీ, కాంగ్రెసును విడనాడి చీలిపోయిరి. యుద్ధపటాలములలో చేరుటకును, యుద్ధకార్యముల కనేకరీతులుగా సహాయముచేయుటకును దేశంలో ప్రజల తోడ్పాటు ప్రభుత్వవిజ్ఞాపనలకు ప్రతిఫలంగా కన్పించుచున్నది. ఈ లక్షణము లన్నియు గమనించి చూస్తే యీ యుద్ధసమయంలో మనజాతీయైకమత్యదీక్ష యీకష్టకాల పరీక్షకు నిల్వలేకపోయినదనియే చెప్పవలసియున్నది. దేశంలోని ముఖ్యమైన పెద్దపార్టీలవారందరూ సహాయనిరాకరణం చేయుచున్నప్పటికీ, యుద్ధసంబంధమైనకృషిని దేశంలో ప్రజలందరూ బాగా చేస్తున్నారని ప్రకటించడం కేవలం హాస్యాస్పదంగా ఉంటుంది. భారతదేశంలో ప్రభుత్వప్రతిష్టంభనం అనేది లేనేలేదని నిఘంటుప్రమాణంగా మాక్సువెల్‌గారు బాహాటంగా ప్రకటించినప్పుడు ఆయన చెప్పినమాటలో అసత్యము లేదేమోయను భ్రమకూడా కలుగుతుంది. కాంగ్రెసుపార్టీ వారిని మినహాయిస్తే, మిగిలిన రాజకీయపక్షములు నిజంగా దేశస్వాతంత్ర్యంకొరకై సాగించుచున్న పోరాటమేమియు కన్పించదు. ఎవరిమట్టుకువారు ఉన్నదానితో తృప్తి పడుతున్నారు. ప్రభుత్వమువారు అమలుపరచిన నిర్బంధ శాసనములవల్ల దేశంలో విజృంభించిన జాతీయోద్యమము తల పైకెత్తకుండా అణచివేయబడినది. కాంగ్రెసు నిర్వచించిన 'స్వాతంత్ర్యదీక్షా ప్రమాణ' వాక్యములను ఇదివరలో వలె బహిరంగముగా పల్కుట కిప్పుడు చాలామంది భయపడుతున్నారు. అమెరీ-చర్చిలు ద్వయం కలిసిమెలిసి కలతలేకుండా వ్యవహరిస్తోంది. వారి చర్యలు వారికి చాలా సంతృప్తికరంగానే ఉన్నాయి. లిన్‌లిత్‌గో ప్రభువుస్థానే వేవెలు ప్రభువు అధికారం స్వీకరించినాడు. కాని పాత పద్ధతిలో కొత్తసంస్కారం ఏమీ లేదు.

అంతర్జాతీయ వ్యవహార ప్రపంచంలో భారతదేశం మూలబడిపోయింది. భారతజాతి యొక్క కళావిహీనమైన యీ బానిస జీవిత నాటకంలో మధ్యమధ్య కొన్ని వినోద ఘట్టముల వలె అఖిలపక్ష మహాసభలు, నిష్పాక్షిక మహాసభలు జరుగుతూ ఉన్నాయి.

జిన్నా సాహెబు ఇంకా రంగస్థలంమీద గర్జిస్తూనేఉన్నాడు. బ్రిటిషువారికి కావలసిన మేళానికి హంగు చేస్తూఉంటాడు. అహ గారులనుగురించి యిప్పుడేమీ మనకు వార్తలు రావడంలేదు. ముస్లిం లీగును ప్రతిఘటించడానికి ఉలేమాలు చాలరు. మితవాదపక్షమువారు యీప్రతిష్టంభనకు ప్రతిక్రియగా జీవంలేని బహిరంగలేఖలు మాత్రము వ్రాస్తూఉంటారు. క్రైస్తవసంఘమువారు శాంతిసద్భావము లనెడి సంతోషపువార్తలనుమాత్రము ప్రయోజనంలేకపోయినా పునశ్చరణచేస్తూఉంటారు. జరుగవలసినమార్పును, గడువుమించినప్పటికీ, హిందూమహాసభవారు చేశారు. సవర్కారుగారిస్థానే హిందూ మహాసభకు శ్యామప్రసాదు ముఖర్జీగారిని అధిపతిగా నియమించారు. ఈమహాసభయొక్క అహంకారతత్వానికి కొంత అగ్నిసంస్కార ప్రాయశ్చిత్తము అమృతసరు సభలో జరిగింది. స్వదేశాభిమాన కాంతికిరణలవలేశముకూడా హృదయంలో లేనటువంటి స్వదేశ సంస్థానాధిపతులు తమకు బ్రిటిషువారిచ్చిన సన్నదుపత్రములను గూర్చియు, తమ సన్మానార్థం కాల్చబడు ఫిరంగిజోహారులను గూర్చియు ఇంకా ఆలాపనచేస్తూనేయున్నారు. పంటసరకుల ధరలు హెచ్చి రైతులు సంతృప్తిగా ఉంటున్నారనే కారణం పురస్కరించుకొని జమీందారులూ, తాలూకుదార్లూ సుఖంగా కాలక్షేపం

చేస్తున్నారు. కాని రైతులకు కావలసిన జీవితావసరసామగ్రుల కన్నింటికీ రైతులు చాలా హెచ్చుధరలను చెల్లించవలసినవారగు చున్నారని యీ జమీందార్లూ, తాలూకుదార్లూ గ్రహించుటలేదు. కమ్యూనిస్టులు ప్రభుత్వాధికారుల అనుగ్రహమునకు పాత్రులై వింతగా వారితో జోడుకూడియున్నారు. కాని వారి సామ్రాజ్య కాంక్షతో వీరి జాతీయస్వాతంత్ర్యమంత్రమును సమన్వయించడం వారికి సాధ్యం కావడం లేదు. రాయిపార్టీవారికి ఇది మంచి గురు మహర్దశగా ఉంది. ఇటువంటి మంచి రోజులు వారికి తిరిగి రావు. కాంగ్రెసు సోషలిస్టుపార్టీ అడుగంటి ఏ పాతాళలోకం లోనో ఉన్నదని అనుమానం. అక్కడకూడా ఆపార్టీ ఏమిచేస్తున్నదో ఎవరికీ తెలియదు. కాంగ్రెసునాయకులను విడుదలచేయవలసినదిగా అనుదినం అదేపనిగా ఆందోళనచేస్తూఉండవలెనని పత్రికా సంపాదకులకు శ్రీనివాసశాస్త్రిగారు విజ్ఞాపించియున్నారు. కాని ఈపత్రికాసంపాదకులు యిప్పుడు కృత్రిమ సుభిక్షదశలోఉన్నారు. వారి సుభిక్షావస్థకు వారు గవర్నమెంటువారికి కృతజ్ఞతాబద్ధులై యున్నారు.

ఇదంతా బాహ్యాపర్యాలోకనం. కాంగ్రెసుమహాసభ సజీవంగానే ఉన్నదనియు, దాని నాడి యింకా కొట్టుకొనుచునే యున్నదనియు ఉన్నమాట ఘంటాపథంగా ప్రపంచానికి సర్ చిమన్లాలు సెతల్వాడుగారు వెల్లడించారు. దేశంలో శాసనసభల ఎన్నికలు జరిపితే ఏపార్టీ గెలుస్తుందో ప్రత్యక్షమౌతుంది అని సెతల్వాడుగారు అన్నారు. ఆమాట నిజం. దివ్యమైన మాట అన్నారు. కాని, యీసవాలు చూస్తే బ్రిటిషువారికి జంకుగానే ఉంటుంది. భారతదేశరక్షణచట్ట నిబంధనపద్ధతి సవ్యంగా లేదని హైకోర్టులు కూడా ధిక్కరించాయి. పోలీసులకు విసువు అనేది లేకపోవచ్చు. కాని మేజస్ట్రీటులకు విసువుపుట్టినది. భారతదేశం పోషించి భరించవలసిన బ్రహ్మాండమైన సైన్యమున్నది. కాని, యీ సైన్యానికి స్వజాతీయ నాయకత్వంగాని, ఆత్మప్రతిష్ఠగాని యింతవరకూ లేవు. ఈయుద్ధసమయంలో ప్రజాజీవితం అంతా శాంతంగా గడచి పోవుట చాలా అపూర్వమైన విషయంగా ఉంది. ఈ ప్రశాంతమంతా మేడిపండువలె బూటకంగా ఉంది. నిజమైన యుద్ధపు తాకుడు తీవ్రంగా తగిలినప్పుడు తిరుగుతూ తిరుగుతూ ఉన్న యీ వ్యవహార చక్రమంతా తల్లక్రిందులు కాకుండా ఉండవలె ననియే మా కోరిక.

ఈలోపుగా దేశపరిపాలనకు సంబంధించిన సమస్యలును, రాజ్యాంగనిర్మాణమును గురించిన సమస్యలును అనుదినము అనేకము ఆవిర్భవించుచున్నవి. రాష్ట్రీయ స్వపరిపాలన మనగా, సంపూర్ణ రాష్ట్రీయ స్వాతంత్ర్యమని సులభంగా భ్రమించవచ్చునని వాదించారు. కాని, ఏరాష్ట్రప్రభుత్వ వర్గములైనను, తమకు తామే స్వతంత్రులమని విర్రవీగే యెడల ఢిల్లీలోని కేంద్ర ప్రభుత్వం వారు నిర్దాక్షిణ్యంగా తమ అధికారాంకుశమును ప్రయోగించి, రాష్ట్రీయ ప్రభుత్వములు స్వతంత్రాధికార పీఠములు కావనియు, తమకు లోబడియుండే తాబేదారులవంటివనియు బుజువుచేయక తప్పదు. ప్రజాశాంతి న్యాయపాలన శాఖల విషయములో కేంద్ర ప్రభుత్వబాధ్యతలనుగూర్చియు, రాష్ట్రీయప్రభుత్వముల బాధ్యతలను గూర్చియు చెప్పబడిన నిబంధనలను, వచనరచనలను ఎటు వీలైతే అటు అన్వయించి, అగమ్యగోచరం చేశారు. కాని కేంద్రప్రభుత్వముయొక్క మాటప్రకారమే జరుగుతున్నదనుట ప్రత్యక్షనిదర్శనంగా కన్పించుచునేయున్నది. మాక్సువెల్లుగారి అధికారమే సర్వవ్యాపకమైపోతోంది.* కాని కేంద్రప్రభుత్వాధికారమూర్తిగా ఆయన అంత హానికరమైన మనిషికాడు. ఏసందర్భములోనైనా అన్యథా వర్తించినట్లు కన్పించినప్పటికీ అది నిజసందర్భములు తెలియని భ్రమప్రమాదం కావచ్చు.

ముస్లింలీగుపార్టీవారే కొన్ని రాష్ట్రములలో అధికారం వహించియున్నారు. ఆవిషయమై జిన్నాగారు ప్రగల్భములు పల్కుచున్నప్పటికీ, ఈముస్లింలీగుమంత్రివర్గములుకూడా ఇండియా ప్రభుత్వముయొక్క ఆటబొమ్మలై యున్నవి. ఈమంత్రివర్గములు అంతర్ధానమైనప్పటికీ వ్యవహారలోపం ఏమీలేదు. మాయమెరుగులు పెట్టిన ఈ బానిసత్వంకంటె శుద్ధనిరంకుశప్రభుత్వమే చాలా మేలు.

మాక్సువెల్లుప్రభుత్వం, * వావెల్లుప్రభుత్వం ఈరీతిగా ఎల్ల కాలం కొనసాగనేరదు. అగ్నిపర్వతముమీద అందమైన పూలతోట పెంచినట్లుగా ఉంది. లక్షలకొలది తుపాకులతో బెదరించినప్పటికీ, కేవలం తుపాకులను చేతబట్టి దేశపరిపాలన ఎవ్వడూ చెయ్యలేడు.

బ్రిటిషువారు సాగించుచున్న బర్మా దండయాత్ర ఏవిధంగా పరిణమించినప్పటికీ బర్మాలోయున్న జపానువారిని చూచి బ్రిటిష్ వారు భయపడకపోవచ్చు. కాని, ప్రక్కనున్న పరిషియారాజ్యంలో స్టాలిను ఉన్నాడనేసంగతిన్నీ, ఇండియాకు స్టాలిను పొరుగు చాలా కంటకమైనదనిన్నీ బ్రిటిషువారు మరువకూడదు. గాంధీమహాత్ముని బ్రిటిషువారు జైలులో నిర్బంధించియుంచవచ్చు.† కాని, నిర్బంధిత భారతజాతీయోత్తేజమునకు ఎన్నటికైనా విమోచనకలుగవలసినదే. నిరాశ, నిస్పృహత్వము దేశములోని విద్యాధికులలో పెక్కుమందిని ఆవరించియున్నది. కాని, దేశములోని విద్యాధికులే స్వదేశస్వాతంత్ర్యమునకు దారిచూపవలసినవారైయున్నారు. అనేక దౌర్భాగ్య దుర్దశదురవస్థల పాలై దెబ్బలుతిని, కష్టపరంపరల ననుభవించిన కొలదీ ప్రజలలో ఉద్రేకము అంతకంతకు ప్రజ్వలిస్తుంది. రాజకీయనాయకులను నిర్బంధించి నోరుమూయవచ్చును. కాని, ఆర్థికదాహముతో

---

* మాక్సువెల్లుగారు ఇప్పు డాపదవిలో లేరు.

† గాంధీమహాత్ము డిప్పుడు కారాగార విముక్తుడైనాడు.

—సంపాదకుడు.

కూడిన ప్రజాశక్తులను అధికారశాసన మేదియు నిరోధింపజాలదు. దేశంలో ధరల హెచ్చు క్రమక్రమంగా మిన్నుముట్టుచున్నది. భాగ్యవంతుడే మరింత ధనవంతుడవుతున్నాడు. పేదవాడే మరింత దరిద్రుడవుతున్నాడు. యుద్ధకాల వ్యాపారంలో అపారలాభములు గడించుచున్నవానికి దేశక్షేమంతో పనిలేదు. దేశాభిమానంతో పనిలేదు. సామ్రాజ్యవాదుల పక్షంలో చేరి వారి క్షేమాభిలాషివలె ప్రవర్తిస్తున్నాడుగాని, యీసామ్రాజ్యాధికారుల కృషిప్రయత్నములనే మరింత నిర్వీర్యమొనర్చి, అసలుకు మోసంవచ్చునట్లుగా పొదుగుకోసి పాలుత్రాగుచున్నాడు. బెంగాలురాష్ట్రములో వెలసిన క్షామపెనుభూతమువల్ల ప్రభుత్వమువారికి నూతన జ్ఞానోదయము కలుగలేదు కాని, వారికి పూర్వముకంటే ఇప్పుడు ధైర్యంగాని, విశ్వాసంగాని, ఉత్సాహంగాని వృద్ధికాలేదు. ఈ దేశముయొక్క భవిష్యత్పరిశ్రమాభివృద్ధి విషయమై చాలా పెద్ద అనుమానములే ప్రబలియున్నవి. యుద్ధానంతర పునర్నిర్మాణ విషయం కొంత చిత్తసంక్షోభకారణంగానే ఉన్నది. ఇదివరకున్న అసంతృప్తిహేతువులకు తోడుగా మరొకటి బయలుదేరింది. ప్రభుత్వమువారి పెట్టుబడి ద్రవ్యంతో ప్రత్యేక వర్తకుల వ్యాపారాభివృద్ధి కొంతజరుగవచ్చు ననుకొనుచున్నారు. దేశంలోని పెద్ద వర్తకశిఖామణులందరూ కలిసి, 15 సం.ల ఆర్థిక పునర్నిర్మాణ ప్రణాళిక నొకదానిని తయారుచేశారు. వారు తయారుచేసిన ప్రణాళిక సర్వసమగ్రంగానే ఉంది. కాని వ్యాపారలాభకాంక్షతో సామ్రాజ్యాధికారం చలాయించే ప్రభువులు స్థిరంగా పాదుకొనియున్నంతకాలము యీ ప్రణాళికలో నిర్వచించిన ఆట వారు సాగనివ్వరు. యుద్ధవిజయానంతరం భారతదేశ పరిశ్రమాభివృద్ధికి అవకాశం లేకుండా అణగద్రొక్కుతారు. ఈ యుద్ధకర్మకాండ ఛాయలలోనే బ్రిటిష్ వ్యాపారసంస్థలున్నూ, అమెరికను కార్యకర్త ప్రముఖులున్నూ కలిసి భారతదేశములో యుద్ధానంతర పరిశ్రమల గూర్చి కార్యక్రమమును నిర్ణయించుచున్నారు. వీరి నిర్ణయములు జవహరులాలుగారి జాతీయ పురోభివృద్ధి కమిటీవారి పద్ధతుల ననుసరించి యుండవు. మున్ముందు భారతదేశంలోని వస్తుసంపదను, అంగబలమును నిర్నిరోధముగా బ్రహ్మాండమైన భారీ ప్రమాణంలో విదేశీయులు పీల్చి పిప్పిచేయుటకు సంకల్పించుకొని యున్నారు. భారతదేశంలోని కార్మికుని భవిష్యద్యోగక్షేమములు ఆలోచించేవారెవ్వరూ లేరు. కష్టించి జీవించేవానికి సవ్యమైన ప్రతిఫలంలేదు. సవ్యమైన ప్రతిఫలం రాబోదు. ఇంగ్లాండులో కార్మికప్రజాజీవితమునకు అనేకభీమానిధులు, అభయహస్తములు కల్పించిన బెవిరిడ్జిగారి సాధనవిధానములు యుద్ధానంతరం యీదేశంలో అవతరించవు. యుద్ధ పర్యవసాన ఫలితాంశము లన్నియు ఇంకెవ్వరినీ బాధించకపోయినా, భారతీయ కార్మికుని బాధిస్తాయి. అప్పుడు భారతదేశ స్వాతంత్ర్యమును సాధించేది యీ కార్మికసంఘములేగాని, దేశంలోని విద్యాధికులు కాదు; దేశంలోని ధనవంతులు కాదు.

భవిష్యద్రాజ్యాంగ నిర్మాణ విధానవిషయమై ఊహాలు పరుగెత్తుతూ ఉంటాయి. ఎంతలేదన్నా, మహాసంగ్రామ మొకటి జరిగి ముగిసిన పిమ్మట, పూర్వమున్న స్థితిలోనే దేశం ఉండజాలదు. చరిత్రగ్రంథాలన్నీ వ్రాసేముందు, భూగోళశాస్త్రగ్రంథాలన్నీ తిరిగి మార్పుచేసి వ్రాయాలి. దేశపటములను తారుమారు చేయాలి. బ్రిటిషుసామ్రాజ్యవాదులే గెల్చినప్పటికీ, భారత జాతీయవాదుల మాట కొనసాగినప్పటికీ, ఎట్లాగైనా పాకిస్తాను అసంభవం. అఖిలప్రపంచ అరబ్బీరాజ్య సమ్మేళనోద్యమము ప్రజ్వరిల్లుచున్న యీసమయంలో పాకిస్తాను నిర్మాణము చాలా ప్రమాదకరమైన విషయం. భారతదేశస్వాతంత్ర్యమునకై పూనుకొనిన ముస్లిములీగు చేయుచున్న కుతంత్రములవల్ల పాకిస్థాను నిర్మాణము మరింత ప్రమాదకరముగా నుండగలదు. రష్యాలో చేరిన వివిధరాష్ట్రభాగములను సర్వస్వతంత్రరాజ్యములనుగా జేసి అట్టి వివిధస్వతంత్రరాజ్యముల సమాఖ్యగా రష్యాకేంద్రప్రభుత్వము వ్యవహరిస్తూ ఉండగలదని రష్యాప్రభుత్వం ప్రకటించింది. కాని, యిదంతా మిథ్య. ఇదంతా ఒకమాయకల్పన. యుద్ధం ముగియగానే, సంధినిర్ణయమహాసభ జరిగినప్పుడు రష్యాలో చేరిన స్వతంత్రరాజ్యాల ప్రతినిధులు చాలామంది ఆసభలో హాజరగుటకు అవకాశ ముండగలదు. రష్యాకు ఆసభలో అధికసంఖ్యాకప్రతినిధివర్గ ముండగలదు. రష్యాకు అందువల్ల పలుకుబడి, ప్రాబల్యం ఏర్పడుతుంది. రష్యాలో అల్పసంఖ్యాకసంఘములప్రజలు చాలామందిఉన్నారు. ఈ అల్పసంఖ్యాకసంఘముల హక్కుస్వాతంత్ర్యములను కాపాడుటకై రష్యాప్రభుత్వం అవలంబించిన రాజ్యాంగవిధానము ఇండియాలో వర్తింపజాలదు. అందుకు కారణ మేమనగా, దేశంలో ఉన్న అల్పసంఖ్యాకసంఘమువారు అధికసంఖ్యాకసంఘమువారితో ఏకముగా అవిభక్తంగా ఉంటూఉండుటకుగాని, విడిపోయి విభక్తముగా ఉండుటకుగాని అల్పసంఖ్యాకసంఘముయొక్క యిష్టానుసారమే జరుగవలెను. ప్రజలే స్వయంనిర్ణయాధికారంగల స్వతంత్రులై ఉండాలి. "ఇండియా వీడిపొండి" అని బ్రిటిషువారితో కాంగ్రెసు అనుచున్నది. "ఇండియాను విభజించి పొండి" అని జిన్నాసాహెబుగారు అంటున్నారు. జిన్నాగారు ఆవిధంగా కోరడం చాలా అవ్యక్తంగానే ఉంది. ఏదేశాన్ని బ్రిటిషువారు విడిచిపోవలెనో, ఆదేశాన్ని విభాగంచేసి పోవలసిన అగత్యం వారి కేముంది? ఈదేశాన్ని వీడిపోయేవారికి విడగొట్టవలసిన అవసరంలేదు. జిన్నాగారు జపించే మంత్రం వారి వ్యర్థప్రలాపనకంటె నిరర్థకంగాఉంది.

ఇతరదేశాలలో ఇటువంటి విభిన్నతత్వములను, విభేదభావములను అంతరింపజేయుటకై విశ్వప్రయత్నములు జరుగుచున్నవని ఆయాదేశ చరిత్రగాథలే చూపించుచున్నవి. ఆస్ట్రేలియా చూడండి.

అమెరికా చూడండి. ఆదేశాలలో ఒక కేంద్రాధికారము క్రింద భిన్న స్వతంత్ర రాష్ట్రముల సమాశ్రయమే అంతకంతకు ప్రస్ఫుటమగుచున్నది. స్వతంత్రరాష్ట్రముల సమాఖ్యావిధానమే గత శతాబ్దములందుకంటె ఇప్పు డెక్కువ గణ్యతగడించి రాజ్యాంగవిధానమునందది యుగధర్మముగా వెలయుచున్నది. పూర్వయుగములో సామంతప్రభుత్వపద్ధతి ఏవిధంగా గణుతి కెక్కెనో నేటికాలమునకీ సమాఖ్యప్రభుత్వపద్ధతియే ప్రఖ్యాతిలోనికి వచ్చుచున్నది. స్మట్సుసేనాని అయిరోపాఖండమును రెండు భాగాలుగా విభజిస్తే తన కోరిక యీడేరుతుంది అన్నాడు. అయిరోపాఖండ పశ్చిమ భాగంలోని రాజ్యములన్నియు బ్రిటిషువారి ఆధ్వర్యముక్రింద ఒక సమాఖ్యగా ఉండవలెననియు, రష్యా (తదనుబంధరాజ్యములతో చేరిన విస్తృత రష్యారాజ్యం) తూర్పు అయిరోపాఖండభాగంగా ఉండవలెననియు స్మట్సుసేనాని కోరెను.

దక్షిణ అమెరికాలోని చిన్న స్వతంత్ర రాజ్యము లన్నియు విదేశాంగ వ్యవహారములలో నైతే నేమి, పరస్పర వ్యాపార ఆర్థిక వ్యవహారములలో నైతేనేమి ఏకకూటంగా చేరక తప్పదు. అట్టి సంకల్పప్రయత్నములను ఆ చిన్న లాటిను రాజ్యములు ఎదిరించి ప్రవర్తింపజాలవు. అక్షరాజ్యాలు ఒకవేళ గెల్చినప్పటికీ, అవికూడా ఏదో ఒక సమాఖ్య పద్ధతిగా సమ్మేళనం కావాలి.

భారతదేశంలో రాజ్యాంగచట్టము ననుసరించి ఏర్పడిన ప్రభుత్వమునే భాషాప్రయుక్తముగా పృథక్కరించవలె ననెడి నూతనప్రయత్న మొకటి కన్పించుచున్నది. భారతదేశంలో బ్రిటిషువారు జయించిన రాజ్యభాగాలు భిన్నరాష్ట్రాలుగా కాలోచితంగా ఏర్పడినవే గాని, క్రమోచితంగా ఏర్పడినవి కావు. అందువల్ల బ్రిటిషువారు యీ దేశంలో సక్రమమైన పద్ధతిగా తిరిగి రాష్ట్రవిభజన ఇప్పుడు చేస్తున్నారు. ఏకజాతిప్రజాకలితమైన రాష్ట్రములకు స్వతంత్ర పరిపాలనాధికారమును కల్పింపవలె ననుచున్నారు. ఒరిస్సా, సింధు, పశ్చిమోత్తరరాష్ట్రాలు నేడు సక్రమముగా ఏర్పడిన రాష్ట్రాలు. ఆంధ్రరాష్ట్రంకూడా ఒకటి త్వరలోనే ఏర్పడాలి.

భాషాప్రయుక్త రాష్ట్ర విభజన పద్ధతి పాకిస్తాను సమస్య వంటిదని యెంచి ఇటీవల కొలదిసంవత్సరములనుండియు లేనిపోని తికమకలపాలైనారు. పాకిస్తాను ఉద్యమం అపసవ్యమైన మతావేశముతో బయలుదేరింది. మత స్వాతంత్ర్యమును అతిగా ఆలాపన చేసింది. అధర్మమైన రాజకీయాధికార దురాశలతో అది పెరిగి పెంపొందినది. కేవలం పరిపాలనా సౌకర్యముకొరకున్నూ, ప్రభుత్వ వ్యయ సదుపాయముకొరకున్నూ ఏర్పడిన విభాగవిధానమే యీ భాషాప్రయుక్తవిభాగమని భ్రమపడ్డారు. ఇది కేవలము సరిహద్దు నిర్ణయవిధానమే యని పొరబడ్డారు. ఈసంకల్పంలో అంతకంటె ఎక్కువ అంతరార్థమే ఉన్నది. భారతవర్ష మనెడి రమ్యహర్మ్యంలో అనేక అంతశ్శాఖలకు చెందిన ప్రజలు స్వస్థానములను, సొంతకాపురములను ఏర్పాటుచేసికొనవలెనని కోరుచున్నారు. ఆంధ్రోద్యమమువంటిదగు ఈఉద్యమము భారతజాతీయైక్యతను సదా కోరుచునేయున్నది. భారతదేశరాష్ట్ర విభాగపటమును సంస్కరించి సరిగా తయారుచేయుటకు బ్రిటిషువారు వెనుకాడుచునే యుందురు. కాని, భారతీయ ప్రజాప్రతినిధి సమావేశము జరిగినప్పుడు ఆవిషయమును విస్మరింపజాలదు.

అయితే, యుద్ధానంతరము జాతీయైకమత్యము ఏరూపంలో అవతరించునని మన దృష్టి కిప్పుడు కన్పించుచున్నది? అప్పుడు బ్రిటిషుసామ్రాజ్యము తప్ప ప్రపంచంలోని మిగిలిన సామ్రాజ్యము లన్నియు అస్తమించగలవు. అటువంటి ఫలితపర్యవసానమే వారికి గొప్పలాభంగా ఎంచవచ్చును. హాలండుదేశపు డచ్చి సామ్రాజ్యమును గాని, ఫ్రెంచిసామ్రాజ్యమునుగాని పునరుద్ధరించి కాపాడుటకై బ్రిటిషువారు పూర్వమువలె పూనుకొనరు. బ్రిటిషుసామ్రాజ్యము విజయపరంపరలను సాధించినప్పటికీ, అపజయము అనుభవించకుండా గట్టెక్కినప్పటికీ, భద్రంగా నిర్భయంగా ఉండుటకు వీలులేదు. మనకు తెలిసినంతలో, యీప్రపంచమందు అమెరికారాజ్య మొక కొత్త సామ్రాట్ప్రభుత్వంగా పరిణమిస్తుంది. పాతపద్ధతిగా రాజ్యభాగములు కావలెనని అమెరికా కోరదు. గాని, నర్తకవిజృంభణకై రేవుసుంకముల సౌకర్యములు కావలెనని కోరుతుంది. అప్పులిచ్చి, పెట్టుబడి పెట్టి ఆయాదేశాలలోని వస్తుసంపదను, అంగబలమును సర్వాధికారంతో వినియోగించుకొని అనుభవిస్తుంది. కాబట్టి ఇకముందుకూడా "బలంగలవానిదే రాజ్యం" అనే రాజకీయధర్మం అమలులో ఉంటుంది. దాని ముందు అంతర్జాతీయ నీతినియమములు కూడా నిలువనేరవు. భిన్నరాజ్యకూటములవల్ల ఏర్పడే పార్టీబలాబలముల హెచ్చుతగ్గులమూలమున యుద్ధములు వెనుకటివలెనే వాయిదా గడువుతప్పకుండా పునఃపునః సంభవింపగలవు. అప్పుడు జాతీయాభిమానాలు తిరిగి ఒక దుర్దశ అనుభవిస్తాయి. అక్షరాజ్యాలు గెలిస్తే, జాతీయభావ మనేది నిర్మూలమవుతుంది. కాని ఆవిషయం మన కిప్పు డక్కరలేదు.

బహుశః మన మనోకల్పనకొంచెం మితిమీరుతూఉన్న దేమో! లేదా కొంచెం పెడతోవపట్టుచున్న దేమో! ఈ యుద్ధానంతరం సోవియటు రష్యా పెద్దపలుకుబడిగల రాజ్యంగా అగ్రస్థానం వహించుననుకుందాం. ఇంగ్లాండు దేశంతప్ప అయిరోపాఖండం యావత్తూ రష్యాకు తోకగా పెరటి పొలంగా ఉంటుంది. అప్పుడు హిట్లరు పరిపాలితమైన జర్మనీ యంతేయును కమ్యూనిస్టు రాజ్యము కాకతప్పదు. పశ్చిమఅయిరోపాఖండంలోని ఉత్తరప్రాంతరాజ్యము లన్నింటికి ప్రచండమారుతమువలె యీయుద్ధము దాపురించి ఆరాజ్యాల స్వాతంత్ర్యమును ఉత్తరసముద్రములోనికి ఎగరగొట్టకపూర్వం ఇదివరకే యివి పాకంముదిరిన సోషలిస్టురాజ్యాలుగా ఉన్నాయి.

అయిరోపాఖండమంతా బోల్షెవిజం వ్యాపిస్తే యీబోల్షెవిజం లక్షణాలు మెల్లమెల్లగా ఇంగ్లాండులోనికి వ్యాపించకుండా ఆంగ్లదేశం నిరోధింపజాలదు. ఏమైనప్పటికీ, ఇటీవల 'హిబర్టు జర్నలు' అనే పత్రికలో ప్రొఫెసరు కార్ వ్రాసినట్లుగా, ఈయుద్ధప్రభావంవల్ల ధనికప్రభుత్వపద్ధతులలో కొన్నిమార్పులు కలుగకతప్పదు. ఈ మార్పులు కలిగినప్పుడు గత 19-వ శతాబ్దము నుండియు అమలులో నున్న "సౌమ్య ప్రజాస్వామ్య" సిద్ధాంతమున్నూ, జాతీయ స్వయం నిర్ణయసిద్ధాంతమున్నూ, యథేచ్ఛావ్యాపార స్వాతంత్ర్యసిద్ధాంతమున్నూ ఇక సాగవు. అవి పోయి సమూలమైన మార్పులు రాగలవు. సౌమ్య ప్రజాస్వామ్య సూత్రమనగా, రాజకీయ వ్యవహారాలలో ఏదోరూపంగా ప్రజాప్రాతినిధ్య ప్రభుత్వం సాగించడమే. కాని, సాంఘిక సమత్వం, అందరికీ సమానావకాశమొసంగెడి సమధర్మవర్తనము, ఆర్థికంగా సమాన స్వాతంత్ర్యం ఇటువంటివి లేనేలేవు. ప్రజల స్వయంనిర్ణయమే ప్రమాణముగా వర్తింపవలెననెడి జాతీయ స్వయంనిర్ణయ సిద్ధాంతము నిరర్థకమైపోయినది. స్వలాభదురాశలతో స్వజాతీయ ప్రాబల్యాధిక్యమును కోరుతూ ఉండడమే స్వయంనిర్ణయస్వాతంత్ర్య పదమునకు అర్థముగా మారింది. యథేచ్ఛావ్యాపార స్వాతంత్ర్య మనెడి సిద్ధాంతమునకు అమలులో నున్న అర్థమేమిటంటే, ధనికులైన పూంజీదార్లు సందర్భావకాశంగా వివిధరాజ్యాలలోని ప్రజాద్రవ్యమును హరించి ప్రపంచాన్ని మహాసంక్షోభములోనికి దింపడం తప్ప మరేమీలేదు. అందువల్ల ప్రజాసామాన్యములో నుండి విప్లవములు చెలరేగుటయున్నూ, ధనికవర్గముల సంస్థలు ధ్వంసమగుచుండుటయున్నూ అనివార్యములగుచున్నవి. ఏవిధంగా మనము ఆలోచించిచూచినప్పటికీ, ధనికవర్గ ప్రజాస్వామ్యరాజ్యములైన అమెరికా ఇంగ్లండులు యీయుద్ధంలో సాధించి గెలిచిన స్వలాభములను నేడు వెంటనే కాకపోయినా, కొంతకాలానికైనా, రానున్న ఆర్థిక రాజకీయ సంఘట్టనములో గోల్పోక తప్పదు. ఇప్పుడు గెల్చిగడించినదానినే అప్పుడు ఓడి పోగొట్టుకుంటారు. ఈయుద్ధంలో రష్యా విజయభేరీ మ్రోగించినదంటే, సామ్యవాదం (సోషలిజం) తన విజయపతాకమును ప్రతిష్ఠించినట్లే! చైనా విజయం పొందినట్లయితే ఆసియా ఖండ రాజ్యాలలో దాని ప్రభ అఖండంగా వెలుగుతుంది. ఈ రెండు ఫలితాంశములును ఈ యుద్ధానంతరం లభిస్తే యీయుద్ధం వ్యర్థం కాదు. అటువంటి పరిస్థితులలో ఆ రాజ్యాల ఆధ్వర్యమున నూతనజాతీయభావోత్తేజము ఉద్భవిస్తుంది. భారతదేశంలోవలెనే భిన్నజాతుల సమాఖ్య పద్ధతిగా, వివిధ ఉపజాతుల సమాఖ్య పద్ధతిగా కళకళలాడుతూ శోభస్కరంగా ప్రపంచంలో వ్యాపిస్తుంది.

భారతదేశంలోని జాతీయైకమత్యమునుగూర్చి నిరాశచెందెడి వారిని హెచ్చరించవలసియున్నది. యుద్ధమొకటి ఇంకా జరుగుచున్నదని వారు మరచిపోరాదు. అది యింకా కొన్నియేండ్లు జరుగుచుండవచ్చును. యుద్ధము వచ్చి ఒక్క పెట్టున సామ్రాజ్యములను, సామ్రాజ్యకాంక్షులను ధ్వంసంచేయవచ్చును. ఒక్క తప్పటడుగు, ఒక్క వక్రచలనం ఉంటే చాలు-రథం బుడింగెఅవుతుంది. భారతదేశంలో జరుగవలసిన యుద్ధసహాయకృషి ఇప్పుడు జరుగుచున్న ప్రమాణంలోనే ఇంకా జరుగుతూ ఉండవలెనంటే బ్రిటిషువారు చాలా శ్రమపడాలి. రాజకీయాందోళనవల్ల దేశంలో కలిగెడి ఒత్తిడి లేకుండా చేసినప్పటికీ, అందుకు ప్రధానపురుషులైనవారిని లొంగదీసినప్పటికీ, ఈ ఒత్తిడి నానాటికి పైకికన్పించకుండానే దేశంలో వృద్ధియగుచున్నది. భారతీయ రాజ్యాంగప్రపంచములో పరిపాలనా చక్రము స్తంభించి ప్రతిష్టంభన మేర్పడినదని అంగీకరించినట్లయితే, ఆసియా ఖండ ఆగ్నేయభాగ యుద్ధరంగములోకూడా యుద్ధము స్తంభించియే యున్నది. ఆయుద్ధరంగము రంగూను, సింగపూరు, బాంకాకునగరముల పునరాక్రమణకు సింహద్వారమువంటిది. ఆయుద్ధరంగమునకు కీలకము అచటి సర్వసేనానియైన లూయీమౌంటుబాటెను ప్రభువు చేతిలోలేదు. భారతీయుల చేతులలో ఉంది. భారతీయుల బుద్ధిసామర్థ్యంలో ఉంది. ఒక్క భారతీయాంతరాత్మలో ఉంది. గాంధీ తన అవతారలీలలు చాలించినా, గాంధీతత్త్వం అంతరించదు. అది అస్తమించదు.

(ఫిబ్రవరి, 44).





# డోంగ్రేగారి బాలామృతము

బలహీనమైన బిడ్డలకు పుష్టియున్ను, బలమున్ను
ఆరోగ్యము నిచ్చును. **It Helps Children in Teething.**

## AN OPPORTUNITY !

BY OUR 1944 **PRABHAKAR WINDER,**
Battery Chargers, Convertors,
Spray Plants, Engine Dynamo Sets,
Transformers, Resistances, etc.
We untertake Electrical Winding. Wiring,
Repairing, Turning and Fitting Jobs.
*Commutator building is our specialty.*




An inquiry is solicited :—
**Eastern Auto Electric Co.,**
470, Sandhurst Road, Tram Terminus,
**BOMBAY, 4**

**THINK OF YOUR POST-WAR CAREERS FROM NOW !**

THERE WILL BE

## A GREAT DEMAND

FOR

**Skilful Radio Technicians.**

Hence EQUIP yourself from to-day.

**Short Period Courses :: Moderate Fees**

Apply immediately for enrolment to—
THE PRINCIPAL.
**RADIO PRACTICAL TRAINING INSTITUTE,**
MOHAN BUILDING,
Girgaon, BOMBAY.

మీరు దీన్ని చదవాలి! ముఖ్యమైన ప్రకటన!

# ఇది లక్షలాదిప్రజలకు సహాయపడుతుంది

పాఠకులారా!

నేను డాక్టరునుకాను. ఆయుర్వేదవైద్యుణ్ణికాను. సామాన్య మనిషిని. దురదృష్టవశాత్తు స్వయంకృతాపరాధాలకు బలినైనాను. అమితమైన నా చెడుచేష్టలవల్ల, నాకు యింద్రియస్ఖలనము, నరముల బలహీనత యేర్పడ్డాయి. నానాటికి కృశించిపోయాను. గుండెదడ హెచ్చయింది ఎప్పుడూ తలనెప్పిగా వుండేది. ఇంతెందుకు. మరణం తటస్థించింది. నా విచారానికి కారణ మేమిటని స్నేహితులు అడిగేవారుకాని చెప్పటానికి నోరురాలేదు. రహస్యంగా అనేకవేలమంది డాక్టర్లు, హకీములు వారి చికిత్సలనుగురించి గొప్పగా చెప్పుకునే వైద్యులందరిని చూచాను. నేను వాళ్లమందులను సేవించాను. ఏమిలాభం లేకపోయింది. ఉద్యోగరీత్యా నా అదృష్టం మంచిదై పెషావరుకుపోవడం తటస్థించింది. అచట ఒక మహాత్ముడు (సన్యాసి) యెదురుపడ్డాడు. నా దీనస్థితికి కారణం అడిగాడు. ఏమి దాచకుండ వున్నదివున్నట్లు చెప్పాను. చివరకు ఆత్మహత్య చేసుకుందామన్న ఆలోచనకూడ ఆయనకు తెలియపరిచాను. ఆమహాత్మునికి నామీద కనికరం కలిగి రెండుప్రక్రియలు చెప్పాడు. ఒకటి లోపలికి పుచ్చుకోటానికి రెండవది పైపూతకు ఆయన సలహాప్రకారం కావలసిన మూలికలు, మందులు అన్ని సంపాదించి ఆయనయెదుటనే మందులను తయారుచేశాను. ఇక సేవించడం మొదలుపెట్టాను. అయ్యలారా! దేవునిమీద ప్రమాణం చేసి చెపుతున్నాను. 7-వ రోజున పునర్యౌవనలక్షణాలు నాలో కనిపించడం మొదలుపెట్టినవి. ఇంక కొన్ని మోతాదులు సేవించిన తరువాత నా నిగ్రహశక్తి తగ్గిపోయినప్పటికీ, సన్యాసి చెప్పిన మోస్తరుగా 21 రోజులు పూర్తిగా మందు సేవింపక తప్పిందికాదు. రోజు 4 శేర్ల పాలను సునాయాసంగా హరాయించుకోగలను. నాకళ్లలో నూతనజ్యోతి ఆవిర్భవించింది. చెక్కిళ్లు గులాభిరంగులోనికి దిగినవి. పోయిన ధాతుపుష్టి జీవనశక్తి తిరిగి శరీరంలో ఆవిర్భవించినవి. నాయింటికి వచ్చింతరువాత యీమందును యింకా కొంతమందికి వాడి చూచాను. అద్భుతంగా పనిచేసింది. నాస్నేహితుల సలహామీదను, నామోస్తరుగా అవస్థపడ్డ ప్రజలకు వుపకారంగా వుంటుందనే వుద్దేశంతోను దీనిని ప్రకటిస్తున్నాను, ఎంతో డబ్బు ఖర్చుపెట్టుకోని, యేమాత్రం ఫలితంపొందనివాళ్లు దీన్ని వాడితే తప్పక బాగుపడతారు. దీనికి ఖర్చుగూడ విశేషంకాదు. దీనిఖరీదు మందుదినుసులకు, ప్రకటనఖర్చులకు సరిపోతుంది.

విదేశాలవారు డబ్బు ముందుగాపంపాలి.

**పునర్యౌవనమాత్రలు 21 రోజులకు రు. 4-0-0**

**పైపూతకు తైలము 21 రోజులకు రు. 4-8-0**

**కేవలం జన్మవల్ల కలిగిందిగాక, మధ్యవచ్చిన సమస్తమైన నరాల బలహీనతకు యీమందు పనిచేస్తుంది.**

ఈమందులో కష్ట యేమాత్రం లేదు. కాబట్టి యేఋతువులోనైనా పిన్నలుఅందరూ వాడవచ్చు.

(నూనె చర్మముమీద పొక్కదు)

## ప్రశంసాపత్రాలు

పాఠకులకు మావద్దనున్న వేలకొలది ప్రశంసాపత్రాలలో కొన్ని యిచట చూపబడినవి.

(1) డా॥ క్సేవియర్ కురుపాసరి కెంథలంగి:—"ఈమందు నా రోగులకు బాగాపనిచేసింది. పుంస్త్వహీనతకు, అకాలవృద్ధాప్యానికి, బలహీనతకు యెంత వయస్సుగల వారికిగూడ తప్పక గుణమిస్తుంది." 10-8-43.

(2) డా॥ బి. సాంబమూర్తి, ఎల్. ఎం. పి. (రిజిస్టర్డు) బెజవాడ 14-5-43:—ఇంద్రియస్ఖలనము మొదలైన వ్యాధులు గలవారికి యీమందు వాడాను. దివ్యంగా గుణంయిచ్చింది.

(2) డా॥ ఎ. షణ్ముగంపిళ్లై నజరెత్ 4-7-43:—"ఈమందులు అమోఘంగా పనిచేసినవి."

(4) హకీం, వైద్, పండిట్ ఏ. డి. శర్మ, బిలాట్ షరీఫ్:- యౌవనోద్రేకంవల్ల ఆరోగ్యం చెడగొట్టుకొన్నవారికి కిది వరప్రసాదం. దీనితో సమానమైనది ప్రపంచంలో లేదు. దాన్ని యేఋతువులోనైనా వాడవచ్చును.

(5) మేనేజరు, మైమాగజిన్, మద్రాసు:— బాటాలలో దరూల్షాఫా గోలియన్ ఆఫీసు చూచాను. మానవశ్రేయస్సుకోసం యీసంస్థ చేస్తున్నపనికి చాల సంతోషించాను. వెయ్యికి పైగా వున్న ప్రశంసాపత్రాలను నేను చూచాను.

## సమస్తమైన సుఖవ్యాధులకు వజ్రాయుధము

గ్యారంటీచికిత్స:—ఈమందుపని చేయకపోతే, ఆవిధంగా ప్రమాణంమీద తెలిపినవారికి ఖరీదు పూర్తిగా వాపసు చేస్తాం. అనేక వేలమంది డాక్టర్లచే యిది సిఫారసు చేయబడింది.

ముఖ్యమైననోటీసు:—నరాలబలహీనత గలవారికి మాత్రమే యీమందు పనిచేస్తుంది. గనేరియా మొదలైన సుఖసంకట వ్యాధులకు మంచి గుణమిస్తుంది. అది శుద్ధమైన ఉష్ణరక్తాన్ని పట్టిస్తుంది.

జాబులు యింగ్లీషులో వ్రాయుడు.

**The Manager,**

**DAR-UL-SHAFA-GOLIAN (Regd.) (A. P. K.)**

**P. O. BATALA, PUNJAB.**



# తిక్కన

[ నాటిక ]

**ఇందు వచ్చుపాత్రలు**

మనుమసిద్ధి—రాజు
తిక్కన—మంత్రి
చిన్నకొమ్మన్న—తిక్కనకొడుకు (14 ఏండ్లబాలుడు)
మారన్న—దళపతి
అన్నమాంబ—తిక్కనతల్లి
సీతమ్మ—తిక్కనభార్య
ప్రోలమ్మ—ఖడ్గ తిక్కనతల్లి. అన్నమాంబ తోడికోడలు



నేను రచించుచున్న 'తిక్కన'అను నవలలోని రెండవ భాగమున రెండవ అధ్యాయమునకు ఇది రూపాంతరము. కొద్ది మార్పుతో ఒక రంగము నాటకముగా వ్రాయబడినది. అద్దంకి ప్రభువయిన మహారాష్ట్రి సారంగుడికిన్ని, నెల్లూరిప్రభువయిన మనుమసిద్ధికిన్ని సంపూర్ణవిజయము కలిగినదిగాని తిక్కన తండ్రియున్ను, సర్వసేనాధ్యక్షుడును, గుంటూరి దండనాథుడును అయిన కొమ్మన్న యుద్ధములో చనిపోయినాడు. ఈ సమాచారము దళపతులలో నొకడును, కొమ్మన శిష్యుడును, భావిజీవితములో మార్కండేయ పురాణకర్తయును అయిన మారన్న కొమ్మన్నభార్య అయిన అన్నమాంబకు తెలుపుటకై పంపబడ్డాడు. ఆ సందర్భమునే ఈనాటిక వివరించుచున్నది.

శ్రీ వున్నవ లక్ష్మీనారాయణ

[ప్రాతసంటూరులో కొమ్మనదండనాథుని గృహము. చిన కొమ్మన్న, మారన్నల ప్రవేశము.]

చినకొమ్మన్న— ఏమి మారన్నా, అప్పుడే వచ్చావు? యుద్ధానికి పోలా ?

మారన్న—(వంచిన తల ఎత్తకుండా) పోయే వచ్చారా.

కొమ్మన—మఱి యుద్ధం చేశావా ?

మారన్న—(తల ఎత్తి) చేశాను.

కొమ్మన—ఎవరినైనా పొడిచావా ? నీవు పొడవకపోతే మానె, నిన్నెవరైనా పొడిచారా ? (బాగా పరికించి) ఏదీ, ఎక్కడా కత్తిగీచుకొనిపోయినట్లుగానైనా లేదే ?

మారన్న—(కొమ్మనను బుజముమీద తట్టుతూ) తీవ్రయుద్ధమే జరిగింది లేరా.

కొమ్మన—(ఎగతాళిగా) యుద్ధం జరిగివుంటుంది లే. నీవుకూడా కాస్త (తన బుజము చూపి) బుజమేశావా ?

మారన్న—(కొద్ది విసుగుతో) పోట్లాడాములే, ఉండరా. (ఖిన్నముఖము పెట్టును)

కొమ్మన—ఏం, మొగ మట్లా వుంది ? మొదట బర్రట్లాడుతూపోతివి - పారిపోయివచ్చావా ? (సాటోపంగా ఎగాదిగా చూస్తాడు) సేనాపతిగారు మిమ్ముల్నం దరినీ కవ్వించి పురికొల్పంగనే, ఉస్కో అంటే ఉస్కో అని వెనక్కి పిక్కబలం జూపావా ? భేరీ మోగంగనే భయపడివచ్చిన రకంలాగ కనపడుతుందే! యుద్ధంలో నుంచి పారిపోయివచ్చినవాండ్లకు ఎఱ్ఱచెరువుగట్టున మఱ్ఱిచెట్టుక్రింద మెడకు ఉచ్చు తగిలిస్తారు. జాగ్రత్త!

మారన్న—ఒరే కొమ్మన్నా! నీవాగుడు కాస్త కట్టిపెట్టు. మామ్మగా రెక్కడున్నారు ?

కొమ్మన—(ఔత్సుక్యముతో) ఏవీ, యుద్ధపు సంగతులు చెప్పు.

మారన్న—చెపుతాలే, మామ్మగా రెక్కడున్నారు ?

కొమ్మన—నాయనమ్మ వస్తే చెపుతావా ? గౌరీపూజ చేసుకుంటున్నారు. ఇవాళ ఉపవాసం. అదుగో వస్తున్నారు. (ఎదురునడుస్తూ) నాయనమ్మా ! మారన్న యుద్ధానికి పోయివచ్చాడు. వార్తలు చెపుతాట్ట. దబ్బున రా.

మారన్న—అమ్మా ! నమస్కారము.

అన్నమాంబ—ఎప్పుడు వచ్చావు మారన్నా ?

మారన్న—ఇప్పుడే వస్తున్నాను తల్లీ !

అన్నమాంబ—ఎక్కడనుంచి ?

మారన్న—ఒంగోలునుంచి ! రణరంగంనుంచి తల్లీ.

అన్నమ్మ—యుద్ధానికి తారసిల్లారా రెండు పక్షాలూ ?

మారన్న—యుద్ధం పూర్తిఅయి మనకు సంపూర్ణవిజయం కలిగింది తల్లీ.

అన్నమ్మ—విక్రమసింహపుర సేనలు వచ్చి కలుసుకున్నవా ?

మారన్న—అవి రాకముందే మన ఒక్క గుంటూరు సేనే కదిసింది. మన ఆశ్వికదళం వీరవిహారం చేసి—

అన్నమ్మ—(సంతోషంతో మెడ పొడిగించి) ఒక్క మీ తాతయ్యగారి సేనకే యావత్తు విజయమూ చెందుతుం దన్నమాట. ఈసారి మఱీ యుద్ధానికి పోవడమంటే స్వర్గానికి పోతున్నంత ఉత్సాహపడ్డారు.

మారన్న—(చకితుడై) అదేమి తల్లీ అట్లా అంటిరి ?

అన్నమ్మ — (పూర్వభావఉద్ఘాట్యకంఠముతో) అశ్లీలం ధ్వనించిందా ? పర్వాలేదులే. (ఇష్టాగోష్ఠి ధ్వనితో) అంతా బాగున్నారా ?

మారన్న—(తల వంచి) అంతా ఎట్లా బాగుంటారు తల్లీ !

అన్నమ్మ—అవును. యుద్ధంగదా ! పాపం ! పదాతులే ఎక్కువ పోతారు. సేనాపతులు వెనుక దూరంగా వుంటారుగనుక వారికి అపాయం తక్కువ.

మారన్న — (భావగర్భితంగా) వాండ్లుకూడ కొందరు పోతారు తల్లీ!

అన్నమ్మ—(ఆకాంక్షస్ఫూర్తితో) కేతన కులాసాగా ఉన్నాడా?

మారన్న—ఉన్నాడు తల్లీ! సైన్యంతో వస్తాడు.

అన్నమ్మ—దళపతులుకూడా దెబ్బ తింటారు. జనంలో ఉంటారుగనుక. సేనాపతులు ఎవరు పోయినారు? అల్లాడమంత్రి కులాసాగా వున్నాడా? తాతగారికి క్షేమమా?

మారన్న— అల్లాడి కులాసాగానే వున్నాడు తల్లీ!

అన్నమ్మ—(ఆతురతతో) మఱి తాతగారు?

మారన్న—తాతగారా తల్లీ!

అన్నమ్మ—(ఆవేగంతో) అవును. తాతగారు. ఏమిటి సందేహము?

మారన్న—(కళ్ల నీరు కారుస్తూ, తల వంచి) లేరు తల్లీ!

అన్నమ్మ—లేనేలేరా?

మారన్న—లేరు తల్లీ, లేరు. యశఃకాయం మాత్రం వుంది.

అన్నమ్మ—(కంట తడి ఆపుకుంటూ) ఏం జరిగిందేమిటి?

మారన్న—(వీరోత్సాహంతో) తన అయిదు వందల ఆశ్వికదళంతో పదివేల శత్రుసైన్యంపై బడి అతి భయంకరంగా ఒకజాము వీరవిహారం చేసి కటిుకుటమ్ములతో పెక్కుమంది దళపతుల ప్రాణవాయువులు హరించి చివరకు సారంగుని వెన్నంటి అర్ధచంద్రబాణ ప్రయోగం చేసి సారంగుని దక్షిణబాహువును సకవచంగా ఛేదించి కొమ్మనభానుడు అస్తమించాడు తల్లీ! (అని తల వంచుకొనును)

అన్నమ్మ—(ఉత్సాహం అణచుకొని) నా నాథుని వీరకథాకథనముతో నా చెవులకు విందు చేశావోయి మారన్నా! నా నాథుని వైదికఇజ్యామంత్రరవమును, ధనుర్జ్యాసమారవమును నా చెవుల మ్రోగుతున్నవోయి. నా నాథుడు యుద్ధానికి బయలుదేరే ముందు నామీది అపారప్రేమచే నాకు బహూకరించిన దివ్యధీరరూపప్రదర్శనమును మరిచిపోలేనోయి. నా మనఃఫలకంపై చిత్రించుకున్నాను. అనంతకాలమూ ఆ రూపాన్ని అట్లే పట్టిఉంచుకుంటాను మారన్నా!

కొమ్మన — (ఆశ్చర్యంగా వింటూ) అయితే, తాతయ్యగారు యుద్ధంలో చనిపోయినారా బామ్మా?

అన్నమ్మ—అవును, పోయినారోయి.

కొమ్మన — మనము ఏడవకూడదుగాదూ బామ్మా?

అన్నమ్మ—కూడదు బాబూ!

కొమ్మన—(మొగముమీద దృష్టినిలిపి) నువ్వు కూడా ఏడువబోకు బామ్మా! తాతయ్యకు వీరస్వర్గము రాదు మనము యేడుస్తే.

అన్నమ్మ—(దుఃఖము బిగబట్టుకొని) ఏడువను లే బాబూ! (మారన్నతో) మారన్నా! నన్ను నెమ్మదిగా గౌరీమందిరంలోకి తీసుకొనిపో. బాబును అటూ ఇటూ తీసుకొనిపోయి వాడివాండ్లు వచ్చేవరకు సముదాయించి కనిపెట్టివుండు.

మారన్న—తల్లీ! ఇటు ఇటు.

అన్నమ్మ—(కాళ్లు తడబడుతూ కొద్దిదూరం అతను దారి చూపిస్తూంటే నడుస్తుంది.)

మారన్న—ఇదిగో గౌరీమందిరం.

అన్నమ్మ—నేను ఇక్కడ కూర్చుంటాను. ఇక నన్ను పలకరించవద్దు. తలుపు దగ్గరదోసి పో.

మారన్న—అట్లాగే తల్లీ! (తలుపు వేసి) ఒరే బాబూ, కొమ్మన్నా, రా. (చెయ్యి పట్టుకొని కొంత దూరం నడిపించును.)

కొమ్మన—ఇక్కడ కూర్చుందాం. నాకు యుద్ధపు సంగతులన్నీ చెప్పు.

(ఇద్దరూ కూర్చుంటారు)

మారన్న—చెప్పనా? భయపడవుగదా?

కొమ్మన—నాకా భయము? సంగతు లన్నీ చెప్పాలె. తాతయ్య ఏం చేశాడేమిటి, వెళ్లగానే?

మారన్న—తాతయ్య ఆశ్వికదళాన్ని రెండుగా చేశాడురా ముందు. మధ్యలో తాను రంగరాట్టుమీద నిలవబడ్డాడు చేతులో ధనుస్సు సంధించి.

కొమ్మన—సారంగుడో మఱి?

మారన్న—అతనూ సైన్యాన్ని రెండుభాగాలు చేశాడు. మధ్యలో తానూ ఇంద్రనీలంమీద నిలువబడ్డాడు.

కొమ్మన—తరువాత ?

మారన్న—తరువాత తాతయ్య కుడివైపుబలాన్ని కదిపాడు.

కొమ్మన—ఇద్దరూ ఎదురుమళ్ల నిలిపారుగదా బలాల్ని, సారంగుడు తన కుడివైపుబలాన్ని కదపలా ?

మారన్న—(మెచ్చుకుంటూ) నీకు యుద్ధం ఎట్లా నడుస్తుందో తెలుసురా ?

కొమ్మన—నే జెప్పింది సరేనా ?

మారన్న—సరే.

కొమ్మన—నన్ను సైన్యంలో చేర్చుకోమంటే మొన్న తాతయ్య 'నువ్వు చిన్నవాడి' వన్నాడు. లేకపోతే నేనుకూడా రణరంగానికి రాకపోయినానా ? ఆఁ- తరువాత ఏమి జరిగింది ?

మారన్న — తాతయ్య ఎడమవైపుబలాన్ని కొద్దిగా ముందుకు నడిపాడు. సారంగుడి బలం రెండడుగులు వెనుకకు వేసింది.

కొమ్మన—మన కుడివైపుబలం ఏం జేసింది ?

మారన్న—అకస్మాత్తుగా ఒక్కపెట్టున శత్రుసైన్యంమీద పడ్డది. సారంగుడి ఎడమబలమూ, మన బలమూ కదిశాయి.

కొమ్మన—అప్పుడే సరైన యుద్ధం మొదలన్నమాట. ఆఁ.

మారన్న— తాతయ్య అల్లైతాడు ఖంగున మోగించాడు.

కొమ్మన—సారంగు డేమి చేస్తున్నాడు ? బాణప్రయోగం చెయ్యలేదా ?

మారన్న—చేశాడు. దాన్ని తాతయ్య మధ్యలోనే తుంచేశాడు.

కొమ్మన—బలే! అన్నీ మధ్యలో విరుగగొట్టాడుగా?

మారన్న—ఆఁ. కొట్టేశాడు. సారంగుడుమాత్రం పూరుకున్నాడా?...బాబూ! అదుగోరా, బళ్లమీద మీ అమ్మగారూ, దొడ్డబామ్మగారూ వచ్చిన ట్లున్నారు.పో, తీసుకురా.

[ప్రవేశము: సీతమ్మ, ప్రోలమ్మ]

కొమ్మన— (పరుగెత్తుకుంటూ పోయి సీతమ్మ ప్రక్కన నిలువబడి వాండ్లను నడిపించుకొనివస్తాడు.)

సీతమ్మ— (పరికించి) దివాణమంతా చిన్నబోయివుంది.

ప్రోలమ్మ—అంత పరివారంగదా! అదుగో మిగిలాడు - కోనగావలి-దివాణంవూడ్చే ముసలిబయ్యన్న. కాస్త పనికివచ్చేవాండ్లంతా యుద్ధానికి పోయినారు. (కంటికి చేయి అడ్డం పెట్టుకొని చూచి) అదుగో మారన్న. నీవు పోలే యుద్ధానికి?

మారన్న—పోయివచ్చాను తల్లీ!

ప్రోలమ్మ—అట్లాగా? అమ్మా యెక్కడ?

మారన్న—గౌరీమందిరంలో వున్నారు.

ప్రోలమ్మ—పద.

సీతమ్మ— అత్తయ్యా మొగం ఎట్లా చూడడం అత్తయ్యా!

ప్రోలమ్మ—ఏమి చేస్తామే తల్లీ! మనచేతనయినపనా? అన్నా, అన్నా!

సీతమ్మ—(దగ్గరకు బోయి మొగముమీద చెయిబట్టి నిమురుతూ) అత్తయ్యా! ఇదేమిటి? మొగమంతా బిగుసుకపోయింది!

ప్రోలమ్మ—(ఒళ్లు పట్టిచూచి) ఒళ్లంతా అట్లాగే వుంది. మరణవార్త అకస్మాత్తుగా వినబట్టి నరాలన్నీ బిగబట్టివుంటవి. మెల్లిగా వేళ్లతో ఒంటిమీద రాయండి. (కాసినినీళ్లు మొగముమీద చిలకరించి) నల్లీ, అన్నా!

కళ్లు తెరచి చూడు. నేను అక్కయ్యను. సీత చూడు, ఎట్లా దుఃఖపడుతున్నదో!

అన్నమ్మ—(కళ్లెత్తిచూచి, నెమ్మదిగా లేచి కూర్చున్నది. దుఃఖము ఆపుకోలేక వెక్కుతూ 'అక్కయ్యా' అని కావలించుకున్నది.)

కొమ్మన—బామ్మా! ఏడువకూడదు. ఏడుస్తే తాతయ్యకు కష్టమవుతుంది.

ప్రోలమ్మ—(వీపు నిమురుతూ) ఎంత అణుచుకుందామన్నా ఆగదే తల్లీ! తలగాలిందే దుఃఖము, కడుపుకాలిందే దుఃఖమని ఆపితే ఆగేది కాదే తల్లీ!

సీతమ్మ—కళ్లెత్తి చూడు అత్తయ్యా. ఏదైనా మాట్లాడు నాతో. నాకు భయంగా వుంది అత్తయ్యా!

అన్నమ్మ—(కొద్దిగా తల యెత్తి, కండ్లు తెరచి) ఏముంది మాట్లాడడానికి? అంతా అయిపోయింది. పెద్దవాడు వచ్చాడా?

సీతమ్మ—రాలేదింకా. ఇప్పుడో, ఇంకాసేపటికో వస్తా రనుకుంటున్నాము.

అన్నమ్మ—రాంగానే చెప్పు అక్కయ్యా., మన కీరాత తప్పిందికాదుగదా!

ప్రోలమ్మ—తప్పదే తల్లీ! తప్పించుకోవడం మన వశమా అమ్మా! ఇంత పసుపుకుంకుమాతో వెళ్లిపోయే వ్రాత మనకు వ్రాయలేదు. అదే పుణ్యవతులకో?

సీతమ్మ—అరుగో మీపెద్దబ్బాయి వస్తున్నారు అత్తయ్యా!

అన్నమ్మ—వచ్చాడా నాతండ్రి?

సీతమ్మ—ఆఁ, వచ్చారు. ముంగిట వున్నారు.

కొమ్మన—(గంతు వేసి ముందుగా పోయినాడు)

[ప్రవేశము: మనుమసిద్ధి, తిక్కన, కొమ్మన]

కొమ్మన—(దగ్గరకు పోయి) నాన్నా, తాతయ్యగారు వీరవిహారం చేసి వీరస్వర్గానికి వెళ్లారుట గాదూ?

తిక్కన—ఎవరు చెప్పారు బాబూ?

కొమ్మన—మారన్న చెప్పాడు. అవునా?

తిక్కన—అవును బాబూ!

రాజు—(చిరునవ్వుతో) ఎవరండీ పిల్లపిడుగు?

తిక్కన—చిన్నకొమ్మన్నండి. బాబూ! వీరు మన రాజుగారు. వీరికి నమస్కారం చెయ్యి.

కొమ్మన—(వీరపద్ధతిన నమస్కరించి, వీరవైఖరితో నిలువబడతాడు)

రాజు—(వీరపద్ధతిన ప్రతినమస్కారం చేశాడు)

కొమ్మన—(వెనుకడుగులు వేసి ప్రక్కకు తప్పుకుంటాడు)

రాజు—ఆంధ్రజాతి అంతా ఇలా తయారైతే?

తిక్కన—శ్రీ గణపతిదేవ చక్రవర్తి, శ్రీ శివదేవమహామంత్రి ఈకలలే కంటున్నారు.

రాజు—దేశం అంతఃకలహాలతో కుంగిపోతున్నది.

తిక్కన— తమ రిప్పటికైనా గ్రహించారు, సంతోషమే.

రాజు—(నాలుగడుగులు వేసి, విచారముతో నిలువబడుతాడు.)

తిక్కన—ఏమిటి ఆలోచిస్తున్నారు?

రాజు—నాకు గుండె దడదడలాడుతున్నది.

తిక్కన—గుఱ్ఱంమీద దీర్ఘప్రయాణం చేశారు. అది కొంచెము జరఘయిన జంతువుకూడాను.

రాజు—అందుకు కాదు. నేను అన్నమాంబగారి ఎదుట పడటానికి భయపడుతున్నాను. దుఃఖము పట్టలేక ఏమి తీవ్రంగా మాట్లాడతారో!

తిక్కన — అమ్మగారి తండ్రి సూరన్నసోమయాజులు శాపచాపముల రెంటిని సమానప్రతిభతో వర్తింపజేశాడు. ఆమె వీరపత్ని. (నవ్వుతూ) వీరమాత కూడాను. ఈ చిన్నకొమ్మన్నది ఆమెతీర్పు. మా వంశములో అయిదు తరములనుండి మా కత్తికీ, ఘంటానికీ సిరసధార లేదు.

రాజు— మామా! క్షమించు. నిమిషములో వీరరసం కురిపించావు. ఇకమీద నీవు కత్తిని ఒరలో బెట్టి ఘంటాన్ని బయటికి లాగి ఆంధ్రావళిని సర్వతో ముఖంగా విజృంభింపజేస్తూ కవిబ్రహ్మవై ఆంధ్రజాతిని సృష్టింతువుగాని.

తిక్కన—తమరు సిద్ధసంకల్పులుకదా!

(రాజు, తిక్కన గౌరీమందిరములోకి వస్తారు. ప్రోలమ్మ, సీతమ్మ నిష్క్రమిస్తారు.)

రాజు—అమ్మా! నమస్కారము.

తిక్కన—అమ్మా! మన రాజుగారు.

అన్నమ్మ— విజయవార్తలు విన్నాను. వారు ప్రభువువారి సేవలో అర్ధశతాబ్దము ప్రశంసాపాత్రంగా వర్తించి చివరకు వారి సేవలోనే వీరమరణము గాంచి ధన్యులైనారు-అని నా వాక్యములుగా వారితో మనవి చేయవోయి.

రాజు—అమ్మా! మా రాజకుటుంబము మీ మంత్రికుటుంబానికి మూడుతరములనుంచి ఎంతో ఋణపడి యున్నది.

అన్నమ్మ—ఈపిల్లవాడిని కనిపెట్టివుండండి.

రాజు—నాకు మంత్రి, సోదరుడు, తండ్రి, గురువుకూడా యీ పిల్లవాడే.

అన్నమ్మ—చిత్తము. ఇంతవరకూ మీ మా కుటుంబములకు అట్టి సంబంధమే వున్నది. మీ క్షేమమే మా క్షేమము.

నాయనా! నేను ఈవార్త విని నీకోసమే కని పెట్టుకొనివున్నాను. సహగమనానికి నీవు ఏర్పాటు చేయించు.

తిక్కన—(కన్నీటితో) అమ్మా! నన్నే మిచేసి పోతావు? నాన్నవియోగమే భరించలేకుండావున్నాను.

అన్నమ్మ—అందరికీ భగవానుడే రక్షకుడు. నీకూ అతడే. భర్త పురుషుడు; భార్య ప్రకృతి. పార్వతీ పరమేశ్వరదాంపత్యమే మన వంశమునకు ఆదర్శము. పురుషుడు పోయినతరవాత జడస్వరూపమయిన స్త్రీ జీవితము నిరర్థకము.

తిక్కన—"ఆత్మావై పుత్రనామాసి" అని పుత్రుడు లేనప్పుడే శాస్త్రాలు సహగమనాన్ని అంగీకరించినవి తల్లీ!

అన్నమ్మ—పురాణదృష్టాంతములనుబట్టి ఆచారము భిన్నముభిన్నముగా నున్నదోయి.

తిక్కన—ఆచారమునకు శాస్త్రాధారము లేదు తల్లీ. ఇంకొక విషయముకూడ నీవు మన్నించవలసి యున్నది. తండ్రిగారు మరణసమయములో నీవు సహగమనం చేయవద్దని, తన యీ ఆఖరిసారికోరికను మన్నించవలసినదని గట్టిగా చెప్పినారట. దొడ్డనాన్నగారు కూడ అటులనే తమ కోరికను వెల్లడించారు. దొడ్డమ్మగారుకూడ దానిని మన్నించారు.

అన్నమ్మ—ఇది వాస్తవమా?

తిక్కన—నీ పాదాలసాక్షిగా మనవిచేస్తున్నాను.

కొమ్మన—ఎందుకు నాన్నా, మీరు ఇంత వద్దని బలవంత పెడతారు?

తిక్కన—(నిర్ఘాంతపోయి, మళ్లా సర్దుకొని) బాబూ! తాతగారి ఆజ్ఞోయి యిది.

కొమ్మన—అయితే సరే.

రాజు—(కుర్రవాడిమీద చేయివేసి) భేష్! బాగుంది.

అన్నమ్మ—అక్కయ్యా! నీ వేమంటావు?

ప్రోలమ్మ—నేను కొండంత ప్రభువును పోగొట్టుకొని జడములాగ నిత్యభత్యాలు మింగుతూ రోజులు లెక్కబెట్టుకుంటూ జీవించడం వారి ఆజ్ఞచేతనేనే. నీవు కూడా తపస్సు చేసుకుంటూవుండు తల్లీ!

అన్నమ్మ—సరే. ఇక నిత్యకర్మకు ఏర్పాటు చేసుకోండి.

తిక్కన—ప్రభూ! లేతామా యి...

రాజు—అమ్మా! శలవు.

అన్నమ్మ—చిత్తము.

[అందరూ నిష్క్రమింతురు]

---




# మధ్యాకర్షణ

శ్రీ వేలూరి శివరామశాస్త్రి

భారతీయ ఖగోళజ్ఞులు సుమారు వేయేండ్లక్రితం మధ్యాకర్షణ శక్తి అంటూ ఒక శక్తి ఉన్నదనిన్నీ, ఇదే గ్రహాలకు నియామకం అనిన్నీ వ్రాసిపోయినారు. అటుపిమ్మట దాని విశిష్టఫలాలు తెలిసికోవడానికి గవేషణ యేమీ జరగకపోవడంవల్ల అది అలా పుస్తకాలలోనే శబ్దరూపంగా స్తంభించిపోయింది. తరువాత్తరువాత స్త్రీల పాతివ్రత్యమూ, పురుషుల పుణ్యమూ దీన్ని పారదోలి దీని స్థానాన్ని ఆక్రమించుకున్నై.

పాశ్చాత్యదేశంలో ఈ మధ్యాకర్షణ మళ్లా మొలకెత్తింది. ౧౭-వ శతాబ్ది శేషార్ధంలో ఐజాక్ న్యూటన్ అనే ఆయన మధ్యాకర్షణ అనే శక్తి ఒకటి ఉందని గ్రహించాడు.

### మధ్యాకర్షణ అంటే ఏమిటి?

రెండు ద్రవ్యాలు పరస్పరమూ అభిముఖంగా ఆకర్షింపబడతై. ఆ ఆకర్షణయొక్క పరిమాణం ఆ ద్రవ్యాల పరిమాణాన్నిబట్టిన్నీ, దూరాన్నిబట్టిన్నీ నియంత్రితం అవుతూవుంటుంది. ఆ ద్రవ్యాలలో ఒకటి మరోదానికంటె పెద్దది కాకపోతే ఆ ఆకర్షణకు ఫలం ఉండదు. అందువల్లనే భూమిమీద ఏ రెండు పదార్థాలూ ఢీడిక్కలు కొట్టుకోడం లేదు. ఈ భూమి ఇతరపదార్థాలకంటె చాలా పెద్దది. కాబట్టి అడ్డమూకలేమీ లేకపోతే ద్రవ్యాలు ఈ శక్తికి లోబడి నేలమీద పడిపోతై.

పండ్లు చెట్లనుండి నేలమీద పడడమూ, నీరు పారడమూ, సముద్రంలో ఆటుపోటులు కలగడమూ, భూమ్యాదులు సూర్యుని చుట్టూ తిరగడమూ, చంద్రుడు హానివృద్ధులు పొందడమూ, గ్రహణములు సంభవించడమూ ఈ మొదలయినవన్నీ ఈ మధ్యాకర్షణవల్లనే అని తరువాత అవగత మయింది.

సూదంటురాయీ, మెరుపూ మొదలయిన ద్రవ్యాలవల్ల కలిగే గమనంకాక మిగిలిన గమనమంతా మధ్యాకర్షణవల్లనే కలిగిం దని క్రమక్రమంగా అనుకోవడం పరిపాటి అయింది. కాగా ఈ శక్తే ప్రకృతిలో ప్రముఖంగా పరిగణింపబడింది. గడచిన మున్నూరేండ్లలో ఈ శక్తిని నమ్మకుండా ఉండడానికి తగిన కారణాలు కనబడలేదు. కాబట్టి వైజ్ఞానికులు సూర్యచంద్రు లున్నారని నమ్మినట్లే ఈ శక్తినికూడా నమ్మారు.

### సందేహం

భూ చంద్రులూ, తతిమ్మా గ్రహోపగ్రహాలూ వీనితాలూకు గమనం మధ్యాకర్షణశక్తిచేతనే నియంత్రితం ఐతే బుధగమనంకూడా ఈ మధ్యాకర్షణశక్తిచేతనే నియంత్రితం కావాలి. అలా కావడం లేదు. ‘అన్నిటిదీ ఒక దారి, ఉలిపికట్టె దొక దారి’ అన్నట్లు ఈ బుధుని గమనం వేరుగా కానవస్తూంది. వైశక్తితో మిగిలిన గ్రహాల గమనానికి గల సంబంధమూ, ఈ బుధుని గమనానికి గల సంబంధమూ సరిపుచ్చడానికి తల బద్దలు కొట్టుకున్నా సరిపడలేదు. ఇది ఇల్లా సరిపడకపోవడంవల్ల ఈ మధ్యాకర్షణశక్తినిగురించి గణకులకు అపనమ్మకం కలిగింది. కొందరు గణితజ్ఞులు ఈ శక్తినియమాన్ని బుధగమనానికి సరిపెట్టి చూచారు.

దానివల్ల మిగిలిన గ్రహోపగ్రహాల గమనంలో తేడా వచ్చింది. 'ఎగదీస్తే బ్రహ్మహత్య, దిగదీస్తే గోహత్యా!'

### కిరణగమనం

లోగడ మాక్‌స్వెల్ మొదలైన వైజ్ఞానికులు కిరణాలు సూటిగా ప్రసరిస్తాయని అనుకున్నారు. గవేషింపదొడగినకొద్దీ అవి వంకరగా ప్రసరిస్తున్నటులు సందేహం కలిగింది. అప్పుడు ఇంగ్లాండు మినహా మిగతా యూరపు ఖండంలోని వైజ్ఞానికు లందరూ జ్యామెట్రీని (జ్యామితి) పునాదిగా వేసుకుని గుణించడం మొదలుపెట్టారు.

### జ్యామితి

“ఏ స్థానమందైనా ఏదైనా ఒక జడపదార్థం వుంటే దానిప్రక్కనున్న స్థానసమూహం యూక్లిడ్ చెప్పినట్లు కాదు. అనగా ఆ స్థానంలో యూక్లిడ్ చెప్పిన జ్యామితి పొసగదు. ఇట్టి స్థానాన్ని మామూలుభాషలో వక్రస్థానం అని వాడవచ్చు. ఈలా చూస్తే సూర్యుని చుట్టూ ఉన్న స్థానం వక్రం. అందువల్ల సూర్యుని సమీపంనుంచి వచ్చే నక్షత్రాల కాంతి యూక్లిడ్ చెప్పినట్లు సరళమార్గాన రాదు.” అని ఇన్‌స్టీన్ గ్రహించాడు.

### సీటార్

“జడపదార్థానికి దాపున ఉన్న స్థానమేకాక జడపదార్థం లేని స్థానంకూడా వక్రమే. యూక్లిడ్ చెప్పిన జ్యామితికి తావలమైన శూన్యస్థానం అంటూ ఒకటి లే”దని ఈయన ఒక మతం ప్రచారం చేశాడు.

కొన్నినక్షత్రాలు మనకు చాలా చాలా దూరంలో మిక్కిలి వడిగా పరుగెత్తుతున్నై. గణకులు చాలామంది ఈయనమతాన్నిబట్టి నక్షత్రాల గమనాన్ని సరిచూచుకుని ఈ మతాన్ని స్వీకరించారు.

ఈరీతిగా యూక్లిడ్ తాలూకు జ్యామితియున్నూ, దాన్ని ప్రమాణంగా పెట్టుకుని చేసిన సిద్ధాంతాలున్నూ సరి కావని తేలిపోయింది. న్యూటన్, అయిలార్ మొదలయినవారు వేసిన లెక్కలు తూచినట్లు సరిగ్గా లేవనికూడా నిశ్చితం అయింది. బ్రహ్మాండాన్ని గురించి అనుమానప్రమాణంచే సాధింపదగిన కొత్త విషయాలకు కొత్త గణితం ఒకటి కావలసిఉన్న దని వైజ్ఞానికుల కందరికీ తోచింది. కాగా ఆ గణితానికికూడా విఘ్నేశ్వరపూజ జరిగింది. దీనికి ప్రథమాచార్యుడు రీచీ. ఇతడు ఇటలీవాడు.

### ఆపేక్షికతత్వం

గణితమూ, పదార్థవిజ్ఞానమూ, ఖగోళశాస్త్రమూ వీనిలో ఆలోచన జరుగుతూవున్న సమయంలో జర్మనీ వాస్తవ్యుడు ఇన్‌స్టీన్ అనే వైజ్ఞానికుడు ఆపేక్షికతత్త్వాన్ని ఉద్ఘాటించాడు. ఇది ఎంత నూతనమో అంత కఠినం.

ఈతని ఊహా వెనుకటి ఊహాల కన్నింటికీ నీళ్లు తోడిం దని చెప్పవచ్చు. ఈ ఆపేక్షికవాదం మొదట మొదట వైజ్ఞానికులకే సుగ్రహం కాలేదు. కాని పిదప పిదప ఈ వాదం పునాదిగా కొంతకొంత విజ్ఞానభిత్తి యేర్పడింది. దాంతో పదార్థవిజ్ఞానంలో కలిగిన కొన్ని సందేహాలకు సమాధానం వచ్చింది. అటుపిమ్మట కొందరుకొందరు ఈ మతమ్మీద విశ్వాసం కలవారయారు. ఈవిశ్వాసం క్రమక్రమంగా విశ్వవ్యాప్తం అయింది.

ఈ ఆపేక్షికతత్త్వాన్ని తెలపా లంటే అతి సూక్ష్మమూ, అతికఠినమూ ఐన గణితంచేకాక మరో రీతిగా తెలపడానికి వీలులేదు. ఐనా దీని ఆభాస ఈ క్రిందిరీతిగా ఉంటుంది: —

బ్రహ్మాండంతాలూకు వెడలుపూ, పొడుగూ, ప్రస్థమూ, వేధా మొదలయిన స్వరూపమంతా కాలంతోగూడా సంబంధపడివుంది. కాబట్టి బ్రహ్మాండంలోని ప్రతి ఘటనా దేశకాలసాపేక్షం అవుతూవుంటుంది. దీన్ని అనుసరించి చూస్తే మనం ఇపు డున్న ఈజగత్తుకూడా దేశకాల సమన్విత మయిన ఒక సత్తా. ఇట్టి సత్తా నడుమ ఏ ద్రవ్యం ఉన్నా ఆద్రవ్యంచుట్టుప్రక్కల వున్న ద్రవ్యాలకు ఒక గమనం ఉంటుంది. అది న్యూటన్ వేసిన లెక్కకు అనురూపం. ఆ గమనం దేశకాలాన్విత మయిన యీజగత్తులో ఉన్నంతమాత్రం వల్లనే కలిగేదిగాని న్యూటన్ చెప్పినట్లు మధ్యాకర్షణ వల్ల మాత్రం కలిగేదికాదు.

# వారికి హామీ-మీ సమస్య!



*....పరిష్కారము
ఐ. ఎం. యల్. ఏ. గ్యారంటీడ్
ట్రిపుల్ బెనిఫిట్ పాలిసీ

ప్రతి గృహస్థుడు పొందగల దివ్యమైన భీమాపద్ధతి. ఇందుమూలమున కుటుంబమునకు తగిన హామీ, వార్ధక్యమున తనకు ఆదాయము. ఈ స్కీములో ప్రతి సం|| భీమా మొత్తమునకు గ్యారంటీడ్ బోనస్ చేర్చబడును.

పూర్తి వివరములకు వ్రాయుడు.

* ఈ స్కీము ప్రకారము చేకూరు 3 గ్యారంటీ లాభములు...........

1. క్రమవిధానమున అభివృద్ధిగాంచు భీమా మొత్తము పాలసీదారుని అనంతరము చెల్లించుట.
2. నిర్ణీతకాలము పూర్తియైన తర్వాత భీమాచేసిన పూర్తిమొత్తము చెల్లించుట.
3. నిర్ణీతకాలము పూర్తియైన తర్వాత, భీమాచేసిన మొత్తమునకు సమానముగా గల మొత్తమునకు అదనముగా ఫ్రీ పెయిడ్ అప్ పాలిసీ ఇవ్వబడును. వేరే ఇతర సౌకర్యములతోను, అధికమైన సరెండరువాల్యూలతోను, ఈ పాలిసీ మిక్కిలి ప్రత్యేకత్వము వహించినది.

**పిల్లల డెఫర్డు ఇన్షూరెన్సు పాలసీలుగూడ గలవు.**

**INDIAN MUTUAL LIFE**
**ASSOCIATION LTD.** H. O. MADRAS

**Indian Mutual**
**LIFE ASSOCIATION LIMITED**
10, MOUNT ROAD, MADRAS.

'PHONE: 3777 'GRAMS: "IMLA"

ఈ రీతిగా ఊహించి గణితం వేస్తే లబ్ధమయిన గమనపరిమాణాన్ని బట్టి బుధుని గమనంలో లోటుపాట్లు చాలాభాగం సర్దుకుంటై. ఇది ఇలా ఉండంగా నక్షత్ర కిరణాలు సూర్యసన్నిధిలో సూటిగా పోక వంకరగా పోతై అనికూడా దీనివల్ల తేలుతుంది. సూర్యగ్రహణ సమయంలో ఎడింగ్‌టన్ మొదలయిన వైజ్ఞానికులు చూచి ఇది సత్య మని నిర్ధారణ చేశారు.

ఐతే న్యూటన్ కనుగొన్న మధ్యాకర్షణశక్తి పొరపాటా అనే శంక కలుగుతుంది. కాదు గాని అతడు కనుగొన్నదాన్ని ఇన్‌స్టీన్ కనుగొన్నదానితో తారతమ్యం... వేజా వేసి చూస్తే.అది చాలా స్థూలం అని చెప్పాలిసి వస్తుంది. స్థూలవిషయాలలో న్యూటన్‌మాట పాటి పోతుంది. సూక్ష్మవిషయాలకు మాత్రం న్యూటన్ మతం సమాధానం ఇవ్వలేదు. అట్టి విషయాలలో ఇన్‌స్టీన్ సిద్ధాంతమే అవలంబనీయం.

రీచీ వేసిన గణితానికి సరిపడేటట్లు ఇన్‌స్టీన్ మధ్యాకర్షణ ఫలితాలను నియంత్రితం చేశాడు. ఖగోళ సందేహమూ, కిరణ సందేహమూ, నూతన గణితమూ ఈ మూటి ఆందోళనమున్నూ కలిసి ఇన్‌స్టీన్ ప్రతిభచే ఆపేక్షిక తత్త్వంగా మారింది.

ఈ ఆపేక్షిక తత్త్వానికి ఫలితంగా బ్రహ్మాండం తాలూకు ఆకార—ఆయతనాలను గురించి కొత్తకొత్త ఊహ.కు అంకురార్పణ అయింది. గడచిన నాలు గయిదేండ్లలో గణకులు నిరూపిస్తూన్న సంగతు లింకా సిద్ధాంతాలు కాకున్నా ఉపేక్షించడానికిమాత్రం వీలు లేదు.





# విమర్శ ప్రమాణము

= శ్రీ నోరి నరసింహశాస్త్రి =

సృష్ట్యాదినుంచీ ఇప్పటివరకూ కవు లెంతమంది పుట్టినారో చెప్పలేము. కాని వారిలో మన మిప్పటికీ స్మరించేవారు కొద్దిమందే ఉన్నారు. అయితే మనము మరచిపోయినంత మాత్రముచేత మనజ్ఞప్తిలో లేనివారు కవులు కాకపోరు. మనకు జ్ఞాపక మున్నంత మాత్రముచేతనే వారంతా మంచి కవులు అన డానికీ వీలులేదు. ఇక మనము మరచిపోయిన విమర్శకులు ఎంత మంది ఉండేవారో చెప్పనేలేము గదా.

## అందరూ విమర్శకులే

ఇప్పు డున్న కవుల సంఖ్య స్థూలంగా చూస్తే సృష్ట్యాది నుంచీ ఇప్పటిదాకా ఉన్న కవుల సంఖ్యకు సరిపోతుందా అని పిస్తుంది. ఇక ఇప్పుడు విమర్శకుడు కానివాడే లేడు. డెమాక్రసీ రోజులు గనుక కవిత్వమూ, దాని విమర్శా సర్వసాధారణము కావ డము న్యాయమే. నా కెందుకు, నేను పది పన్నెండేళ్లు వచ్చినప్పటి నుంచీ కవిత్వమూ, కవితావిమర్శా మొదలుపెట్టినాను. ఎప్పటి కప్పుడు నేను చెప్పే కవిత్వమువలెనే నా విమర్శ కూడా నాకు మాత్రము బాగుండేది. అయితే ఎప్పటి కప్పుడే కాని ఆ తృప్తి, వెనకటి కాలంలో బాగున్న కవిత్వము కాని, విమర్శకాని ఇప్పుడు నాకే నచ్చడము లేదు.

## ఒకే ఒక ప్రశ్న

అందువల్ల ఈ మధ్య కొంతకాలమునుంచీ నన్ను ఒక ప్రశ్న పట్టి బాధిస్తున్నది. బంగారము మంచిదో, చెడ్డదో విచారణచేయ వలెనంటే స్థూలంగా గీటురాయివల్ల చెప్పవచ్చును. ఇంకా సూక్ష్మమైన సాధనాలవల్ల కొలతవేసి ఇంతబంగారము, ఇంతరాగి, ఇంతమట్టి అని చెప్పే వీలున్నది. అట్లాగే ఇతరవిషయాలు కూడా మంచి చెడ్డలు విచారణచేయడానికి ఏవో ఆధారాలు — ప్రమా ణాలు ఉన్నవి.

## ఏది కొలబద్ద ?

కవిత్వానికీ, విమర్శకూ అటువంటి కొలబద్దలు ఏమైనా ఉన్నవా? ఉంటే అవి ఎంతవరకు సమ్మతదగినవి? కావ్యము మంచి దేదో, చెడ్డ దేదో తెలుసుకునేందుకు ప్రమాణము దొరికితే కవి త్వానికీ, విమర్శకూ ప్రమాణము దొరికినట్లే కాబట్టి రెండింటికీ కలిపి పర్యాలోచన చేదాము. అందులో పాశ్చాత్యులమీది అభి మానముచేత ఆధునికులు అమలులోకి తెచ్చిన కొన్ని ప్రమాణాలు ముందు విచారిద్దాము. అయితే అవి మనకూ కొత్తవికావు.

## కాలమా ?

అటువంటి ప్రమాణకోటిలో ప్రప్రథమముగా పరిగణించేది కాలము. ఏ కావ్యము శాశ్వతముగా జనాదరణపాత్రముగా ఉం టుందో అదే గొప్ప కావ్య మని ఉద్దేశము. ఎన్నో గ్రంథాలు తాత్కాలికముగా జనుల మనస్సులు ఆకర్షిస్తవి. కొద్ది రోజులకు మళ్లీ వాటి సంగతి తలచేవాళ్లుకూడా ఉండరు. హోమరు, డాంటే, షేక్స్పియరు—ఇత్యాది మహాకవుల గ్రంథాలు కొన్ని శతాబ్దా లుగా జనము చదివి ఆనందిస్తున్నారు. అవే ఉత్తమకావ్యాలు. వాటి గుణము శాశ్వతత్వము. కాబట్టి కావ్యానికి కాలమే ప్రమా ణము అనిపిస్తున్నది.

## అందులో విప్రతిపత్తి

ఐతే ఇవ్వాళ వ్రాసే కావ్యము మంచిదో, చెడ్డదో విమర్శించడానికి ప్రస్తుతము వీలు లేదన్నమాట! కాలము విమర్శించి నిలిపేదాకా మనము ఆగవలసి వస్తుంది. ఇక కాలమంటే ఎంత కాలము!

అదీగాక ఒక్కొక్క కావ్యము ఉండడానికి దాని గుణమేకాక మరెన్నో కారణాలు ఉండవచ్చును. ఒక మహాకవి వ్రాసిన సామాన్యకావ్యాలుకూడా జనము అతనిమీద గౌరవముచేత స్మరిస్తూ మరవకుండా ఉంటారు. ఒక్కొక్కప్పుడు మతసంబంధమైన స్పర్శ కలిగితే ఆ మతస్థులకు అది పూజ్యమై శాశ్వత మవుతుంది. చివరకు ధైర్యము చేసి పచ్చిబూతుగా ఎవరైనా పుస్తకము వ్రాస్తే అన్నిటికంటే అది శాశ్వత మవుతుందని నావిశ్వాసము. విశ్వాసము లేనివారు కాళిదాసప్రహసన మనే ప్రసిద్ధి ఉన్న ప్రహసనము వ్రాసినవాణ్ణి, మన కవిచౌడప్పనూ అడగండి! ఈవిధంగానే ఉత్తమత్వమేకాక మరెన్నో కారణాలు ఉండవచ్చును—చిరంజీవులుగా ఉండడానికి.

అంతేకాక ఉత్తమమైనవి ఎన్నో కావ్యాలు కాలగర్భంలో పడిపోయినవి. కవి తాను ప్రచారముకోసము ప్రయత్నించకపోతే లోకానికి ఎట్లా తెలుస్తుంది! ఒక్కొక్కప్పుడు ఉపద్రవాలవల్ల కావ్యాలు పోతవి. కొన్ని గ్రంథభాగాలే కనిపిస్తవి. ఎన్నో కాలగర్భంలో పడిపోయినవి చిత్రముగా కొన్నాళ్లకు పైకి వచ్చి జనాదరణపాత్ర మవుతున్నవి. ఇటువంటిదానికి గొప్ప ఉదాహరణము ఇప్పుడు మనము సామాన్యముగా భాసనాటకాలని వ్యవహరిస్తున్న ప్రతిమాదినాటకాలు. ఇందులో రెండు విశేషాలు. అవి ఎవరు వ్రాసినా చక్కని నాటకాలే. అవి ఎన్నాళ్లు కాలగర్భంలో పడిపోయినవో తెలియదుగదా! ఇప్పుడానాటకాలు నమ్మకమైన ఆధారము లేకపోయినా, భాసుడి పేరుతో ముడివేయడమువల్ల వాటికి మరింత జనాదరణము వచ్చినదనడము నిస్సందేహవిషయము!

కాబట్టి కాల మనే ప్రమాణము మనకు విశ్వాసపాత్ర మైనది కాదు.

## విశ్వజనీనతా ?

కాలము కాదు. కావ్యము బహుజనాదరపాత్రము కావలె అంటే ఒకరకమైన మనుష్యులకేకాక బహువిధాలవారికి కావ్యము నచ్చవలె. అప్పుడే అది మంచి కావ్య మవుతుంది. అంటే మంచి కావ్యాలు బాలురవద్దనుంచీ పరిణతబుద్ధులవరకూ అందరికీ బాగుండవలె. పిల్లలు కథాచమత్కృతికి వ్యగ్రులవుతారు. శాబ్దికులు శబ్దసౌష్ఠవంవల్ల ముగ్ధు లవుతారు. ధర్మప్రబోధముతో ధార్మికులు సంతుష్టులవుతారు. మహాభారతప్రస్తావనలో పూజ్యపాదుడైన నన్నయభట్టారకుడు కూడా ఈ గుణమే ఉద్ఘాటించినాడు :

"ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని
యధ్యాత్మవిదులు వేదాంత మనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రం బని
కవివృషభులు మహాకావ్య మనియు
లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహ మని
యైతిహాసికు లితిహాస మనియు
పరమపౌరాణికుల్ బహుపురాణ సముచ్చయంబని..."

ఇంకో విధముగా కూడా మన పెద్దలు ఈ గుణాన్నే వర్ణించినారు :

"ఒక్కొక్కని కావ్యము కవిగృహములోనే నిలిచిపోతుంది. మరొకరిది ఆ కవిస్నేహితుల ఇళ్లదాకా వెళ్లుతుంది. ఇక మరి ఒకరి కావ్యము అవిదగ్ధుల వదనములందు పాదము లుంచి విశ్వమంతా హాలివలె శాశ్వతముగా సంచరిస్తుంది."

ఈ గుణాన్నే 'విశ్వజనీనత' (*Universality*) అని పాశ్చాత్య విమర్శకు లంటారు.

## అదీ నిలవదు

అయితే ఈ కొలబద్ద వేస్తే ఎన్నో మంచికావ్యాలు పోతవి. కొన్ని కావ్యాలు పరిణతబుద్ధులకే కాని ఆనందము కలిగించవు.

"...తేజవరాలు చెక్కగి
టిన వసవల్చు బాలకుడు
డెందమునన్ గరగంగ నేర్చునే?"

అన్నాడు కాదూ మన తెలుగుకవి! మరి అంత గొప్పగా నన్నయభట్టారకుడు మహాభారతమును ప్రశంసించినాడా? దాన్ని కూడా కొందరు నవనాగరకులు, ద్విజులు తమకు ద్విజేతరులచేత శాశ్వతముగా దాస్యము చేయించుకోడానికి వ్రాయించిన ప్రచారప్రధానమైన గ్రంథమని తోసివేస్తున్నారు. అంతమాత్రము చేత మహాభారతము కూడా పోవలసిందేనా ? కాబట్టి ఈ విశ్వజనీనత కూడా నమ్మకమైన కొలబద్ద కాదు. సూక్ష్మముగా ఆలోచిస్తే ఇది కూడా ముందు విచారించిన కాలమనే ప్రమాణానికి అపరరూపమే! కాబట్టి కాలమూ కాదు, విశ్వజనీనతా కాదు!

## ఉదాత్తతా ? అంటే...

ఇక కొందరు ఉత్తమకావ్య లక్షణము ఉదాత్తత (*Sublimity*) అంటారు. మిల్టను వ్రాసిన 'పారడైజు లాస్టు' చూడండి!_ అందులో మనుష్యజాతికే సంబంధించిన ఉదాత్త విషయాలు చిత్రించినాడు. డాంటే వ్రాసిన 'డివైను కామెడీ' కూడా అంతే! అట్లాగే గెటే వ్రాసిన 'ఫాస్టు' ఆలోచించండి. రవీంద్రుని 'కింగు ఆఫ్ ది డార్కు ఛేంబరు'; మీటరులింకు వ్రాసిన 'బ్లూబర్డు', 'ది సైటులెస్'; హాప్ట్మనుది 'ది బెల్'! హోమరు చిత్రించిన యుద్ధము కూడా సామాన్యమానవులది కాదు. దేవతాసమములైన వీరు

లది. పెద్దలు పురాణము పంచలక్షణ మని చెప్పినారు—సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరములు, వంశానుచరితము! ఇట్టి ఉదాత్త విషయవర్ణన చేసేదే ఉత్తమ కావ్యము!

## అందులో బాధకాలు

ఈ గుణము కొలబద్దగా తీసుకుంటే ఉత్తమ కావ్యకోటిలో అందరూ సామాన్యముగా పరిగణించే కావ్యాలు చాలా భాగము వస్తవి. నా కెందుకు నాకు గాఢాభిమానపాత్రమైన కావ్యాలన్నీ వస్తవి. మహాభారతానికి మకుటాయమానమైన స్వర్గారోహణపర్వము ఒక్కసారి జ్ఞాపకము తెచ్చుకోండి! మానవులలో ఉత్తముడు ధర్మరాజు. అందరిలో మానవశరీరముతో స్వర్గములో అడుగుపెట్ట దగినవాడు అత డొక్కడే! అతనికి బంధుజనులను చూడ బుద్ధి పుట్టగా ముందు ఉన్న తానసనముమీద దుర్యోధనుణ్ణి చూపుతారు. తన సోదరులు నరకములలో ఉంటారు. దేవనీతిమీద కొంతసేపటికి అసహ్యము కలుగుతుంది ధర్మరాజుకు! చివరకు మానవనీతికీ దేవనీతికీ భేదము విశదీకరించి ఆకాశగంగలో స్నానము చేస్తేనేగాని ధర్మరాజుకుకూడా 'మానవ భావవికారముల శోకబంధము' లడగవనీ, అప్పుడేకాని స్వర్గసౌఖ్యము అనుభవింపరాదనీ విశదీకరిస్తారు. ఈ విధముగా ఈలోకనీతితో కట్టుబడే మనకు ఇంతకంటె ఉదాత్తమైన నీతి బోధించినాడు వ్యాసభగవానుడు! ఈవిధంగానే ఉదాత్త విషయములు చిత్రించగలిగినవారే మహాకవికోటిలోకి వస్తున్నారు. అయితే ఈ ఉదాత్తధర్మమే ఉత్తమకావ్యలక్షణ మంటే బాగున్నట్లే ఉన్నదికాని దీనికికూడా ఎన్నో బాధకాలు ఉన్నవి.

## అసలుకే మోసము

ముందు అసలిది సంసారపక్షమైన కొలత కాదు. ఈకొలబద్ద వేసి కొలిస్తే నిలవగలిగే కావ్యాలు బహుస్వల్పము. ఇక మహాభారతాదులే కావ్యాలు- ఇతరము కాదంటే కవులు చాలా భాగము వ్రాయకుండా ఊరుకోవలసివస్తుంది. షేక్స్పియరునాటకాలు చాలా భాగము పోతవి. భవభూతి మాలతీమాధవము నిలవదు. కాళిదాసు మేఘదూతము, మాళవికాగ్నిమిత్రము, విక్రమోర్వశీయముకూడా గణనలోకి రాకపోవచ్చును. అమరుకము ఏమి కావలె! గాథా సప్తశతి ?

## అవ్యాప్తి

కవులూ, విమర్శకులూ ఎందరో రామణీయకవాదులు. కావ్యానికి ఉదాత్తత దానికి ఉత్కృష్టత ఆపాదించే ఒక గుణవిశేషమే కాని నిత్యధర్మము కాదు. ఎన్నో కావ్యాలు రమ్యంగా మాత్రమే ఉంటవి. వాటి విషయములో ఈ ఉదాత్త ప్రమాణము అవ్యాప్తమై పోతుంది. కాబట్టి నాబోటివారికి ఈ ఉదాత్తత ఎంత అభిమానమైనా ప్రమాణభూతము కాదని ఒప్పుకోక తప్పని స్థితి ఏర్పడుతుంది.

## పోనీ, రామణీయకమో ?

ఇక ఉదాత్తతను బాధించిన రమ్యత పోనీ, విశ్వసనీయమైన ప్రమాణ మవుతుందా? కావ్యము మనోజ్ఞముగా ఉండవలె!

" *A thing of beauty is a joy for ever* " అని కీట్సు ప్రారంభించినాడు. కొందరు కళకు గమ్యస్థానము కళయే అన్నారు. కవులు చిత్రకారులవలెనే సౌందర్యోపాసకులు. ఆలంకారికులలో అధునాతనుడైన జగన్నాథ పండితరాయలు "రమణీయార్థప్రతిపాదకశబ్దమే కావ్య" మన్నాడు. శ్రీ రాయప్రోలు సుబ్బారావుకూడా అన్నాడు :

> " నిర్వికల్పక విజ్ఞాన నిరతు లయిన
> బ్రహ్మవాదులకును, హ్లాదరామణీయ
> వాదులైన కవులకును భేద మెంతు ;
> తారతమ్య మీమాంసకు తగను నేను "

## బాగానే ఉంటుంది

మమ్మటభట్టారకుడు 'కవిభారతి హ్లాదైకమయ' మనీ, 'నవరసరుచిర' మనీ అన్నాడు. కావ్యవిమర్శకు ప్రమాణముగా ఈ రమ్యత, మనోజ్ఞత అని అంగీకరించేందుకు చాలా అవకాశము కనపడుతున్నది. ఎంత చిన్న కావ్యమైనా మనోజ్ఞమైతే మన కది గ్రాహ్యమే !

## కాని, దానికి వ్యవస్థలేదు

ఐతే దీనికి కూడా బాధ లేకపోలేదు. కావ్యానికి మనోజ్ఞతే ప్రధాన లక్ష్యమైతే ఇప్పటికి లోకములో ఉత్తమోత్తమ కావ్యాలుగా పూజింపబడే కావ్యాలే వెనకపడిపోతవి. ఉదాత్త కావ్యకోటిలో ఉదాహృతమైన కావ్యాలన్నీ మనోజ్ఞతలో చాలా చిన్నకావ్యాలకు తీసిపోవచ్చును. అంతే కాదు. ఈమనోజ్ఞతకు సరియైన వ్యవస్థ చేసే వీలులేదు. ఈ మనోజ్ఞత మనిషినిబట్టి మారుతుంటుంది. కాముకునికి శృంగారప్రశంస ఒక్కటే మనోజ్ఞము. భక్తునికి భక్తిప్రశంసే కాని శృంగారప్రశంస అసహ్యము కలిగిస్తుంది. ప్రాకృత జనానికి పచ్చిబూతు రుచిగా ఉంటుంది. పాపము! వరూథినిమనోజ్ఞత ప్రవరాఖ్యునికి పనికిరాలేదు. ఆ శ్రోత్రియ బ్రాహ్మణునికి అరణులు, దర్భలు,అగ్నులు ప్రియములైనట్లు అన్యములు కావు.

కాబట్టి ఈ రమ్యతకూడా అవ్యవస్థితమైపోతుంది.

## భావనాబలమూ కాదు

పోనీ, కొందరు కవికి భావనాబలము (*Imagination*)ఉండవలె నంటారు కదా అంటే ఇదమిత్థమని మనము స్పష్టముగా తెలుసుకునే వస్తువు కా దది!

## కావ్యాలాపాలు

మరికొందరు మనిషిని మంచి కావ్యాలు కదిలిస్తవి, ఉద్రేకము కలిగిస్తవి అంటారు. మద్యాదుల సేవవల్ల కలిగే ఉత్సాహమూ, ఆవేశమూ వంటిదే కావ్యపఠనమువల్ల కలిగే ఫలిత మని వీరి ఉద్దేశము. తన పాఠకులచేత వీరాంగము వేయించడమే కవి విధి అంటే పెద్దమనుష్యు లైనవారు కవిత్వముజోలికి పోరు. అటువంటి కావ్యాలను ఉద్దేశించే పెద్దలు 'కావ్యాలాపములు వర్జించవలె'నని పలికి ఉంటారు.

## ఉపజ్ఞలో ఓగు

అది కాదు. కవికి ఉండవలసినది ఉపజ్ఞ (*Originality*) అంటారు కొందరు. అయితే కాళిదాసంతవాడు తనకు ఉపజ్ఞ లేదని

"మణౌ వజ్రసముత్కీర్ణే
సూత్రస్యేవాస్తి మే గతిః"

అని ఉద్ఘాటించినాడు. ఉపజ్ఞ విమర్శకు ప్రమాణమైతే రఘువంశము మంచి కావ్యముకాదని తోసివేసే అవస్థ పడుతుంది. అటువంటి కావ్యవిమర్శకు దూరమునుంచే నమస్కారము చేయవలసి వస్తుంది.

## వైచిత్రిలోని విపరీతాలు

మరికొందరు కవికి కావలసినది 'వైచిత్రి' అంటున్నారు. నిజముగా ఆలోచిస్తే, ఉపజ్ఞ లేనివాళ్లు అది ఉన్నవాళ్లను అనుకరించబోయి చూపే ఉపజ్ఞాభాస ఈ వైచిత్రి అని స్పష్టమవుతుంది. కావ్యరచన ధనసంపాదనకూ, కీర్తిసంపాదనకూ ఉపకరించే వ్యాసారముగా మారినతర్వాత లోకవంచనకు చిల్లరకవులు చేసే గారడీ ఈ వైచిత్రి. 'నీ పేరేమి'ని తల్లకిందులుచేసి చదువుకగా వైచిత్రిగల కావ్యముగా చేయవచ్చును. అప్పుడు అది 'మిరేపేనీ?' అవుతుంది.

'వైచిత్రి' కావ్యానికి కొలబద్దగా తీసుకుంటే ఏమవుతుందో అది 'వికట కవి'కే వదలవలసి ఉంటుంది.

## దేనికదే

ఇక కొందరు "ఏ కావ్యానికి ఆ కావ్యమే గాని కావ్యాలకన్నింటికీ సామాన్యధర్మము లేదు; ఏకావ్యానికి అదే ప్రమాణము; అంటే కావ్యము చదివి అది ఏప్రమాణములతో బద్ధమైనదో తెలుసుకొని విచారించవలెను" అంటారు. ఇది విమర్శకులు ముఖ్యముగా గమనించదగిన విషయము. అయితే ఈ పద్ధతి విషయగ్రహణానికి మాత్రమే పనికివస్తుంది. కాని అది మంచిదా చెడ్డదా, గొప్పదా తక్కువదా—ఈవిధముగా విలువకట్టడానికి ఉపయోగించదు. అర్థము చేసుకోకుండా విమర్శ ప్రారంభించేవారికి ఈ పద్ధతి అడ్డుతగులుతుంది.

## అభ్యుదయరచయితలకు పోటీ

"ఇకముందు లోకంలో రాబోతున్నది కమ్యూనిజము. దానికి అనుకూలించేవే మంచికావ్యాలు. ఇతరమంతా తుచ్ఛమైనవి" అంటారు ప్రోగ్రెసివ్ రైటర్స్ అనే పేరు పెట్టుకొని కొందరు. వారు చెప్పేదంతా కావ్యవస్తువుకు సంబంధించినదే కాని కావ్య స్వరూపానికి సంబంధమేమాత్రమూ లేనిది. ముందు ఎట్లా ఉన్నా అది అంగీకరిస్తే ఇంతవరకూ లోకములో గొప్పకావ్యాలనుకునేవి తోసివేయవలసివస్తుంది. నాటి రుచి ఎరిగినవారు ఎన్నటికీ అందుకు ఒప్పుకోరు. వీరితో పోటీగా చాలారకాల ప్రచారకులు తమకు ఇష్టమైన ప్రచారానికి ఉపయోగించేదే కావ్యమని పోటీకి వస్తారు.

## సున్నకుసున్న, హళ్లికిహళ్లి

ఇంతవరకూ పాశ్చాత్యవాసనవల్ల మనవాళ్లు వాడుకలోకి తెచ్చిన విమర్శాదర్శములు పరీక్షించి చూచినాము. అవి అన్నీ కూడా కేవలము పాశ్చాత్యులవే కానక్కరలేదని సూచించినాము. అయితే పైవాటిని పరీక్షించగా ఒకటీ తృప్తిగా నిలవలేదు.

## పూర్వాచార్యు లేమంటారు ?

మన పూర్వులు ఎందులో సమర్థులు కాకపోయినా తత్త్వవివేచనములో మాత్రము నిపుణులు కాబట్టి వారు దీనికి ప్రమాణమేమైనా నిర్వచించినారేమో విచారిద్దాము!

## రసమతము

భరతమునివద్దనుంచీ బహుపండితాదరము పొందిన మతము రసమతము. పెద్దలు ఏమన్నారు :

"కావ్యస్య శబ్దార్థౌ శరీరమ్; రసాదిశ్చాత్మా; గుణాః శౌర్యాదివత్; దోషాః కాణత్వాదివత్; రీతయోऽవయవ సంస్థాన విశేషవత్; అలంకారాః కటకకుండలాదివత్".

ఈ సమష్టివాక్యములో ఆలంకారికమతాలు చాలాభాగము సమన్వయమైనవి. ఔచిత్యవాద మొక్కటీ, ధ్వనిమత మొక్కటీ మిగిలిపోయినవి. సూక్ష్మముగా విచారిస్తే ధ్వనిమతానికీ, రసమతానికీ ఎక్కువ భేదము లేదు. ఔచిత్యముకూడా నిజముగా గుణవాదములోనిదే.

## కావ్యాత్మస్వరూపము

ఇక ఈ రసవాదములో గాని, ధ్వనివాదములో గాని కావ్యాత్మస్వరూప మేమి?

కొందరన్నారట:

"ధ్వనేస్తత్త్వం గిరా మగోచరం సహృదయ సంవేద్యమేవ"

మరి కొందరు దాన్ని అన్నారట:

"ప్రతీయమానం పునరన్యదేవ
వస్త్వస్తి వాణీషు మహాకవీనామ్,
యత్తత్ప్రసిద్ధావయవాతిరిక్తం
విభాతి లావణ్య మివాంగనాసు"

అట్లాగే రసముకూడా—

"లోకోత్తర చమత్కార
ప్రాణః కైశ్చి త్ప్రమాతృభిః
స్వాకారవ దభిన్నత్వే
నాయ మాస్వాద్యతే రసః"

అలాగే—

"పుణ్యవంతః ప్రమిణ్వంతి యోగివద్రస సంతతిమ్."

ఈ విధముగా మన పూర్వులుకూడా వివరణాలలో ఎట్లా ఉన్నా రసస్వరూపము చెప్పేప్పుడు సహృదయైకవేద్యమే ననీ, అనిర్వాచ్యమనీ, బ్రహ్మానంద సహోదరమైన అనుభవము కలిగిస్తుం దనీ ఇత్యాదికముగా చెప్ప వలసి వచ్చినది.

## ఎవడు సహృదయుడు ?

అయితే ఎవడు సహృదయుడు?

శ్రీ మమ్మట భట్టారకుడు కావ్యానికి హేతువుగా మూడు సామగ్రులు ఉదాహరించినాడు:

"శక్తి ర్నిపుణతా లోకశాస్త్రకావ్యా ద్యవేక్షణాత్,
కావ్యజ్ఞశిక్షయాభ్యాస ఇతి హేతు స్తదుద్భవే"

అందులో 'శక్తిని' వివరిస్తూ—

"శక్తిః కవిత్వబీజరూపః సంస్కారవిశేషః, యాంవినా కావ్యం నప్రసరేత్, ప్రసృతంవా ఉపహసనీయం స్యాత్"

అన్నాడు.

నిపుణతను వివరిస్తూ లోక జ్ఞానమూ, ఛందో వ్యాకరణాది శాస్త్రములూ, గజతురగ ఖడ్గాది లక్షణ గ్రంథములూ, మహాకవుల కావ్యములూ, ఇతిహాసాదులూ—వీటి విమర్శవల్ల వచ్చే వ్యుత్పత్తిగా నిరూపించినాడు.

అభ్యాసము వివరిస్తూ—

"కావ్యం కర్తుం విచారయితుంచ యే జానంతి. తదుపదేశే కరణే యోజనేచ పౌనఃపున్యేన ప్రవృత్తిః"

అన్నాడు.

ఆపైన "ఈమూడూ వేరేవేరే కారణాలు కావు. కారణమే-అంటే అన్నీ ఉన్నప్పుడే సాధ్య"మని ఉపదేశించినాడు.

కావ్యవిమర్శకునికి కూడా ఇవన్నీ తప్పనిసరిగా కావలసిన గుణాలుగా కనబడుతున్నవి. అటువంటి సామగ్రి ఉన్నవాడే సహృదయుడు. వజ్రపరీక్ష ఎంత కష్టసాధ్యమైనదో అంతకంటే సహస్రగుణము కావ్యపరీక్ష కష్టసాధ్యమైనది. వజ్రపరీక్షకు ఒక వజ్రప్రపంచము బాగా తెలుస్తే చాలును. కాని కావ్యవిమర్శకు కావలసిన సామగ్రి అపరిమితమైనది.

### మనవి

విమర్శప్రమాణము సర్వవ్యాధి నివారిణియని చెప్పే చిట్కా మందులవలె సులభసాధ్యమైనది కాదు. విమర్శ చేసేందుకు సమగ్రమైన సామగ్రి మన విమర్శకులకు ఎందరికి వున్నదో ప్రశ్నించుకో వలసిన దని మనవిచేస్తున్నాను.



# కొండాపురము (నైజాము) లో దొరికిన ప్రాచీన వస్తుసంగ్రహము

(క్రీస్తుశక ప్రారంభ కాలమునాటివి)



ఒకానొక బోధిసత్వుడు



ఒకానొక యక్షుడు



మృత్తికాస్వరూపములోనున్న రోమక నాణెములు

# సరస్వతీ బుక్కుడిపో, బెజవాడ.

స్టేజినాటకములు

శ్రీ కృష్ణతులాభారము॥సు॥ 1-8, భక్తమార్కండేయ 1-0, కచదేవయాని 1-0, రణతిక్కన 1-0, చింతామణి కా॥ నా॥ 1-8, మధుసేవ 1-8, పద్మవ్యూహము 1-4, చిత్రాభ్యుదయము 1-0, సత్యహరిశ్చంద్రీయం బ॥ ల॥ 1-8, బుద్ధిమతీ విలాసము (శ్రీయాళ్) 1-4, ఉత్తరరాఘవము 1-4, సాత్రాజితీయము 1-0, రామదాసు డి॥ గో॥ 1-4, రామకబీర్ 1-4, సుభద్రార్జునీయము డి॥ గో॥ 1-4, సావిత్రి శ్రీ॥ స॥ 1-4, పత్నీప్రతాప్ (అనసూయ) సో॥ అ॥ 1-4, కనకతార చం॥ శే॥ 1-4, బలిబంధనము 1-2, చండిక ము॥ వెం॥ చె॥ 1-4, చంద్రగుప్త నం॥ శి॥ 1-4, భక్తమీరాబాయి కే॥ రా॥ 1-2, ద్రౌపదీవస్త్రాపహరణం మ॥ అ॥ 1-8, భక్తచొక్కామేళ 1-2, కృష్ణలీలలు (కొత్తది) 1-0, అనార్కలీ ఊ॥ స॥ 0-12, రాణాప్రతాపసింహ జం॥ శి॥ 1-4, దుర్గాదాసు 1-4, కృష్ణలీల బళ్ళారి కె॥ సు॥ 1-4, లవకుశ 1-4, సంపూర్ణ మహాభారతము 1-4, ప్రౌఢకృష్ణలీల 1-4, సరిపడని సంగతులు టి॥ రా॥ 1-4, తెనుగుతల్లి వేదాంతకవి 1-4, భక్తతుకారాం కె. భా. 1-2- జయంత జయపాలం ఆ. స. 1-0, శ్రీరామాంజనేయము సి. చి. 1-0, నారోజా భో. నా. 1-0, సతీ సక్కుబాయి సో. రా. 1-8, రంగూన్ రౌడి 1-8, గంగావతరణము 1-8, ధరణికోట 1-8, సతీ అనసూయ 1-2, భీష్మ బ్రహ్మచారి 1-4, కాలకేతనము 1-4, మహాభక్త విజయము 1-2, భోజకాళిదాసు 1-2, తాజ్ మహల్ 1-4, రాధాకృష్ణ పానుగంటి లక్ష్మీనరసింహరావుగారు 0-12, విప్రనారాయణ 1-8, పాదుకాపట్టాభిషేకము 1-8, కోకిల 1-4, ముద్రిక 1-0, వీరమతి 1-4, సరస్వతి 1-4, పూర్ణిమ 1-4, మాలతీమాల 1-0, పద్మిని 1-0, సరోజిని 1-0, రాతిస్తంభము 1-0, విచిత్ర వివాహము 1-0, చూడామణి 1-0, వృద్ధవివాహము 1-8, రసపుత్రవిజయం ఇ.య 1-2, రాణాప్రతాప్‌సింగ్ 1-0, బొబ్బిలి యుద్ధము శ్రీ. కృ. 1-0, రుక్మాంగద బే. భ. 1-0, బృహన్నల 1-4, మోహినీరుక్మాంగద 1-4, పాంచాలీస్వయంవరం 1-4,

శ్రీపాద కామేశ్వరరావుగారి నాటకములు

ఏకిచ్ ప్యాలా (ఒక పెగ్) 1-0, పునర్వివాహము 1-0, చిత్తవృత్తి 1-0, భారతరమణి 1-0, బిల్వమంగళ 1-0, లీలారతి సులోచనలు 1-0, కళాపహాడ్ 1-0, మాధవాచార్యవిద్యారణ్య 1-0, శంభాజి నిర్యాణము 1-0, శివాజీ శీలము 1-0.

కొవ్వలి లక్ష్మీనరసింహారావుగారివి

విడో మ్యారేజ్ 1-0, పద్మచారణచక్రవర్తి అను జయదేవు 1-0.

హరికథలు

ఆదిభట్ల నారాయణదాసుగారివి

జానకీ శపథము 1-0, రుక్మిణీకల్యాణం 0-12, మార్కండేయ చరిత్రము 0-12, హరిశ్చంద్రోపాఖ్యానము 0-12, గజేంద్రమోక్షము 0-8, ప్రహ్లాద చరిత్రము 0-8, అంబరీష చరిత్రము 0-8, భీష్మచరిత్రము 0-8, పై 8 పుస్తకములు కలిపిన క్యాలికో బైండు 6-0, యధార్థరామాయణము 3-0.

కాళ్ళకూరి హనుమంతరావుగారివి

లేడిడాక్టరు 1-0, కాలేజిగరల్ 1-0.

చందాల కేశవదాసుగారివి

శ్రీకృష్ణ తులాభారం సాంగ్సు 0-12, రాధాకృష్ణ సాంగ్సు 0-12.

పానుగంటి విజయరాఘవరావుగారివి — లోభి 1-0.

స్త్రీల పాటలు : ఘాలిసుబ్బారావు పాటలు 1 వ భాగం 1-0, 2 వ భాగం 1-0, వేడుకపెండ్లిపాటలు 0-8, మహిళా మనోరంజని పాటలు 0-5.

బి. బాలాజీదాసుగారివి

సంపూర్ణ రామాయణము 1-0, గయోపాఖ్యానం 0-8, జయప్రదాదేవి చరిత్రము 0-8, నలచరిత్రము 0-8, సీతా కల్యాణము 0-8, రుక్మాంగద చరిత్రము 0-8, శశిరేఖా పరిణయము 0-8, కుశలవ విజయము 0-8, త్రైశంకువిజయము 0-8, దయాకర విజయము 0-8, సూరదాస్ చరిత్రము 0-6, పురందరదాసు చరిత్రము 0-6, ద్రౌపదీమానసంరక్షణము 0-6 కుచేలోపాఖ్యానము 0-6, కర్ణానందదాయి (పద్యములు)0-6 హరికథేతిహాసమంజరి 0-6, 2 వ భాగము (కీర్తనలు) 0-6,

కోసూరి భోగలింగదాసుగారివి

శ్రీమత్సంగీతానంద రామాయణము బాల, అయోధ్యకాండలు 1-0, డిటో కిష్కింధ, సుందరకాండలు 1-0, రామాయణము- యుద్ధకాండ 1-0, నలోపాఖ్యానము 0-10.

నందివాడ జగన్నాథదాసుగారివి

శ్రీకృష్ణ రాయభారము 0-12, సీతాకల్యాణం 0-10.

తిరునగరి శేషదాసుగారివి

శ్రీరామ పాదుకాపట్టాభిషేకము 0-8, సీతాకల్యాణము 0-8, సీతాపహరణం 0-8, శ్రీమదుత్తర రామచరిత్రము 0-8, సుభద్రాపరిణయము 0-8, సమయోచిత పద్యరత్నావళి 0-8, కొమ్మూరి బాలబ్రహ్మానందదాసుగారివి భీమార్జున గర్వభంగము 0-8, శ్రీ శివచరిత్రము 1-8, బ్రహ్మంగారి వీధినాటకము 1-0.

వలయువారు:— **సురకూరి సుబ్బారావు అండ్ సన్,**

ప్రొప్రయిటర్సు: సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

# ఆర్యద్రావిడభాషలు

 = శ్రీ పరవస్తు వేంకటరామానుజస్వామి = 

శ్రీ పరవస్తు వేంకటరామానుజస్వామి

> న చాస్తి సంస్కృతైః శబ్దైః కశ్చిత్ మ్లేచ్ఛాపభాషణే,
> సంస్కృత ప్రతిరూపా హి తద్భాషార్థాంతరే స్థితా.
>
> [కుమారిలభట్టు- తంత్రవార్తికము]

దేవభాష యనియు, గీర్వాణభాష యనియు ప్రఖ్యాతిని బొందిన సంస్కృతభాషకును, తత్సంబద్ధములగు గ్రీక్ లాటిన్ మొదలగు పాశ్చాత్యభాషలకును, సంస్కృత భాషాజన్యము లని యంగీకరింపబడిన పాళీ ప్రాకృతాది భాషలకును, తజ్జన్యములగు హిందీ బెంగాలీ మొదలగు నధునాతనభాషలకును ఆర్యభాషలని సముదాయనామము. తెలుగు, తమిళము, కన్నడము, మలయాళము మొదలగు భాషలు ద్రావిడభాషలని వ్యవహరింపబడుచున్నవి. దేశభేదమును పురస్కరించుకొనినయెడల నుత్తర హిందూదేశమున వ్యవహరింపబడుచున్న భాషలును, వాని పూర్వావస్థలును ఆర్యభాషలలో చేరిన వనియు, దక్షిణ హిందూదేశమున వ్యవహరింపబడుచున్న భాషలును, వాని పూర్వావస్థలును ద్రావిడభాషలలో చేరిన వనియు చెప్పవచ్చును. ఈ ఆర్యద్రావిడభాషల కుండు సంబంధమును మనవారు పూర్వమునుండియు విచారించుచు వచ్చిరి. ఇటీవల పాశ్చాత్యులు కూడ విచారించి యున్నారు.

భాష యనునది మనుష్యులకు దమ యభిప్రాయముల నొండొరులకు దెలియజేయుట కుపయోగించు వర్ణాత్మకమగు సాధనము. అభిప్రాయ బోధకము కానియెడల వర్ణాత్మకమైనను నది భాష యనిపించుకొనదు. మనము "కచటతపయశహ"యని పలికినచో నది వర్ణ సమూహమైనను అభిప్రాయబోధకము కాకపోవుటచే భాష యనిపించుకొనదు. ఆంగ్లభాష దాని నెరిగిన వారికి అర్థవత్తయినను తదనభిజ్ఞులకు నిరర్థకమగుటచే భాష యనిపించుకొనదు. ఏదియో కాసర పీసరవలె వినబడును. అభిప్రాయ బోధయే ముఖ్యోద్దేశ్యమగుటచేతను, అఖండవాక్యముచేతనే యభిప్రాయములు బోధింపబడుటచేతను భాష వాక్యరూపముగానే యుండునని మనము నిశ్చయింపవచ్చును. పదవర్ణాత్మకములగు భాగములు వ్యాకరణశాస్త్రకృతములు కాని యథార్థమైనవి కావు. నామాదులు క్రియాన్వితములైనప్పుడే యర్థవత్తు లగును కాని ప్రత్యేకముగా నున్నయెడల నర్థవత్తులు కానేరవు. ఇట్లు అఖండవాక్య రూపముగా నున్నభాషను విమర్శించి యఖండవాక్యములలోని భిన్నసమాన భాగములను గమనించి వానిచే బోధింపబడు నర్థభాగములను నిశ్చయించి భాషను మొట్టమొదట వ్యాకరించినవారు హిందువులు. వీరు ప్రథమమున సంస్కృతభాషను విమర్శించి దానికి వ్యాకరణములను వ్రాసియున్నారు. సంస్కృతవైయాకరణులను జూచి మరికొందరు ప్రాకృతభాషలకు వ్యాకరణములను వ్రాసిరి. ఈ సంస్కృతప్రాకృత వ్యాకరణకర్తల మార్గము ననుసరించి మరికొందరు ద్రావిడ భాషలకు వ్యాకరణములను వ్రాసిరి.

> విశ్రుతులు హేమచంద్ర త్రివిక్రమాదు
> లొనర జూపిరి ప్రాకృతంబునకు త్రోవ
> నాంధ్రభాషయు ప్రాకృతాహ్వయము కాన
> నలయు తల్లక్షణంబులు వరుస దెలియ.
>
> [విన్నకోట పెద్దన–కావ్యాలంకార చూడామణి]

సంస్కృత మతిప్రాచీనమగు భాష యగుటచే దానిని మనవారు విశేషముగా గౌరవించి దేవభాష యని వ్యవహరింప నారంభించిరి. దేవతల నుద్దేశించి చేయు యజ్ఞములందు వ్యవహరింపబడు భాషయగుటచే దానికి దేవభాష యని వ్యవహారము వచ్చియుండవచ్చును. దేవతల నుద్దేశించినప్పుడు శుద్ధమగు సంస్కృతమే వ్యవహరింపబడుచుండెను.

యర్వాణ స్తర్వాణో నామ ఋషయో బభూవుః, తే తత్ర భవంతో యద్వాన స్తద్వాన ఇతి ప్రయోక్తవ్యే యర్వాణ స్తర్వాణ ఇతి ప్రయుంజతే. యాజ్ఞే పునః కర్మణి నాపభాషంతే.

[పతంజలి- మహాభాష్యము]

ఇట్లిది దేవభాష యనిపించుకొనియుండ వచ్చును. వేదమంత్రముల భాష యగుటచే దేవభాష యనిపించుకొనియుండవచ్చును. హింసించునది సింహ మని పిలువబడినట్లు వేదభాష దేవభాష యని పిలువ బడి యుండవచ్చును. అతి ప్రాచీనమైన దగుటచేతను, వేదమంత్రముల భాష యగుటచేతను నీ సంస్కృత భాషను మనవారు భాషాంతరములకు మూల మని తలంచిరి. శాస్త్రాంతరము లన్నింటికిని వేదము మూల మైనట్లు భాషాంతరము లన్నింటికిని వేదభాష, లేక దేవభాష మూలమని మనవారు విశ్వసింపనారంభించిరి.

తల్లి సంస్కృతంబె యెల్ల భాషలకును.

[కేతన-ఆంధ్రభాషాభూషణము]

జనని సంస్కృతంబు సకలభాషలకును.

[శ్రీనాథుడు – క్రీడాభిరామము]

తెలుగు మొదలగు ద్రావిడభాషల వ్యాకరణ ములు ప్రాకృతవ్యాకరణముల ననుసరించుటచే తెలుగు వైయాకరణుల కిట్టి యభిప్రాయము కలిగియుండవచ్చును. భాషాచరిత్రము ననుసరించి సంస్కృతము ప్రాకృతము లకు మూల మగుటచే ప్రాకృత వైయాకరణులు "ప్రకృతిః సంస్కృతమ్", "శేషః సంస్కృతాత్" అను మొదలగు సిద్ధాంతములను వ్యాకరణములలో బొందుపరచియున్నారు. ద్రావిడ వ్యాకరణ కర్తలు సంస్కృతద్రావిడభాషలను విమర్శింపక, సంస్కృత ద్రావిడభాషల తత్త్వమును గ్రహింపక కేవలము సంస్కృతభాషయందలి గౌరవముచేతనో, కేవలము ప్రాకృతవ్యాకరణమార్గము ననుసరించియో ద్రావిడ భాషలకు సంస్కృతము ప్రకృతి యని నుడివిరి.

ప్రాకృతవైయాకరణులు ప్రాకృతభాషలలోని పదజాతమును సంస్కృతసమము లనియు, సంస్కృత భవము లనియు, తద్భిన్నములగు దేశ్యము లనియు మూడువిధములుగా విభాగము చేసియున్నారు. వర్ణవి పరిణామములను పొందక స్వస్వరూపముతో ప్రాకృత మున వ్యవహరింపబడు సంస్కృతపదములు తత్సమము లనబడుచున్నవి. ఉదా॥ కమలో, తరలో. కొన్ని వర్ణవి పరిణామములను పొంది ప్రాకృతమున వ్యవహరింపబడు సంస్కృతపదములు తద్భవము లనబడుచున్నవి. ఉదా॥ అచ్ఛి, హత్థో, పుఢమమ్. సంస్కృతసంబంధమేమియు గానరాక యనాదిసిద్ధముగా భాషలో వ్యవహరింపబడు చున్న శబ్దములకు దేశ్యము లని పేరు. ఉదా॥ ఊహో, పొట్టమ్, మంగుసో. సంస్కృతసంబంధ మేమియును లేకపోవుటచే నీపదములకు ప్రకృతిప్రత్యయవిభాగము కాని, వ్యుత్పత్తిగాని లేదని వ్యాకరణకర్తల యభిప్రా యము. సంస్కృతవైయాకరణులు సంస్కృతపదము లకు వ్యుత్పత్తిని బోధించియున్నారు. ప్రాకృతవైయా కరణు లట్టి ప్రయత్నమును జేయలేదు. ప్రాకృతములు సంస్కృతభవములు కనుక వారి కట్టి ప్రయత్న మనవ సరమయ్యెను. దేశ్యపదములు సంస్కృతసంబంధము లేనివగుటచే నవ్యుత్పన్నము లనబడెను. ఇవి యార్య భాషాశబ్దములు కాకపోవుటచే వీనిని వ్యాకరణమున విమర్శింప నావశ్యకత లేకపోయెను.

ఈప్రకారముగానే ద్రావిడభాషా వ్యాకరణ కర్తలుకూడ నాభాషలలోని పదములను తత్సమము లనియు, తద్భవము లనియు, దేశ్యము లనియు మూడు విధములుగా విభజించియున్నారు. తత్సమతద్భవదేశ్య పదములకు ప్రాకృతవైయాకరణులవలెనే నిర్వచనమును చెప్పియున్నారు. వర్ణవిపరిణామములను పొందక ద్రావిడ భాషలలో ప్రయోగింపబడు సంస్కృతపదములకు తత్స మము లని పేరు. ఉ॥ తెలుగు–రాముడు, విద్య, పిత; కన్నడము–వన, ధన, వస్త్ర; తమిళము– కమలమ్, కారణమ్. ఇచ్చట సంస్కృతపదములు స్వస్వరూపము తోడనే ద్రావిడవిభక్తులను గ్రహించినవి. కొన్ని వర్ణ విపరిణామములను పొంది ద్రావిడభాషలలో ప్రయో గింపబడు సంస్కృతపదములకు తద్భవము లని పేరు. ఉ॥ తెలుగు–ఆకసము (సం. ఆకాశః), మెకము (సం. మృగః), వంకర (సం. వక్రః), మరుడు (సం. స్మరః); కన్నడము-పయణ (సం. ప్రయాణమ్), బీది (సం. వీథి); తమిళము–చుత్తమ్ (సం. శుద్ధమ్), చట్టి (సం. షష్టి); పిచ్చై (సం. భిక్షా). ఈ తద్భవశబ్దములలోని వర్ణవిపరి

ణామములు చాలవరకు ప్రాకృతతద్భవములలోని వర్ణవి
పరిణామములకు సమానముగా నున్నవి. తత్సమ
తద్భవములు కానటువంటియు (అనగా సంస్కృత
సంబంధ మేమియు కనబడనట్టియు), దేశవ్యవహారసిద్ధ
మైనట్టియు పదములకు దేశ్యము లని పేరు. ఉ॥ తెలుగు
—ఊరు, మేడ, ఇల్లు; కన్నడము— మనె, హాల,
నెల; తమిళము—ఊర్, మనై, తరై. ఇట్లు ద్రావిడ
వైయాకరణులు ద్రావిడ భాషల తత్త్వమును పరిశీలిం
పక, పదముల వ్యుత్పత్తిని విమర్శింపక, ప్రాకృత వైయా
కరణుల ననుసరించి ద్రావిడభాషాపదములను విభజించి
యా పదసామ్యమునే యాధారముగా జేసికొని ద్రావిడ
భాషలు సంస్కృతజన్యము లని సిద్ధాంతమును జేసిరి.
ద్రావిడభాషలకు స్వతఃసిద్ధములగు పదము లేవియో
నిర్ణయించుటకు ప్రయత్నము చేయక ప్రాకృతములకు
స్వతఃసిద్ధములగు పదముల నాధారముగా జేసికొని యవి
సంస్కృత భవములని ప్రాకృత వైయాకరణులు చెప్పిన
దానిని పురస్కరించుకొని ద్రావిడభాషలకు స్వతఃసిద్ధము
లు గాని పదముల నాధారముగా జేసికొని వీనినిగూడ సం
స్కృతజన్యములని తలంచిరి. సంస్కృతభాషయం దుం
డెడి గౌరవమే వీరి నిట్లు పెడమార్గమున బెట్టినది. ద్రావిడ
భాషలకు దొలుత వ్యాకరణములను రచియించినవారు
సంస్కృతపండితు లగుటవలన ద్రావిడభాషల కీ యవస్థ
సంభవించినది. ఆధునిక భాషాశాస్త్ర సిద్ధాంతముల
ననుసరించి పరిశీలించినచో ద్రావిడభాషలకును,
సంస్కృతమునకును జన్యజనకభావసంబంధము లేదని
మనకు స్పష్టము కాగలదు.

భాషలకు జన్యజనకభావసంబంధమును నిర్ణయిం
చునది కేవల పదసామ్యము కాదు. వ్యాకరణ
సామ్యము. ఇది ముఖ్యముగా నుండవలయును. వ్యా
కరణసామ్య మనగా ప్రత్యయములలోను, పదవ్యుత్పత్తి
యందును, వాక్యసంఘటనా రీతిలోను సామ్య మని
యర్థము. ఏదేని యొక భాష భాషాంతరములనుండి
పదములను యథేష్టముగా స్వీకరించును. ప్రత్యయము
లను, వాక్యసంఘటనారీతిని మాత్రము గ్రహింపదు.
ఇదియే భాషకు స్వతఃసిద్ధ మైనది. ఇదియే భాషకు
ప్రాణమని చెప్పవచ్చును. తెనుగుభాషలో ననేకాంగ్ల
పదములు ప్రవేశించినవి. కాని ప్రత్యయములును, పద
పదార్థ సంబంధమును దెలుపు రీతియును ప్రవేశింప
లేదు. మనము "నారూములో" అని ప్రయోగింతుము
కాని "ఇన్ నా గది" యని చెప్పము కదా
"బుక్కులు" అందుము కాని "పుస్తకస్" అనము
కదా! "ఫీవర్ తో బాధపడుచున్నాడు" అందుము
కాని "విత్ జ్వరము బాధపడుచున్నాడు" అనము
కదా! "లైట్ లో నూనె యున్నదా?" అందుము
కాని "ఇన్ దీపము నూనె యున్నదా" అనము కదా!
"డేకి అయిదణాలు కూలి" అందుము కాని "పర్
దినము అయిదణాస్ కూలి" అనము కదా! "నన్ను
ట్రబుల్ చేస్తున్నాడు" అందుము కాని "నన్ను ఇన్
బాధ ఇంగ్" అనము కదా! అందుచే వ్యాకరణసామ్య
మున్నచో భాషలకు సంబంధమును నిశ్చయింపవలయును
కాని పదసామ్య మున్నంత మాత్రమున నిశ్చయింప
రాదు. ఇదియే ద్రావిడ వైయాకరణులు గమనింపని
విషయము.

ద్రావిడభాషలకును, ఆర్యభాషలకును పదజాత
ములో విశేషసంబంధ మున్నను ప్రత్యయములలోను,
పదపదార్థ సంబంధబోధక రీతులలోను సామ్యము లేక
పోవుటచే అవి భిన్నకక్ష్యలకు చెందిన వని యంగీకరిం
పక తీరదు. మొట్టమొదట ప్రత్యయకల్పన (Concep-
tion) లోనే ఆర్యద్రావిడభాషలకు భేదము కలదు.
ఆర్యభాషలలో ప్రత్యయము లనేకార్థ సూచకములుగా
నుండగా ద్రావిడభాషలలో నవి యేకార్థసూచకము
లుగా నున్నవి. సుప్ప్రత్యయము లన్నియును ఆర్య
భాషలలో వచనవిభక్త్యర్థములను రెంటిని తెలియ
జేయుచున్నవి. 'భిస్' అనునది తృతీయార్థమును, బహు
త్వమునుగూడ సూచించుచున్నది. 'స్య' అనునది
షష్ఠ్యర్థము, నేకత్వమునుగూడ సూచించును. ఇట్లే తిఙ్
ప్రత్యయములు పురుషవచనములను రెంటిని సూచించు
చున్నవి. 'మస్' అను ప్రత్యయము ఉత్తమపురుషను,
బహువచనమును సూచించును. 'థస్' అను ప్రత్యయము
మధ్యమ పురుషను, ద్వివచనమునుగూడ సూచించును.
ద్రావిడభాషలలో నీసంప్రదాయ మగపడదు. విభక్తిని
సూచించుటకును, వచనమును సూచించుటకును విభిన్న

ప్రత్యయములు కలవు. తృతీయాబహువచనమున 'లు' (ల) అనునది బహువచనమును, 'చేత' యనునది తృతీయార్థమును ప్రత్యేకముగా సూచించుచున్నవి. షష్ఠ్యేకవచనమున 'కు' యనునది షష్ఠ్యర్థమును మాత్రము సూచించును. బహువచన ప్రత్యయము చేర్చకపోవుటచే ఏకవచనము సూచింపబడుచున్నది. బహుత్వమును సూచించుటకు ప్రత్యేకప్రత్యయ ముండుటచే దాని యభావమే యేకత్వమును సూచించును. తిజంతములలో సర్వనామైక దేశములగు ను (నేను), ము (మేము), వు (నీవు), రు (మీరు) మొదలగునవి క్రియాపదముల చివరను చేరుటచే పురుషవచనములు రెండును వానిచే సూచింపబడుచున్నను పదైకదేశమును ప్రత్యయముగా నుపయోగించుట ఆర్యభాషాసంప్రదాయ విరుద్ధము. తి, అన్తి, సి, థ అను మొదలగు ప్రత్యయములకును, తత్తత్పురుషవచనములలోని సర్వనామములకును సంబంధ మేమియును కనబడదు. ఇట్లే కొన్ని విభక్తిప్రత్యయములు ద్రావిడభాషలలో పదసమానాకారములుగా నుండగా నార్యభాషలలో విభక్తి ప్రత్యయముల కెట్టి పదములతోడను సంబంధ మగపడదు.

మరియు ద్రావిడభాషలలో నొక యర్థమున నొకే ప్రత్యయ ముండగా ఆర్యభాషలలో ఒకే యర్థమున ననేకప్రత్యయములు గూడ గలవు. తృతీయా బహువచనమున సామాన్యముగా శబ్దము లన్నిటికిని 'భిస్' అను ప్రత్యయము చేరుచుండగా అకారాంతశబ్దములకు మాత్రము 'ఐస్' అను ప్రత్యయము వచ్చి చేరును. షష్ఠ్యేకవచనమున అకారాంతశబ్దములకు 'స్య' అను ప్రత్యయముండగా, తదితరశబ్దములకు 'అస్' అను ప్రత్యయము కలదు. ప్రథమా ద్వితీయావిభక్తులలో పుంలింగ స్త్రీలింగ నపుంసకలింగశబ్దములకు ప్రత్యయభేదము కలదు. విభక్త్యంతరములలోకూడ నేకవచనమున పుంలింగస్త్రీలింగశబ్దములకు ప్రత్యయభేదము కలదు. తిజ్ ప్రత్యయములలో గూడ నిట్లు ప్రత్యయ బాహుళ్య మార్యభాషలలో కలదు. పరస్మైపది ఆత్మనేపది ధాతువులకు ప్రత్యయభేదము కలదు. లిట్టునకును, లోట్టునకును విశిష్టప్రత్యయములు కలవు. ఇట్లు శబ్దభేదమునుబట్టియు, కాలభేదమును బట్టియు సుప్ తిజ్ ప్రత్యయములు మారుచుండుట ద్రావిడభాషలలో గనబడదు. ప్రత్యయములకు పదసంబంధము కాని, పదైకదేశసంబంధము కాని కనబడకపోవుటచే నీవిధమగు ప్రత్యయ బాహుళ్య మార్యభాషలలో సంభవించినది.

ఈ సుప్ తిజ్ ప్రత్యయములు శబ్దములకును, ధాత్వంగములకును చేరునప్పుడు వీనియందును, ప్రత్యయములయందును వర్ణవిపరిణామము లార్యభాషలలో కలుగుచుండును. ద్రావిడ భాషలలో నిట్టి వర్ణవిపరిణామములు సంభవింపవు. షష్ఠ్యేకవచనమున హలంత శబ్దములకు 'అస్' అను ప్రత్యయము స్వస్వరూపముతో నుండగా (ఉ॥ మరుతః, ఆత్మనః) ఇకారాంత-ఉకారాంత- ఋకారాంత శబ్దములలో అకారమును కోలుపోయి కేవల 'స్' అను రూపముతో గన్పట్టుచున్నది (ఉ॥ హరేః, శంభోః, పితుః). 'విద్వస్' శబ్దము తృతీయాదివిభక్తులలో అజాది ప్రత్యయముతో చేరునప్పుడు 'విదుష్' అను రూపమును, హలాది ప్రత్యయముతో చేరునప్పుడు 'విద్వత్' అను రూపమును పొందుచున్నది. 'అస్' ధాతువు ప్రథమపురుషైకవచనమున స్వస్వరూపముతో కనబడుచున్నది. కాని ద్వివచన బహువచనములలో అకారమును కోలుపోయి కేవల 'స్' కార రూపమున కనబడుచున్నది (చూ: అస్తి, స్తః, సన్తి). 'ఇ' ధాతువు ప్రథమపురుషలో ఏకవచనమున 'ఏ' అను రూపమునను, ద్వివచనమున 'ఇ' అను రూపమునను, బహువచనమున 'య్' అను రూపమునను నున్నది కదా (చూ: ఏతి, ఇతః, యన్తి). కృధాతువు కొన్ని తిజంత రూపములలో స్వస్వరూపముతోడను, మరికొన్ని రూపములలో 'క్ర' అను రూపముతోడను, ఇంక కొన్ని రూపములలో 'కర్' అను రూపముతోను, వేరు కొన్ని రూపములలో 'కార్' అను రూపముతోను కనబడుచున్నది. ఇట్టి భేదములు ద్రావిడభాషలలో కనబడవు.

ద్రావిడభాషలలో మరియొకవిధమగు వర్ణవిపరిణామ మగపడుచున్నది. ప్రాతిపదికయందలి స్వరమునుబట్టి యొకప్పుడు ను, కు అను విభక్తులు ని, కి అను రూపములను పొందుచుండును. ఉ॥ హరిని, శంభును; హరికి, శంభునకు. ఇట్లు పూర్వస్వరమున

కనుగుణముగా నుచ్చారణ సౌకర్యార్థ ముత్తరస్వరము నకు విపరిణామ మార్యభాషలలో సంభవింపదు. ఉ॥ శంభుషు, హరిషు. పైని వివరించిన యార్యభాషల లో సంభవించు స్వరవిపరిణామమునకును, ద్రావిడభాష లలో సంభవించు నీ యచ్చుల మార్పునకును సాదృశ్య మేమియును లేదు. రెండును విభిన్నజాతీయములు. భాషలలో సంభవించు వర్ణవిపరిణామములు రెండువిధ ములు: కొన్ని స్వతంత్రము లైనవి; మరికొన్ని వర్ణాంతర కార్యరూపము లైనవి. 'స్తః' అను తిజంత రూపములోని అకారలోపమును, 'విదుష్' అను ప్రాతి పదికలోని అకారలోపమును స్వతంత్రములైనవి; వర్ణాంతరకృతములు కావు. కాని హరిని, హరికి అను సుబంత రూపములలోని యంత్యవర్ణ విపరిణామము తత్పూర్వాక్షరములోని ఇకారజనితము. అందుచే నీ రెండు విధములగు వర్ణవిపరిణామములకును సామ్య మేమియును లేదు. కాబట్టి యివి భాషాసంబంధమును సూచింపజాలవు.

విభక్తి ప్రత్యయముల స్వరూపమునగూడ ఆర్య ద్రావిడ భాషలకు సంబంధ మేమియును లేదు. ద్రావిడ భాషలలో విభక్తిప్రత్యయము లనబడు రూపములను పరిశీలించినచో నవి స్వతంత్ర ప్రయోగార్హములైన పద ములుగానో, పదావయవములుగానో కనబడుచున్నవి. ఈ ప్రత్యయములు నిజముగా ప్రత్యయము లనదగి యుండలేదు. ఆర్యభాషా సంప్రదాయమును కేవల మనుసరించి ప్రత్యయము లనబడినట్లు తోచుచున్నవి. ఆర్యభాషలలో ప్రత్యయములు స్వతంత్ర ప్రయోగార్హ ములైన పదములుగా లేవు. పదభాగము లనికూడ మనము నిరూపింపలేము. ఈ ప్రత్యయముల యతి ప్రాచీనరూపములను గ్రహించినను వానికి సంబంధించిన పదములను నిరూపించుట సాధ్యముకాదు. కాన నివి నిజముగా ప్రత్యయము లనదగియున్నవి. ఇట్లే తిఙ్ ప్రత్యయములుకూడ సంస్కృతమున ప్రత్యయము లన దగియుండగా ద్రావిడభాషలలో తిఙ్ప్రత్యయము లన బడునవి సంబంధసూచకపదము లనియో, లేక వాని భాగము లనియో మనము నిరూపింపవచ్చును. వీనిలో గూడ పూర్వమందలి ధాత్వాదులలోని స్వరబలముచే గలుగు మార్పులేకాని వాని స్వరూపమును గుర్తుపట్ట లేనంత వర్ణవిపరిణామములు కలుగలేదు. ఇట్లు ద్రావిడ భాషలలో సుబంతతిఙంతములు సమస్తపదము లనదగి యున్నవి. ఆర్యభాషలలో నిట్లు తలంచుటకు సూచన కనబడదు. సుప్ తిఙ్ ప్రత్యయములేకాక తదితరములగు తన, కడ, మి (మెయ్), పడి, వు (అగు) మొదలగు ప్రత్య యములుకూడ ద్రావిడభాషలలో పదము లని కాని, పదైకదేశము లని కాని సులభముగా నిరూపింపవచ్చును. అందుచే ద్రావిడభాషలు సంశ్లిష్టపదభాష లనియు (Agglutinating languages), ఆర్యభాషలు సంయుక్త పద భాష లనియు (Amalgamating languages), ప్రత్యయ యుక్త భాషలనియు (Inflexional languages) చెప్పబడు చున్నవి. ఈ రెండు భాషలకును పదవ్యుత్పత్తియందు సామ్య మేమియును లేదు.

భాషలకు సంబంధమును నిర్ణయించుటకు పైని వివరించిన పదనిష్పత్తిలో సామ్యము ముఖ్యముగా నుండవలయును. అది లేనియెడల నా యా భాషలకు సంబంధము లేదని నిశ్చయముగా మనము చెప్పవచ్చును. పదసామ్యమును బట్టికూడ భాషలకు సంబంధమును మనము నిర్ణయింపవచ్చును కాని యందు ప్రమాద పడుట కవకాశము కలదు. ఆ యా భాషల నుపయో గించు జనుల కుండు సంబంధ తారతమ్యమును బట్టి యొక భాషలోని పదము లింకొక భాషలోనికి అధికము గానో, స్వల్పముగానో ప్రవేశించుచుండును. తదితర ద్రావిడభాషలకంటె తెనుగునకు సంస్కృతప్రాకృతము లతో సంబంధ మధికమగుటచే సంస్కృత ప్రాకృత పదము లధికముగా దెనుగుభాషను ప్రవేశించినవి. అత్యంత విప్రకృష్టములగు దేశములలో నున్న జనులకు గూడ నేదోయొక కారణవశమున సాంగత్య మేర్పడినచో వారి భాషలు సాంకర్యమును పొందును. ఇట్లు మన దేశమునకు వచ్చి కొన్ని దినములు నివసించియుండు టచే పారశీకుల, తురుష్కుల, ఆంగ్లేయుల భాషలలోని పదము లెన్నియో తెనుగు భాషలో ప్రవేశించినవి. ఇట్టి కృత్రిమపదముల నాధారముగా జేసికొని భాషలకు సంబంధమును నిర్ణయించుటకు వలనుపడదు. భాషలకు అనాదిసిద్ధములగు పదములను గ్రహించి వానిలో

సాదృశ్యము కనబడినచో పరస్పర సంబంధమును మనము నిర్ణయింపవచ్చును. కాని యాయా భాషలను మనము సాకల్యముగా దెలిసికొనిన గాని వానిలో భాషాంతరములనుండి స్వీకరింపబడిన పదము లేవియో, స్వతఃసిద్ధములైన పదము లేవియో చెప్పజాలము. అట్లు తెలిసికొనలేనప్పుడు పదసామ్యమును పరిశీలించి సంబంధమును నిర్ణయించుటలో ప్రమాదము సంభవింప వచ్చును. కేవల స్వీకృత పదములను పరిశీలించి సంబంధ నిర్ణయమును చేయుట సంభవింపవచ్చును. కాబట్టి నూతనముగా మనకు గనబడు భాషలకు సంబంధించి పదసామ్య విమర్శనము చేయుట యసాధ్యమనియే చెప్పవచ్చును. కాని యేపదములు ప్రతి భాషకును స్వతఃసిద్ధములుగా నుండునో, అనగా నేపదములు భాషాంతరములనుండి స్వీకరించుట కవసరము కలుగదో యట్టి పదములలో సామ్య మగపడినచో భాషలకు సంబంధమును మనము నిర్ణయింపవచ్చును.

సామాన్యముగా నీక్రింది జాతిపదములు భాషలకు స్వతఃసిద్ధములుగా నుండునని భాషాశాస్త్రజ్ఞులు నిశ్చయించి యున్నారు.

౧. సర్వనామములు.

౨. మొదటి నాలుగైదు సంఖ్యావాచకపదములు.

౩. సన్నిహిత సంబంధవాచకపదములు; శరీరావయవ వాచకపదములు.

౪. తరచుగా ప్రతిదేశమున నగపడు వస్తువుల యొక్కయు, జీవరాసులయొక్కయు పేర్లు.

పై జాతి పదములలో సామ్య మగపడినచో భాషలకు పరస్పర సంబంధము కలదనియు, నివి యొక కక్ష్యకు చేరిన వనియు మనము సామాన్యముగా నిశ్చయింపవచ్చును. ఆర్య ద్రావిడభాషలకు పై జాతి పదములలో సామ్యము లేదని నిరూపించుటకు కొన్ని పదములు క్రింద నుదాహరింపబడినవి.

### సర్వనామములు

| తెనుగు | అరవము | కన్నడము | సంస్కృతము | గ్రీకు | లాటిను |
|---|---|---|---|---|---|
| నేను | నాన్ | నాను | అహమ్ | egō | ego |
| నీవు | నీ | నీవు | త్వమ్ | tu | tū |
| వాడు | అవన్ | అవను | సః | (s)o | (ip)se |
| ఆమె | అవళ్ | అవళు | సా | (s)ē | (ip)sā. |
| అది | అదు | అదు | తత్ | to | (is)tud |

### సంఖ్యావాచకములు

| తెనుగు | అరవము | కన్నడము | సంస్కృతము | గ్రీకు | లాటిను |
|---|---|---|---|---|---|
| ఒకటి | ఒన్ఱు | ఒందు | ఏ(క) | oi(nē) | oi(nos) |
| రెండు | ఇరండు | ఎరడు | ద్వా | duō | duō |
| మూడు | మూన్ఱు | మూరు | త్రయః | treis | trēs |
| నాలుగు | నాన్గు | నాలక్కు | చత్వారః | tettares | quattuor |
| ఐదు | ఐందు | ఐదు | పంచ | pente | quinque |
| పది | పత్తు | హత్తు | దశ | deka | decem |

### సంబంధవాచకములు

| తెనుగు | అరవము | కన్నడము | సంస్కృతము | గ్రీకు | లాటిను |
|---|---|---|---|---|---|
| తల్లి | తాయ్ | తాయి | మాతా | mētēr | māter |
| తండ్రి | తగప్పన్ | తందె | పితా | patēr | pater |
| అన్న | అణ్ణన్ | అణ్ణ | భ్రాతా | phrātēr | frāter |
| అక్క | అక్క | అక్క | స్వసా | ... | soror |
| [మగడు] | మగన్ | మగ | సూనుః | sūnus(లిథు) | sunus(గాథి) |
| [కూతురు] | మగళ్ | మగళు | దుహితా | thugatēr | ... |
| మామ | మామా | మావ | శ్వశురః | (s)ekuros | socer |

## ఆర్యద్రావిడభాషలు

### అవయవవాచకములు

| తెనుగు | అరవము | కన్నడము | సంస్కృతము | గ్రీకు | లాటిను |
|---|---|---|---|---|---|
| తల | తలై | తలె | శిరః | karā | cere(brum) |
| కాలు | కాల్ | కాలు | పత్,పాద | poda | pedem |
| మండ | మళం | మండి | జాను | gonu | genu |

### జంతువాచకములు

| తెనుగు | అరవము | కన్నడము | సంస్కృతము | గ్రీకు | లాటిను |
|---|---|---|---|---|---|
| ఆవు | ఆ | ఆ | గౌః | bous | bōs |
| గొఱ్ఱె | మఱి | కురి | అవిః | ois | ovis |
| నాయి | నాయ్ | నాయి | శ్వా | kuōn | canis |
| ఎలుక | ఎలి | ఎలి | మూషః(కః) | mūs | mūs |
| గుఱ్ఱము | కుదిరై | కుదిరె | అశ్వః | ippos | equos |
| [ఎలుగు] | కరడి | కరడి | ఋక్షః | arktos | ursus |
| పొగ | పొగై | హొగె | ధూమః | thumos | fūmus |
| సన్నని | సన్న | సణ్ణ | తను | tenu | tenuis |

వైవిధముగా పదములలోగాని, పద నిష్పత్తిలో గాని పోలిక యణుమాత్రమును లేని ఆర్యద్రావిడ భాషలకు జన్యజనకభావ సంబంధము కాని, సమాన జన్యత్వ సంబంధము కాని, ఏక కుటుంబత్వ సంబంధము కాని లేదని మనము దృఢముగా చెప్పవచ్చును. ప్రాకృత వైయాకరణులు ద్రావిడ భాషను ప్రాకృతములలో చేర్చుట కాని, ఆంధ్ర వైయాకరణులు తెనుగును సంస్కృత వికృతములలో చేర్చుట కాని సరికాదని మనము విశ్వసింపవచ్చును. వారుస్థూలదృష్టితో పదసామ్యమును చూచి యట్లు చెప్పియుండవలయును. నిజముగా ఆర్యద్రావిడభాషలు వేరువేరు కక్ష్యలకు (కుటుంబములకు) చెందిన భాష అని చెప్పదగియున్నవి. ఈ విషయమును మనవారు చాలకాలము క్రిందటనే కనిపెట్టియున్నారు. కుమారిలభట్టు పదసామ్య మున్నను ఆర్యమ్లేచ్ఛ (ద్రావిడ) భాషలకు సంబంధము లేదని తన తంత్రవార్తికమున నుడివియున్నాడు.



ఒండుమట్టితో చేసిన ప్రతిమలు



శిల్పి : శ్రీ మొక్కపాటి కృష్ణమూర్తి

## కామినియా స్నో

(రిజిష్టర్డు)

మీ ముఖమునకు వికాసము, మృదుత్వము కలిగించును. మచ్చలను తొలగించును. చర్మమున ముడతలు మోటుతనము లేకుండా చేయును. ఒకసారి వాడిన మీకు సంతృప్తి కలుగును.



## ఓడ్లున్స్ నెప్రైన్ సాల్వ్

(రిజిష్టర్డు)

వివిధరకముల నొప్పులకు వజ్రాయుధము. తలనొప్పి, రొమ్ము, వెన్నునొప్పులకు ప్రత్యేకముగా వాడబడుచున్నది. దగ్గు, పడిసెములకు గూడ అద్భుతముగా గుణ మొసంగును. ఆర్డరులు ఈ దిగువ ఎడ్రెసుకు పంపుడు :—

ANGLO INDIAN DRUG & CHEMICAL Co,
285, Jumma Masjid, Bombay 2.

# ఒరిజినల్ వీల్ మార్కు వజ్రములు

చెన్నీస్ స్పెషల్ వజ్రములు కేటలాగు




మిక్కిలి శ్రేష్ఠమైనవి ఉచితము

**WHEEL MARK DIAMONDS & CHENNI'S SPECIAL DAIMONDS**
**STANDS FOR BRILLIANCE**

ఇన్వెస్టర్స్: చెన్నీస రాధాకృష్ణ అండ్ కంపెనీ,
సరాబు వ్యాపారం, నెం. 17, పెద్దబజారు, తిరుచినాపల్లి,

**Worder!** అద్భుతము!
**"SCORPIONO" తేలుమందు "స్కార్పియానో"**

నాలుకమీద మాత్రలు వేసిన వెంటనే విషము దిగిపోవును. ఇదివరకు ఇట్టి మందులేదు. 12 సంవత్సరములనుంచి వాడబడి అనేక యోగ్యతాపత్రముల పొందిన దివ్యౌషధము. ఇందు విష గంధకాదులులేవు పసిపిల్లలకు గర్భిణీస్త్రీలకు వాడవచ్చును,
అనేకమంది వాడి ఆశ్చర్యపడి వున్నారు. వాడిన వారికే తెలియును, సీసా 1 కి రు. 0-12-0.

**"STOMOKOL" అజీర్ణాంకుశము "స్టమకాల్"**

అన్నివిధములైన అజీర్ణములకు, కడుపుబ్బరములకు, అపానవాయువులకు అంకుశమువంటిది. సాధారణముగ అందరకువచ్చు అజీర్ణవ్యాధులకు దీని వాడినచో డాక్టర్లకు చెల్లించు బిల్లులను తగ్గించుకోవచ్చును. పిల్లలవ్యాధులకు అమోఘముగ పనిచేయును. మీకు విందుల భయమేకలుగదు. భోజనానంతరము 4 మాత్రలు చప్పరించిన భోజనమువలన కలుగు ఆయాసం మాయమైపోవును. ఏదుర్గుణములు ఈ మందువలన కలుగవు. సీసా 1 కి రు. 0-12-0

ఉపేంద్ర అండు కంపెనీ, కెమిస్టుస - గుంటూరు బ్రాంచి - బెజవాడ.



మందహాసవదనారవిందులైన గాంధీమహాత్ముడు

ఆగాఖాన్ భవనమునుండి విడుదలైవచ్చినపిమ్మట జూహూలో బంధుమిత్రపరివారమున కిచ్చిన దివ్యదర్శనము



# తెలుఁగులో సొగసులు

= శ్రీ శతావధాని చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి =

తెలుఁగుభాషలో వుండే సొగసు వివరించవలసివస్తే వొక్క తెలుఁగుమాత్రమే తెలిసిన మానిసికి శక్యం కాదు. మఱి కొన్ని భాషలుకూడా రావలెను. నాకు తెలుఁగుతోపాటో, అంతకంటె కొంచెం హెచ్చో సంస్కృతంలో ప్రవేశం వుంది. యింకేదీ రాదు. నన్నుదీన్ని గూర్చి వ్రాయవలసిందని మాశంభుప్రసాదుగారు కోరిరి. అందుచేత వ్రాయడం తప్పింది కాదు.

యెవరి భాష వారికి సొగసుగా వున్నట్లు తోఁచడం సహజం. నేనైతే కొన్ని వందల సంవత్సరాలకు పూర్వం అఱవవాఁడనే. (మాశాఖ తోటఅఱవశాఖ) కాని యిటీవల తెలుఁగు దేశంలోనే మా శాఖ బ్రాహ్మణులు నిల్చిపోయారు. పేరూరిద్రావిళ్లు యింకా అంతో యింతో (యింట్లోనేనా) అఱవం మాట్లాడుకోవడం వుంది గాని మాశాఖవారు లేశమున్నూ ఆజోలి లేని తెలగాణ్యంతో పూర్తిగా యేకీభవించడంచేత నేను తెనుఁగువాఁడనే అయినాను. మాముత్తాత నరసకవిగారు మేలుకోటనుండి ( తిరునారాయణపురం ) మా చెళ్లపిళ్ల కుటుంబం వలసవచ్చినట్లు వ్రాసి వున్నారు. చెల్వము + పిళ్ల కలిసిన సమాసం 'చెల్వప్పిళ్ల'గా మాఱి తుదకు 'చెళ్లపిళ్ల' క్రింద లోకంలో నిల్చిం దన్నారు.

" మ. ప్రవరుల్ గొందఱు మేలుకోటఁ గల చె
ల్వప్పిళ్లరాయండు......స
ర్వవిశేషంబుల వృద్ధిఁ బొంది రిలఁ జె
ల్వప్పిళ్లవా రంచనన్.

తే. గీ. అది మొదలుగాఁగ సకలజనానుమతిని
వినుతి దగెఁ జెళ్లపిళ్లవారను సమాఖ్య"

(వేంకటేశ్వర విలాసము)

కృష్ణదేవరాయలు కన్నడీయుఁడై కూడా తెనుఁగునే ప్రేమించినప్పుడు నేను యెన్నితరాలనాఁడో అఱవవాఁడనైనా తెనుఁగును అభిమానించవచ్చును. కాని నా అభిమానం అట్టిది కాదు. మొదట నాకు తెలుఁగంటే కొంత యీసడింపుగా వుండేది. తెలుఁగుకవి అని న న్నెవరేనా అంటే అది నన్ను తిట్టినట్టుగా భావించేవాణ్ణి. తెలుఁగుపండితుఁడుగా 13 యేండ్లు బందరు హిందూహైస్కూల్లో వున్నాను గాని ఆపేరు నేనెక్కడా వ్రాసికొనే లేదు. అవధానాలలో (యెవరేనా కోరితే చెప్పక తప్పదుగదా!)తప్ప యితరత్ర మేం తెలుఁగు చెప్పేవాళ్లం కాము. సర్వాత్మనా మాకు (తి. వెం. కవులకు) సంస్కృతమందే అభిమానం. దాని క్కారణం మేము గురుకులవాసం చేసి చదువుకొన్న విద్య సంస్కృతం కావడమే. యిప్పుడేనా కేవలం తెలుఁగుమాత్రమే తెలిసి కవిత్వం చెప్పేవారి యందు మాకు- కాదు, నాకు- కొంత నిస్సారమే. యిటీవల కొన్ని యేండ్ల క్రిందట నాకు "తెలుఁగుకూడా గౌరవించతగ్గదే" అనే అభిప్రాయం గలిగింది కాని అది కేవల తెలుఁగు కాదు.

" తే. గీ. తెలుఁగు తెలుఁగని యద్దాన దిసులె కాని
సంస్కృతమ్మనకన్నఁ గష్టమ్ము హెచ్చు

ఒక్కదానఁ బరిశ్రమ మున్నఁ జాలు
దాని; కిద్దానికో! రెంటఁ దనలవలయు"
(పాణిగృహీత)

శ్రీనాథాదులవలె సంస్కృతపాండిత్యంతో మిళితమైన తెలుఁగు చెప్పవారు గౌరవనీయు లని మా తాత్పర్యం. సంస్కృతంలో నిశితమైన సాహిత్య సౌహిత్యం లేని కవులను శ్రీనాథునితో యెవరేనా పోల్చినా, వారే పోల్చుకున్నా అది నాకు లజ్జను కలిగించును.

"క. కేవల సంస్కృతమర్యా
దావిదులును కేవలాంధ్రతత్త్వరులును గా
కేవార లుభయభాషా
కోవిదు లవ్వారు దీనికురువులు జగతిన్."
(దేవీ భా.)

యీవిధంగా కొన్నాళ్లకు అభిప్రాయం మాఱింది గాని యింతమాత్రంచేత తెలుఁగులో సంస్కృతంకంటేకూడా సొగసెక్కువ వుందనే అభినివేశం కలిగినట్లు లేదు. శ్రీనివాసవిలాసాంధ్రీకరణంనాఁటికి ఆయీ యభిప్రాయం మొలక యెత్తినట్లు యీ క్రిందిపద్యము తెల్పును:

"ఉ. కావ్యము గాని నాటకముగాని మఱొక్కటి గాని తెల్గునన్
శ్రావ్యముగా నెసంగదు పురాణము తెల్గొనరించినన్ గడున్
శ్రావ్యతగాంచి యొప్పెసఁగి సంస్కృతమంగని గెలిసేయు..."

దీని తాత్పర్య మేమంటే? భారతాదులు వ్యాసకృతమైన సంస్కృతంలోకంటేకూడా తెలిఁగించిన నన్నయాదులవే హృద్యంగా వుంటాయని. కారణ మేమంటే: వినీవినడంతోనే తాత్పర్యం తెలిసే మాతృభాషగదా తెలుఁగు? సంస్కృతమో? అభ్యాససాధ్యం. అందుచేత సర్వసామాన్యంగా ఆనందాన్ని కలిగించదు. "అన్య దాలోచనామృతం"వంటి దన్నమాట. తెలుఁగో? "ఆపాతమధురం" వంటిది. అనఁగా సంగీతంవంటి దన్నమాట. (ప్రతి తెలుఁగున్నూ కాదు. ప్రసాదగుణం కలదైతేనే) విశేషాంశాలు కొకపోయినా ముఖ్యతాత్పర్యం యేమాత్రం అక్షరజ్ఞానమున్నా చక్కనికవిత్వమైతే తెలిసిపోతుంది, చూడండి:

"క. దేవసములైన యనుజుల
తో విప్రులతో రథాళితో వచ్చి యరణ్యావాసము చేసెదు ధర
ణీవల్లభ! నీవు ధర్మనిష్ఠితబుద్ధిన్" (నన్నయ్య)

"క. ఆపద గడవం బెట్టఁగ
నోపి శుభంబైన దాని నొడఁగూర్పఁగ మా
కీపుట్టువునకుఁ బాండు
క్ష్మాపాలుఁడు నిన్నుఁ జూపి చనియె మహాత్మా." (తిక్కన)

"క. ఈలోకము యగుఁ గొందఱ
కాలోకము గొందఱకు నిహంబును బరమున్
మేలగుఁ గొందఱ కధిపా!
యేలోకము లేదు సూవె యిలఁ గొందఱకున్." (యెఱ్ఱన)

ఆయీమాదిరిపద్యాలు భారతంలో యెన్నో వుంటాయి. వున్నా నేను తఱచు వీట్లనే వుదాహరించడాని క్కారణం నాకు నోటికి వచ్చి వుండడమే. యివి త్వరగా తాత్పర్యం బోధించి జనసామాన్యానికి ఆనందాన్ని కలిగించడంచేత "తెలుఁగు సంస్కృతముం గని గెలిసేయు" అని కూడా వ్రాయవలసి వచ్చింది. యింకా యీలాటి వెన్నో నాకు కంఠతః వచ్చిన వున్నాయి సుమండీ! నాయీ వెఱ్ఱిఅభిమానం నాకు పమట్కారాలుగూడా తగిలిస్తూ వుంటుంది. అయినా నేను వీట్లని మెచ్చడం మానలేను. వీట్లకి పోటీగా వ్రాసినవాటెని యీసడిస్తానుకూడా.

అయితే కేవలసంస్కృతాభిమానులు యీమాటను (గెలిసేయు) వప్పుకోరు. పయిగా తెలుఁగు మ్లేచ్ఛభాష అనిన్నీ, యేమో అనిన్నీ, దాన్ని మడిగట్టుకొన్నప్పుడు వుచ్చరింపనే కూడదనిన్నీ వివదిస్తారు. అందుకు నేనున్నూ వారిలోనే కలుస్తాను. మునిఁగిపోయిందేమిటి! తద్దినం, యజ్ఞం వగయిరాలలో సంస్కృతానికే ప్రాముఖ్యం యివ్వండి. ఆనందం కలిగించే సందర్భంలో మనకు పుణ్యపాపాలతో ఆవశ్యకత లేదు. కవిత్వం ఆనందంకోసం పుట్టింది. తటస్థిస్తే పుణ్యం కూడా తటస్థించవచ్చు. ప్రధానం ఆనందం. పుణ్యమో! "నను లక్ష్మీఫల మానుషంగికం"

"అభినవనవనీతస్నిగ్ధ మాపీతదుగ్ధం", లేదా "వాశ్చ్యోతద్ధ్వజధక్" అనే రచనలోకంటె "వెన్నవలెన్ గఱంగు నలి వేణులు" అంటే వెంటనే తాత్పర్యం స్ఫురించి ఆనందో ద్రేకాన్ని కలిగిస్తుంది. పూర్వకాలంలో నాటకాలు మన తెలుఁగుభాషలో లేవు. శాకుంతలం వగయిరా కొందఱు ఆభాషలో మిక్కిలి మృదువైన శైలిలో రచించారు. అందులో శ్లోకం—"యాస్యత్యద్య శకుంతలేతి హృదయం సంస్పృష్ట ముత్కంఠయా" అనేది సభ్యులలో (ఈకాలంలో కాదు. ఆకాలంలోనే) యెందఱికి తెలుస్తుందో, ఆనందం కలిగిస్తుందో ఆలోచించండి. "కొందల మందె డెందము శకుంతల నేఁడు" అన్న పద్యములో అదే అర్థం త్వరలో గోచరిస్తుందంటే రసజ్ఞులు వొప్పకపోరు. కొందఱు డెందము, కొందలము యివిమాత్రం(వ్యావహారికాలుకావుగదా)జనసామాన్యానికి చట్టనగోచరిస్తాయా అని వివదిస్తారు. అందుకే యేమాత్రమో అక్షరాస్యులుగా వుండేవాళ్లకే అన్నాను. కట్టెలమ్ముకొనేవాళ్లకు కాదు. ఇప్పటికంటె ఆకాలం చాలా సంస్కృతపాండిత్యమయంగా వుండేది అని చెప్పేవారితో నేనూ యేకీభవించేవాణ్ణే కాని "ఉద్దామ ద్యుమణి ద్యుతివ్యతికర ప్రక్రీడ దర్కోపల జ్వాలాజాలకరాళ" అనే శైలిలో వ్రాసిన నాటకాలే చాలా వున్నాయి. ఆయీ నాటకాలు ప్రదర్శిం

చేవారో లేదో? ప్రదర్శిస్తే యెవరో వుపాధ్యాయులున్నూ, శిష్యులున్నూ మాత్రమే ఆడియన్సుగా వుండేవా రనుకోవాలి. వారేనా ఆనాఁడు ఆయానాటక శ్లోకాల వ్యాఖ్యానాలు చూచికొని తాత్పర్యం అవగతం చేసికొని వచ్చి కూర్చుండేవారేమో! విజయనగరం మహారాజులుంగారు ఆనందగజపతి భవభూతి ఉత్తరరామచరిత్రాన్ని పండితులచేత ప్రదర్శింపచేశారని విన్నాను. ఆపట్టణంలో తప్ప యితరత్ర ఆప్రదర్శనం చూచేవాళ్లు వుండరు. ఆపట్టణం పండితమయం కదా! ఇది విషయాంతరం.

తెలుఁగుభాష మృదువైనది, మధురమైనది అనడానికి మన తెలుఁగువాళ్లం మాత్రమే కాదు. అఱవవారున్నూ (ఇప్పుడు కాదు) అంగీకరిస్తారు. రాగం అఱవవారు తమ సాంప్రదాయకంగా ఆలాపించినా కృతి త్యాగరాయల తెలుఁగేకదా పాడడం? నా వలె త్యాగరాయలు తెలుఁగును అభిమానించినవాఁడు కాఁడు. మొదట తెలుఁగు (వెల్నాటి) వాఁడే అయినా కృతిరచనాకాలం నాఁటికి శుద్ధ అఱవవాఁడు. ఆలా అయి వుండి దీని కున్న మాధుర్యం అఱవానికి (తెలుఁగు తేట, అఱవం అద్దాన్నం) రాదనియే రచన యావత్తూ తెలుఁగులోనే నడిపించాఁడు. త్యాగరాజు సంస్కృత పండితుఁడయివుండిన్నీ యేకొంచెమో తప్ప దానిలో రచించలేదు. నిన్న మొన్నటిదాఁకా అఱవవారు ఆ కృతులను పాడి పేరు పొందినారు. ఇటీవల "స్వస్థాన వేష భాషాభిమతాః స్సంతః" అన్న శ్లోక పాదానికి వుదాహరణంగా మాఱినట్లు వినికిడి.

తెలుఁగుభాష చాలావఱకు సంస్కృతప్రాకృత భాషలనుండి పుట్టిన వికృతి. కొంత అఱవమునుండి దిగినది. కొంత కన్నడం. కృష్ణదేవరాయలు కర్ణాటరాజు (వారి పూర్వులు తెలుఁగువారైతే కానివ్వండి) గదా? అతఁ డేమన్నాఁడో చూడండి:

"ఆ.వె. తెలుఁగదేల యన్న దేశంబు తెలుఁ గేను
తెలుఁగువల్లభుండ తెలుఁ గొకండ
యెల్లనృపులు గొల్వ నెఱుఁగవే బాసాడి
దేశభాషలందుఁ దెలుఁగు లెస్స."

యీమాట తెలుఁగుదేశంలో కృష్ణాతీరంలో శ్రీకాకుళంలో వుండే దేవుఁ డన్నట్లు రాయలు వ్రాసినాఁడు. ఆయనకు అఱవం, కన్నడం, వురుదు, సంస్కృతం, మహారాష్ట్రం ఇన్ని భాషలేనా వచ్చివుండాలి. వీట్లన్నిటిలోనూ తెలుఁగే మంచి మృదువైనది యని ఆయనతాత్పర్యం. నేను మండసాసంస్థానానికి వెళ్లినప్పుడు ఆరాజుగారు మంచిపాండిత్యం సంస్కృతంలో వుండిన్నీ నావల్ల వసుచరిత్రను ప్రత్యేకించి కోరి శ్రద్ధగా విన్నారు. శ్రీ జయపురం మహారాజుగారు (విక్రమదేవవర్మ) ఓఢ్రం, సంస్కృతం వగయిరాలలో విద్వాంసులై యుండి తెలుఁగురచనకే ప్రాధాన్యం యిచ్చి నాటకాలు వగయిరా వ్రాసినారు. శ్రీనాథుఁడు "గౌడడిండిమభట్టు కంచుఢక్కా" పగులఁగొట్టించింది సంస్కృతభాషాపాండిత్యంవల్లఁ గాని తెలుఁగులోఁ గాదు. అట్టి ప్రౌఢప్రసంస్కృతైకవిసార్వభౌముఁడు రచించిన కావ్యములన్నీ తెలుఁగులోనేకాని మచ్చుకి కూడా వొక్క సంస్కృతశ్లోకం వున్నట్టూ, విన్నట్టూ లేదు. యేకొన్ని శ్లోకాలో వున్నా అవి ఆయన్ని సంస్కృతభాషాకవిని చేయనేరవు. పైఁగా ఆ మహాకవి యీలా అన్నాఁడు: "నాకవిత్వంబు నిజము కర్ణాటభాష" అన్నాఁడు. ('కర్ణా + అటతి') చెవికింపైన తెలుఁగన్నమాట.

అచ్చతెలుఁగు చెప్తామని కొందఱు ప్రారంభించి కుమ్మరి కుండలు కొత్తవి నిర్మించినట్లు క్రొత్తపాటలు నిర్మించి రచిస్తే తెలుఁగు పూర్తిగా స్వరూపాన్ని గోలుపోయి కోదుభాషగా పరిణమిస్తుంది. అవసరమైనపుడు తత్సమపదాలు చేర్చికోవడమే నన్నయాదులకు యిష్టం. కొందఱు అచ్చతెలుఁగుమాత్రమేకాక నిరోష్ఠ్య, నిర్వచన అని కూడా నియమం పెట్టుకుంటారు. ఇవన్నీ రసస్వరూపమెఱుఁగనివారి పోకడలు. "సాధ్యోహి రసో యథాతథం కవిభిః" అప్రయత్నసిద్ధంగా వచ్చిన శబ్దచిత్రం తప్ప కవిత్వంలో యితరశబ్దచిత్రంకూడా హృద్యం కాదనియే నా అభిప్రాయం. యిందుకు లాక్షణికులు వ్యతిరేకించరు.

ఉ. "భారతభారతీశుభగభస్తిచయంబులు"

మ. "కురువృద్ధుల్ గురువృద్ధబాంధవు లనేకుల్"

మ. "మదమాతంగతురంగకాంచనలసన్మాణిక్యగాణిక్య"

ఈవిధంగా నన్నయ్యకు అప్రయత్నసిద్ధంగా శబ్దచిత్రం దొర్లుతుంది.

మ. "బహురత్నద్యుతిమేదురోదదరీ ... సౌరభగ్రహణేందిందిర తుందిలంబు లివి మత్కాంతారసంతానముల్"

మ. "అకలంకౌషధ...ఉద్దండగండక వేదండవరాహవాహరిపు ఖడ్గవ్యాఘ్రము"

నన్నయ్యతర్వాత మళ్లా పెద్దన్నగారికే యీసంస్కృతధారలో యీ శబ్దచిత్రం దొరలడం. నాకు నన్నయ్య చుట్టం కాఁడు. అతణ్ణి నేను ఘుక్కాలిగా మెచ్చుకొన్నందుకు నాకు వొక ముసలితిక్కన్నవల్ల చాలా తిట్లు తగిలాయి. అయితేమాత్రం యేలా మానేది? శాంతం పాపం!

వసుచరిత్రలో వున్న శబ్దచిత్రాలు ప్రయత్నపూర్వకాలు గాని సహజాలు కావు.

సీ. "మందయానము నేర్పు నిందిందిరాజీవ రాజీవ రాజన్మరాళరాజి"

సీ. "లలనాజనాపాంగ వలనావసదనంగ తులనాభికాభంగ దోఃప్రసంగ"

ఆయీ విషయం చాలా ముసలివాళ్లలోకూడా కొందఱే చర్చించతగ్గది. చట్టన కొందఱు ఆయాకవులను యీసడించిన

ట్లభిప్రాయపడతారు. యేంచేసేది? ఆయాకవులు యెంతటి పండితులూ, యెంత కష్టించినవారూ కాకపోతే ఆలాటి (లలనా-) యనుకం కుదురదు. అది నిజమే. రసజ్ఞులకు కవి తన ప్రతిభను తెల్లపుడుచేసిగాని, కష్టం తెలియఁజేసి గాని ప్రయోజనం లేదు. రచనలో రస మెంతి యున్నదో రసజ్ఞులు చూతురు. పైకి డాబుగా వుండి తీరా విపదీస్తే "సడ్డలు రైకలోపలం బ్రోవిడినట్టి కుచకుచపాంకము" గా పరిణమించే శబ్దచిత్రం మృదంగాదిధ్వనివలె వుండి ఆర్థికులకు హాయిని గలిగించదు. అర్థంతోఁగాని, శబ్దసౌష్ఠవం తోఁగాని నిమిత్తం లేనిది గానం గాని కవిత్వం కాదు. ఆచార్య గోవర్ధనుఁ డేమన్నాఁడో చూడండి: "కిమపభ్రంశేన భవతి గీతస్య" అపభ్రంశము వ్యాకరణరీత్యా తప్పయితేనే కాదు, సమంజసమైన అర్థంలేకుండా వుండేదికూడా వొకవిధమైన అపభ్రంశమే. ఒక మహాకవి—

"మురారే! మురారే! మురారే! మురారే!
తవాఽహం తవాఽహం తవాఽహం తవాఽహం"

ఇదే మాదిరిని నాల్గుచరణాలున్ను పూర్తిచేశాఁడు. సందర్భం యెఱుఁగక దీని కర్థం చెప్పవలసివస్తే ఒక్కొక్కపదానికి నాలు గర్థాలు చెప్పడానికి నిఘంట్లు తిరుగవేయవలసి వస్తుంది. సందర్భం తెలిస్తేనో? యేమీ లేదు. "వస్లగింజలోది బియ్యపుగింజ!" బ్రహ్మదేవుఁడు నాలుగు మొగాలతోనూ విష్ణుమూర్తిని స్తోత్రం చేశాఁడంటే సరిపోతుంది. యింకొక తెలుఁగు కవి నాల్గుచరణాలూ యిట్లే చిత్రించాఁడు. "సీ. సారంగమదహారి సంపన్నత వహించు ఘన సారసచ్ఛాయ కడురహించు". తేటగీతిలో యేవో అవయవాలను పేర్కొన్నాఁడు. దీని సమన్వయానికి సారంగశబ్దానికిన్ని, ఘన సారశబ్దానికిన్ని నిఘంటులో వున్న అర్థాలు చూచుకుంటే యేమాత్రం అక్షరజ్ఞాన మున్నా చాలు.

ఈ మాదిరికవిత్వాలు "తనకు నాల్గు నిఘంటుపదములు వచ్చనంచుఁ బదిమందికిని దెలుపంగ" పనికివచ్చునేకాని రసజ్ఞుల ఆమోదానికి పనికిరావు. మొల్ల యేమంది? "మూఁక చెవిటివారి ముచ్చ టదియు" అని సాహసించి పలికింది. ఆమాట చాలా గౌరవించతగ్గది. కవిత్వమన్నది యెందుకు పుట్టిం దంటే! తన అభిప్రాయాన్ని పరులకు తెల్పడానికికదా? ఆలా తెల్పడంలో కొందరు వీలయినంతలో సులభశైలిలో తెల్పుతారు. కొందరో? కఠినశైలిలో తెల్పుతారు. ఈరెండుపక్షాలలోనున్నా ఋషులశైలినిబట్టి విచారిస్తే తేలికశైలిలో తెల్పడమే ఆదరణీయంగా కనపడుతుంది.

"రామం దశరథం విద్ధి మాం విద్ధి జనకాత్మజామ్,
అయోధ్యామటవీం విద్ధి గచ్ఛ తాత యథాసుఖమ్"

(రామాయణము)

"ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః,
మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ!"

(భారతము)

యేమాత్రం సంస్కృతవిభక్తిజ్ఞాన మున్నా పైశ్లోకాలు తాత్పర్యం అవుతాయి. తెలుఁగులోకూడా యీలాటి శైలికేగౌరవం. మనకి వుపలబ్ధమవుతూవున్న తెల్గుపుస్తకాలలో ఆముక్తమాల్యద చాలా కఠినపాకంలో వుంటుంది. దానిలోకూడా కొన్ని తేలిక శైలిపద్యాలు వుండఁబట్టే దానికి కొంతమట్టుకేనా వ్యాప్తికలిగింది. కొంచెం మచ్చుచూపుతాను:

తే. గీ. "సంగతియె యోయి? యిసుమంత టింగణావు
తత్త్వనిర్ణయవాదంబు తరమె నీకు
నోడితేనియు వద్దు మొఱ్ఱోయనంగ
లింగమును గట్టి కుడుగ మెఱింగి నోడుదు"

ఈఘట్టంలో మఱికొన్ని పద్యా లీలాటివే వున్నాయి. విస్తరభీతిచే స్పృశించి వదలుచున్నాను. ఇతరఘట్టాలలోకూడా యించుమించుగా యీలాటి తేలికశైలి వుండఁబట్టే ఆముక్తమాల్యద పేరు శాశ్వతంగా నిల్చింది. (1) "ఆనిష్ఠానిధిగేహసీమ" (2) "గృహసమ్మార్జనమో, జలాహరణమో?...నృహరీ! వాదము లేల? లేరె యితరుల్ నీలీలకుం బాత్రముల్" (3) "తలపక్షుచ్ఛటఁ గ్రుక్కి బాతువులు" ఈలాటివి చాలా వున్నాయి. ఋతువర్ణనలు, అలంకారాలతో గ్రంథాన్ని పెంచినా స్వభావోక్తు లుండడంచేత రాయల కవిత్వానికి విద్వల్లోకంలో మంచిపేరు వుంది.

(1) "మే కెరువుల్ సుంపటిమంచ మెక్కిరి ప్రభుత్వైకాప్తి రెడ్లజ్జడిన్."

(2) "మట్టిమిద్దెలవారికి మరుపనులకు నెలఁతఁ బాసినవారికి నిదుర చెడియె"

ఆయీవుటంకింపులు వర్ష ఋతువర్ణనలోనివి.

యింతవఱకు వ్రాసిన సంగతులు తెలుఁగుకూ, సంస్కృతానికీ కూడా వర్తిస్తాయి. కేవలం తెలుక్కే సంబంధించేవి కొన్ని వున్నాయి. అందులో వొకటి మృదుత్వం. ఇది సంస్కృతంలో లేకపోలేదుగాని తెలుఁగులో యెక్కువగా చూపవచ్చును.

చ. "వలఁ బడియున్న జక్కవకవం బురుణించుచు సన్నపైటలో
పల బిగిగుబ్బదోయి కనుపండువు సేయఁగ మోడ్పుఁజేతు లౌ
దలను ఘటించి మ్రొక్కిడి పదంపడి మెల్లన డాయఁబోయి తో
య్యలి విరిబంతి దోయిట నుపాయన మాయన కిచ్చి యిట్లనున్"

గుఱుతుంచిన రెండుపదాలు తప్ప పైపద్యంలో సంస్కృత పదం లేదు. అందుచేత పద్యాని కంత మృదుత్వం వచ్చింది. ఆ రెండిటిలో 'ఉపాయనం' అనేపదం తెలుఁగుపదంలాగే వుంటుంది.

కైశికీవృత్తికి వుదాహరణంగా యిచ్చిన "జితమదన విలాసం కాక తీయాన్వయేందుం" లోనైన శ్లోకానికూడా యింత మృదుత్వం వున్నా దీనంత ప్రసాదగుణం దానిలో రావడానికి అవకాశం లేదు అభ్యసిస్తేగాని రాని భాషకదా అది? యిది వుగ్గుఁబాలతో వచ్చేది.

గిడుగు పంతులుగారి వాదానికి నేను కొంతకాలం కేవలం వ్యతిరేకినై వుండికూడా సుమారు పదిపం(డెండు యేండ్లనుండి కొంత అనుకూలుణ్ణిగా మారడానికి కారణం తగినంత పాండిత్యం లేని రచయితలు తమ అభిప్రాయాలు లోకానికి తెలుపుడు చేయడానికి కాక అవకాశం వుండడం యుక్తమనియ్యేవే. కొన్నాళ్లు పత్రికలలోవా ర్తలదగ్గిఅనించీ వ్యాకరణయుక్తంగానే ప్రకటిస్తేనే కాని బాగుండ దనుకొనేవారు. ఆయనధర్మమా అని ఇటీవల ఆ పీడ వదిలింది. ఇప్పుడు సంపాదకీయంకూడా వ్యావహారికంలోనే వ్రాసినా లోకం ఆమోదిస్తూనే వుంది. విషయాంతరమేతత్.

యిఁక తెలుఁగులోమాత్రమే రాఁదగిన సొగసులు కొద్దిగా చూపుతాను.

తే. గీ. "విమల మధురమనోహరవృత్తి నెలయు
వారి బొడఁగన........." (వసుచరిత్ర.)

యిందులో వున్న 'వారి'శబ్దము ఒకపక్షంలో సంస్కృతం; యింకొకపక్షంలో శుద్ధతెలుఁగు. ఒకపక్షంలో 'వారిన్' అని యేకవచనం; వేరొకపక్షంలో 'వారిన్ = వారలను' అని అర్థం గనక బహువచనం. యీశ్లేష సంస్కృతంలో వచ్చేది కాదు. యింకొకటి చూపుతాను :

తే. గీ. "తమ్ములు పదానుజన్ములై తనరఁబోలు." (వసుచరిత్ర)

దీన్ని సంస్కృతీకరించవలసివస్తే కంఠం పట్టుకుంటుంది. 'తమ్ముఁడు' అనేదాని బహువచనం 'తమ్ములు.' 'తమ్మి' అనేదాని బహువచనం 'తమ్ములు'. దీన్ని అతిప్రయాసమీఁద సంస్కృతీ కరించవలసి వచ్చింది. యేలాగంటే—

"కనిష్ఠసముదాయః, తత్పాదకనీయాఙ్కిమ్"

కనిష్ఠశబ్దానికి 'తమ్ములు' అనే అర్థం సుళువుగానే వస్తుంది గాని 'పద్మములు'అనే అర్థం రావడం కష్టంక్లిష్టిమీఁదఁగాని రాదు. "కే=ఉదకే, నిష్ఠా స్థితిః యేషాంతాని కనిష్ఠాని, పద్మానీత్యర్థః" యీ విధంగా మార్చి యేలాగో బయటఁబడవలసి వచ్చింది మాకు వేంకటగిరి సంస్థానంలో. తెలుఁగులో ఎంతో సుళువుగా 'సోదరులు, పద్మములు' అనే వుభయార్థాలు వచ్చి హృదయంగమంగా వున్నాయి. యీ గీతంలోనే చక్రపదం వకటిన్నీ (చక్రమేల్పడి గాఁబోలు జఘనరమకు ప్రసవములు గోళ్ల నిసువులై యెసఁగఁ బోలు), ప్రసవపదం వకటిన్నీ శ్లేషించినవి వున్నాయి గాని అవి ముక్కస్య ముకార్థః (కాఁబట్టి = కనుక, కనుక = కాఁబట్టివలె) చేస్తే చిక్కులేదు. యీ తమ్ములశ్లేష ఆమాదిరిది కావని అనుభవజ్ఞులు గుర్తిస్తారు.

శ్లేషదాఁకా యెందుకు, జాతీయంగా మాట్లాడవలసివస్తే మాత్రం తెలుఁగులో వచ్చే సొగసు సంస్కృతంలో వస్తుందా? మచ్చు చూపుతాను కొంచెం:

క. "వీరెవ్వరు శ్రీకృష్ణులు
గారా? వీ రెన్నఁడును వెన్న గానరఁట కదా?
చోరత్వం బించుకయును
నేరరఁట? ధరిత్రి నిట్టి నియతులు కలరే?" (భాగవతం)

యిక్కడ పోతన్నగారు బహువచన ప్రయోగం చేసి తెచ్చిన సొగసు సంస్కృతంలో వస్తుందా? యేమి, యెందుకు రాదు? సంస్కృతంలోమాత్రం బహువచనం (శ్లో. ఏతే కే శ్రీకృష్ణా నహివా) లేదా అంటే జవాబు చెప్పడం కష్టం. 'తేభ్యో మహద్భ్యో నమః.' దశరూపకంలో యేమన్నాఁడు? "తస్మై నమః స్వాదు పరాఙ్ముఖాయ" అనలేదా? అయితే దీనికి మార్గదర్శకుఁ డెవఁడు పోతన్నకు? నన్నయ్య. అతఁడు వీరరసంలో మిళిత మైన హాస్యరసంలో—

క. "వీరెవ్వరయ్య? ద్రుపదుఁ
డారాజులె? యిట్లు కృపణులై పట్టువడన్
వీరికివల సెనె? యిపుడు మ
హారాజ్యమదాంధకార మది వాసెనొకో" (భారతం)

అని యెత్తిపొడుపుగా, జాతీయంగా చిత్రించాఁడు. పోతన్నగారు వాత్సల్యరసమిళితమైన యొకవిధమైన కోపరసంలో వినియోగించారు. నన్నయ్య నాగ్గోచరణంలో వాచ్యం చేశాఁడు అంతస్సితకోపాన్ని. పోతన్న యావత్తూ సంభితంగానే నడిపించాఁడు. యేదో మహాధారలో రచన సాఁగుతుంది. యీ నీహారలేశాలకు తీరిక వుంటుందా? మహాప్రవాహంలో గ్రంథకర్తల కెక్కడ తీరుతుంది?

లోఁగడ ఉదాహరించిన "రామం దశరథం విద్ధి" అ యీ శ్లోకానికి వ్యాఖ్యాతలు యెన్నో అర్థాలు వ్రాశారు. అవి గ్రంథకర్తకు-వాల్మీకికి అభిప్రేతములని యేకవి అనుకుంటాఁడు? యేవిధమైన శ్లేషా లేకుండానే తెలుఁగులో వచ్చే సొగసులు చూపడం మనకు ప్రస్తుతం. "వచ్చినవాఁడు ఫల్గునుఁ డవశ్యము గెల్తు మనంగ రాదు" యీ పద్యం సంస్కృతీకరణం చేసేయెడల యీ 'ఫోర్సు' వస్తుందా? "ఫల్గునోఽద్య సమాయాతః" అనిగాని, "ఫల్గునస్తు సమాయాతః" అనిగాని మార్చేస్తే అర్థం మటుకు వస్తుంది గాని దానిలో వుండే సొగసు రాదు.

ఆ యీ సందర్భాలనుపట్టి పరిశీలిస్తే తెలుఁగు భాష మృదుత్వానికే కాదు; మరికొన్నిటికికూడా తనకు మాతృభాషగా

వుండే సంస్కృతాన్ని అతిక్రమిస్తుందేమో అని నే ననుకుంటాను. ఆ యీ కారణాన్ని బట్టే కాకపోతే వాల్మీకివ్యాసులకంటే యే విషయంలోనూ తీసిపోని శుద్ధ'జపహోమతత్పరుఁడు' నన్నయ భట్టేమి, తత్తుల్యుఁడో అధికుఁడో అయిన శ్రీనాథభట్టేమి సంస్కృత విద్వాంసులు "ఆంధ్రభాషామయం కావ్య మయోమయ విభూషణమ్" అని యీసడించే తెలుఁగులో, లేదా తెలుఁగులోనే గ్రంథాలు వ్రాసి వూరుకుంటారా? నాకు కొంతకాలం గతించాక కలిగిన "సంస్కృతమ్ముం గని గేలిసేయు" అనే అభిప్రాయం వారికి మొట్టమొదట నేకలిగివుండాలి. పరిశుభ్రత వగయిరాలు తెలుఁగులోకంటె సంస్కృతంలోనే వుండనివ్వండి, రసానికి పరిశుద్ధికీ చాలాదూరం. శృంగారరసప్రవర్తనకుకూడా ఆచమనాదికర్మకలాపం వుంది గాని లేకపోలేదు. ఆపద్ధతిని పగటిసమావేశం బొత్తిగా దూష్యం. భవతు-అగుఁగాక. 'కాళిదాసుగారి శాకుంతలంలో వుండే శృంగారం ధర్మశాస్త్రవిరుద్ధం. పరాశరుని శృంగారంకూడా డిటో. శాకుంతలంలోని శృంగారరసం ధర్మశాస్త్రవిరుద్ధమని ఆక్షేపించిన వారిని నేనెఱుఁగుదును. వారికి నమస్కారం. కవులకు రసమే ప్రధానం. "సాధ్యోహి రసో యథాతథం కవిభిః" కొనసాఁగకపోతే మానింది గాని వరూథినీప్రవరుల శృంగారమున్నూ మిట్టమధ్యాహ్నమే. ఆ శాస్త్రంత్రోవ దానిదే, దీనిది దీనిదే. సంస్కృతానికి సమగ్రమైన వ్యాకరణం వుంది. తెలుక్కి లేదు. దీనిలో నానా చెత్తా చెదారం చేరింది. చేరుతూవుంది యింకానూ. కలగూరగంపలా వుంటుంది యీ భాష; అయినా మాధుర్యం హెచ్చు. అందుచేత నిప్పుకూడా కడిగే వైశ్వదేవపరులు నన్నయాదులు దీనిలో ప్రవేశించారు. అంతకు పూర్వులే అని తోస్తుంది శైవకవుల రచన-పాల్కురికి సోమనాథుని ద్విపదలో వుండే భాష చాలా బాగుంటుంది.—సంస్కృతంలో చాలా వృత్తాలు వున్నా అనుష్టుప్పు శ్లోకాలతోనే నూటికి తొంభైవంతులు పురాణాలు ప్రవర్తించాయి. ఆశ్లోకానికి దీటయినది తెలుఁగులో ద్విపద వొక్కటే కనపడుతుంది. శైవకవి సోమనాథుని రచన సర్వమూ ద్విపదలోనే. నన్నయ్యమాత్రం ద్విపద ననాదరించాఁడు. తరువాతకవులందఱూ నన్నయ్యమార్గాన్ని బట్టి ప్రవర్తించారు. రంగనాథాదులు ద్విపదకు ప్రాధాన్యం యిచ్చారు. శ్రీనాథుఁడు వెక్కిరించాఁడు.

కొన్ని సొగసులు సంస్కృతంలోవి తెలుఁగులో తీసుకురావడానికి సాధ్యపడవు. మచ్చు చూపుతాను.—హర్షుఁడు బాణ మహాకవిని రిజాలాపురుషుఁ డని వినివున్న కారణంచేత 'భుజంగ' అని భావగర్భితంగా, అనాదరంగా సంబోధించాఁడు. దానిమీఁద బాణుఁడు "కామేభుజంగతా" అని యెదురుకొని ప్రశ్నించాఁడు.- ఇక్కడ "కా- మే- భుజం- గతా" అని ఒకవిఱుపు; కామే భుజంగతా" అని వొకవిఱుపు. అర్థాన్ని మీరే చూచుకోండి సుళువే. యీవిఱుపులు తెలుఁగులో తీసు[illegible] కొంతటి మహాకవికినీన్నీ పుస్తకాపేక్షే. యీలాటి వింకా సంస్కృతంలో "చేతోనలంకామయతే", "అంసంగతంశుకం", "అలంఘనం" మొదలైనవి శరపరంపరగా వున్నాయి. ఇవి తెలుఁగులో రమ్మంటే రావు. వీట్లనే జతుకాష్ఠశ్లేష లంటారు. "మంచ మానందినం ప్రాప్తం నేహ నందీ హరాంతికే" ఈ వక్రోక్తిగాని, "కే దార పోషణరతాః కేదారపోషణరతాః" ప్రశ్నోత్తరాలు రెండూ వకటిగానే వుండే యీమాదిరి శ్లోకాలు గాని ఆంధ్రీకరించడం ఘటించదు. కనుకనే యీలా అనవలసి వచ్చింది:

మ. "జతుకాష్ఠక్రియ నొప్పు సంస్కృతపుశ్లేషల్ తెల్గులో మార్ప మా
మతికిన్ శక్యమటంచుఁ దోఁచు, డిటక మా మాటట్టులుండంగ ను
న్నతులై పేరును గాంచినట్టి యల శ్రీనాథాదు లిప్పట్టున
న్నతు లర్పించిరి నిక్క మియ్యది ప్రమాణంబుల్ తదుద్గ్రంథ
ముల్." (మా 'శ్రీనివాసవిలాసం')

ఒకభాషలో వుండే సొగసులుగాని, శ్లేషలుగాని మఱొకభాషలో రావాలంటే సుఖసుఖాల రావని అందఱూ యెఱిఁగిందే. దాన్ని బట్టి విశిష్టత్వం చెప్పవలసి వుండదు.

చ. "తెనుఁగున కొన్ని సంగతులు తియ్యనవై యలరారు సంస్కృతం
బున మఱికొన్ని సంగతులు ముద్దులు మూటలు గట్టఁజాలు నిం
దును మఱియందునున్ సొబగులో (దులఁదూఁగును) కొన్ని సంగతుల్
పనిగొని చెప్పనేల? యిది పండితవేద్యము గాక యుండునే?"
(మా 'శ్రీనివాస విలాసం')

పై పద్యతాత్పర్యాన్ని బట్టి యేభాషలో అందచందాలు ఆభాషవే అనిన్నీ, పరివర్తన చేయడంలో అవి రావడం దుర్లభ్యమనిన్నీ చదువరులు తెలిసికోఁగలరు.

ఇంకొక విశేషం. ద్వ్యర్థికావ్యరచనకు తెలుఁగులో కొంత సుళువు కనపడుతుంది. "సీతను వే విడువంగ మేలగున్" — ఇది 'లంకావిజయం' (రావణదమ్మీయం) లోనిది. ఒక పక్షంలో "సీ! తనువే" అనిన్నీ, యింకొక పక్షంలో "సీతను - వే-విడువంగన్" అనిన్నీ విఱుగుతుంది. ఇది సంస్కృతంలో రమ్మంటే వస్తుందా? రాదు. వసుచరిత్రలో—

క|| ...ఆఁడుఁబడుచు లే
పగవారికి వలదన నా
పగవారికి నేల యొసఁగెఁ బద్మజుఁడు."

"ఏపగవారికి— ఏశత్రువులకు, ఆ+పగవారికి?" అని సామాన్యంగా తోఁచే అర్థం. అంతరార్థమో? "ఆ పగ (నది) వారికి(ఉదమునకు)" అని. గిరికాదేవి శుక్తిమతీనది కూఁతురు గదా?

యీలాంటి సొగసులు చాలా వున్నాయి గాని, ఆయీ స్థలాలలో విస్తరించి వ్రాస్తేనేగాని చదువరులలో చాలామందికి అవగతంకాదు.

తే. గీ. "ఎందు వేట రారె? యితరు లేమనసుతో
దారసంగసుఖము తప్పఁ ద్రోచి తకట!..."
(రాఘవపాండవీయం)

యీ పద్యంలో రామాయణార్థం చెప్పేటప్పుడు "ఏమనక్-సుతోదార (సుత+ఉదార) సంగసుఖము" అనిన్నీ, భారతార్థంలో "ఏ మనసుతోక్-దారసంగసుఖము" అనిన్నీ విఱుగుతుంది. యీ సొగసు తెలుఁగుభాషకేగాని సంస్కృతానకు సంఘటించదు. సంస్కృతంలో వున్న నైషధాన్ని శ్రీనాథుఁడు తెలిఁగించి యెక్కువ రసం కలిగించాఁడు. ఆరసాని క్కారణం భాషే అని నే ననుకుంటాను.

సీ. "నళినసంభవు వాహనము వారువంబులు
కొలఁకుసాములు మాకుఁ గువలయాక్షి
చదలేటి బంగారు జలరుహంబుల తూండ్లు
భోజనంబులు మాకుఁ బూవుఁబోఁడి
స్వర్గలోకముదాఁక సకల లోకంబులు
నాటపట్టులు మాకు నబ్జవదన
మధురాక్షరములైన మామాటలు వినంగ
నమృతాంధసులు యోగ్యు లనుపమాంగి
తే. గీ. భారతీదేవి ముంజేతి పలుకుచిలుక
సమదగజయాన సబ్రహ్మచారి మాకు
వేదశాస్త్రపురాణాది విద్యలెల్లఁ
దరుణి నీయాన ఘంటాపథమ్ము మాకు"

ఆ యీ సీసంలో అయిదారో, యేడెనిమిదో శ్లోకాల తాత్పర్యం కరిగి ముద్దచేసి యిమిడ్చి తయారుచేశాఁడు శ్రీనాథుఁడు. సంస్కృతం కంటే యెంతో సొగసుగావుంది. ఆసొగసు చాలాభాగం భాషబాపతే. కొంత రచనలోకూడా వుంటుంది.

రచనాప్రౌఢిమ యెఱుఁగని విమర్శకులు 'విద్యలెల్ల ఘంటాపథమ్ము' అన్నచోట శంకిస్తారు. వారికి "వేదాః ప్రమాణం" అన్న సాంస్కృతిక ప్రయోగ సారస్యంగాని, "గొల్లాంధ్ర సుబ్బపాలిండ్లు సాక్షి" లోనైన పిల్లలమఱ్ఱివరి రాల ప్రౌఢప్రయోగాల సొగసుగాని తెలియదనుకోవాలి.

యెంత రసవత్తరమైన శ్లోకాన్నైనా తెలుఁగులో పెట్టి రసం తేవచ్చుఁగాని తెలుఁగులోనే మంచిపోకడలో వున్నదాన్ని సంస్కృతంలో పెట్టి రసం తేవడం కష్టసాధ్యం. చూడండి :

శా. "నానా గాయనగాయనీమణుల గానం బుర్వినాలింపమో
నానాఁట న్నగభేదివీటఁ గల గంధర్వాప్సరోగానవి
ద్యానైపుణ్యము లెన్నియేని వినమో? అందైన నిందైన విం
దై నాదం బొడఁగూర్చ్చనేమనకి ని ట్లానందసందోహముల్."
(వసుచరిత్ర)

ఉ. "ఎన్నఁడు మున్నెరుంగ నిరుపమ నవ్య నిత్యశరాసనసాయకోత్సవ
ఘన్నత వాడిపత్తలయి కేలఁ గపోలము లూఁది చూడ్కులన్
విన్నఁదనంబు దోఁపఁ గనుపేఁదుఱుసం బయిగాలి సోఁకినన్
వెన్నవలెం గఱంగు నలివేణులఁ గౌఁగిటఁ జేర్చు భాగ్యముల్"
(మనుచరిత్ర)

చ. ప్రకటజితేంద్రియుల్ మును పరాశరకౌశికులంతవారు స్త్రీ
లకు వశు లంతకన్న మిగులన్ దృఢమా మగకచ్చ బిగ్గఁ గ
ట్టుకొనఁగ నీతఁ డెంత, శుకుఁడో? హనుమంతుఁడొ?
భీష్ముఁడో? వినా
యకుఁడో? తలంచుకో సరసిజాయతలోచన! నెమ్మనమ్మునన్"
(వైజయంతీ విలాసము)

శా. "గంగాసంగము మిచ్చగించునె? మదిన్ గావేరి దేవేరిగా
నంగీకార మొనర్చునే? యమునతో నానందముం బొందునే
రంగత్తుంగతరంగ హస్తముల నా రత్నాకరేంద్రుండు నీ
యంగం బంటి సుఖించెనేని గుణభద్రా! తుంగభద్రా నదీ.

చ. మదభసలాళివంటి కచమా? మృదురంభలవంటి యూరులా?
కదలని మించువంటి తళుకా? విరిబంతులవంటి గుబ్బలా?
మదనదరంబువంటి గళమా? ముకురంబులవంటి చెక్కులా?
మదవతి జవ్వనం బమృతమాధురి సేయదె యెంతవానికిన్?"
(యామినీపూర్ణతిలక)

శా. "ఎంచు న్మర్మము లెత్తి మాటికిఁ, దుటాయించుంగను ల్బల్మిటా
రించున్ జన్గవపైఁ జెఱంగు వలపూరించు న్నగించుం బ్రశం
సించున్ మించుమనోవికారమును సూచించున్ మరుల్ వెంచున
మ్మించుం బోఁడిస్వభావమో? అతనినమ్మించం బ్రయత్నించుటో?"
(శ్రవణానందము)

యీలాంటి వెన్నో తెలుఁగులో వున్న పద్యాలు సంస్కృతీకరించ వలసివస్తే దీనిలోవున్న అందచందాలు రావడం దుర్ఘటం. యెంతటి మహాకవికేనా సరే యీవిషయం పుస్తకావేక్షే. అది కవిలోపం గాదు. ఆయా భాషలయందుండే సహజగుణమే ఆలాటిది. దీనికి ముఖ్యకారణం వినీవినడంతోనే, మాతృభాష గనుక-తెలుఁగు-అంతోయింతో అర్థం తెలుస్తుంది. సంస్కృతం ఆలా బోధించదు.

ఏతావన్మాత్రమే కాదు; తెలుఁగులో శ్రవణకటువుగా వుండే వొత్తక్షరాలు లేవు. సంస్కృతంలో ప్రయత్నించి చెప్పాలంటే (శ్లో. సజలజలదనీలం వల్లవీకేళిలోలం) మృదువుగా చెప్ప వచ్చునుగాని స్వతహా తెలుఁగు కున్నంత మార్దవం కల పదాలు

వుండవు. అచ్చ తెలుఁగుపదాలతోటే యావత్తు రచనా సాగించాలనే చేదస్తం పెట్టుకుంటే ఆరచన దుర్బోధంగానూ, కటువుగానూ వుంటుంది. యెందుచేతనంటే ఆరచనలో సహజభాషకాక కొంత కృతకభాష పడుతుంది. అర్థంబొత్తిగా తెలియని యీయూరోపియనులు కూడా తెలుఁగు చదివించి విని ఆనందించడం నేను యెఱుఁగుదును. తత్సమపదాలు కలిసినా అవి తఱుచు తెలుఁగులో వాడుకొనేవిగా వుంటే తెలుఁగుకు వున్న మాధుర్యాన్ని చెడఁగొట్టవు. లోఁగడ వుదాహరించిన "దేవసములైన యనుజులతో" అనే నన్నయ్యగారి కందపద్యంలో యేకొంచెమోతప్ప తక్కిన యావత్తూ తత్సమపదాలే అయినా అర్థం ఝడితిగా స్ఫురించడంచేత అవన్నీ అచ్చ తెలుఁగుగానే పరిణమించినట్లయినది.

క. "సంజయ ! మురభంజనుని ధ
నంజయునిం జీరికిం గొనఁడు కర్ణుం డిం
ద్రుం జెనకియైన గెల్తు న
నం జచ్చెనె? యట్టివాఁడునుం గయ్యమునన్" (తిక్కన)

క. "కరుణానిరతులు ధర్మ
స్వరూపు లింతకు మదీయజనకులు చనుదెం
తురు వారు వచ్చి నీ కి
చ్చిరేని పాణిగ్రహణము సేయుము నన్నున్" (నన్నయ్య)

పై పద్యాలలో ఉభయులున్నూ ఉభయభాషలు యించుమించు సమంగానే వాడినా అర్థం త్వరలో స్ఫురించడ మనే ప్రసాదగుణానికి లేశమూ లోపం కలక్కపోవడంచేత అంతా తెలుఁగే అనిపిస్తుంది. కవిత్వారంభదశలో మనం యెంత కఠినంగా రచిస్తే లోకంలో మనలను అంత గొప్పవాళ్లనుగా గౌరవిస్తారనే భ్రాంతి కలుగుతుంది. కాని క్రమంగా ఆవూహ సరియైనది కాదని గోచరిస్తుంది. ఇది విషయాంతరం.

యెంత చర్చించినా కవిత్వమనేది సులువుగా బోధించేటట్టు వుండడమే ఆవశ్యకం. ఋషుల రచనలలో యీ అంశం బాగా గోచరిస్తుంది. "అర్జునస్య ఇమే బాణా నేమే బాణా శ్శిఖండినః" యీ మాదిరి శ్లోకాలు సంస్కృతం రానివాళ్లకు కూడా సులువుగా తెలుస్తాయి. కాని సంస్కృత మంతా యిదే విధంగా వుందనుకోవడానికి వీలులేదు. కొందఱు కవులు వారి వారికి వున్న వ్యాకరణ పాండిత్యాన్నంతా వినియోగించి తాత్పర్యం దుర్బోధంగా రచించిన మాట సత్యం.

శ్లో. "ఏకైకే నివసంతి తే భుజభృతః కస్మై నిగృహ్ణీమహే
వీరక్షేత్ర మియం పునర్వసుమతీ పౌలస్త్య మాబిభ్రతీ
వాలీ త్వాహ్వాయమాన మేనమపి యచ్చక్రే కృతే చక్షుషీ
పశ్యామ శ్శ్వివసీకృతేచ శ్రుణుమ స్త ద్వక్తు మప్యేవయమ్." (మురారి)

యీ శ్లోకంలో వొక లోకోక్తి యిమిడ్చి చక్కనిపోకడగా రచించి వున్నప్పటికీ రెండు మూఁడుచోట్ల పాషాణపాకంగా వుండడంచేత దీన్ని కావ్యపంచకపాండిత్యం వున్నవాళ్లు కూడా విని ఆనందించడానికి అర్హులుకారు. చూడండీ! దీన్ని తెలుఁగుభాషలో పెడితే యేలాటి అందం వచ్చిందోను—

చ. "ఒకరొక రుండ్రు వీరవరు లొక్కరి కొక్కరు తీసిపోరు భూ
మికి యశ మబ్బె రావణుని మెచ్చున నం చనుకొందుమేని నా
లికి నతఁ డింత జంకె లవలేశము లొక్కట డించి కన్ను లుం
టకుఁ గని వీను లుంటకు వినం దగు నల్పుల మేమి చెప్పఁగన్."

ఆశ్లోకంలో వున్న అర్థాన్నే వివరించే యీపద్యం శ్రోతలకానందం గలిగించినట్లు సంస్కృతభాష బాగావచ్చిన పండితులకేనా ఆశ్లోకం కలిగించనేరదు. అది భాషలోవున్న భేదంగాని అన్యం గాదు. తెలుఁగుభాషలో వున్న సీసంమాదిరి శ్లోకాలు సంస్కృతంలో యతిక్కించిచ్ఛేదంతో లేకపోలేదు గాని అవి కేవలం విశేషణకవిత్వానికే తప్ప యితరథా వుపయోగించవు. వాట్లను అశ్వధాటీవృత్తా లని వ్యవహరిస్తారుగాని వృత్తరత్నాకరంలో మత్తేభము లని వున్నట్లు జ్ఞాపకం. "ద్వైపాయన ప్రభృతి శాపాయుధ త్రిదివసోపాన" అనే కాళిదాసశ్లోకా లవే. సీసానికీ, దీనికీ యెంతో తేడా వుండదు. ప్రతిచరణానికీ మూఁడేసి ప్రాసలతో రచించినప్పడే యీశ్లోకం అందంగా వుంటుంది. సీసం ఆలా అక్కఱలేదు. అనేకవిధాల వుపయోగిస్తుంది.

సీ. "హంసచేఁ దనవిని నంతకం బెను రూప
విభవాతిశయమున వెలయుదాని" (భారతం)

సీ. "వితతనవద్వయద్వీప నానాజయ
శ్రీ వధూటీ సమాశ్లిష్టభుజుఁడు" (నైషధము)

సీ. "తనకప్పు నెఱికొప్పునను పూని గౌరీస
మాఖ్య మించ జనించినట్టి యార్య" (వసుచరిత్ర)

సీ. "చిన్నివన్నెలకందు వెన్నుదన్ని సుధాబ్ధిఁ
బొడమిన చెలువ తోఁబుట్టు మాకు" (మనుచరిత్ర).

యీలా అనేకవిధాలుగా సీసం తెలుఁగుభాషకు అందం తెస్తుంది. సంస్కృతంలో వున్న అశ్వధాటి ఒకటే విధంగా వుపయోగిస్తుంది. అదేనా కాళిదాసువంటి సమర్థులకేకాని సర్వసామాన్యులకు దాన్ని స్పృశించే అధికారం లేదు.

ఇంకా యెన్నో సంగతులు తెలుఁగునుగుఱించి వ్రాయవలసి వున్నాయి. "ఉడుకులనాయకుండు=నక్షత్రసముదాయమునకు నాయకుఁడు; ఉడుకులకు నాయకుఁడు", "రాజీవంబయటంచు=రా, జీవం జీవమా రా" ఇత్యాదులు సంస్కృతంలో రావని యెఱుఁగనగు దిఙ్మాత్రం చూపించాను. తుదిదానిలో "రాజీవంబె పద్మమే" అ వొక అర్థం. ఒక్క దేశభాషలందు మాత్రమే కాదు. సంస్కృ

# మలేరియా



రాక్ ఫెల్లర్ ఫౌండేషన్, కూనూరు, నీలగిరికి చెందిన డాక్టర్ పాల్ యఫ్. రస్సెల్ గారు చెప్పినట్లు సంవత్సరములతరబడి రాత్రింబవళ్లు ప్రతినిమిషమునకు కనీసము రెండు చావులకు, ప్రతి ఎనిమిది దినములకు 2,880 చావులకు మలేరియా కారణమగుచున్నది.

మలేరియా ముఖ్యముగా బలహీనపరచే జ్వరము, వైద్యపోషణ లేకపోయినమాత్రమే ప్రమాదించును. రోమన్ సామ్రాజ్యము క్షీణించిపోవుటకు మలేరియాకు చాల సంబంధముండినదని చరిత్రకారులు సూచించియుండిరి. అదేవిధముగ పూర్వార్థగోళమందలి జాతులు తగినంత చురుకుతనము లేక వెనుకబడియుండుటకును మలేరియా కారణమైనను నిజము కావచ్చును.

మలేరియావ్యాపన చరిత్రనుగాని, మలేరియాను పూర్తిగగాని, కొంతవరకుగాని పోగొట్టగలవని పేరుపొందిన క్వైనా, అటెబ్రిన్, ప్లాస్మొక్విన్ మొదలగు మందులనుగురించిగాని తెలిసికొన నక్కరలేదు. క్వైనా నేడు మిక్కిలిప్రియమైనది. అనేకులు క్వైనాచేదును భరింపలేరు. ఇతరమందులు దొరకుటలేదు. ఈ కారణములచే మేమొక మందును తయారుచేసితిమి. మా కోరికపైన డాక్టర్లు దీనిని ఉపయోగించగా మంచిఫలితముల నిచ్చినది.

తయారుచేయుట :—'మలేరిడాల్' సుప్రసిద్ధ 18 దేశీయమూలికలనుంచి తయారు చేయబడినది. వీనిలో మిక్కిలి ముఖ్యమైనది "దీతపట్ట" లేక "పాలకొడిసెచెట్టుపట్ట." ఇండియాలో ఎక్కడనైనను దొరకు ఈ చెట్టుపట్ట అతి చేదుగ వాసనలేకుండ నుండును. ఈపట్ట ఏవిధమైన మలేరియానైనను నివారించుటలో క్వైనాతో సమానమైనది.

ఈమధ్య కలకత్తాలో జరిగిన పరిశోధనలలో ఆర్థికముగను, వైద్యరీతిని క్వైనైన్ సల్ఫేటుకుబదులు ఈ పట్టను ఉపయోగింపవచ్చునని తేలినది. మలేరియాతో బాధపడు గర్భిణీస్త్రీలకుకూడ ఇది వాడవచ్చును.

ఈ మూలికతోపాటు కఫమును తగ్గించుటకును మలమూత్రములను చక్కబరచుటకును, శరీరస్థితి నభివృద్ధిపరచుటకును, ఇతరమూలికలనేకము చేర్పబడినవి.

'మలేరిడాల్'లో చేర్పబడిన మూలికలమూలమున 'మలేరిడాల్' ఎట్టి మలేరియానుగాని నివారింపగలదు. ఇందు చేరిన మూలికాదులలో హానికరము లేదు. ఇది మలేరియాతో సాధారణముగా సంభవించు రోగిస్థితిని తగ్గించి ఆరోగ్యము నభివృద్ధిపరచును. ఎంత మొండి తలనొప్పినైనను నిస్సందేహముగా నివారణచేయును.

భాషకంటే కూడా తెలుఁగు మెప్పును గడిస్తుం దనుటకు సందేహం లేదు. యెక్కువ మెత్తని హృదయం గలవారు తప్ప ఆయీ నా అభిప్రాయాన్ని ఆమోదించరు. "వీఁడికి సంస్కృత మంటే యేం తెలుస్తుంది? వీఁడిమొఖం!" అనేవారుకూడా వుంటారని నే నెఱుఁగుదును. నాకు యేమీ తెలియనిమాట సత్యమే. అయినా నేనెవరిపద్యాలు వుదాహరించి ఆయీచర్చ చేశానో, ఆనన్నయాదులు సంస్కృతంలో యెంతవాళ్లయి తెలుఁగులోకివచ్చి రచన సాఁగించారో ఆలోచించుకుంటే వారికి నాతాత్పర్యం సుళువుగా అవగతమవుతుంది. ముందు వచ్చిన చెవులకంటేకూడా వెనక వచ్చినకొమ్ములే వాఁడి కలిగి వుండడం అంతాయెఱిఁగిందే. సమస్త భాషలకూ తల్లి సంస్కృతభాష. అది గురుస్థానం. రాముఁడికి విశ్వామిత్రుఁడు గురువు. అతనివిద్య రామునియందు సంక్రమించి యెక్కువ శోభించింది. ఆలాగే సంస్కృతం తెలుఁగులోకివచ్చి విశిష్టత్వాన్ని ఆర్జించింది.

సంస్కృతంలోకంటే తెలుఁగులో కొన్ని కట్టుఁబాట్లు (యతిప్రాసలు) యెక్కువగా వున్నమాట సత్యం. ఆకట్టుఁబాట్లకు లోఁగే నన్నయాదులు కవిత్వం చెప్పి ఆచంద్రతారార్కమైన యశస్సు సంపాదించారు. వారిప్రయోగాల సారస్యం యెఱిఁగినవారు మాత్రం కవులలో విరళంగా వున్నారు. యెఱుఁగనివారు తెలిసీ తెలియని దిద్దుఁబాట్లుచేసి భవిష్యత్కవులకు తీరని అపకారాన్ని చేసివున్నారు. ఇది అచ్చువలన కలిగినదోషం. ప్రెస్సువారెవరినో సంస్కర్తలనుగా పెట్టుకుంటారు. ఆయనజీతం ఆయనకు రావాలి కనక తోఁచినట్లల్లా ఆయన సంస్కరిస్తారు. యిప్పటికి అచ్చు వచ్చాక అయిదాఱుసార్లయినా భారతం అచ్చైవుంటుంది. చూడండీ: ఒక ముద్రణానికీ వేఱొక ముద్రణానికీ యెంత భేదం వుంటుందోను. తిక్కన్నగారి "నమ్మినమ్మక", జ్ఞకారకకారయతి వగయిరాలు దిద్దినారు. కాని "ఏనిని" అనే ప్రయోగాన్నింకా దిద్దలేదు. 'ఏనిని' తప్పన్నవారుమాత్రంబయలుదేఱినారు. ఈపైని దిద్దుతారుకాఁబోలు. "హా సీతే కిం భవిష్య!" కవిహృదయం తెలిసికోవడం చాలాకష్టం. "కాదన కిట్టిపాటి యపకారము తక్షకుఁ డేకవిప్రసంబోధన చేసి" అని నన్నయ్యగారు దషలకు ప్రాసమైత్రిని తెల్పుడుచేస్తూ ప్రయోగిస్తే, దాన్ని "ఏకవిప్రసంచోదన" అని దిద్ది యతిస్థానంకూడా వారిచిత్తంవచ్చినట్లు సవరించారు. ఇంతస్వాతంత్ర్యం సంస్కృతం సంస్కరించేవారికి వున్నట్లు లేదు. "తేనావైహీతి వృద్ధి రసాధు రేవ" అనే మొదలైన వాక్యాలవల్ల యీసంగతి అవగత మవుతుంది. తెలుఁగులిపిలోఁగాని, సంస్కృతలిపిలోఁగాని అవైహి, అవేహి అనే రూపద్వయానికి యెంతో భేదం వుండదు. సాహసించి దిద్దితే దిద్దవచ్చును. కాని తెలుఁగులో వున్నట్లు సంస్కృతంలో అపండితులు వ్యాఖ్యాతలు లేరు. మాతృభాష కావడంచేత తెలుఁగులో చాలామంది ప్రవేశాన్ని సంపాదించడానికి అవకాశంవుంది. పూర్వజన్మవాసనవల్ల కవితాధారకూడా పుట్టవచ్చును. ఆలాటివారు యేదో రచనచేసుకొని తృప్తిపడితే చిక్కులేదు. వ్యాఖ్యానం చేయడానికి మొదలు పెడతారు. ఆలా మొదలుపెడితే వచ్చేచిక్కు కొంచెం తెల్పుతాను:

"న మానినీ సంసహతే ఽన్యసంగమం" (భట్టికావ్యము)

ఆవ్యాఖ్యాతలను "అయ్యా! 'అన్యసంగమం' అన్న సమాసానికి విగ్రహం సెలవియ్యండి" అని అడిగిచూడండి. యేవిధంగా చెప్తారోను. "అన్యస్యసంగమః" అని చెప్తారు. అప్పుడాశ్లోకార్థం చెడి వ్యతిరేకిస్తుంది. "మానవంతురాలైన స్త్రీ (తన భర్తకు) ఇతరస్త్రీతో సంబంధం వుంటే సహించదు." అని రావలసినదానికి యితరపురుషునితో అని తేలుతుంది. శాస్త్రజ్ఞుఁడైతే వ్యాఖ్యాత "అన్యస్యా స్సంగమః, అన్యసంగమః" అని వ్యాఖ్యానిస్తాఁడు. శాస్త్రవాసన లేని వ్యాఖ్యాత అంతమాత్రంతో వూరుకుంటాఁడా! వూరుకోక "అప్పుడు 'అన్యాసంగమః' కావద్దా? దీర్ఘ మేమయింది" అని శంకిస్తాఁడు. ఈచెట్టుక్రింది ప్లీడరీ పాండిత్యాల చేతుల్లోఁబడి తెలుఁగు నానాపస్మారాల పాలవుతూవుంది. ఈవ్యాఖ్యాతలకి భాషలోని లోఁతుపాఁతులు బొత్తిగా తెలియవు. తెలియనివారు వూరుకోరు. యేదో తప్పుమార్గాన్ని తొక్కుతారు. వారు తొక్కిన త్రోవనే మఱికొందఱు (శతాంధాః కూపం ప్రవిశంతి) పోవడం. యీ దురవస్థ లేకపోతే తెలుఁగులో బాగుండేది.

శ్లో. "స్వాధీనో రసనాంచలః పరిచితా శ్శబ్దాః కియంతః క్వచిత్
క్షోణీంద్రో న నియామకః పరిషద శ్శాంతాః స్వతంత్రం జగత్."

"వయం హూనవ్రతాలంబినః" అని యీమధ్య వోపికలేక వ్యాసాలపని కట్టిపెడితే మా శంభుప్రసాదుగారు బలవంతపెడితే యీనాలుగుమాటలూ వ్రాశాను. వైతండికులకు భయంపడి వున్నమాట దాస్తే యేలాగ? "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" అనేమాట సత్యం. ముమ్మాటికీ సత్యం. ఈ భాషకు యెక్కువగా అందాన్ని కల్పించేవి లోకోక్తులు. ఆ లోకోక్తులు గ్రామ్యంలోనే చాలామట్టుకు వుంటాయి. మచ్చుచూపుతాను.

"పాలు విఱిగితే పెరుగగునే?" (సారంగు తమ్మయ్య)

"నుయి దాఁటేవానికిన్ జింతయా కంతైనం గొదవైనను౯" (రామలింగం)

"రోళ్లా రోకళ్లం బాడిన కూరుము లిపు డింత దాఁచికొన్న౯" (పింగళి)

ఇవి తప్పులనేవా రున్నారు. అంతటి మహాకవులకు "విఱిగితే, దాఁటేవానికి, రోళ్లా" అనే ప్రయోగాలు గ్రామ్యాలని తెలియనే తెలియదా? (శాంతంపాపం) అన్నంతవఱకు ఆలోచన పోనే పోదు. ఇది యీ భాష చేసుకున్న పాపమేమో అనుకుంటాను. మనకు వున్న అజ్ఞత్వాన్ని మహాకవులనెత్తిని రుద్దడంకంటే అప

చారం యేముంటుంది? "లోకోక్తీనాం భవే ద్యోగో యథావ ద్భుతి రంజనం" అని అహోబలుఁడు వ్యాకర్తల సమ్మతిని ప్రకటించి వున్నాఁడు. సీతారామాచార్యులవారు యెంతో కాలం శ. ర. నిఘంటు నిర్మాణానికై జీవితాన్ని ధారపోసి గణించిన అనుభవాన్ని క్రోడీకరించి 'త్రిలింగ లక్షణశేషం' అనే పేరుతో లక్షణగ్రంథం నిర్మించారు. కూచిమంచి తిమ్మకవి 'సర్వలక్షణ సారసంగ్రహం' రచించి ప్రయోగ విశేషాలు కనపఱచి వున్నాఁడు. ఇవేవీ పరిశీలించకుండా సుప్రయోగాలు, అపప్రయోగా లనడం యెంతో అపచారంగా కనపడుతుంది. నూటికి తొంబదిపాళ్లు ఆంధ్రభాష వ్యవహారంమీఁద ఆధారపడి వుంటుంది అనడానికి యెవరో కాదు, భారతకవులే మార్గప్రదర్శకులు. వారు 'వస్తాఁడు, పోతాఁడు' అనే గ్రామ్యాలు ప్రయోగించరుగాక యీ క్రింది ప్రయోగం చూడండి: "నరునకు చుట్టమెవ్వరు"–యిందులో 'చుట్టము' ఏకవచనం, 'యెవ్వరు' బహువచనం. దీన్ని చట్టన సర్వజ్ఞంమన్యులు "చుట్ట మెవ్వఁడు" అని దిద్దుతారు. ఆ యీ పీడ మనస్సులో పెట్టుకునే అనుకుంటాను, రెండోచరణంలో ప్రాసలో "ఎ, వ్వరు" అని శంభుదాసుఁడు ప్రయోగించివున్నాఁడు. అది దిద్దడానికి వశం కాదు. ఆపైని యింకో విచిత్రమైన వాదానికే దిగుతారు. వారు యెందుకో ఆలా ప్రయోగించి వుంటారు. మనం మాత్రం దాన్ననుసరించి ప్రయోగించుకోకూడ దని కొందఱు. కొందఱో, మహాకవులకుమాత్రం ప్రమాదం రాఁగూడదా? అట్టి ప్రమాదాన్నే మనం పట్టుకొని వ్రేలాడడ మెందుకంటూ వాదానికి దిగుతారు. యీ చివరవారి వాదం కొంత ఆపాతరమణీయంగా కనపడుతుందిగాని ఆ మహాకవులు ప్రమాదపడి ప్రయోగించినట్లు రుజువు చేయాలా, వద్దా? తిక్కన్నగారు మూడుచోట్ల ప్రాసస్థానంలోనున్నా, ఇతరచోట్ల శతముల కొలఁదిగానున్నా వాడినదానిని ('ఏనిని' ప్రయోగం) తప్పని తమవాదమే నిల్పడానికి ప్రయత్నించడాన్ని యేమనాలి? న్యాయ్యమైన కట్టుఁబాట్లుందఱూ విశ్వసింపవలసిందే. మనకు తెలియక యేదో తప్పని తరవాత దానికోసమై పెనుగులాడడం భాషకు తీరని అపకారాన్ని కలిగిస్తుంది. అప్పకవినాఁటికి తమకు గోచరించి వున్న యతులు కొన్నిమాత్రమే లక్షణజ్ఞులు వుదాహరించారు. "పూర్వకవుల లక్ష్యములు" పరిశీలించి యతులసంఖ్య అప్పకవి చాలా పెంపుచేశాఁడు. అట్లే ప్రాసల విషయంకూడా. అప్పకవి యించుగాగమయతి పూర్వలాక్షణికులకే కాక భారతాదులకు కూడా సమ్మతమైనా యెందుకో నిషేధించాఁడు. కల్లూరివారు భారతాదులనుంచి బహు ప్రయోగాలు చూసి సమర్థించారు. మనకు వుభయులూ ప్రాజ్ఞులే, మాన్యులే కనక మనం యిరువురినీ అనుసరించడంలో ఆక్షేపణ లేదు. ఆ యీ విధంగా భాషకు కొంత స్వాతంత్ర్యం కలిగించడంలో అపచారం యేమీ వుండదు. నన్నయాదులు అన్యదేశ్యాలు కొంచెమే వాడినారో, లేక వాడనేలేదో! పెద్దన్నగారు చాలా వాడినారు. దిట్టకవి శరపరంపరగా వాడి మెప్పించుకున్నాఁడు. "మా యబ్బపదమ్ములాన నిజమాడితి హైదరుజంగు సాహెబూ?" అన్నాఁడు. ఈసంబోధన మార్చడానికి వీలులేదుగాక, యెన్నో మార్చడానికి వీలున్నవే వాడినాఁడు.

ఈ వెఱ్ఱివాదం తెలుఁగుకవులనే బాధించలేదు. యింత కాకపోయినా యిందులో కొంతేనా సంస్కృతకవులనున్న యేదో మాదిరిది బాధించింది. కనుకనే భవభూతిమహాకవి "సర్వథా వ్యవహర్తవ్యం కుతో హ్యావచనీయతా, యథా స్త్రీణాం తథా వాచాం సాధుత్వే దుర్జనో జనః" అన్నాఁడు. అని అంతతో వూరుకున్నాఁడా? లేదు. "అతిదుర్జన ఇతి వక్తవ్యం" అని కూడా వార్తికం తగిల్చాఁడు.

వ్రాస్తే చాలా వ్రాయాలి. రసమెఱుఁగక పాడుచేసుకొనే వారినిగూర్చి చెప్పేది లేదు. రసజ్ఞులైన విద్వత్కవులకు తెలుఁగు భాషవంటి భాష మఱివొకటి కాదు. రసములేని రచన యెంత నిర్దుష్టమైనా, స్వహస్తపాకంవలె వుంచుంది. రసమెఱిఁగిన కవి ఆలాటిభాష, అనఁగా శుద్ధచ్ఛాందసగ్రామ్యంలో కూడా రసం కురిపించఁగలఁడు.

శా. "అన్నే చూస్నివషే వొషే చెవుడషే అష్టాగషే యేమిషే
విస్నావర్ఘులవారి బుఱ్ఱినష ఆవిస్నాయి కిస్నారుషే
విస్నం డెంతటివాఁడె? యేళ్లు పదిషే"

యీ పద్యం కొలఁదికాలంక్రిందట కీ. శే. ఱైన దాసు శ్రీరామకవిగారిది. బాగుంది కనక నాకు నోటికి వచ్చింది.

"లోకులరసనలె యాకులుగా నుండునట్టి యవివో కవితల్"

క. "ఏరసము చెప్పఁబూనిన
నారస మాలించువారి నలరింపని యా
నీరసపుఁగావ్యశవముల
దూరముగన పరిహరింపుదురు కావ్యజ్ఞుల్"

ఇవి నా స్వంతమాటలు కావు. కవికర్ణరసాయనంలోవి. యెంతసేపూ రసానికి పాటుపడడం కవి కావశ్యకం. కవిత్వ మనేది రసజ్ఞలోకానికై పుట్టింది. రచనలో రసమంటూ యేకొంచెమేనా వుండనిపక్షంలో కవి యెంత తర్కం వచ్చినవాఁడైనా, యెంత వ్యాకరణం నేర్చినవాఁడైనా, యెన్ని వీసెలవిభూతి ధరించి యెన్ని రుద్రాక్షపేరులు ధరించి రచించినవాఁడైనా ప్రయోజనం లేదు.

శ్లో. "ఘటః పట ఇతి స్ఫుటం పటు రటంతి నైయాయికాః
పఠంతిచ హహాత్తరాం కఫఘటేతి పాతంజలాః
వయం వకుళమంజరీగళదరీణమాధ్వీఝరీ
ధురీణశుభరీతిభిః ఫణితిభిః ప్రమోదామహే"

పై శ్లోకంవల్ల తర్కవ్యాకరణాదిశాస్త్రాలు ఆనందం యిచ్చేవి కావనిన్నీ, కవిత్వమే ఆనందం యిచ్చేదనిన్నీ తేలుతూ వుంది. ఆయీమాట వొక్క భాషకే సమన్వయించేదికాదు. చెప్పడం సంస్కృతకవి చెప్పినా అన్ని భాషలకూ మనం సమన్వయించుకోవచ్చును. అందులోనున్నూ— "తత్రాఽపిచ చతుర్థోంకః" అన్నట్టు తెలుఁగు భాషలో యెక్కువసొగసులు తీసుకురావడానికి అవకాశం వుంది. కాని కవికి భాషాజ్ఞానమాత్రమే వుంటే చాలదు. చాలా లోకానుభవంకూడా వుండాలి. అందులోనూ శృంగారరసం వ్రాసి మెప్పించడం మరీకష్టం. ఎందఱో కవులు శృంగారం వ్రాసిన్నీ మెప్పొందనివారీకాలంలోనే కాదు, పూర్వకాలంలోనూ వున్నట్టు వారి వారి కృతులు సాక్ష్యమిస్తాయి. జయదేవుని అష్టపదులు శృంగారానికి పెట్టింది పేరు. ఆ జయదేవుఁడు మెచ్చుకొన్నవాఁడు ఆచార్యగోవర్ధనుఁడు. గోవర్ధనుఁ డేమన్నాఁడో చూడండీ:

"ఆస్వాదితదయితాధర సుధారసస్యైవ సూక్తయోమధురాః
అదళితరసాలముకుళో సకోకిలః కలముదంచయతి"

"అంతరమపి బహిరివహి వ్యంజయితుం రస మశేషత స్సతతం
అసతీ సత్కవిసూక్తిః కాచఘటీచ త్రయం వేద"

వ్యాసం విస్తరిస్తూ వుంది. మఱొకప్పుడు చూచుకుందాం తెలుఁగు కవిత్వంలో నానావిధములైన అందచందాలు వున్నవనిన్నీ, అవి అనుభవైకవేద్యాలనిన్నీ సారాంశం. స్వస్తి.



సుగాలీ సుందరి

[ చిత్రకారుడు : శ్రీ కె. వేణుగోపాలం ]

# మాతృశ్రీ

= శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి =  

౧

లెక్క లొక్కటె నెఱసున్న, తక్కినట్టి - చదువులందెల్ల నేనే ప్రశస్తి గంటి
దాన సంతోష మంది విద్యాధికారి - పారితోషిక మిడె నొక్క బంతి నాకు.

లెక్కలలోఁ గడు మొనగాఁ - డక్కర మింకేది రాద, యయినను మఱియిం
కొక్కండుఁ బారితోషిక - భాక్కయ్యెం బ్రక్కయింటి బాలుఁడు నాతోన్.

ఉభయులకు రెండు బంతులు - లభియించెన్, నాకు నుపరి లక్ష చివాట్లున్
లభియించెఁ బరువు చెఱచితి - వభాజనుఁడ వయితి వనుచు నధ్యాపకుచేన్.

రాచి రాచి నన్ను అంపానఁ బెట్టెను - బ్రక్కబాలుఁ జాలఁ బ్రస్తుతించెఁ
దక్క చదువులందు నెక్కువతక్కువ - లెఱుఁగఁ డేమి యొజ్జ లిరువురందు?

౨

ఎనిమిదేండ్ల ప్రాయ; మేనును, నాతోడఁ - జదువు బాలుఁ డొకఁడు సందెవేళ
నింటిదొడ్డిలోన నేకాంతమున బంతు-లాట లాడుచుండ నరసె నమ్మ.

వాఁ డొకదాన నే నొకట వాటులు రువ్వట, నట్లు నేర్పుతో
నాడుట చేతఁగాని నను నవ్వలఁ బొమ్మని రెండు చేతులన్
గూడ నొకండె వాఁ డెగురఁగొట్టుట బంతులు రెండు, వింతసం
క్రీడలఁ గాలఁ గేల నవరించుట, డగ్గఱి యమ్మ యారసెన్.

"రెండు బంతులు నిచటి కెందుండి వచ్చె?-నొక్కబంతియె కదర నీ కొదవె నపుడు?
ఎవ్వరేని వీని కింకొక టిచ్చినారె? - దొరకెనే యెచ్చటేని? లేక దొంగిలితిరొ?"

నిలువుగ్రుడ్డు పెట్టి నిలిచితి నూపిరి - యాడలేదు మాటజాడ లేదు
తణుకు బెణుకు లేక తత్క్షణమే సహా-ధ్యాయి యమ్మమాట కడ్డుకొనియె.

వ. వాఁడు తఱచుగ మాయింట నుంటయు, మాయమ్మ 'నత్తయ్యా' యని వరుసతోఁ బిలుచుటయుఁ బరిపాటి.

"అత్తయ్యా! విను దొంగిలించినదిగా, దైదాఱునా ళ్లయ్యె, మే
మిత్తోఁటన్ దగ నాటలాడుకొనుచో నెందుండియో కాని మా
నెత్తిన్ బడ్డది, యిత్త మన్న నడుగన్ లే రెవ్వరున్, బంతి మా
సొత్తయ్యెన్ దొరకెన్ దనంత నిఁక నిచ్చో నాడుకోరాదొకో?"

బంతి గొని యమ్మ విసవిసఁ బ్రక్కయింటి-కరిగి, యాయింటి యిల్లాలి, నామెపుత్రుఁ
బిలిచి యేమేమొ మాటాడి, పిదప మమ్ము-నవసవగఁ బిల్చి యంబులు జాలువార్చె.

"ఆట లిల్లైన సాగెనా? యింక మీగతి-యెట్లు లౌనో? యెవ్వ రెఱుఁగఁగలరు?
తోటకూరనాఁడె యేటికిఁ దెలుపవై-తనుచు మీఁద నన్ను నడుగు టగునో?

ఐదాఱునాళ్ల ముందఱ-నే దొరకిన నాకుఁ దెలుపనే లేదేమీ?
కాదుకదా యిది మీది? యిఁ-కీదాపున నెవరి దగునొ? యెఱుఁగరటోరీ!"

వ. వడఁకుతో మాట తడబడ నే నిట్లంటి:

"అగు నిక్కమ్ముగఁ బ్రక్కబాలకునిదే యాబంతి, యానాఁడు వాఁ
డెగురఁగ దన్నుచు నాడుచుండెనొ? మఱింకేమయ్యెనో? దూకి మా
మొగముల్ దన్నుచు దొడ్డిలోనఁ బడె నేముం దాఁచుకొన్నాము పై
కగపడ్డం గయికొందు రన్న వగతో నైదాఱునాళ్లమ్మరో!"

వ. మాటలాటలందుమాత్ర మతిమాత్రచతురుండు నాతోడ నాడు బాలుఁ డంత—

"అత్త! మాతప్పిదం బావంతయును లేద తాన యాబంతి మాపైనఁ బడెను
అడిగిన నిచ్చివేయఁగవలె ననియె మేముంచితి మిన్నినాళ్లొక్కఁడైన
నడుగనే లేదు, మీరయి యేల యీయలే దందువేమో వాని చంద మెఱుఁగు
లెక్కలలోఁ దన కెక్కువ నేర్పని గర్వపడును జూచి యోర్వలేఁడు
వాఁడు మాజాడ, నటువంటివానితోడఁ-బొసఁగు బా టేల? యీబంతి విసరివైచి
వాని దొడ్డిలోఁ జేర్తుము; వాని సొమ్ము-వాని దగు నరి కిది సరి యౌనుగాదె?"

కోపము దుఃఖముం గనులకొల్కులఁ దాండవమాడఁ జూచి ఛీ
ఛీ! పదఁ డంచు వెంటఁగొని చేతుల బంతు లొసంగి వీథిలో
నే పదిమందిముందరను నిల్పి మముం, బిలిపించి ప్రక్కయిం
టావెను దత్సుతుం గథ సమగ్రముగా వచియించె నీగతిన్:

## 3

వ. "మీరు మీరు నందఱు నీ వినిందితుల నడవడి వినుండు. వీఁడు నాకొడుకు. వీఁడు వీని తోడి తరగతివాఁడు; నాల్గువీధు లవతలివాఁడు. వీ రిద్దఱు నేకమై, ప్రక్కయింటి బాలుఁ డాటాడుచోఁ దప్పిదారి మాదొడ్డిలోఁ బడిన యీ రబ్బరుబాలు నపహరించి దాఁచిరి. అది వానిదే యగుట నెఱింగియు వానికీయరైరి. నాకును జెప్ప రయిరి. ఎవ్వరి నడిగిన నేమి యనర్థ మగునో యని యీప్రక్కయింటి బాలుఁడు తన యిక్కట్టు నెవ్వరికిం దెలుపక యేడ్చుచున్నాఁడు. మావాండ్రయిదాఱునాళ్లు దాఁచి యెదిరి యేడ్పడఁగియుండు నని, యెట్లో నను నెఱపఱచుకొనవచ్చునని, యొక్క బాలుతోనే యిద్దఱు బాలురు నాడుట వలని యుత్సాహసంకోచము నోర్వఁజాలక యిప్పుడు బయటఁబెట్టిరి. మావాఁ డాట చేతఁగానివాఁడు. కాని వస్తులుబ్ధుఁడు. పేరికే రెండు బంతులు మావానివి కాని యాట ముచ్చట లెల్ల నీ మిత్రబాలునివే. వీని రెండుబంతుల గంతులాట సూచి నే నడుగఁగా

బొంకుల బుంగ, దొంగ యీ మిత్రబాలుఁడు బూకరించుచు నాతోఁ బలికిన పలుకు లిట్టి విట్టివి. ఇందు మావాని తీ రిట్టిదిట్టిది. నేఁడు బడిలో లెక్కలలోఁ బారితోషికము గొంటి నని పొరుగింటి బాలుఁడు గర్వించుచున్నాఁ డనుచున్నారు. ఆ బాలున కట్టి గర్వము కలదో లేదో కాని మావానికి వానిపై నసూయ యున్నది. అదియే యీబంతి నపహరింపించినది. ఇంది క్రొత్తబంతిని దాను గైకొనఁగోరుచున్న యీమిత్రబాలకుఁ డుద్బోధకుఁడు. ఒక్క లెక్కలలోనే యెవరింటి బాలుఁ డెక్కువ కాన వాని కంతగా గర్వ ముండ నవకాశము లేదు. అది తనకు రానందుకు వంతయు, వానికి వచ్చినందు కసూయయుఁ, దక్కిన యన్నింట దంటనైతి నన్న గర్వమును మావానికే యున్నవి. ఎదరివానిపై నిందగట్టువాఁ డానింద తనయం దెంతవట్టు కుదుర్కొనియున్నదో ముందు గుర్తించి చూచుకోఁబూనఁడు. ఎదిరి బాలునిపై మోపు నిందలలో నెన్నో యంశములు మావానిలోనే కుదుర్కొనియున్నవి. ఇట్టి దోసముల నీ చిట్టివయసుననే చిదుకఁద్రొక్కకున్న దో నవి పెరిగి పెద్దచేటు మూడ్చును" అని యమ్మ మమ్ముం జూచి——

౪

"కొంపల్ గూల్చెద రోరి బాలు రిటు లెగ్గుల్ నేర్చినన్, మిమ్ము మ
న్నింపన్ జాల యథార్థమేయయిన మీ నేరంబులకై యేడ్చుచున్
లెంపల్ వైచుకొనుండు నల్గురెదురన్, మిత్రత్వ మీ బాలుతో
సంపాదించుకొనుండు దుష్కృతికిఁ బశ్చాత్తాపమున్ జెందుచున్.

ఐదు నాళ్లు దాఁటె నాబాలకుం డెంత-వంతపాలు పడెనో? వాని తల్లి
కెఱుఁగఁజెప్పకుండ నేడ్చుచున్నాఁడు-ఫలము దీని కెపుడో కలుగు మీకు.

వానిఁగాని మిమ్ము మానసమున సుంత-చింత చేసికొనుఁ డదెంత వంత
యగునో తెలియు; నట్టి పగ ముందటికి మూట-గట్టికొంటి రెవ్వ డొట్టుకొనునో?

* * * * * *

వచ్చెఁ బ్రమాద మెట్లొ భగవంతుఁడ కావు మటంచుఁ జాటుగా
నిచ్చలు నాత్మ వేడుకొనునేని విశుద్ధుఁడు కాఁడు వేఁడుఁ, దాఁ
గుచ్చిత మెవ్వనింగుఱిచి కూర్చెనో? వానినె దేవునట్లు వా
విచ్చి క్షమింపఁ దప్పిదపు వెల్లడి వేడవలెన్ విశుద్ధికిన్.

కొంకక లోలోఁ బాపవి-సంకల్పము లార్చ మానసంబున్ బైకు
ట్టంకించి చిదుకఁద్రొక్కు భ-యంకరునకు నది యొదింగి యనువర్తించున్.

అల్లరిపిల్లవాండ్రకు రహస్యపురక్ష త్యజించి దోషముల్
వెల్లడిచేసి తండ్రులు సువృత్తము తీర్తురు చిత్తవృత్తులన్
బిల్లలవంటి పౌట గమనించి యసంగతభావజాతమున్
గ్రుల్లనుబోలె వెల్వఱిచి కూర్చు విశుద్ధత వాని కాత్మయున్.

తల్లిదండ్రు లుత్తములుగాఁ దనరు టెట్లొ?-యాత్మ పరిశుద్ధమైనది యగుట యట్లు
తనయు నవ్వారు సరిదిద్దికొనుట యెట్లొ?-మనసు నాయాత్మ సరిదిద్దుకొనుట యట్లు.

వ. వీండ్రను జాటున శిక్షింపవచ్చును. బంతి నొకవాటున వారి యింటం జేర్చ వచ్చును. అది యీబాలురకు మేలుగూర్చు తెఱఁగు గాదు. నిజముగా మావాండ్రు పశ్చాత్తప్తు లగుట కిదియ పద్ధతి. పశ్చాత్తాపపడక బాగుపడుట పొసఁగదు." అనుటయు నప్పుడు-

౫

నేను నేనని యనుకొను మేను, దాని-లోన నింకేమి యే మున్నదో, నిలువున
నల్ల నది యెల్లఁ దాఁటుమాత్రె కలంగెఁ-గలను నేను, నా తన మది కలవొ? లేదొ?

వలవల యేడ్చితిన్ దలఁపు వ్రయ్యలువాఱెను మాతృదేవి యు
జ్జ్వలహృదయంబు దానఁ గనవచ్చెను, నాకు శరీరలాభ మా
సులలితశీలమూలమునఁ జొప్పడుటన్ సమకూఱె నిట్టి ని
ర్మలతరబోధ మన్మద మమందముగా దయివాఱె నిల్వనన్.

తప్పిదము లొప్పుకొంటిని-జెప్పితిని క్షమాపణంబు చెంపలు వ్రేట్లన్
నొప్పించుకొంటి నెయ్యం-బొప్పంగోరితిని బాలు నొసఁగితి బాలున్.

తద్దినము పెట్టువానితోఁ దమ్ముఁనట్లు-నానపాధ్యాయి నావెన్క నలి గెఁగాని
మాటఁగా లేద కసు చెసు మత మతనిది-యట్లె యంతంత కల యలవాట్లె పెరిగె.

౬

అమ్మహితబోధనమ్ము బాల్యమ్మునందు-నలసవృత్తిని జనువున నప్పుడపుడు
పెటఁబుచ్చితినేనిఁ దా విసువుగొనక-దిద్దుకొనుచు. నాతర్వాశ దిక్కెవ? రను.

బాల్యపుం జాపలము చప్పఁబడియెఁ గొంత-చదువుజంజాటమున ముక మొదవె నవల
జనకులకు జన్మభూమికిఁ జాల దవ్వు-చని బ్రతుకుఁదెరువునం దొకట్టొన నొదిఁగితి.

కన్నవారి సేవింపఁగా నున్నయూరి-యుప్వ దిన నప్పుడపు డేఁగుచుంటి నింటి
కారఁబండిన పండ్లు పుణ్యాత్ము లూర్ధ్వ-గతికిఁ దలిదండ్రు లరిగి రుత్కంఠ యుడిగె.

ఉన్నయూరికి నరుగుట నన్నగిల్లెఁ-దల్లిదండ్రుల మైతిమి దంపతులము.
కష్టసుఖములు మామీఁదఁ గడలుకొనియె-మేమె నిర్వాహకుల మయి మెలఁగవలసె.

తప్పో? యొప్పో? సుఖంబో? దుఃఖమొ? పయిన్ దార్కొన్న నున్నారు మా
యప్పల్ సర్వము నిర్వహింతురని నే నంటించుకోకుంటి నాఁ;
డప్పుణ్యాత్ములమల్ గతించినవి యిల్లాల్ నేను నా దేశపుం
జొప్పుం గొంటిమి, గంటి మాగమగతిన్ సూనుస్నుషాద్యావృతిన్.

ఇంచుక మంచికార్య మెదియే నొనరించితినేని దాన నన్
గాంచిన తల్లిదండ్రులకుఁ గల్గుఁ బ్రమోద మటన్న వేడ్క ప్రే
రించును దొల్లి న, న్నల యదృష్టము తీరెను, వారు దివ్యతన్
గాంచిరి, నేన పెద్ద ననఁగాఁబడితిన్ బడితిన్ వ్యథాంబుధిన్.

కోరిక యొక్కఁడానిపయి, గొప్ప ప్రయత్నము దానిఁగూర్చి, తా
ర్మారయిపోవు టల్లది దురర్థ మటంచుఁ ద్యజించుకొన్న దే
కోరి తనంత వచ్చి సమకూరుట, తప్పనుకొన్న దొప్పుగా
మారుట, యొప్పు తప్పయి భ్రమంబు ఘటించు టదేమి కర్మమో?

౨

చిక్కుల్ పెక్కులు చుట్టుముట్టికొని నుచ్ఛేదించుకోలేక నే
నుక్కిర్బిక్కిరి యౌచునుంటి, నట నా కొక్కింత సాహాయ్య మీఁ
జిక్కండయ్యె నొకండు; నెట్టు లిఁక నీచీకాకులందండి నే
రెక్కొఁగల్గుట యం చధోగతిని నిర్విణ్ణుండనై క్రుంగితిన్.

మూఁగి తుపాను రేఁగిన సముద్రమువోలె బహిఃప్రపంచ ము
ద్వేగవిఘాతవిశ్లథగతిన్ హతమారఁగఁజొచ్చెఁ బైకెటుల్
సాగఁగ రాక కన్మొగిచి శాంతివెలుంగటలోనఁ దోఁపఁ దో
డ్తో గుఱుతించుకొంచు బహుదూరము పోతిని బోతిఁ బోయితిన్.

హద్దుల్ సూపుచుఁ గానవచ్చె నట మూలాధార మాయమ్మ న
న్నొద్దన్ జేర్చుకొనెన్ భయం బుడిపె నాయుద్బోధముల్ గోక నీ
విద్దుఃఖంబులు తెచ్చుకొంటి విఁకనే నీబాట నేతెమ్ము నా
సుద్దుల్ విన్మ పరాత్మకంబు లవి తోచున్ బాచు నీచిక్కులన్.

విడిచిన నిట్టి నీవసదవృత్తుల పాల్పడవచ్చు, నింక ని
న్గవఁగనీను నీవెనుకఁ గావలియుండెద నానిదేశపుం
బడిఁ జదువంగ నీకు నెటువంటి భయంబులు నింకమీఁదఁ బైఁ
బడ విటు చూడుమా యనుచు బాల్యపుఁ దత్కథ తోఁపఁజేయుచున్.

మాతృశ్రీయట యక్షరాకృతి రహింపన్ జక్రమై చుట్టి సం
ప్రీతిన్ గూర్చెను; దల్లక్రిందయి యదే శ్రీమాతయై తోఁచె; నా
రీతిన్ జక్రము గిర్గిరన్ దిరిగి మాతృశ్రీకి శ్రీమాత కు
ద్ద్యోతింపించె విభేదశూన్య మగు విద్యుద్దివ్యహృద్యద్యుతిన్.

సంకల్పంబుల కూటపట్టయిన యాస్థానంబు వెన్నంటి తా
నోంకారమ్ము సదర్థయోజనలకున్, హుంకారముల్ దుష్క్రియా
సంకల్పంబులకున్ బొనర్చుచును నిచ్చల్ జీవితప్రక్రియన్
వంకల్ దిద్దుచు నమ్మ నెమ్మది పరావాగ్రూప నన్నోమెడున్.

---



# ఆనందగజపతి విద్యావినోదములు

= శ్రీ అడిదము రామారావు =

సూర్యవంశసంభూతులైన పూసపాటివారికి మాధవ వర్మ మూలపురుషుఁడు. ఈయన తన తపః ప్రభావాతిశయమున తా నేలు రాజ్యమునందు నేడు గడియల కాలము సువర్ణవృష్టి గురిపించిన మహానుభావుఁడని ప్రసిద్ధిగన్న నృపపుంగవుఁడు. ఈ పావనవంశమం దనేకులు రాజోత్తములు జన్మించి, తమ పరాక్రమాదిగుణములచేతను, పరిపాలనా దక్షతచేతను వంశవిఖ్యాతిని ఆచంద్రార్కముగ నిలుపఁగలిగిరి. అప్రతిహతముగ నవనిఁ బాలించిన బుద్ధవర్మయు, పిడుగు తుత్తునియలుగ నటికిన చిక్కభీముఁడును, పరవీరనృపులకు ప్రక్కలోని బల్లెమై ధరణి నేలిన దేవవర్మయు మున్నగువారు ప్రాచీన కాలమునకుఁ జెందినవారు.

పొట్నూరు, కుంభిళాపురము (కుమిలి), విజయనగరములను రాజధానీనగరములుగఁ జేసికొని కళింగ దేశమును పరిపాలించిన మహారాజులు — సీతారామచంద్రులు, వేంకటపతిమహీపాలుఁడు, ఆనందగజపతీంద్రుఁడు, అన్నమరాజు మొదలగువారు. క్రీ. శ. 1757-వ సంవత్సరమున



విజయనగర ప్రభువులగు
**శ్రీమదానంద గజపతిరాజేంద్రులు**
[ క్రీ. శ. 1850-1897 ]

బొబ్బిలియుద్ధములో వీరస్వర్గమును గాంచిన శ్రీ పెద విజయరామగజపతి మహారాజులుంగారును, అటుపిమ్మట రాజ్యమునకు వచ్చి అసహాయశూరులని ప్రఖ్యాతి నార్జించినవారును, ఆనాఁడు వర్తకసంఘముగ నీప్రాంతమున నుండియున్న ఆంగ్లేయులకు అమూల్యసహాయ మొనర్చి వారి భక్తిగౌరవములకు పాత్రమైనవారును నగు శ్రీ ఆనందగజపతిమహారాజులుంగారును, వారికి పిమ్మట ఇరువదిసంవత్సరములకు పైఁగా రాజ్యమును పరిపాలించి 1794-వ సంవత్సరములో పద్మనాభయుద్ధమున దివంగతులైన శ్రీ చినవిజయరామమహారాజులుంగారును అత్యంతసంస్మరణీయులు.

మన యీవిజయనగరము శాస్త్రాది విద్యలకు వారణాసి యనియు, సంగీత విద్యాప్రచారమునకు తంజాపురమని యు ప్రసిద్ధి గలుగుటకు హేతుభూతులైన శ్రీ విజయరామగజపతిమహారాజులుంగారు (మూఁడవ) రాజర్షి యగు శ్రీ నారాయణబాబుగారి పుత్రులు. ఈ మూఁడవ విజయరామగజపతిమహారాజావారి కుమారులే విఖ్యాతమహాపురుషులగు శ్రీ ఆనంద

గజపతిరాజేంద్రులు. పూసపాటివంశపూర్వరాజుల తపః ఫలమే ఈ మహారాజురూపమున నవతరించె నని లోకులు చెప్పుదురు. ఈ రాజన్యుని సౌందర్యమార్దవవాఙ్మాధుర్య మర్యాదాదిగుణము లెల్లర హృదయముల నాకర్షించుట వలన ఆంగ్లేయులు ఈయనను ప్రిన్స్ ఛార్మింగ్ (Prince Charming_జగన్మోహనుఁడు)అని యుగ్గడించుచువచ్చెడి వారు. వీరికి సంగీతసాహిత్యములయందుఁ గల ప్రజ్ఞ బుధజనసంస్తవనీయమై యలరారెను. ఈవిద్వద్రాజ శిఖామణి ఆంధ్రభోజుఁ డని ప్రసిద్ధిగని తన విద్యా పోషణముచేతను, వైదుష్యముచేతను, కళాప్రియత్వ కవితాచతురిమలచేతను నిస్తులకీర్తి నార్జించి మించెను. ఈ ప్రసిద్ధికి తగినట్లుగనే సుప్రసిద్ధాంధ్రకవులు, శతావధానులు నగు శ్రీ తిరుపతివేంకటేశ్వరకవులు

"గీ. ఏను చూచిన రాజులం దెల్ల నొక్క-
విజయనగరమహారాజు వేత్త" (నానారాజసందర్శనము)

అని ప్రశంసించియున్నారు. ఈ మహారాజు కవియు, విద్వాంసుఁడు నగుటచే వీరి యాస్థానమున పండిత ప్రకాండులు, విద్వత్కవులు, కూలంకష ప్రజ్ఞా సమన్వితులగు శాస్త్రవేత్తలును వెలసియుండిరి. ఈ యంశమునే శ్రీవారి సామాజికులలో నొకరగు కీ. శే. గురుజాడ అప్పారావు పంతులుగారు 'కన్యాశుల్కము' నకుఁ దాము వ్రాసిన పీఠికలో* He is a great scholar; he has attracted "to his court literary stars of the first magnitude" అని యుగ్గడించియున్నారు. కీ. శే. కొల్లూరు కామశాస్త్రిలవారు, పేరి వేంకట శాస్త్రుల వారు, మండ చిట్టికామశాస్త్రులవారు, భగవత్కవి శ్రీమాన్ ముడుంబై నరసింహాచార్య స్వామివారు, మైసూరు భీమాచార్యులవారు, ఆంధ్ర కవిజీవితముల కర్తయగు శ్రీ గురుజాడ శ్రీరామమూర్తి పంతులవారు మొదలుగాఁగల విద్వాంసులు ముఖ్యులుగ నుండిరి. వీరి తోఁబాటు ఆంగ్ల విద్యా విశారదులగు శ్రీ కిళాంబి రామానుజాచార్యులవారు, పండిత శ్రీ లింగం లక్ష్మాజీ పంతులవారు, నిష్ఠల రామస్వామి శర్మగారు, గురుజాడ అప్పారావు పంతులుగారు మున్నగు సామాజికులును, దూర్వాసుల సూర్యనారాయణ శాస్త్రిగారు (సుప్రసిద్ధ వైణికులు), గురాచార్యుల వెంకటరమణ దాసుగారు (వైణికులు), కలిగొట్ల కామరాజుగారు (ఫిడేల్ వాద్యమున పండితుఁడు), కవిరాయుని రమణయ్యగారు (రుద్రవీణ), మహబత్ ఖాన్ మొదలగు గాయక శిఖామణులును సభ నలంకరించియుండిరి. ఇట్టి మహా విద్వాంసులతో ఈ విద్వత్ప్రభు నాస్థానము అత్యంత శోభాయమానమై విరాజిల్లుచుండెడిది. ప్రభువు రాజ్య భారము మాతృశ్రీవారికిని, మేనేజర్లకును నప్పగించి నిత్యము సంగీత సాహిత్య విద్యావినోదములచేతనే కాలము గడుపుచువచ్చెను. ప్రతిదినము సాయంకాలము పండితసభ రాజమహలులో జరుగుచుండెను.

ఒకనాఁడు జరిగిన సాహిత్యగోష్ఠిలో "జ్ఞానప్రద మైన సాహిత్యము—శక్తిమంతమైన సాహిత్యము" అను విషయములు చర్చకు తేఁబడెను. తీవ్రమగు వాదప్రతివాదములు జరిగిన పిమ్మట జ్ఞానప్రద సాహిత్య పక్షమునే ప్రభు వంగీకరించెనని చెప్పుదురు. మఱియొక సారి శ్రీవారి సమక్షమున చక్కని సన్నివేశము జరిగెను. ఈ సన్నివేశమందు ప్రభువువారి సామాజికుల పిల్లలకును (దూర్వాసుల సూర్యనారాయణ శాస్త్రి గారి పుత్రులు, గురుజాడ శ్రీరామమూర్తిగారి కుమారులు మొదలగువారు), ఇప్పటి మహారాజావారి పితామహులును, ఆనాఁడు విద్యార్థిదశలో నున్నవారును నగు శ్రీ విజయరామగజపతి మహారాజులుంగారు మున్నగువారికిని పరీక్ష జరుపఁబడెను. (ఇట్టి పరీక్షలు తఱచు వారమునకును, పక్షమునకును జరిపించి ప్రభువు విద్యార్థులకు ద్రవ్యరూపమగు బహుమానముల నొసఁగి ప్రోత్సహించుచుండెను.) నాఁటి పరీక్షాధికారి పండిత లింగం లక్ష్మాజీపంతులుగారు. పరీక్షించు సందర్భమున ఆయన "No any" అను పదగుచ్ఛమును ప్రయోగించెనఁట. ఆసభలో ప్రభుసన్నిధి నున్న నిష్ఠల రామస్వామిశర్మగారు కోపావేశపూరితులై "No any" అను నీప్రయోగమును గర్హించుచు లక్ష్మాజీపండితుని నోనాడెను. వెంటనే దీనికి తగిన ప్రమాణ మెచ్చటనైన లభించునా యని ప్రభువును,

* శ్రీ అప్పారావు పంతులవారి పీఠికలోని వాక్యములు నాకు యథామాతృకముగా లభింపలేదు. జ్ఞప్తిపథమున నున్న రీతిగా వ్రాసితిని. చిహ్నములలో (" ") నున్న మాటలు వారివియే యని నానిశ్చయము. —అ. రా.

పండితులునుగూడ తీవ్రముగ పరిశోధింపఁబూనుకొనిరి. న్యూమన్ (New-man) చరిత్రోపన్యాసములలో నీ ప్రయోగము లభించినది. అంతట ప్రభు వీక్రిందివిధముగ ప్రసంగించెను: "ఈప్రమాణమువలన నీప్రశ్నపట్లఁ గల సందేహము నివృత్తియైనది. న్యూమన్ ప్రామాణికుఁడు గాఁ డనలేము. అతఁడు ప్రఖ్యాతరచయిత. ఒకప్పుడు రామానుజాచార్యులవారికిని, నాకును ఒకానొక ప్రయోగపు సాధుత్వమునుగూర్చి మతభేదము గలిగినది. అయిదు సంవత్సరములు ఆ యంశమును నా నిఘంటులో నుంచి, తుదకు నామాట నిలుపఁగల ప్రయోగమును న్యూమన్ మహాశయుని గ్రంథమునుండియే చూపఁగల్గితిని. "No any" అను ఈప్రయోగము జూపఁగల్గుట యొక మహత్కార్యమనికాని, ఈచర్చ కవకాశ మిచ్చిన సంఘటనముబట్టి ఉత్కర్ష పొందఁదగిన దనికాని నే నెంతమాత్రము తలంపను. తన కే విషయమునుగూర్చియైన నిశ్చయజ్ఞానము కలిగియున్నప్పుడును, తద్విషయమై యితరులు పొరఁబడుచున్నా రని దృఢముగా తోఁచినప్పుడును ప్రాజ్ఞుఁడు ఎదుటివారి మనస్సునకు నొప్పి కలిగింపఁగూడదు. విశేషించి లక్ష్మీజీపంతులవారివంటి వయోవృద్ధులును, పండితులును పొరపడి రని యెత్తిపొడిచి యెంతమాత్రము నాక్షేపింపఁగూడదు. కోపింపకుండ మృదువుగను, సున్నితముగను ఆక్షేపణలను వెలిబుచ్చవచ్చును. ఇతరుల లోపములను జూపుట కెన్నియో చక్కని మార్గము లున్నవి. విధివాక్యముగఁ జెప్పనక్కరలేదు. మానవజీవిత మనే గ్రంథమును పరిశీలనతో చక్కఁగఁ జదువవలయును. లేనిచో చిక్కులు తటస్థించుచుండును" ఇయ్యది నాఁటి సభలో ప్రభువువారు గావించిన ప్రసంగ మని తెలియవచ్చుచున్నది.

ప్రభుసన్నిధివర్తులలో నొకరగు ఈ రామస్వామిశర్మగారు కాలమున ఆంగ్లకళాశాలలో ఉపన్యాసకులుగ (Lecturer) కొన్నిదినములును, ఆస్థానపండితులుగ కొంతకాలమును నుండుచువచ్చిరి. ఆంగ్లభాషలో వీరికిఁ గల పాండిత్యము నిరుపమానము. మహారాజావారు చెన్నపురిగాని, కలకత్తానగరముగాని వెళ్లియున్నప్పుడు నూతనమగు నొక యాంగ్లగ్రంథమును అక్కడినుండి తెచ్చి దానిని శర్మగారికిఁ జూపుచు "ఇది సరిక్రొత్త ప్రచురణము" అని ప్రభువు చెప్పుటయే తడవుగ శర్మగారు "ప్రభూ! నేను ఈగ్రంథమును కొంతకాలముక్రిందటనే చదివియున్నాను. ఇదియే కాదు, దీని ననుసరించి వ్రాయఁబడిన మఱికొన్ని పుస్తకములు గూడఁ గలవు" అని చెప్పుచుండువారఁట. అంతట ప్రభువు శర్మగారి పరిజ్ఞానసంపద యెంతవరకు నిజమో పరీక్షింపనెంచి వేఱొకసారి సరిక్రొత్తపుస్తకము నొకటిఁ గొనితెచ్చి దానిని శర్మగారికిఁ జూపకుండ తామును, మఱికొంతమంది యాంగ్లపండితులును ముందుగాఁ జదివి పిదప శర్మగారికి తెలియఁజేయఁగా నాతఁడు మామూలు ప్రకారముగా "మహాప్రభూ! ఈగ్రంథము నే నిదివరకే చదివియున్నాను" అని చెప్ప మహారాజులుంగా రాశ్చర్యనిమగ్నులై యితరపండితులతోఁగూడ నాగ్రంథములోని వివిధఘట్టములనుగూర్చి ప్రశ్నింపఁగా నాప్రశ్నములకు తూచాతప్పకుండ సదుత్తరముల నిచ్చి వారి యచ్చెరువు నినుమడింపఁజేసినా రని వినవచ్చెడిని. ఈశర్మగారి బుద్ధివైశద్యమును, నిశితప్రతిభయు ననన్యసాధారణములని వేఱుగఁ జెప్పనక్కఱలేదు.

శ్రీ ఆనందగజపతిమహారాజులుంగారికి సమస్యాపూరణ మన్నను, భావగర్భితమగునట్టియు, క్లిష్టమగునట్టియు సంస్కృతశ్లోకముల యాంధ్రీకరణమన్నను నెక్కువ మక్కువ. ఒకానొక దినమున శ్రీవారి సభలో వసుచరిత్రములోనిది యగు—

శా. "ఆతన్వంగి యనంగఝాంకరణవ
 జ్యాముక్తచూతాస్త్రని
ర్ఘాతం బోర్వక తమ్ములంచు తటినీ
 గర్తైకసంజాతకం
జాతవ్రాతము మాటుజెంద నవి యే
 చన్ సాగె మున్ముందుగాన్
'జ్ఞాతిశ్చే దనలేన కి' మ్మనెడి వా
 చారూఢి నిక్కంబుగా"

అనువదింప పండితుల కీయఁబడెను. అంత నాస్థానవిద్వత్కవులగు నరసింహాచార్యస్వామిగా రీవిధమున ననువదించిరి:

శ్లో. "తన్వంగి కుసుమాస్త్రఝాంకరణవ
 జ్యాఘాతభూతాశుగా

ఖిలా [illegible] ధవే [illegible]
త్యాగా[illegible] సహ్యాంజనేః
[illegible] మహేశస్య [illegible]
[illegible] కాంచి! తాం
[illegible] కిం '[illegible]'
[illegible] ప్రష్టతేక్"

ప్రభువు వారి యనువాదమున కెంతయో ముద మందిరఁట. మఱియొకసారి మహారాజు—

"[illegible] కాంచనాద్రేః
కుబేరమిత్రం రజతాద్రి[illegible],
[illegible] జాతం
[illegible]" (విశ్వగుణాదర్శము)

అను నీశ్లోకమును ఆంధ్రీకరింపుఁడని తమ పండితులను కోరఁగా శ్రీస్వామివారే—

కం. "హరుఁడు [illegible] కాంచన
గిరుఁడు ధనపతియు సఖుఁడు రజతగిరి [illegible]
[illegible] మెత్తెడు
శిరమెక్కిన గంగ వేల్పు సిరిఁ జెలువారో!"

అని అనువదింప ప్రభువు దాని నెక్కువగ మెచ్చుకొని రని చెప్పుచున్నారు. ఇంకొకసారి ప్రభు సన్నిధిని కూరెళ్ల రామశాస్త్రి యను పండితవర్యుఁడు నరసింహాచార్యస్వామివారి నుద్దేశించి "ఉమాముఖం చుంబతి వాసుదేవః" అను సమస్య నిచ్చి వెంటనే పూరింపఁగోరెనఁట. అంత స్వామి క్షణమాత్రములో—

శ్లో. "నవిమ్య దేశోపయనం విచింత్య
హిమాలయస్యాలయ మేత్య కిం తే
సులేతి చోద్య[illegible]
మనూముఖం చుంబతి వాసుదేవః"

అని పూర్తిగావింప సభలోని పండితులును, ప్రభువులును మిక్కిలిగ సంతసించిరి. ఇట్టి విద్వద్గోష్ఠి జరుపుచు ప్రభువు వినోదించుచుండువాఁడు. ఆనాఁడు ప్రభుసమక్షమున విద్యావినోదములలో పాల్గొనుచు వచ్చిన పండితులుగాని, కవులుగాని, సామాజికులుగాని నేఁడొక్కరైనను నుండకపోవుట మిక్కిలి విషాదకర మగు సంగతి. స్థాలీపులాకముగ మీఁది కొలఁది ముచ్చటలుమాత్రము సంగ్రహింపఁగలిగితిని. వందలకొలఁది గఁ జేర్పఁదగిన విషయములలో నొకటిరెండు విద్యా వినోదము లెట్లు పాఠకమహాశయులను రంజింపఁజేయఁ గలవు?

ఒకనాఁడు మహారాజావారు పండితులతో సభ దీర్చియుండ మాఁడుగులనుండి వచ్చినవారును, రాజ బంధువులును నగు చింతలపాటి రాయపరాజుగారు ప్రభుని దర్శించి సభ నలంకరించినవారై కొంతవరకు పండితగోష్ఠి జరిగినపిదప పూర్వకవియగు శిష్టు కృష్ణ మూర్తిశాస్త్రిగారు పూరించిన "దుగ్ధపయోధిమధ్య మున దుమ్ముగ గ్రమ్మె నదేమి చిత్రమో!" అను సమస్య గల పద్యము నిట్లు చదివిరి:

ఉ. "దగ్ధని మృత్యువుం జరయు
సాగఁగనీదు సుధారసం బసం
[illegible] పుటంము [illegible] [illegible]
దేవతలయ్యసురు [illegible] మృ
దగ్ధసుమందర[illegible]
దీర్ఘజపంబున నెత్తిపఁగా
దుగ్ధపయోధి.........చిత్రమో!!"

అంత మహారాజీపద్యమును విని యాస్థానకవి యగు నరసింహాచార్యస్వామిగారిని పై సమస్యనే పూరింపుమని కోర, స్వామిగారు—

ఉ. "స్నిగ్ధని దేవదానవులు
తెచ్చిరి మందరభూధరంబునన్
ముగ్ధత వాసుకిం బొదివి
త్రోయ మథింప హాలాహలంబు ని
ర్దగ్ధముసేయ నద్రిశిఖ
రంబులు విచ్చి శివుఁడ్యాఁ దుండినన్
దుగ్ధపయోధి.........చిత్రమో !"

అని పూరింపఁగా ప్రభు వీపద్యద్వయముయొక్క గుణతారతమ్యములను పండితులతో విమర్శించి స్వామి గారి పద్యమునకే ఆధిక్యత నిచ్చిరని వినవచ్చెడిని. కృష్ణమూర్తిశాస్త్రిగారి పద్యమున "నదేమి చిత్రమో!" యనుదాని కుపపత్తి లేదనియును, స్వామిగారి పద్య మున నుపపత్తి జూపఁబడిన కారణమున నయ్యది శ్లాఘ్యతరమనియు ప్రభు వుగ్గడించెననియును, కృష్ణ మూర్తిశాస్త్రిగారి పక్షమువారగు శ్రీ రాయపరాజుగారు చిన్నవోయిరనియు లోకము వాకొనుచున్నది.

ఆ కాలమున శ్రీ యానందగజపతిమహారాజు సామాజికులలో నొకరును, వారి చిరంతనమిత్రులును, వైశ్యకులోద్భవులును, కందుకకళావిశారదుఁడును (Expert Billiards Player), ఆంధ్రకవియును నగు రాజామణిసెట్టి చెన్నపురినుండి వచ్చి ప్రభుసమ్మానితుఁడై కొంతకాలము విజయనగరమున నివసించియుండెను. ఆ కాలమున నాయనకు శ్రీ నరసింహాచార్యుల వారితో దృఢపరిచయము గలిగెను. స్వామిగారు సెట్టిగారి కవనచతురిమ మొదలగు శక్తిసామర్థ్యములకు విస్మితులగుచు నొక పద్యము నిట్లాతనిపైఁ జెప్పిరి:

శా. "వ్యాయామంబుల, రాజ ఖేలనములన్
    వాక్యోపపత్త్యాదులన్
భూయోన్నైపుణమంది ప్రజసిక తా
    భూమాంతరంగాఢ్యుఁడై
మాయాతీతసువృత్తిచే మెలఁగు స
    మ్యగ్జ్ఞాని 'రాజామణి'
శ్రేయోనామకవీంద్రుఁడొప్పె విబుధ
    శ్రేణీమనోహ్లాదియై."

శ్రేష్ఠి యీపద్యమును కృతజ్ఞతాభక్తిగౌరవములతో స్వీకరించి దానిం గొనిపోయి మహారాజునకుఁ జూపెను. నాఁటిసాయంకాలము ప్రభువువారు స్వారి విచ్చేయుముందర స్వామిగారిని పిలిపించి తత్పద్యాక్షర సంఖ్యా సమసంఖ్యములగు నూటయిరువదియెనిమిది రూప్యములను ఆయనకుఁ పారితోషికముగా నొసంగి గౌరవించిరి. పూర్వకాలమున భోజుఁడు అక్షరలక్షలిచ్చి కవులను గౌరవించెనో లేదో కాని యీమహారాజు అక్షరరూప్యము లిచ్చి తన యాస్థానపండితులను, కవులను గౌరవించి వినోదించుచుండువాఁడు. ఇట్టి బహుమానములకుఁ బాత్రులైనవారు కీ. శే. దివాన్ బహదూరు శ్రీ కిళాంబి రామానుజాచార్యులవారు (ఆనాఁడు ఆంగ్లకళాశాలకు ప్రిన్సిపాలుగా నుండినవారు) ఒకరని తెలియవచ్చెడిని. ఉదాహరించుటకు ఆచార్యులవారి సంస్కృత శ్లోకము లభ్యము కాలేదు

శ్రీ ఆనందగజపతిమహారాజునకు బుధజన సంస్తవనీయమైన పాండిత్యము గలదని యిదివఱకే చెప్పియున్నాను. వారి వైదుష్యమునుగూర్చి విజయనగరపురవాసులును, ఆంధ్రపండితులును నగు కీ. శే. వెలటూరు లక్ష్మాజీపంతులవారిట్లు ప్రశంసించియున్నారు:

సీ. "వేల్పుబాసను జెల్వు వెలయించి, లాటిను
    బాసలోన మనీషఁ బ్రబలఁజేసి,
ఫారసీభాషలో బహుగ్రంథుల మెఱంగి
    పుట్టుబాసను గూర్చిఁ జెట్టఁబట్టి,
ఫక్తు హిందూస్థానిబాణీ ఖరారాయించి,
    ఆంగ్లేయభాషలో నభ్యసించి,
నిగమాగమపురాణ నికరార్థసంప్రదా
    యకభావభేదంబు లరసియరసి,
తెక్కుగల విద్యలెల్లను దఱచి తఱచి,
చెన్నుమీరిన బల్ రాచమిన్న వైతి
వక్కటా దుష్టవిధి గ్రుక్కు పొక్కి పూపె
నిన్నుఁ గనలేఁడ! ఆనందమన్నెఱేఁడ!"

శ్రీవారి సామాజికులలో నొకరును, కీ. శే. లును నగు గురుజాడ శ్రీరామమూర్తి పంతులవారు ప్రభువుయొక్క విద్యాపోషణమును, ఉద్గ్రంథరచనకు మహారాజొసఁగిన ప్రోత్సాహమును నిట్లుగ్గడించియున్నారు:

సీ. "నీసభాస్థలినిగా నిఖిలశాస్త్రంబులు
    శ్రీమీఱ నాంధ్రీకరింపఁబడియె,
నీసదస్సునెగదా వాసిఁజెందెను మను
    ధర్మశాస్త్రవ్యాఖ్య దశవిధముల,
నీసమ్ముఖమునసే ధీసమ్మతమ్ముగా
    సంధిపంచక మాంధ్రసాఖ్యమయ్యె,
నీసమక్షమునఁ గా నెగడెను సత్యావి
    ష్కరణ నొప్పెడు మేటి పుస్తకములు,
నీవెగా దేశచారిత్ర నిర్ణయంబు
చేయువారల నరసి రక్షించినాఁడ
వహహ! నీవిరహంబున నాంధ్రయువతి
పొక్కెదే కృష్ణభోజులు పోయినట్లు" (ఆనందతారావళి)

శ్రీ ఆనందరాజచంద్రుఁడు స్వర్గస్థుఁడగుటకు నొకటిరెండు సంవత్సరములు ముందు సుప్రసిద్ధాంధ్రకవులును, శతావధానులును నగు తిరుపతి వేంకటేశ్వరకవులు విజయనగరమునకు వేంచేసిరి. 10,15 దినములదనుక వారికి ప్రభుసందర్శనము లభింపలేదు. అప్పటి మేనేజరులగు శ్రీ విజాపురపు కోదండరావుపంతులవారియొక్కయు, శ్రీ చోదిమెళ్ల రామమూర్తిపంతులవారియొక్కయు 'సిఫార్సు'పైన వారు రాజదర్శనము చేయఁగలిగిరి.

ఈ విద్వద్రాజశిఖామణిదర్శనలాభము సర్వసాధారణముగ సాధ్యము కాదనెడి సంగతిని శతావధానులీరీతిగఁ దెలిపియున్నారు :

సీ. "అష్టావధానమా ? యానందదంతీంద్ర
జనపాలు దర్శనం బనెడివారు
ఆశుకవిత్వమా ? యానందదంతీంద్ర
జనపాలు దర్శనం బనెడివారు
శతఘంటకవనమ్ము సల్పుటా? యానంద
జనపాలు దర్శనం బనెడివారు
ఆకాశపుఁ బురాణ మల్లుటా ? యానంద
జనపాలు దర్శనం బనెడివారు
గీ. కాని సులభంబటంచు నొక్కరును జెప్ప
నట్టి భవదీయదర్శనం బాచరించి
ధన్యతను జెందె మాకవిత్వప్రశంస
శ్రీమదానంద గజపతిక్షితితలేంద్ర"
(నానారాజ సందర్శనము)

మీఁదఁ జెప్పిన ప్రకారము మహారాజులుంగారిని దర్శించి వారి సమక్షమున జరిగిన పండితసభలో తమ కవితాప్రాగల్భ్యమును, అవధానచతురిమను జూపి సమ్మానితులై యుచితసత్కారమును గాంచిరి. నాఁటి సభలో తిరుపతి వేంకటకవులు చెప్పిన పద్యములలో నొకటిరెండింటి నిందుఁ బొందుపఱచుచున్నాను:

ఉ. "ఎందఱఁ జూచెనేని వరి
యింపదు మాకవితాకుమారి క
న్నందుకు దేశముల్ దిరుగు
టబ్బెను సౌఖ్యము లేకపోయె నా
నందనృపాల! నీదు సుగు
ణమ్ములు చెప్పిన నాలకించి సం
టం దలయూఁచెఁ గావునఁ ద
టాలున దీనిఁ బరిగ్రహింపుమా.

మ. కవితామాధురిఁ దా గ్రహించి యిది శ్లా
ఘ్యం బిద్ది శ్లాఘ్యంబు గా
దు విశేషం బిట నిర్విశేష మిట మా
ధుర్యం బిటన్ వహ్వారే!
కవిరాజా! యని మెచ్చి యిచ్చు నృపుఁడొ
క్కండైనఁ గన్పైనచోఁ
గవినై పుట్టుటకన్నఁ బాపపరిపా
కం బుండునే ? భూవరా !!

మ. కనుఁగొంటిన్ గవులార మిమ్మిచట నా
కష్టంబుగట్టెక్కె ర
మ్మనె నానందనృపాలకుండు మిము నే
నానందభూపాలకీ
ర్తిని దేఖో హుకుమంచు నిచ్చె నసుర
క్తిం బత్రికన్ దానఁ జ
య్యన నేతెంచితి మయ్య! వాస్తవమిదే
యానందభూపాలకా"

ఆ దినములలో 'తెలుఁగు హార్పు' (Telugu Harp) అను నాంధ్రాంగ్ల వారపత్రిక యొకటి విజయనగరపట్టణమందు శ్రీ ప్రభువువారి పోషణక్రింద ప్రచురింపఁబడుచుండెను. దానియందు గురుజాడ అప్పారావు పంతులుగారు మొదలగు విద్యాధికులు వ్యాసములు వ్రాయుచు ఆనందనృపాలుని విద్యాప్రసంగ వినోదములను బ్రచురించుచుండువారు. శ్రీ తిరుపతి వేంకటకవులు విజయనగరమునఁ గావించిన అవధానముల సమాచార మా పత్రికయందుఁ బ్రశంసింపఁబడెను.

1896-వ సంవత్సరములో నొకానొక దినమున పండితులతో విద్యావినోదములను సలుపుచు ప్రభువు "సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్" అను మకుటముతో శతక మొకటి రచింపుఁడని తమ యాస్థానపండితులను, కవులను గోరెను. ప్రభునాజ్ఞ ప్రకారము వారి యాస్థానపండితులును, కవులును గాక ఆంధ్రసీమయందుఁ గల పెక్కుమంది కవిపండితులీ 'సత్యవ్రతి' శతకమును రచించి మహారాజునకు సమర్పింప సంసిద్ధులైయుండఁగనే దుష్టవిధిప్రేరణచే కళాకోవిదుఁడు, కవిపండిత కల్పభూజము శ్రీ ఆనందగజపతి రాజచంద్రుఁ డస్తమించెను. ఈ దురదృష్టము కారణమున నాఁడు రచింపఁబడిన వందలకొలఁది శతకములలో నొకటి రెండు దక్కఁ దక్కిన వన్నియుఁ బ్రకాశితములు గాలేదు. శ్రీ మహారాజావారి ఆంగ్ల కళాశాలలో సంస్కృతపండితులుగాఁ బనిచేసినవారును, కీ. శే. లును నగు భాగవతుల లక్ష్మీనారాయణ శాస్త్రులవారు రచించినదియు, నిటీవల ప్రకటితమైనట్టిదియునగు శతకములోని 2-3 పద్యములు మచ్చుకుఁగా నిచ్చట నిచ్చుచున్నాను :

కం. "అతులప్రౌఢ నవీనక
విత్తారసజ్ఞులు మొదలిడి వీడక తుదకున్
గృతిఁ బరికించిన కవికిన్
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్.

కం. ప్రతిజనవిధి విస్మృతి ను
త్తతగమనప్రాక్తన స్వతంత్రీవార్తా
యితమహిత సత్యమహిమన్
సతతము......ప్రతికిన్.

కం. కతిపయసురమందిర శ
స్తతటాకారామసప్తసంతానవితా
నతులిత సూనృతమహిమన్
సతత........ప్రతికిన్."

ఆనందగజపతీంద్రునకు నుభయభాషలయందును నికటమైన పాండిత్య ముండుటయేగాక ఆంగ్లభాషయందు సంస్తవనీయమైన పాండిత్యము కలిగియుండె నని పెద్దలు చెప్పుచున్నారు. ఈ భాషలతోఁ బాటు లాటిన్, ఫ్రెంచ్, ఉరుదు, హిందూస్థానీ మున్నగు నితరభాషల యందుఁగూడ నభినివేశము కలదఁట. ఇంతకు ముందుదాహృతమైన పద్యమునందలి వర్ణనము యథార్థమనియే లోకము చెప్పుచున్నది. ఈమహారాజు "వరదరాజకృత మగు కౌముది"ని కొంతవరకుఁ దెనిఁగించెను. ఆంగ్లేయ భాషాగ్రంథములఁ గొన్నిటిని తెనిఁగింపఁ బ్రయత్నించెను. ఆంగ్లేయగద్యగ్రంథకర్తలలో జాన్ స్టూఅర్ట్ మిల్, హెర్బర్ట్ స్పెన్సర్ మొదలైనవారియందును, ఆంగ్లకవులలో పోపు, ఎడ్వర్డ్ యంగ్ అనువారలయందును ఈయనకు విశేషమగు ప్రీతి. ఆకారణముచే వారి యభిప్రాయములను దెనుఁగువారికిఁ దెలుపుటకై ప్రభువు కొన్ని వ్యాసములను రచించెను. కాని యవి ప్రకాశితములు కాలేదు.

ఈ మహారాజు సంస్కృతాంధ్రములయందుఁ జక్కని కవిత్వము చెప్పుచుఁ దన యాస్థానకవులతోను, బండితులతోను కవితావినోదములు సల్పుచుండువాఁడు. ఈయనకు సమస్యాపూరణమన్న మిక్కిలి మక్కువ. "కుచభరభిన్నమై నడుము గూలెనొకో చెలినాభివాపిలోన్" అనుదాని నిట్లు పూరించెను:

చ. "అచతురభిన్నులున్ నడు మ
టంచు వచింపఁగఁ గిక్క ప్రసక్కియున్
వచనభరంబు నైనను న
భంబువలెన్ భరియింపలేనిచో
సచివత జన్మలబ్ధమగు .
సంగతిఁ బాయఁగలేక నేఁటి కీ
కుచభర........వాపిలోన్"

ఈయన రచించిన మఱికొన్ని పద్యములను, శ్లోకములను నిచటఁ బొందుపఱచుచున్నాఁడను:

(1) "కం. కసవుం దిను పసరములకు
నసువులపై నాసజేయనా సహజముగన్
అసమత దూషితమగు నీ
వసుమతి జీవేచ్ఛ మృతికి వచ్చు సమ మనన్.

(2) కం. కులశైలములు చలించిన
జలనిధు లింకిన దినకరచంద్రులసన్మం
డలములు ధరఁ గూలిన సౌ
రు లచల వాక్ శ్రీవిలాసు లురుగుణసదనా. ·

ఈ రెండు పద్యములును ఇంగ్లీషుపద్యములకు * ననువాదములు. (శ్రీ) మహారాజావారి సామాజికులలో నొకరగు కీ. శే. శ్రీనివాసాచార్యులవారు ఇంగ్లీషున రచించిన హరిశ్చంద్ర నాటకములోని పద్యముల కనువాదము. మొదటి పద్యము 'ఆనంద భైరవి'లోను, రెండవపద్యము 'సావేరి' రాగమునను చదువవలెనని శ్రీ ప్రభువువారి యాజ్ఞ.

శ్లో. "ప్రాచాం రీతిః పౌనరుక్త్య ప్రదాత్రీ
నవ్యా శిష్యాచార్యమాధుర్యధుర్యాః
తస్మా దస్తు క్షాంతిశీలాయతత్త్వం ·
త్వత్సంబోధ్యం స్తోత్ర మన్యాపదేశః."

ఇటులనే ఆంగ్లేయభాషలోఁ జెప్పఁబడిన పద్యములుగూడఁ గలవని చెప్పుదురు. అతిప్రయత్నముమీఁద మీఁదిపద్యములు మాత్రమే లభ్యములైనవి.

---

*1. *Let thoughtless cattle cling to life in simple mirth,*
*To thinking man creation's lord of nobler birth,*
*Life is but death if lived on this sad changeful earth,*
*For transient life when naught is equal has no worth.*

2. *The Kula Mountains eight may even fly,*
*The mighty oceans seven entirely dry,*
*The Sun and Moon and Stars fall down from the sky,*
*But solar kings will never tell a lie.*

శ్రీవారి జనకులగు విజయరామమహారాజులుం గారు తమ కుమారునిఁ జూడవచ్చినప్పుడెల్ల తమ పాద రక్షలను ఆనందగజపతీంద్రుని భవనద్వారముకడనే విడిచి లోని కేగుచుండువారఁట. "బాబాజీ సర్కార్! తమరు జోడుతోనే లోనికి దయచేయవచ్చును" అని కుమారుఁడు విన్నవింప "చిరంజీవీ! నీభవనము శారదా నిలయము. మాది మోతీమహాలు. కాఁబట్టి పండితు లతో విద్యావ్యాసంగము గావించు నీయొద్దకు జోడుతో వచ్చుట భావ్యము కాదు" అని చెప్పుచు తమ కుమా రుని విద్యావినోదమున కెంతయు నుప్పొంగుచుండువా రఁట. ఇట్టి శారదారాధనతత్పరుఁడగు శ్రీయానందగజప తీంద్రుని విద్యావినోద వృత్తాంతములు పెక్కులు కాల గర్భమునఁ బడి మటుమాయము లైనవి. శ్రీ ఆంధ్ర పత్రికా సంపాదకుల గౌరవాదరముల మూలమున మీఁది కతిపయవిషయములు మాత్రము ప్రయత్న ముతో నేనాఁడు సంగ్రహించి ఆంధ్రలోకమునకు సమ ర్పింపఁగలిగితిని.

ఇంక నీ నృపోత్తముని వైదుష్యమునకు, పండి తాదరణమునకు నీడుగా నీతఁడు విద్యాపోషణము గూడఁ గావించి యశస్సు నార్జించి మించెను. జ్ఞానాభి వృద్ధికంటె లోకోపకారకంబైన పని యొండొకటి లేదను తలంపున తన్ముఖ్యసాధనంబులగు పాఠశాలలఁ బెంపు సేయుటయేగాక ఉత్తమగ్రంథముద్రణ మొనరింపఁ బూనుకొన్న వారికి ధనసహాయము నొనర్చుచువచ్చెను. ఋగ్వేదసంహితాముద్రణమునకై మాక్సుముల్లర్ (Max-muller) పండితునకును, శబ్దార్థసర్వస్వముద్రణ మునకై తారానాథతర్కవాచస్పతికిని, ప్రాచీన సంస్కృత గ్రంథముద్రణమునకై కాశీపండితులకును ఈ విద్వత్ప్రభువు గావించిన ధనసహాయము లోకవిదితము. మహామహోపాధ్యాయ పరవస్తు రంగాచార్యకృతమగు శబ్దార్థసర్వస్వము నచ్చువేయించుటకు ఈమహారా జుద్దేశించెనుగాని తద్గ్రంథముద్రణ ప్రారంభము గాక పూర్వమే యాంధ్రజనుల భాగ్యహీనతచే నీయన స్వర్గ స్థుఁడయ్యెను. ఇంతియగాక మున్షీ మహమ్మద్ పాచ్చా మియా సాహెబ్ అనునాతఁడు 'ఫర్‌హంగీ ఆనంద రాజ్' అను భాషాకోశమును ఉరుదూభాషలో రచించి ఈమహారాజు పోషణక్రిందనే అచ్చుగావించెను' వేలువేలు సంపుటములుగా అచ్చుగావింపఁబడిన గురు జాడ శ్రీరామమూర్తి పంతులుగారి 'కవిజీవితములు' మున్నగు గ్రంథములన్నియు ఈప్రభునాదరణముననే ప్రకాశితము లయ్యెను. ఇట్లుగా ననేకములగు విద్యా సంస్థలకీ ప్రభువు ప్రోత్సాహ మొసఁగుచువచ్చెనని లోకము చెప్పుచున్నది.

శ్రీ ఆనందగజపతి మహారాజు సాహిత్యమునం దెట్టి దిట్టయో సంగీతమునందుఁగూడ నంత యెన్నిక గాంచిన పండితుఁడు. సుప్రసిద్ధవైణికులగు దూర్వాసుల సూర్యనారాయణశాస్త్రిగారు, గురాచార్య వెంకటరమ ణదాసుగారు, కజ్జి పద్మనాభస్వామిగారు (పైవారు వైణి కులు), కలిగొట్ల కామరాజుగారు (ఫిడేల్), మరము రాయాచార్యులుగారు (మృదంగము, గాత్రము) మొద లగు కర్ణాట గాయకశిఖామణులేగాక కవిరాయుని వెంకటరమణయ్యగారు (రుద్రవీణ), మహబత్‌ఖాఁ (రుద్రవీణ), మన్వర్‌ఖాన్ (గాత్రము), అబిదుల్లాఖాన్ (చితార్), నిషావల్లీఖాన్ (రబాబ్) మున్నగు సుప్ర సిద్ధులైన ఔత్తరాది గాయకులుకూడ నీమహారాజు సభ నలంకరించియుండిరి.

శ్రీవారి వీణాగానవైశద్యమును ప్రభువుసన్నిధి వర్తులగు గురుజాడ శ్రీరామమూర్తిపంతులుగా రిట్లు వర్ణించియున్నారు:

ఉ. "వీణియ చేతఁబట్టి కడు
విస్మయ మొప్పతిలంగ 'భైరవిన్'
తానము మేళవించి యమృ
తంబును జిల్కెడు మిమ్ముఁ జూచుచో
గానలు, హూణు లొక్కగతి
గా నుతిసేసిరిగాని, యింపలో
వీనుల పుణ్య మీకరణి
నీడెను గానము నస్తమించెఁగా."

(ఆనందతారావళి)

శ్రీవారి సంగీతకళావైదుష్యమునకు వారిచే విరచితమగు నీక్రింది తానవర్ణమును దార్కాణముగఁ జూపవచ్చును:

(ఘన్యాసిరాగం-ఖండజాతి—ఆటతాళము)

పల్లవి

దేవి! త్వాం యదధిరనుపశ్యతి నాస్య తృప్యతి,
భావయ తేజసి తిమిరే త్వాం త్వదస్య తృప్యతి.

అనుపల్లవి

ఏకదోభయో స్ఫూర్తిరసంభవయక మవశ్య
కితత్కథ మభికామయితుం ఆనందవసనిపుణే

చిట్టస్వరము

కైవల్యదాయిని.

('గాయకలోచన'మను సంగీతగ్రంథమునుండి యథామాతృకముగ గ్రహింపఁబడినది.)

కళాకోవిదుఁడగు నీమహారాజు సంస్కృతనాటకసమాజ మొకటి స్థాపించి శాకుంతలము, విక్రమోర్వశీయము మున్నగు సుప్రసిద్ధనాటకములను ప్రదర్శింపఁజేయుచు వినోదించుచుండువాఁడు. ఈసమాజమునందు నటించువా రందఱు మంచి పండితులు. సంస్కృతము ననర్గళముగా మాటాడఁగల వక్తలు. గంటి బుచ్చిశాస్త్రిగారు, కర్రా పాపయ్యశాస్త్రిగారు, పప్పు వెంకటశాస్త్రిగారు మొదలగువారు వారిలో సుప్రసిద్ధులు. ఈ నాటకసమాజ మాదినములలో విఖ్యాతమై పోషకుల కళాప్రియత్వమును నల్గడల వ్యాపింపఁజేయుచు వచ్చెను. 'భూలోకనారదుఁ' డని ప్రసిద్ధిఁగాంచిన పప్పు వెంకన్నగా రిందు ప్రధానగాయకులు.

ఇట్టి విద్యాసంస్థలను, సుప్రసిద్ధ కవిపండితవర్గమును లెస్సగఁ బోషించి ప్రోత్సహించుచు శ్రీ ఆనంద గజపతి రాజచంద్రుఁడు ప్రత్యహము విద్యావినోదములం దేలుచు అన్వర్థాభిధానుఁడై విరాజిల్లె నని పెద్దలు చెప్పుచున్నారు.



# తియ్యని తలంపులు

— శ్రీ ఎస్. ఎ. నారాయణరావు —

జగతి నెయ్యాని తప్పకుండగ
జనులనన్నవి యుత్తమోత్తము
జాతి యొక్కటి వెలయు నదె మన-జాతి మెఱుగనదీ,
నాన నెల్లర హృదయములు నా
సంస్కృతేజముతో వెలుంగను
మెఱయుచుండును వారి కనుగవ-లెఱుక మెఱుపులతో.

తప్పు లున్నవి వారి చెంతల
చెప్పుడును జొప్పడగనేరవు
కూడదు సురుడని వారి కెవ్వడు-లేడు వేడికొనన్,
పంచతారసకరుల యలజడి
యుండనేరదు వారి చెంతల
శాంతిసంపద సామరస్యము-చక్కగా సాగున్.

వారు వీరలు ధీరు లతిబల
వంతు లంతే కన్నులెదురను
గాస నోర్వరు పరుల నెత్తుటి-కణ మొకండైనన్,
నీటిమీదను నిప్పుమీదను
నేలమీదను గాలిమీదను
వాలి నిర్వాహింత్రు తమస-ర్వాధిపత్యంబున్.

బల్లెములు బాకులును దాకు న
భాగ్యమే లేకుండు నత్తటి
నెల్ల దేశము లెల్ల జాతులు-నేకమై వెలయున్,
అఖిలహృదయములందు సుఖసౌ
హార్దనాదులె యాడుచుండును
పాలు తియ్యపు నెత్తురే యా-పాదమస్తకమున్.

గడబిడలు లేకుండ నింపైన
గడు నభిజ్ఞత గలిగి సభలను
నడచుకొందురు వారు తమ నడ-వడి ప్రశస్తముగాన్,
ఆటపాటల నీశ్వరుని మా
హాత్మ్యమే కొనియాడుచుందురు
గుళ్ల గోపురగళ్ల నెడనెడ-గూడి వేడుకతోన్.

తీర్థముల నుద్యానవనముల
దేవళంబుల నారుబయళుల
స్త్రీలు పురుషులు నందు యువకులు-బాలకులు వృద్ధుల్,
కూడిమాడి సమస్తవిద్యల
గూర్చి చర్చలు సలుపుచుందురు
నేర్చుకొందురు వారు తమతమ-కూర్చు విద్దియలన్.

కూర్మి గృహపతి యేకమై సహ
ధర్మచారిణితో సుఖించును
ధర్మపత్నియు బతికి మనువును-దనువు నర్పించున్,
కడుపు చల్లని తల్లిదండ్రులు
గా నహించుదు వారు సంతతి
బడసి సుఖులై నర్మవ్యసనులు గుడి-పడను కష్టంబులన్.

యుగము లరిగెను గాని యింతకు
జగతి మానవజాతి యెఱుగదు
సగము సగమే గుర్తెఱింగిరి-సత్కవీశ్వరులున్,
సచ్చిదానంద ప్రదీపము
సకలజనహృదయాంగణంబుల
నచ్చమై స్నేహార్ద్రమై యపు-డలరి వెలుగొందున్.

ముద్దుగూనల నవ్వుమోములు
మురిపములవలె దియ్యదియ్యనై
యద్దములవలె నలరు మనసుల-నఖిలమానవులున్,
ఒద్దికంగ నకూడి తార
న్యోన్యమును సుఖియించుచుందురు
తద్దయును భగవద్గుణస్తుతి-తత్పరత్వమునన్.

సర్వవిద్యలు నూత్న తేజము
పర్వ యభ్యున్నతిని గాంచును
హాయి మని గేయములు నుచ్చ-స్థాయిలో సాగున్,
దేవలోకమువోలె గడు బరి
తృప్తి గొల్పును మర్త్యలోకము
జీవితమె యొక గేయరచనము-గా వినోదమిడున్.

చీకుచింతలు సమసి పోవును
సిగ్గులెగ్గులు చిదికిపోవును
లేకితనములు లేకపోవును-లేవు పాపకృతుల్,
కాక యొక్కొక వేళ నెపుడే
కలిగెనేనియు నవియు మేలే
చేకుఱంగా జేయు నీశ్వర-సిద్ధిహేతువులై.

భ్రమము గా దిది స్వప్నవృత్తాం
తమును గా దత్యంతసత్యము
క్రమముగా నిక మీద జగమున-కలుగనున్నదియున్,
మనము చూతుమొ చూడమో మన
తనయు లయినను జూడనేర్తురు
కనుటకే యాసింత మా బం-గారు కాలమ్మున్.



# కపర్ది

[ కథాకృతిస్వప్నము ]

= శ్రీ విశ్వనాథ సత్యనారాయణ =

## పీఠిక

నేను కపర్దిని రెండేండ్లుగా నెఱుగుదును. ఆ పరిచయము కొద్దిమాత్రము స్నేహముగా పరిణమించెను. కపర్ది యనినచో నానాటికి గౌరవమును హెచ్చుచుండెను. అతని వయసు ముప్పదియేండ్ల లోపు. వృత్తి న్యాయవాది. అందులో గిట్టింపు తక్కువ యైనను పిత్రీయమైన యాస్తిమీఁద సాలుకు మూఁడునాల్గువేల యాదాయము వచ్చును. ఆంగ్లేయములో పట్టపరీక్ష పొందుటయే కాక సంస్కృతాంధ్రములలో చక్కని సాహిత్యము కలవాఁడు. మానిసి యందగాఁడు. సంగీతము కొంత చెప్పికొన్నాఁడట. భరతశాస్త్రమున లక్ష్యలక్షణములు చక్కఁగా తెలిసినవాఁ డని ప్రతీతి. అతడు నన్ను తన యింటికి రమ్మని యాహ్వానింపగా నేను— అందులో నేను, అతని నొక యవతారపురుషుఁడుగా భావించెడు నేను— ఎట్లు కాదనగలను? అతనికిని, నాకును స్నేహ మున్నను స్నేహము స్నేహమే. లోని మనోభావములో అత డొక గురువు, నే నొక శిష్యుఁడను. చాలదినములనుండి నా హృదయములో నొక భావము—"ఇటువంటి మన్మథాకార సంగీత సాహిత్య సరస్వతికి నెట్టి భార్యకలదో? ఆమె యెంత యందకత్తెయో? విద్యావతి కూడ నేమో?" అని. లోపల వెళ్లవలయుననియే యున్నది. పైకి మాత్రము "మరియొకసారి వచ్చెదను లెండి" అన్నాను. అతడు "నేను వెనుక రమ్మన్నప్పుడు నీ విట్లే యంటివి" అనెను. దానితో నేను తిరిగిపోయి, మాటాడకుండ బయల్దేరితిని. వారి యిల్లు విశాలమైన క్రొత్త కట్టడము. ఆధునిక గృహనిర్మాణమునందలి సర్వరమ్యతయు కలదు. పోయి చావడిలో నొక పడకకుర్చీలో కూర్చుంటిని. ఎన్నాళ్లుగానో యీ మాత్రము సావకాశముగా నున్నప్పుడు కొంచెము పాడు డనియు, కొంచె మభినయింపు డనియు అతని నడుగవలయు నని నా కోర్కి. ఒక అరగంట తాత్సారముచేసి చివరకు బయటపెట్టితిని. ఆయన చిరునవ్వునవ్వి "నేనే యభినయించవలయునా? మరి యెవ్వరైన నభినయించిన చాలునా" యనెను. నా గుండెలో గుబుక్కుమన్నది. "ఏమి రా భార్యను పిలిచి అభినయింపించునా? తన భార్యచేత నాయెదుట నభినయింపించునంతటి సౌహార్దము నాయం దున్నదా" యనుకొంటిని. ఆయనయు "నేను కాదు. నా కుమారునిచేత అభినయింపించెద" ననెను. నా ప్రాణములు కుదుటపడినవి. నేనేమియు మాటాడలేదు. కపర్ది తన కొడుకును పిలచెను. ఆ పిలిచినది కొడుకు నేనా యని యనుమానపడితిని. ఆ పిలిచినవాని పేరు సంస్కృతము కాదు, తెనుగు కాదు; పాశ్చాత్యుల పేరు - రొనాల్డు (Ronald) అని.

అంత నొక నాలుగేండ్ల బాలుఁడు మే మున్న చోటికి వచ్చెను. ఎఱ్ఱని జుత్తు. తెల్లని మేను. పిల్లికండ్లు. పిల్లవానిని చూచినంతనే పాశ్చాత్యుల పిల్లవానివలె నుండెను. కాని, ఆ కన్నులలో చూపు, పసితనము యొక్క వైఖరి, నవ్వులోని మాధుర్యము తెలుగుతనమునే విరియించుచున్నది. నా కవుగాముల యంతు పట్టలేదు. నా నివ్వెరను కపర్ది చూచుచునే యుండెను.

"నాన్నా! ఒక మువ్వగోపాలపద మనరా" యనెను. వాఁడు నన్ను చూచి సిగ్గుపడెను. ఆ సిగ్గులో నా వైఖరి తెనుగుపెంపకమునే వెల్లడించెను. కపర్ది "భయము లేదు. ఆయన మనవాఁడే" అని నచ్చచెప్పి, దగ్గరకు తీసికొని, లాలించి, యొక పదము మొదలందించె

ప్రోత్సహించెను. ఇంచుకసేపటిలో పిల్లవాడు సగము సిగ్గును తొలగజెట్టి తొక్కుపలుకులతో ఆ పదమును నడుగువేసి చేతులు త్రిప్పి యంతలో పెద్దసిగ్గు వచ్చి పోయి కపర్దియొడిలో నురికి తల వాంచుకొనెను. కపర్ది పకాలున నవ్వి యతని వీపు చరచి ఎత్తికొని ముద్దాడి తీసికొనిపోయి లోన దింపివచ్చెను. అప్పుడు నే నెట్లుంటిని? ఒక చిత్రప్రతిమవలె నుంటిని. బహిశ్చైతన్యము మాలిన నాయెదలో నూహాపరంపర యానకట్టలేని మహానదివలె పోవుచుండెను.

"ఇత డొక పాశ్చాత్యస్త్రీని వివాహమాడెనా? ఇతడు పాశ్చాత్యదేశములకు వెళ్లినట్లెవ్వరును చెప్పలేదు. ఒకవేళ నితని భార్య పాశ్చాత్యాంగన యైనచో నింత సేపు గృహాంతర్భాగమున నేల ఉండును? ఈపాటికే సావడి లోనికి వచ్చి, తద్దేశగృహిణీమర్యాదల జరపియుండును. ఇతని గృహము పూర్తిగా పాశ్చాత్యమర్యాదలతో నిండియుండును. ఈ పిల్లవాడు అప్పుడు తెలుగు మాటాడునా? అంతయు నాంగ్లేయములోనే భాషించియుండును."—ఏవో యిట్టి యూహాలు వందలు వేలుగా వచ్చుచుండెను.

కపర్ది నేనున్న చోటికి వచ్చి నాస్థితి యంతయు చూచి "ఏమి యాలోచించుచుంటివి" యనెను. నేను నాలోనుండి చప్పున వెలికివచ్చి "ఏమియును లేదు. ఈ పిల్లవాడు—బాగుగా నున్నది." అంటిని. కపర్ది—నవ్వెనో?, ముఖములో విషాదము తెచ్చుకొనెనో?, ప్రాతకథ స్మరించెనో?, సాముఖ్యము వెల్లడించెనో?, అన్నియు నొక్కసారిగా చేసెనో?

ఆపాటున కూరుచుండి పదినిముసములు నాతో మాటాడలేదు. రాత్రి పదిగంట లైనది. నేను తెలివి తక్కువగా మాటలాడితి ననిపించినది. నాకు ముండ్ల మీద నున్నట్లున్నది. వెడలిపోవుదు నని చెప్పజాలక, వెడలిపోవుటకు నాయొడలి కదలిక యంతయు నభిముఖముగా నుండగా కపర్ది యిట్లనెను: "నీ వీపూట ఇచ్చటనే భోజనము చేయుదువు" అని. అతని యామాట శాసనమువలె నుండెను. అతడు శాస్త. నేను శాస్యుడను.

భోజనము లైనవి. రాత్రి పదునొకం డైనది. వాకిటిలో కూర్చుండి మాటాడుచున్నాము. కపర్ది లేచి నన్ను లోనికి రమ్మనెను. ఇరువురము లోనికి పోయితిమి. ప్రక్కగదిలోనికి నన్ను తీసికొనివెళ్లెను. ఒక మంచముమీద మెత్తని పరుపులమీద 'రౌనాల్డు' నిదురపోవుచుండెను. కపర్ది మంచమువద్ద నిలచుండి వానివంక చూచుచుండెను. నేనును చూచితిని. మాటాడకుండ నతడు గది వదలివెళ్లెను. నేను నతని ననుసరించితిని. బయట కుర్చీలలో కూర్చుంటిమి. అత డిట్లు చెప్ప నారంభించెను:

## కపర్ది కథ

### ౧

"నా కప్పు డిరువదిరెం డేండ్లు. నా తల్లితండ్రులు చిన్నతనముననే పోయిరి. నా యాస్తిని రక్షించిన యొక్క మేనమామయు నా యిరువదియవయేటనే పోయెను. నే నప్పటికి రెండేండ్లనుండి నా వ్యవహారములు చూచుకొనుచుంటిని. సాలున కైదువేలు దాటి నా కాదాయము వచ్చును. నీవు వినియుందు వనుకొందును. మా మేనమామ బ్రతికియున్నప్పుడు నాకు వివాహము చేయవలయు నని యెంతయో ప్రయత్నించెను. నేను బి. ఏ. పరీక్ష యిచ్చినగాని వివాహము చేసికో నంటిని. నా మొండిపట్టు చూచి యాయనయు వచ్చిన వంద సంబంధములను త్రిప్పివేసెను. ఆయన పోయినతరువాత నాకు పిల్ల నీయవలయు ననగా వచ్చి నన్నే యడుగవలయును. న న్నెవ్వరు వచ్చి యడుగలేదు. సాహసించి యడిగిన యొకరిద్దరిని పుల్లవిరుపు మాటలతో పంపించితిని.

ఇంతకు నేను వివాహము చేసికో నిష్టము లేక కాదు. దానికి వేరే కథయున్నది. వినుము. ఒక స్నేహితుని పెండ్లికి నే నొక పల్లెటూరు పోయితిని. వా రొక బోగముమేళమును తెచ్చిరి. నాకు భరతశాస్త్రమునం దభినివేశము కలదని తెలిసి స్నేహితులందరు వా రభినయించువేళ నన్ను ముందుకు త్రోయుచుండిరి. ఆ మేళములో నొక పదునాలుగేండ్ల పిల్ల. దాని కనుముక్కు తీరు, శరీరచ్ఛాయ, ఆ పెదవుల రెంటి కలయిక, ఆ చెక్కిళ్లమీదికి జారుచున్న కంటి తుదకాంతి, అరటి చెట్టు క్రొత్తగా గొలవిడచునప్పటి చివరి సన్నని

పూబాటమరింపుపోని దాని జవ్వనపు తొంగి చూచుట, దాని కన్నులలోని యమాయకత్వము ఏ దైవ ప్రేరితమో అది మాటిమాటికి నా వంకనే చూచుట, చిరుతసిగ్గులు పిసాళించుట ఇదియంతయు నాకొకవిచిత్ర మైన యనుభూతివిశేష మైపోయెను. పెండ్లినుండి తిరిగి వచ్చితిమి. నాకు నిదురపట్టలేదు. అన్నము రుచించ లేదు. పెద్దవారు లేరుగనక నా మనస్సు విపరీతపు త్రోవలు పోవుచున్న దనుకొంటిని. ఎంతవిచారించినను దానిలో నాకు వైపరీత్యము కనుపించలేదు. నేను పెండ్లి చేసికొనినచో నాపిల్లనే చేసికొందును. నే నెవరు? అది యెవ్వరు? నేను సంఘసంస్కారిని కాదు. సంస్కార భావము లందు నా మనస్సులో నదివర కెప్పుడును ఆద రము లేదు; నిరాదరము లేదు. ఆపిల్లను నేను పెండ్లి చేసికొందు ననుకొన్నది సంస్కారబుద్ధిచేతనే కాదు. భగవంతుడు దానిని నాకై నిర్మించెను. న న్నామెకై నిర్మించెను. అరే! నే నింత తద్వశుడనై పోతిని. ఆమెయు రోయియింటి బాలిక. ఆమె నాకోసము సౌశీల్యవతి యైయుండునా? నేను విటకాడనై యుండునా? ఛీఛీ! ఎంతకాదనినను నన్ను నేను కాదనుకొనలేక పోతిని. అప్పటినుండి తొందరపుట్టెను. వారిది యేయూరు? ఆ వివాహమైన మిత్రుని కనుగొంటిని. వారందరు నవ్విరి. నే నాగ్రామమునకు పోయి వారి యిల్లు కను గొని ప్రొద్దుగ్రుంకినతరువాత దొంగచాటుగా వారి యింటికి పోయితిని. నా కచ్చట తేళ్లమీద కూర్చున్న ట్లుండెను. అచ్చటి యీ యసహ్యమైన గోల ఎందుకు? వా రందరు నేను కన్నెఱికము పెట్టుటకు వెళ్లితి నను కొన్నారు. నేనును క్రమముగా తెలియచేయవచ్చు నను కొంటిని. ఆబాలికపేరు మృణాళిని.

మృణాళినియు, నేనును సంవత్సరము కలసి యుంటిమి. స్నేహితులలో నన్నుగురించి వేయివదం తులు బయల్దేరినవి. నే నెన్నిసార్లు ప్రస్తావన చేసినను దాని తల్లి "తరువాత పెండ్లి చేసికొనవచ్చును, తొందర యేమి" యని మెలయించెను. మృణాళినియు, నేను మాత్రము భార్యాభర్తలవలె నుంటిమి. ఆమెకు నేను భరతాభినయము చాల నేర్పితిని. దాని గొంతు పైడితీగ.

ఆమెతో నేను కలసి యనుభవించుచున్న బ్రహ్మా నందములో వివాహము చేసికొనవలయు నని కాని, యామె నాదుష్టసంపర్కమునుండి వెలికి తేవలయునని కాని యెప్పుడును నిమ్మగా పూనలేదు. ఆయేడాది చివ రకు వచ్చినకొలది దాని తల్లియు, నప్పలును దానిని నావెంట పంపించ రను విషయము కొంతకొంత నాకు గోచరించినది. నేను రమ్మన్నచో మృణాళిని నావెంట వచ్చెడిదే. అప్పటి కది పదునైదేండ్లపిల్ల. నే నా ప్రయ త్నమును చేసితిని. దానికి మైనారిటీ వెళ్లలేదు కనుక నేను తీసికొనిపోయినచో నాపై నభియోగము చేయుదు మని వారును బెదరించిరి. నే నేమి చేయవలయునో నాకు తెలియలేదు. ఒకనాడు రాత్రి నేనును, మృణా ళినియు నొకరినొకరు కౌగలించుకొని యేడ్చితిమి. నా మనస్సులో నొక్క యనుమానము. మృణాళినికి మా బంధములోని పవిత్రత తెలిసికొనునంత వయఃపరిణతి కలుగలేదని. ఆ యేడాదిలో నేను వారి కెంతయైన డబ్బు నిచ్చితిని. వివాహమునకు వా రంగీకరించని వేళ నుండి నేను ధనమిచ్చుట యాగిపోయెను. పరిస్థితులు చమత్కారముగా మారెను. ఒకరోజున నేను పోగా మృణాళిని బంధువులయింటికి పోయిన దనిరి. వారము గడచెను. రెండువారములు గడచెను. నామనస్సు మారి పోయెను.

నేను అప్పటికే బి. ఏ. పరీక్ష యైయుంటిని. ఆ కోపములో, ఆ దుఃఖములో, ఆ నిరాశలో నేను ఒక నాటి సాయంతనమున నాకు నాకే తెలియకుండ మద్రాసుపోయి లాకాలేజీలో చేరితిని. రెండేండ్లు నా చదువు, నేను. మృణాళిని ప్రతినిశాభాగమునందును నామనస్సులోననే యుండెను. పగ లామెను మరచి పోవుచుంటిని. ప్రతినిశాపరభాగవేళయందు గాఢాలోచ నాపర్యవసన్నమైన దొక్కటే నిశ్చయము. ఆమె నా భార్య. నేను మరొకర్తెను వివాహమాడను. ఆమెను దాని తల్లియప్పలు వృత్తిలోనికి దించెదరేమో. దించి నను దానిని నేను స్వీకరించెదను. ఆమె యంగీకరించ నిచో నేను నాజీవితాంత మిట్లే తద్వ్రతుడనై బ్రహ్మ చర్య మవలంబింతును.

౨

న్యాయవాదిపరీక్షయం దుత్తీర్ణుడ నైతిని. మద్రాసునుండి యెకాయెకి వారి యూరే పోయితిని. ఆ యూరిలోని నాస్నేహితులు నన్ను వారియింటికి రమ్మని పిలచిరి. నేను రానంటిని.

"ఓయీ! నీ కింకను దానిమీది యాశ వదలలేదు. దానికేమి? ఆమెయభినయము చూసితీరవలయును. ఈ రెండేండ్లుగా నామె పేరు మోసినది. భరతశాస్త్రములో అంతటి విద్యాశాలిని యీప్రాంతము లందు లేదట. ఆమె నెవ్వరు పిలచినను రాదు. మేళము కట్టదు. మా కామెయభినయము చూడవలయు నని యున్నది. నీవు వచ్చినచో మా కది సులభముగా సమకూరును" అనిరి. మరియు మృణాళినినిగురించి చిత్రచిత్రములైన కథలు చెప్పిరి. ఆమె కొక కొడుకట. ఒక దొర పాశ్చాత్యుడు ఆమె నుంచుకొనెనట. ఏడాదిగా నామె కాంగ్రెసులో వాలెంటీరుగా చేరెనట. నిత్యము ఖద్దరునే కట్టునట. ఆరునెలలనుండి క్షయవ్యాధియేమో అనుకొనుచున్నారట. ఒక వార్తకాదు. నాతల దిమ్మెక్కిపోయినది. వైముఖ్య మెంత కలిగినదో, నాసర్వాశలు నెంత కుంగినవో పోయి యామెను చూడవలెనని అంత నాసర్వాశలు చెలరేగుట మరల నంత జరగినది. వారి వెంటబడి నాకాళ్లే యచ్చటి కీడ్చుకొనిపోయినవి.

పోయి వారి సావడిలో కూర్చుంటిని. మే మచ్చట కూర్చుండియుండగనే మృణాళిని యచ్చటకు వచ్చెను. ఒక తెల్లని ఖద్దరుచీర ధరించియుండెను. మనిసి శుష్కించినట్లు లేదు. నే నామెవంక నివ్వెరపోయి చూచితిని. ఆమె నావంక చూచి యాశ్చర్యపోలేదు. ఆనందపడలేదు. క్రొత్తదనము ననుభవింపలేదు. రెండేండ్లక్రింద మే మిరువురము కలసియుండిననాడు న న్నెంతచనవుతో, విశ్వాసముతో, పరమానుబంధముతో చూచినదో అట్లే నాయందు ప్రవర్తించెను. వీరు చెప్పిన కథలన్నియు నిజములా, అబద్ధములా?

అప్పుడు వారందరును "నీయభినయమును చూడవలయు నని వచ్చితిమి" అని యడిగిరి. ఆమె వెంటనే వచ్చి న న్నానుకొని నిలుచుండి, రెండేండ్లక్రింద నే నేదైన పాడుమనగా న న్నె ట్లడిగెడిదో అట్లే యడిగెను: తన వక్షస్థ్సలము నావామభుజమ్మున కానించి, "ఏమభినయించమందురు?" అని.

ఆమెశరీరము నాయొడలికి తాకినంతనే యామె యొడలు తీవ్రజ్వరముచేత మండిపోవుచున్నట్లు తెలిసెను. ఆమె యాజ్వరబాధ ననుభవించుట లేదు. నాకు చిత్రమనిపించెను. అంతమందిలో నాసంగతి నే నామెతో నేమని ముచ్చటింతును! ఆమెకు నేను నేర్పిన కీర్తన నొకటి పాడుమంటిని. ఆకీర్తనలోని భావము 'తల్లి తన పిల్లను ముద్దాడుట.' మృణాళిని యాకీర్తన నభినయించెను. అట్టి దివ్యమైన యభినయము నే నెచ్చటను చూడలేదు. నే నామెకు నేర్పలేదు. అయ్యోయ్యో! ఆ కన్నులలోని వాత్సల్యము, పిల్లవంక చూచుచున్నట్లు మొగము వంపగా నామెచిబుకమును, కపోలాధోభాగమును పొందిన వర్తులవతనము నిప్పటికి నాకన్నుల కట్టినట్లే యున్నది. నేను నామనస్సునొత్తిడి యోర్చుకో లేకపోయితిని. ఆ యభినయభారముచేత నామె తూలి పడిపోవునేమో యనుకొంటిని. నాహృదయోద్వేగము నేను పట్టుకొనలేక ఎవ్వరితో మాటాడకుండగనే నే నచటనుండి వెడలిపోయితిని.

౩

వారి యింటినుండి యుత్తరాభిముఖముగా పోగా దారిలో నొక వాగుండెను. ఆవాగు సర్వఋతువుల యందు ప్రవహించుచుండును. ఆవాగుమీద వంతెన లేదు. జన మందరు దిగియే పోవుదురు. ఆవాగు దాటిన తరువాత క్రొత్తపట్టణమంతయు బలిసెను. వారి యిల్లు ప్రాతపట్టణములో నున్నది. ప్రాతయూరు వాగునకివతల.

అప్పటికి ప్రొద్దుక్రుంకవచ్చుచున్నది. నేను విషాదమగ్నహృదయుండనై వాగుదాక పోయితిని. ప్రక్కన నెవరో నడచివచ్చుచున్నట్లుండెను. తలనెత్తి చూడగా మృణాళిని. దాని చంకను ఈ పిల్లవా డుండెను. అప్పటికి వీడు ఏడాదిపిల్లవాడు. ఆమె జరిపేటంచుల జరీగళ్ల పొందూరుచీర తాల్చియుండెను. నే నామె నేమియు నడుగలేదు. ఆమె నాతో నేమియు చెప్పలేదు. నే నడుగకుండ, నామె చెప్పకుండ నామె నాతో వచ్చి

వేయుచున్నదని నాకు తెలియును. వాగుదగ్గరకు చేరు వేళకు కొంచెము చీకటి పడినది. కాని వచ్చిపోవు జనము ఒకరికొకరు కనిపించుచునేయుండిరి. వాగులో నీళ్లు మోకాలిపైకి వచ్చుచుండెను. మృణాళిని దిగినచో నామెచీరయంతయు తడిసిపోవును. నేనామెను రెండు చేతులలో నెత్తుకొని వాగులో నడచితిని. జనమందరు నావంక చిత్రముగా చూడసాగిరి. క్రొత్తయూరిలో నొక పెద్ద మేడలో హోటలుండెను. అది యొక యయ్యరుహోటలు. నేనామె నెచ్చటికి తీసికొనిపోవలయును? ఆరాత్రి కొక గది తీసికొని యందుండి మరునాడు ఈయూరు తీసికొనిరావలయు నని తలంచినాను. అయ్యరును ఒక గది యిమ్మంటిని. అతడు ఖాళీలు లేవనెను. చివరకు మేడచివరిభాగములో నొకగదిని ఖాళీ చేసియిచ్చెను. నేను మృణాళినిని అందు కూర్చుండబెట్టితిని. "నేను భోజనమునకు పోయెదను. నీవు నావెంట నేల వచ్చితివి?" అంటిని. ఆమె మాటాడలేదు. నేను "నిన్ను నే నిప్పుడు తీసికొనిపోయినచో లోకు మేమందురు? నేను వివాహమాడుటకును నీ విప్పుడు తగనిదానవు. నీవు పోయి నీతల్లిదగ్గర నుండుము. నే నిట్లే జీవితాంతము నీవే నాభార్య వనుచు బ్రహ్మచారినై యుందు" నంటిని. అని, పోయి భోజనము చేసి మరలివచ్చితిని. అప్పటికి ఆమెతల్లియు, అప్పగార్లును గదిలో నుండిరి. వా రామెను తిరిగి యింటికి రమ్మనిరికాబోలు. ఆమె ఏమి సమాధానము చెప్పెనో నాకు తెలియదు. ఆమె మరలి తమతో రాదని వారు నిశ్చయము చేసికొని వెడలిపోయిరికాబోలు. నేను మృణాళినియు, దాని బంధువులును కలసియుండుట చూసి యచటనుండి వెడలిపోయి యారాత్రి యా గదిలోనికే పోలేదు. నాకు తెల్లవారలును నిద్రయును లేదు.

ఆమె తన తల్లివెంట వెళ్లిపోయియుండు నని మనసులో దృఢవిశ్వాసము. వెడలిపోదని మనసులో నొకచోట చిన్న యాశ, అనుమానము.

మరునాడు ప్రొద్దున నే నచ్చటికి పోగా నామెయు, పిల్లవాడును అచటనే కూర్చుండియుండిరి. నేను "నీవు వెళ్లిపోలేదా?" అని యడిగితిని. ఆమె మాటాడలేదు. ఆమెమీద నాగుండెలో మేరుపర్వతమంత మహానురాగము. ప్రతినిమేషమున పోయి కౌగలించుకొని మనము వివాహమాడి సుఖముగా నుందమని చెప్పవలయు నన్నంత యాభిముఖ్యము. ఇంతటి మహావాంఛాప్రవాహమును ఏదో ఒక చిన్ని వెలిబిగువు - గడ్డిపరక యంతటిది - ఆనకట్ట కట్టి నిలుపుచుండెను.

మరల కొంతసేపు చూచి సాయంకాలమువరకు నామె యట్లే ఉండినచో నామెను తీసికొనిపోదు నని యనుకొన్నానో యేమో. అచటనుండి వెడలిపోయితిని.

తరువాత రెండుగంటలైన కాలేదు. ఊరిలో సత్యాగ్రహము జరుగుచుండెను. ఆజ్ఞోల్లంఘనము చేసి వచ్చిపోవని జనసముదాయము విరియచేయుటకు రక్షకభటులు తుపాకులు పేల్చిరనియు, ఒకదెబ్బ తగిలి మృణాళిని చనిపోయె ననియు నెవ్వరో యింతలో చెప్పిరి. నేనామెను పోయి చూచితిని. ఆమె గతాసువై యుండెను.

వెంటనే నాకు అపిల్లవా డేమయ్యెనో యన్న భావముతో హోటలునకు పోయితిని. ఈ పసివాడు గిలగిల కొట్టుకొనుచు నేడ్చుచుండెను. నేను వీనిని మృణాళినితల్లికి తీసికొనిపోయి యొప్పగించవలె ననుకొంటిని. ఇంతలో దుఃఖించుచు మృణాళినితల్లియు, బంధువులును వచ్చిరి. వారు కుఱ్ఱవానివంక చూడలేదు. నావంక చూడలేదు.

నేను కుఱ్ఱవానిని తెచ్చుకొంటిని. వారి ప్రసంగమువలన నితనిపేరు రొనాల్డు అని తెలిసెను.

ఈ బాలుడు నేనే తన తండ్రి ననుకొనుచున్నాడు. ఒకవిధముగా తండ్రినేకదా. కాని నేను తెలిసికోలేని దొక్కటియే విషయము. మృణాళిని నన్నువదలి అట్లేల ప్రవర్తించెనో యని. నాకు తరువాత తెలిసినది. ఆమెను దాని తల్లియు, అప్పలును చాల బాధలుపెట్టిరట. భరింపలేక, ఎదిరించు శక్తి లేక, వయస్సు లేక, ఆధారములేక వారి బలవంతమునకు లొంగవలసి వచ్చినదట."

### ముగింపు

అని కపర్ది పుచ్చిన నిశ్వాసము నాగుండెలో పదిమైళ్లలోతున దిగబడెను. ఆరాత్రి నేను వారి యింటి

లోననే నిద్రించితిని. కపర్దిని నే నోదార్చవలయునో, సానుభూతి తెల్పవలయునో, నీవు మహాపురుషుడ వని ప్రశంసింపవలయునో, కులభ్రష్టుడ వని నిందింపవలయునో నాకేమియు తెలియలేదు. అత డన్నచో మనస్సులో నొక మహాగౌరవ మేర్పడినది.

తెల్లవారుకడ కొంచెము నిద్రపట్టినది. కపర్ది వచ్చి నన్ను నిద్రలేపెను. కాఫీకి తొందరపెట్టెను. ఈ కపర్ది రాత్రి కథచెప్పిన కపర్ది కాడు. పరమోత్సాహవంతుడు. పరిహాసవాక్కు. అతని నవ్వువెన్నెలల ముందు సర్వవిషాదాంధకారములు తొలగిపోవును. నేను రెండేండ్లుగా అప్పుడప్పుడు కలసికొన్న రసజ్ఞశేఖరుడు, కళాజీవియు, మధురభాషుడు నగు కపర్ది అతడు.





# యింతలో యింత ఆరోగ్యం!

"మొన్నటికి ముఖమంతా పాలిపోయి వాలవేశావ్. ఇంతలో యింత ఆరోగ్యం! అది యెలా సాధ్యం?"

"అదే చెప్పకో!"

"ఇదివరకు నే చెప్పినమందా?"

"కాదు"—

"ఏదైనా ఇంగ్లీషుమందా?"

"కా—దు"

"యూనానీయా?"

"కా———దు"

"మరి—?"

"లోధ్ర. పొరిగింటావిడ యిచ్చింది. పుచ్చుకున్నాను నాలుగు మోతాదులు. దాన్తో కడుపునొప్పి ముట్టుకుట్టు అదంతా మాయమైపోయింది.

| గర్భాశయ రోగములను పారద్రోలి ఆరోగ్యమును ప్రసాదింపగలది "లోధ్ర" |
|---|

**కేసరికుటీరం లిమిటెడ్ - రాయపేట - మద్రాసు**

తెలుగు జిల్లాలకు సైజాముకు ఏజెంట్లు:—
శీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ.

# డెన్టాక్సిల్ టూత్ పేస్టు



**BRIGHTENS THE TEETH, STRENGTHENS THE GUMS**




One good brushing with DENTOXYL Tooth Paste removes food particles, prevents decay, whitens the teeth, strengthens the gums and sweetens the breath. Your chemist sells DENTOXYL.




**THE DENTOXYL CO.,**
**SADAR, KARACHI.**

**ది డెన్టాక్సిల్ కంపెనీ, సాదర్, కరాచి.**

పో. బా. 3116, బొంబాయి.

దంతములకు మెరుగుపెట్టును. చిగుళ్ళను గట్టిపరుచును. డెన్టాక్సిల్ టూత్‌పేస్టుతో పండ్లుతోముకొనిన పండ్లసందులందు నిల్వయుండు ఆహారపదార్థములు తొలగింపబడును. దంతములు చెడిపోకుండా కాపాడును. దుర్వాసన తొలగించును. కెమిస్టు లందరివద్ద దొరకును.

సర్కారులు, దత్తమండలములకు డిస్ట్రిబ్యూటర్లు:

**ది యునైటెడ్ ఏజన్సీస్, బెజవాడ.**



# ఆంధ్ర విశ్వవిద్యాలయము - ఆంధ్రవికాసము

శ్రీ విస్సా అప్పారావు

౧

**1907** సం. ప్రాంతమందు వంగదేశమును రెండు భాగములుగా చేసిన సందర్భములో, ఆ దేశమందు పుట్టిన జాతీయోద్యమము బిపిన్‌చంద్రపాలువలన ఆంధ్రదేశమునకు ప్రాకినది. ఆ నాటి ఉద్రేకము, రాజమహేంద్రవరములో జరిగిన పరివర్తనము నేటికిని నాకు కళ్లకుగట్టినట్లున్నవి. ఆ యుద్యమమునకు ఆంధ్రదేశములో బందరు కేంద్రముగా ఆనాడుండెను. నా దేశము, నాహక్కు, నే నాంధ్రుడను, ఆంధ్రుల వ్యక్తిత్వము వేరు, వారి సంస్కృతి వేరు, ఆంధ్రాభ్యుదయమునకై, ఆంధ్రుల వికాసమునకై ప్రత్యేకరాష్ట్ర మావశ్యకము—అను ప్రబోధము చెలరేగినది. ప్రచారము సాగించి ఆంధ్రనాయకులందరు ఈవిషయమై తీవ్రప్రయత్నములు చేసినారు. కాని 1920 సంవత్సరము నుండి కాంగ్రెసుయొక్క ప్రాబల్యము హెచ్చినది. స్వరాజ్య సంపాదన యను మహోద్యమము దేశమందలి జాతీయనాయకులందరి దృష్టి నరికట్టినది. అందుచేత జాతీయనాయకులగు ఆంధ్రులు ఆంధ్రరాష్ట్రసంపాదనమును స్వరాజ్యసంపాదనలో చేర్చివేసిరి. అందుచే మిగిలిన ఆంధ్రనాయకులకు తొల్లిటి బలము తగ్గినది. ఆంధ్రోద్యమమం దొక భాగమైన ఆంధ్రవిశ్వవిద్యాలయము కొఱకై వారు కృషిసలిపిరి. పదేండ్లనుండి జరిగిన ఆందోళన ఫలితముగా మదరాసువిశ్వవిద్యాలయపు సినేటుసభలో 1920 లో ఆంధ్రులకు ప్రత్యేకముగా ఒక విశ్వవిద్యాలయ మవసరమని తీర్మానింపబడినది.

ఈ విషయమును గురించి పర్యాలోచన చేసి సలహా నిచ్చుటకై 1920 లో దొరతనమువారు ఒక సంఘము నేర్పాటు చేసిరి. దివాన్ బహద్దరు గోవిందరాఘవయ్యరుగారు అధ్యక్షులు. రావు బహద్దరు నరసింహరాజుగారు కార్యదర్శి. ఇతర సభ్యులు 18 గురు. అం దొకరు డాక్టరు (సర్) రామలింగారెడ్డిగారు. ఈ సంఘమువా రొక నివేదికను దొరతనమువారికి పంపిరి. ఆ నివేదికయే ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు పునాది, ముఖ్యాధారము నని చెప్పవచ్చును. అందలి ముఖ్యవిషయములు క్లుప్తముగా ఇవి:

1. తెలుగు జిల్లాలకొఱకు విశ్వవిద్యాలయము నేర్పాటు చేయవలెను.

2. మదరాసులోవలె గాకుండా ఆంధ్ర విశ్వవిద్యాలయము వారే స్వతంత్రముగా కాలేజీల నేర్పరచి విద్య గరపుట ముఖ్యకర్తవ్యము. **(Teaching University)**

3. సరియైన ప్రచారము చేసినచో ఆంధ్ర దేశస్థులు చందాలు, విరాళములు ఇచ్చి శక్తివంచన లేకుండ తోడ్పడుదు రను ధైర్యము కలదు. కాని ఖర్చును భరించు భారము ముఖ్యముగా మదరాసు ప్రభుత్వమువారిదే.

4. (a) కళాశాఖ **(Arts)**, శాస్త్రశాఖ **(Sciences)**, బోధనాభ్యసనశాఖ **(Teaching)**— ఈ మూడింటితో ఆంధ్ర విశ్వవిద్యాలయము ప్రారంభము కావలెను. రాజమహేంద్రవరములోని ట్రెయినింగుకాలేజిని విశ్వవిద్యాలయమునకు దొరతనమువారిచ్చివేయవలయును. దాని నాధారముగా టీచింగు శాఖను వృద్ధి చేసికొనవచ్చును.

**(b)** విశాఖపట్టణములో దొరతనమువారి వైద్యకళాశాల స్థాపనకాగానే వైద్యశాఖ ప్రారంభము కావలెను. ఈ కళాశాలను దొరతనమువారు విశ్వవిద్యాలయాధికారుల కప్పగించవలెను.

(c) సమయము కూడినతోడనే యీక్రింది 12 శాఖలు క్రమముగా ప్రారంభించవలెను:— వ్యవసాయము, వాణిజ్యము, పరిశ్రమోపయోగకారి యగు రసాయనశాస్త్రము (Industrial chemistry), ఇంజనీరింగు, గనులశాస్త్రము, అడవుల శాస్త్రము, న్యాయశాస్త్రము, సాంఘికశాస్త్రము (Sociology), నావికాయానము, సముద్రసంబంధమగు శాస్త్రము, నేతపరిశ్రమ, తోళ్లు పదునుచేయు శాస్త్రము.

5. (a) మాతృభాషయగు తెలుగులో పాఠములు చెప్పుట, నేర్చుకొనుట, పరీక్షల నిచ్చుట కూడ మిక్కిలి యావశ్యకమే. కాని ప్రస్తుతము మాత్రము ఇదివరలో వలెనే యింగ్లీషులోనే వీటిని జరుపుచుండవలెను.

(b) పాఠ్యాదికములు ప్రస్తుతము తెలుగులో జరపకపోయినను మాతృభాషాసేవకొరకు, తెలుగువారి జ్ఞానాభివృద్ధి నిమిత్తము పుస్తకములను వ్రాయించి ప్రచురించు శాఖ నొకదానిని తక్షణమే స్థాపించి పోషించవలెను. అట్టి పుస్తకములయందలి విషయములు నేటి కాలమునకు అవసరము లగు శాస్త్రములకు, పరిశ్రమలకు సంబంధించినవిగా ఉండవలెను. ఇట్టి పుస్తకములను సుబోధకముగా వ్రాయించి వాటికి విరివిగా వ్యాపకము కలిగించినగాని దేశమునకు అభ్యుదయము కలుగదు. జనసామాన్యమునకు జ్ఞానోదయము కాదు. ఇది ప్రభుత్వమువారు గమనింపవలసిన ముఖ్యవిషయము. మరియు హిందూదేశచరిత్రను గురించి, హిందూతత్వశాస్త్రమును గురించి పుస్తకములను తెలుగులో వీలైనంత త్వరలో ప్రచురించవలెను.

6. శీతోష్ణస్థితిని బట్టి, అక్కడివారిచ్చు విరాళములను బట్టి యీక్రింది ఐదుపట్టణములలో నొక్కచోట విశ్వవిద్యాలయ కేంద్రమును దొరతనమువారేర్పరచవలయును: విజయనగరము, విశాఖపట్టణము, రాజమహేంద్రవరము, మచిలీపట్టణము, అనంతపురము.

7. ఆంధ్రవిశ్వవిద్యాలయముయొక్క ప్రత్యేకత ఈ క్రింది యాదర్శములలో నిబిడీకృతమైయుండును:—

(a) కేంద్రమందు నెలకొల్పబడు సంస్థ బోధనావిశ్వవిద్యాలయముగా ఉండవలెను. అవసరమైనట్టి పారిశ్రామికశాస్త్రవిద్యలన్నిటి నేర్పరుపవలెను. కేంద్రమందు వందలకొలది విద్యార్థులు వసతిగృహములలో నివసించవలెను. ఏకకుటుంబమునకు చెందినవారమను జ్ఞానము కలిగి, కలసిమెలసియుండు ఏర్పాటు చేయవలయును. విశ్వవిద్యాలయావరణలోనే అధ్యాపకులందరు ప్రత్యేకగృహములలో కాపురములుండవలెను. వారందరు విద్వాంసులును, ధర్మశీలురును, ప్రతిభాశాలురునుగ నుండి, విద్యార్థులతో కాలము గడపుచు, సత్యాన్వేషణమందు సమర్థులై, సత్యమును గుర్తించు మార్గమును విద్యార్థులకు బోధించుచు, మానవస్వభావము నుత్కృష్టముగా జేయు భావములయందు మనస్సులను లగ్నముజేయుచు, సన్మార్గావలంబన గలిగింప సమర్థులై యుండవలెను. అక్కడ నివసించిన ప్రతియువకుని నడవడియందు శ్లాఘ్యమైనట్టియు, విశిష్టమైనట్టియు శీలము తొణుకులాడుచుండవలెను. ఇతడు ఆంధ్రవిశ్వవిద్యాలయమున విద్యనేర్చినవాడని దేశమంతయు గర్వించతగిన ట్లుండవలయును.

(b) నేటి విశ్వవిద్యాలయములన్నియు వృత్తికి సాధనమగు చదువులకొరకై బయలుదేరుచున్నవే. కేవలము ఐహికములగు లాభములయందును, పదవులయందును మనస్సు లగ్నం కాకూడదు. జ్ఞానసంపాదన స్వార్థముకొరకుగాక పరమార్థముకొరకే యను ఉత్కృష్టభావములతో విశ్వవిద్యాలయవాతావరణము పరిమళించవలెను. అక్కడ అలవడిన శిక్షు, తరిబీదు, జ్ఞానము, క్రియాకౌశల్యమును జీవితములో మనల నెదుర్కొను అన్ని ఘట్టములయందును స్మరణీయములై, విజయసాధనములు గావలెను.

(c) విశ్వవిద్యాలయము ఒక స్వతంత్ర సంస్థగా ఏర్పాటు కావలెను. ప్రభుత్వమువారు దాని స్వతంత్రతను సాధ్యమైనంతవరకు కాపాడుచుండవలెను. తమ యధికారమునకు లోబడునట్టి పద్ధతిని వారు విడిచిపెట్టుటయే శ్రేయోదాయకము.

స్వాతంత్ర్యమే విశ్వవిద్యాలయ జీవనాధారము. అందు విద్యాధికులగు ఆచార్యులయొక్క యభిప్రాయము లెట్టివైనను పరిపాలనాధికారులు ఉదాసీనులై యుండవలెను. ఆ యభిప్రాయముల నాధారము చేసికొని ఉపాధ్యాయులకు ఉద్యోగము లిచ్చుటగాని, స్వస్తిచెప్పుటగాని ఎంతమాత్రము కూడదు. పరిపాలనావర్గమందు కొంతవరకు ప్రభుత్వమువారి ప్రతినిధులు ఉండవలసినదే. కాని, నిత్యవ్యవహారాలయందు విద్యావిధానపద్ధతులలోను, విశ్వవిద్యాలయంలోని వ్యక్తుల నడవడిని శిక్షించుటలోను సర్వస్వతంత్రంగా విశ్వవిద్యాలయపు వర్గంవారికే వీలయినంతవరకు అధికారమంతయు వదిలివేయవలెను. కావలసిన ధనమంతయు సాలీనా యిచ్చివేస్తూ విరుద్ధకార్యములను నిషేధించు నధికారముమాత్రముంచుకొని, సొమ్ము సక్రమముగా ఖర్చగుచున్నదా లేదా అని కనిపెట్టుచు, విశ్వవిద్యాలయముయొక్క వృద్ధినే సదా కోరుచు దొరతనమువా రుండవలెను.

8. విశ్వవిద్యాలయము సరిగా నడచుటకు ఆరంభంలో 30 లక్షల రూపాయీలకు తక్కువగాకుండా యిచ్చి, సాలీనా 5, [illegible] లక్షల రూపాయీలు ఖర్చుపెట్టుచుండవలయును.

ఈపైన సూచించినట్లుగా కమిటీవారిచ్చిన సలహాప్రకార[illegible] పని జరిగియుండినయెడల ఆంధ్రులకు మహోపకారం జరిగేయుండ ననిన్నీ, ఆంధ్రవికాసానికి ఆంధ్రవిశ్వవిద్యాలయం యెంతో తోడ్ప[illegible] యుండేదనిన్నీ చదువరులు సులభముగా గ్రహించగలరు. కా[illegible] "శ్రేయాంసి బహువిఘ్నాని" అన్నట్లు, కావాలన్నట్టే జ[illegible] గడం యెంతటి అదృష్టవంతులకోగాని సంభవిస్తుందా?

౨

పైనివేదిక 1921 లో గవర్నమెంటువారికి అందింది. తరువాత కొన్ని సంవత్సరాలకు-1926 లో ఆంధ్రవిశ్వవిద్యాలయచట్టం ఆమోదింపబడినది. ఆసంవత్సరమే కళాశాలయేలేని బెజవాడలో విశ్వవిద్యాలయంయొక్క హెడ్ క్వార్టర్సు యేర్పాటయింది. కాలేజీలను నిర్మించి వృద్ధిచేయుటకై వాల్తేరు, రాజమహేంద్రవరం, అనంతపురం అను మూడుకేంద్రాలు యేర్పాటుచేయబడ్డాయి. ఆరంభంలోనే హంసపాదన్నట్లు పై రిపోర్టులోని సూచనలకు భిన్నంగా వ్యవహారం వేరేదారి పట్టడం ఆరంభమైంది. క్రొత్తకాలేజీలు బెజవాడలో స్థాపించడానికి ఆక్టు ప్రకారం వీలు లేదు. హెడ్ క్వార్టర్సు యెక్కడ పెట్టడమా అనే సమస్య రేగింది. ఆంధ్రులలో యేకీభావం నశించింది. యెవరికి వారే మావూళ్లో అంటే మావూళ్లో అని తగవులాడుకొన్నారు. ఇలాగ అమూల్యమైన మూడేండ్లకాలం వృథాగా చెడిపోయింది. ఆంధ్రవిశ్వవిద్యాలయమందు గల ఉత్సాహం పటాపంచలయింది. ఉదాసీనం పెరిగిపోయింది.

ఇంకొక విషయం. స్వతంత్రంగా కార్యములను నిర్వహించుకోనిచ్చుట, కావలసిన సొమ్ము నిచ్చుచుండుట, గవర్నమెంటు కాలేజీలను విశ్వవిద్యాలయంవారి అధీనం చేయుట మొదలగు మూలవిషయములనుగురించి ఆంధ్రవిశ్వవిద్యాలయమునకును, దొరతనంవారికిని వ్రాతమూలమగు చర్చ యీ మూడేండ్లలో సాగింది. ఇట్టిస్థితిలో గోరుచుట్టుమీద రోకలిపోటన్నట్లు 1928 డిశంబరులో నిరుత్సాహకరమూ, ఆంధ్రోద్యమానికి భంగకరమూ అగు ఒకప్రచురణ ప్రభుత్వమువారు చేశారు. దానివల్ల యిదివరకు పడ్డ శ్రమ, చేసిన కృషి, సలిపిన ఆలోచన అన్నీ వృథా అగునట్టి సమస్య యేర్పడింది. ఆ ప్రచురణయొక్క సారాంశ మేమంటే—"మీరేమీ పనిచెయ్యలేక తగాదాలుపడుతున్నారు. కార్యాలోచన ఉన్నట్లు లేదు. అట్టిస్థితిలో కేంద్రంలో ఉంచబోయే కళాశాలను నడిపించడం, అఫిలియేటు చేసికొన్న కళాశాలలను సమర్థించుకోవడం యీ రెండూ మీరు సాగించుకో లేరేమో. కనుక అఫిలియేటెడ్ కాలేజీలను మదరాసు విశ్వవిద్యాలయానికి తిరిగి యిచ్చివేయండి, విశాఖపట్నంలో కేంద్రం యేర్పరుచుకొని కాలేజీలను వృద్ధిచేసుకోండి. యిది మా సలహా. బాగా ఆలోచించుకోండి."

ఏమయితేనేమి అట్లా జరగలేదు. 1929 లో విశాఖపట్టణం విశ్వవిద్యాలయకేంద్రంగా యేర్పాటయింది. రాయలసీమవారికి నిరుత్సాహం, ఆశాభంగం కలిగింది. ప్రభుత్వమువారు 27 లక్షలిచ్చారు. కళాశాలలు, వసతిగృహములు వాల్తేరులో నిర్మాణమవడం ఆరంభమైంది. టీచింగుయూనివర్సిటీకి కావలసిన యేర్పాట్లు 1931 జూలయినాటికే ప్రారంభమయి పనిసాగింది. 1933 నాటికి జయపూరు విక్రమదేవు మహారాజావారిపేర కాలేజ్ ఆఫ్ సైన్సు అండ్ టెక్నాలజీ (College of Science and Technology) అనేది స్థాపింపబడింది. యిదే ఆంధ్రవిశ్వవిద్యాలయంవారు ముఖ్యముగా శ్రద్ధతీసికొనుచున్న కళాశాల. దీనికి శ్రీశ్రీశ్రీ విక్రమదేవవర్మ మహారాజావారు సాలీనా ఒకలక్షరూపాయ లిచ్చి పోషించుచున్నారు. ఇట్టి మహాదాత, ఉదారుడు, దేశభక్తుడు, పరమార్థమెఱిగిన దయాశాలి మరియొకరు ఆంధ్రదేశమందు అరుదైపోయినారు. ధనవంతులు లేకనా? ఉన్నవారు విరివిగా ఖర్చుపెట్టకనా? కాదు కాదు. మన దురదృష్టంవల్ల వారికి అట్టి ఔదార్యభావం యింకను కలగకపోవడమే. అట్టి మహాపురుషులు అనేకులు కొందరు అయినా దోహదంచూపినగాని ఆంధ్రవిశ్వవిద్యాలయం ఉన్నతమైన స్థితికి వచ్చుట దుస్తరము. మరియు యీసని సెరవేరాలంటే, ఆంధ్రవిశ్వవిద్యాలయప్రముఖులు దేశస్థులతో ఉచితరీతిని సంప్రతించి దేశమందు ప్రచారము సాగించవలయును. ప్రజాభిప్రాయమును గౌరవించి, వారికి తగిన సమాధానముల నిచ్చి, ఆంధ్రులందరకు శ్రేయస్కరమైన పనులు సాగించుచు, వారిని చెందనాడుకోక అన్యోన్యభావం పెంపొందించాలి. యిది ముఖ్యకర్తవ్యం. ఇదివరలో జిల్లాబోర్డులవారూ, పురపాలకవర్గాలవారూ ధనసహాయం చాలా చేశారు. చేయగలరు. వారందరూ వందనీయులు. వీరుగాక తిరువాన్కూరుమహారాజావారు, మహారాణీగారు, హైదరాబాదునైజాముగారు, బొబ్బిలిమహారాజావారు, పానగల్లురాజావారు, విజయనగరసంస్థానమువారు, చల్లపల్లిరాజాగారు, తిక్కవరపుకుటుంబమువారు, సర్ కట్టమంచి రామలింగారెడ్డిగారు మొదలైనవారు భూరివిరాళముల నిచ్చి విశ్వవిద్యాలయాభివృద్ధి కెంతో సాయపడ్డారు. వారి కందరకు కృతజ్ఞతాపూర్వకమైన వందనము లెన్ని సమర్పించినా వారి ఋణము మనము తీర్చలేము. వీర లెంద రెంతెంత సహాయము చేసినా కార్యభారమంతా వహించి సొమ్మిచ్చితేనేమి, అనేకవిధములగు పురుషకారము చేసితేనేమి మదరాసుప్రభుత్వమువారు ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు చాలా తోడ్పడ్డారు. ఆకారణముచేత విశ్వవిద్యాలయము శాఖోపశాఖలుగా విస్తరించింది. ఇట్టి స్థితిలో ప్రపంచమంతటను వ్యాపించిన మహాసంగ్రామము సంభవించింది. దానివల్ల విశ్వవిద్యాలయములో జరుగుచున్న అభివృద్ధి ఆగిపోయింది. అది సహజమే. కాని విశాఖపట్టణము యుద్ధక్రియలకు ముఖ్యమగు స్థానముగా ఏర్పాటుచేయవలసివచ్చుటచేత విశ్వవిద్యాలయము వాల్తేరును వదలి గుంటూరు వచ్చివేసింది. ఈ క్లిష్టస్థితి యుద్ధము ముగిసేవరకూ ఉంటుంది. త్వరలో ప్రపంచశాంతి కలుగుగాక యని మనము ప్రార్థించాలి.

౩

యుద్ధానంతరం విద్యావిధాన పునర్నిర్మాణ కార్యక్రమము జరుగబోతున్నది. ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు సింహా

వలోకనము చేసికొని అభివృద్ధికరమగు కార్యములను ఎన్నో చేయ వలసియుంటుంది. కాన ఆ విషయము కొంత వ్రాయుచున్నాను.

1. రాయలసీమవారి తోడ్పాటు:—ఆంధ్రదేశములోని అన్ని జిల్లాలవారు తోడ్పడి విశ్వవిద్యాలయమును వృద్ధికి తేవలసియున్నది. సముద్రప్రాంతపు జిల్లాలవారు రాయలసీమవారితో సహృదయులై సంచరించి, అనంతపురంలో కొన్ని విద్యాసంస్థలను స్థాపించుటకు కంకణము కట్టుకొనవలయును. రాయలసీమవారు వాల్తేరు చాలా దూరమైపోయిందనీ, అనంతపురంలో యేసంస్థా పెట్టలేదనీ అసంతృప్తిపడి, చీలిపోయారు. వీరి యెడబాటు ఆంధ్రదేశమునకు గొప్ప లోటు. ఈలోటు తీరుటయే ఆంధ్రవికాసమునకు, ఆంధ్రోద్యమమునకు మొదటిమెట్టు.

2. అధ్యాపకులకు వసతిగృహాలు:— నూతనాశయములతో మన విశ్వవిద్యాలయము నిర్మాణమైనది. అందులో విద్యార్థులతోపాటు అధ్యాపకులకుకూడ నివసించుటకు వసతిగృహములు ఉంటేనే గాని బోధనావిశ్వవిద్యాలయము కానేరదు. విశ్వవిద్యాలయము యొక్క పేరుప్రతిష్ఠలు విద్యాధికులు, శీలవంతులు అగు ఆచార్యుల నాధారము చేసికొనియుండును. అందుచేత అట్టి ఆచార్యులను గౌరవించి, కొన్ని సంవత్సరములపాటుండనిచ్చినగాని గోవిందరాఘవయ్యరు సంఘమువారు సూచించిన ఉన్నతాశయములు అమలులోకి రావడానికి సందర్భ మేర్పడదు. అట్టిస్థితి యెంత త్వరలో యేర్పడితే అంత మంచిది. యెపుడు సాయంత్రమగునా, యెపుడు యింటికి పోదుమా అని ఉపాధ్యాయులందరూ, విద్యార్థులు కొందరూ యెదురుచూస్తూఉంటే, విశ్వవిద్యాలయాధికారవర్గమువారు ఆచార్యులయొక్కా, విద్యార్థులయొక్కా జీవితాలలో అత్యంతానుబంధము కలుగజేసుకోకపోతే, ఎవరికి వారేగా ఉండిపోతే, విశ్వవిద్యాలయావరణలో ఉపన్యాసాలు, వినోదాలు, కలుసుకోవడాలు, అన్యోన్యము అభిప్రాయములు తెలుసుకోవడాలు మొదలైన ముఖ్యవిషయాలు యెట్లా సాగుతాయి? సాగకపోతే ఆశయాలు ఆశయాలలాగే ఉండిపోతాయి; అభ్యుదయాలు దూరమైపోతాయి.

3. మాతృభాషాసేవ:—ఆంధ్రవిశ్వవిద్యాలయంవారు మాతృభాషనుగురించి తగిన పని చేయడం లేదని దేశంలో అక్కడక్కడ అనుకోవడం కలదు. (a) తెలుగులో పాఠాలు చెప్పడంలేదనీ, (b) తెలుగుభాషలోను, సారస్వతంలోను, చరిత్రవిషయంలోను తగిన శ్రద్ధ తీసికొనలేదనీ, (c) సామాన్యజనుల జ్ఞానాభివృద్ధికొరకు అవసరమైన విషయములనుగురించి సుబోధములగు పుస్తకములను వ్రాయించలేదనీ అతృప్తి. కాని యిదంతయు నిజమని చెప్పుటకు వీలులేదు. ఏమంటే (a) తెలుగులో పాఠాలు విశ్వవిద్యాలయంవారు చెప్పారనుకోండి; పిల్లలు తెలుగులోనే పరీక్ష లిచ్చారనుకోండి. అట్టి పట్టభద్రులకు ఉద్యోగా లెట్లా అవుతాయి? వారు యెలాగ చలామణీఅవుతారు? వారిని యెవ రాదరిస్తారు? యీ ప్రశ్నలకు తగిన సమాధానం యేర్పడితేనేగాని ఆకార్యం చేయడమెట్లు? చేస్తే, నిరుద్యోగసమస్య మరింత హెచ్చదా? సైజాము ప్రభుత్వమువారు చేయడం లేదా అంటే, ఏం లాభం? ఆ పరిస్థితులు ఆంధ్రదేశంలో వున్నాయా? కనుక తొందరపడగూడదు. (b) చిత్రప్రభ, సంగమేశ్వరక్రోడము, గురుప్రసాదము, గురుప్రసాదశేషము, వైయాకరణపారిజాతము వీటిని ప్రచురించి వ్యాకరణమునకు విశ్వవిద్యాలయమువారు అమూల్యమగు సేవ చేసినారు. సంస్కృతసారస్వత చరిత్ర, ఆంధ్రభాషాచరిత్ర వ్రాయించి, రంగనాథరామాయణమును ప్రచురించి సారస్వతసేవ చేసియున్నారు. (c) ఆంధ్ర మీమాంసాన్యాయముక్తావళిని, విశ్వరూపమును, జంతుశరీరశాస్త్రములను, క్షేత్రగణితమును తెలుగున వ్రాయించినారు. ఈపనులన్నియు శ్లాఘ్యమైనవే. కాని యింతకంటె పని విరివిగా జరుగవలసియున్నది. అందు నిమిత్తమై ఒక విమర్శనాశాఖ, ప్రచురణశాఖ స్థాపించవలెను. యీపని యిదివర కెన్నడో జరుగవలసినది. పరిశోధనచేయవలసిన అపూర్వమైన విషయము లెన్నో ఆంధ్రసారస్వతమునకు, భాషకు, చరిత్రకు చేరినవి ఉన్నవి. ఈ మూడింటికి పరస్పరసంబంధం హెచ్చుగా ఉంది. ఈ విషయములను విమర్శింపగలిగినవారు ఉన్నారు. వారి నందరిని చేరదీసి, వారికి తగిన ప్రోత్సాహ మిచ్చి, కావలసిన సామగ్రిని సమకూర్చి, పనిచేయించినచో అమూల్యమైన విషయములు కల గ్రంథములు బయలుదేరును. ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు యీ కార్యమును తప్పక చేయించెదరను గంపెడాశపెట్టుకొన్న తెలుగువారికి ఆశాభంగమై అసంతృప్తి వ్యాపించినది. కనుక యీ విషయము త్వరలో సాగించుట మంచిది.

4. కళాసేవ:—మదరాసు విశ్వవిద్యాలయములోను, అణ్ణామలై విశ్వవిద్యాలయములోను కర్ణాటక సంగీతశాఖలు నిర్మింపబడినవి. జంత్రగాత్రములలో విద్య నేర్పుచున్నారు. విద్వాన్ మొదలైన పరీక్షలు జరుగుచున్నవి. సంగీతకళ చాలా పోషింపబడుచున్నది. తమిళభాషలో అన్నివిధములైన పాటలూ వుండవలెననీ, చాలావరకు తమిళపాటలనే కచేరీలలో పాడించవలెననీ తమిళులు వాదించుచు, ఆపనిని సాగించుకొనుచున్నారు. సంపన్నులు లక్షలకొలది ధనము వ్యయపరచుచున్నారు. దీనివలన అక్కడి సంగీతకచేరీలలో తెలుగుపాటలు—ముఖ్యముగా, త్యాగయ్యగారి కీర్తనలు-పాడుట తగ్గిపోయినది. దానివల్ల ప్రాచీనసంప్రదాయాలు, మంచి కర్ణాటకగానము క్షీణించు నని ఒకమూల ఆందోళన ప్రారంభమైనది. తెలుగుదేశములో ఇదివరకే సంగీతకళ చాలా అడుగంటి ఉంది. దక్షిణాదికి పోయి నేర్చుకు రావలసియుంటూంది. తెలుగువారికి మదరాసు, అణ్ణామలై విశ్వవిద్యాలయ

ములవారు సంగీతముద్రాధారణ చేసి భిక్షపెడుతున్నారు. సంగీతకళ తెలుగుదేశమం దెంతో పునరుద్ధరింపబడవలసి యున్నది. ఇందుకు తగిన సంఘములు గాని, పరిషత్తులు గాని తెలుగుదేశములో లేవు. ఈపనికి విశ్వవిద్యాలయమువారైనా పూనుకొనట భావ్యము. వారు సంగీతములో బోర్డు ఆఫ్ స్టడీసును యేర్పాటు చేసినారు. ఇంటర్మీడియేటుకు, బియేకు సంగీతములో పరీక్ష లేర్పాటు చేసినారు. దానివల్ల సంగీతమునకు తగిన ప్రోత్సాహము కలుగ లేదు. నామమాత్రముగానే ఉన్నది. అందుచేత తక్కిన కళలమాట అట్లుండగా సంగీతకళనైనా విశ్వవిద్యాలయంవారు పోషించవలెను. దాని కొక శాఖను నిర్మించి విద్య బోధించవలెను. అపూర్వమైనట్టి, అచ్చుపడనటువంటి గ్రంథములను శోధించి ప్రచురించవలెను.

5. పారిశ్రామికవిద్యలు:—పారిశ్రామిక విద్యలను మేలుతర గతిలో యేర్పాటు చేయుట విశ్వవిద్యాలయోద్దేశ్యములలో ప్రధానమైనది. యుద్ధానంతరము హిందూదేశమందు విద్యను సర్వతోముఖముగా పెంపొందించుటకై దొరతనమువారి యాధిపత్యమున ఒక పెద్ద ప్రణాళిక యీమధ్యనే ప్రచురింపబడినది. దానికి వందల కొలదికోట్లరూపాయీలు అంచనా వేసినారు. ఆ సందర్భములో విశ్వవిద్యాలయములోని విద్యలను గురించి చర్చిస్తూ, వృత్తికి సంబంధించిన ఇంజనీరింగు మొదలగు చదువులలో తేరిన యువకులకు యంత్రముల నుపయోగించుటయందును, కర్మాగారములను నడిపించుటయందును ఉండవలసినంత అనుభవము లేదని యుద్ధ కార్యతంత్ర నిర్వహణదక్షు లొకరు నొక్కి వక్కాణించిరి. ఏ పరిశ్రమకు సంబంధించిన చదువులోనైనను దానికి కావలసిన విధానము లన్నింటిని యథాక్రమముగా విద్యార్థులచేత చేయించి, పూర్ణమైన తరిఫీదు నిచ్చిగాని పట్టా లివ్వరాదనీ, అలా చేస్తేనేగాని దేశంలోని పారిశ్రామికస్థితి బాగుపడదనీ వ్యక్తంచేసినారు. ఇదే విద్యావిధానమునకు ప్రామాణికమైన పద్ధతి యని చాలాకాలము నుండి అందరూ యెరిగినదే.

ఈ ప్రమాణమునుబట్టి పరిశీలించినచో ఆంధ్ర విశ్వవిద్యాలయములోని పారిశ్రామికశాఖలో (**Technology**) నేర్పే రసాయన పరిశ్రమ (**Chemical Technology**), రసాయన శిల్పవిద్య (**Chemical Engineering**), పంచదార పరిశ్రమ, ఔషధాల పరిశ్రమ కర్మాగారాభ్యాసము (**Work- shop practice**) మొదలైనవి చాలా మార్చుకోవలసివస్తుంది. పుస్తకముల చదువుతోపాటు పరిశ్రమలలో అనుభవంకూడా బాగా కలిగితేనే గాని లాభంలేదు. ఈ పని సాధారణమైంది కాదు. ఒక్క ఘనంవల్ల నెరవేరేది కాదు. పరిశ్రమలలో ఆరితేరిన అధ్యాపకులవల్ల గాని యిది సిద్ధించదు. అందుచేత యేచదువుకు, యేతరిఫీదుకు, యేపరిశ్రమకు ఏది కావలయునో విమర్శించి తెలిసికొని, బుద్ధిమంతులగు యువకులను విదేశములకు బంపి, తగినంతకాల మందుంచి, రప్పించుకొని, వారి నాదరించి, కార్యము సాగించుకోవలెను. ఆనాడుగాని పారిశ్రామికశాఖలు దేశాభ్యుదయమునకు సంపూర్ణముగా తోడ్పడజాలవు. వారివారికి తోచినట్టు పారిశ్రామికవిద్య నేర్చివచ్చినవారిలో యీ నూతనాశయములకు సరిపడేవారు, నిలదొక్కుకొనియుండి పనిచేసేవారు దొరుకుట దుర్లభము. ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు పడిన శ్రమ, పొందిన అనుభవమే దీనికి తార్కాణము. ముందుముందు పరిశ్రమలకు ప్రాధాన్యం రానున్నది. రావలసియున్నది. దీనికి తగిన అన్నివిధము లగు యేర్పాట్లు యిప్పటినుంచీ ఆలోచించుకొని, ఇండియాగవర్నమెంటువారు యేర్పరిచిన కేంద్రవిద్యాసంఘమువారితో ఆలోచించి కార్యక్రమమును సిద్ధముచేసికొనవలసియున్నది. పరిశ్రమలకు సంబంధించిన విషయము ముఖ్యమైన దింకొకటి యున్నది. మన దేశములో పరిశ్రమలే తక్కువ. * ఉన్నవాటిలో చాలామటుకు బాల్యావస్థలో ఉన్నాయి. వాటికి విశ్వవిద్యాలయములోని పదార్థ విజ్ఞానశాస్త్ర, రసాయనశాస్త్ర, పారిశ్రామిక అధ్యాపకుల సహాయము బాగా కావలసియుంటుంది. ఏదైనా ఒకవిషయమునుగురించి ప్రయోగాలు సలిపి, క్రొత్తపద్ధతులు పరిశ్రమలో ప్రవేశపెట్టాలన్నా, యేనయినా సందేహాలు తీర్చుకోవాలన్నా విశ్వవిద్యాలయమే శరణ్యము. ఇతరసంస్థలు లేవు. దేశమందలి పరిశ్రమలతో విశ్వవిద్యాలయము వారికిని చాలా పని ఉంటుంది. ఇలాగనే పరస్పరము లాభము లుంటాయి. కనుక అన్యోన్యసంబంధము లేర్పాటుచేసికొనుట ఉభయతారకము. ఆ ప్రయత్నము అత్యవసరము.

6. భూగర్భశాస్త్రము - ఖనిజశాస్త్రము (**Geology and Mineralogy**):—మూడేండ్లై ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు ఈ శాస్త్రములలో ఆనర్సువరకూ విద్యనేర్పుట కేర్పాట్లు ప్రారంభంచేశారు. యుద్ధకారణముచేత వాల్తేరునదలుటచేత ఈశాస్త్రవిద్యకు చాలా నష్టంకలిగింది. త్వరలో పునరుద్ధరింపవలసియుంది. ఈపునరుద్ధారణ దూరదృష్టితో చక్కగా ఏర్పాటైతే దేశసంపదకు ఎక్కువగా తోడ్పాటుకలుగుతుంది. మద్రాసువిశ్వవిద్యాలయమువారూ, అణ్ణామలై విశ్వవిద్యాలయమువారూకూడా ఈశాస్త్రమును వృద్ధిచేయక ఉపేక్ష చేసినారు. ఆంధ్రవిశ్వవిద్యాలయము దీనిని అన్నివిధములా వృద్ధి చేయుట ఆవశ్యకము. ఆంధ్రదేశము ఖనిజసమృద్ధి గలది. ఖనిజసంపదను గుర్తించి, ఖనిజములను త్రవ్వితీసి, ఉపయోగకరములగు పదార్థములుగాను, వస్తువులుగాను మనమే వాటిని మార్చినచో, దేశ మార్థికసంపదతో తులతూగి, శక్తివంతమై, తా నొక వ్యక్తిగా తల

* రాజమహేంద్రవరమున కాగితపుమిల్లు, బందరులో ఆంధ్ర సైంటిఫిక్ కంపెనీ, ఆంధ్రా కెమికల్సు, బెజవాడలో ఆంధ్రఫార్మస్యూటికల్సు, ఆంధ్రసిమెంటు ఫేక్టరీ, ఏలూరిలోని జూట్ మిల్సు, వుయ్యూరు, రాయగడ, కిర్లంపూడి, ఏటికొప్పాకలలోని పంచదార ఫేక్టరీలు, నిడదవోలులోని రసాయనపరిశ్రమాలయము ముఖ్యమైనవి.

యొత్తుకొని మెలగగలరు. ఇంగ్లాండు, జర్మనీ, అమెరికాసంయుక్త రాష్ట్రీసులు ఇలాగే గొప్పవయినవి. ఉత్తరసర్కారులలోని తూర్పుకనుమల ప్రాంతదేశమందును, గోదావరీ, కృష్ణా, తుంగభద్రా నదులు పారుచున్న ప్రదేశములయందును, రాయలసీమలోను ఖనిజ పరిశోధన విరివిగాను, లోతుగాను చేయవలసియున్నది. నవీనశాస్త్ర సంబంధములగు ఖనిజపరిశోధపద్ధతులు (**Scientific prospecting**) ఇటీవల చాలా కనిపెట్టబడినవి. ఇతరదేశములకు పోయి-జర్మనీలో శాస్త్రము (**Theory**), అమెరికాసంయుక్తరాష్ట్రములలో అనుభవము (**practical**)-నేర్చినవారుగాని ఉపయోగపడరు. అట్టివారధ్యాపకులుగా ఉండి ఏర్పాట్లు చేయకపోతే ఈశాస్త్రములు నిర్జీవములుగానే, ప్రాతపద్ధతులలోనే ఉండిపోవును. విశాలదృష్టితో ఈ కార్యము సద్ధరించవలసియున్నది. లేదా లాభ మెంతమాత్రమును ఉండదు. ఇలాగున నూతనమార్గమున ఒక శాస్త్రశాఖ తయారైనచో అందు వందలకొలది విద్యార్థులను- మెరికలవంటివారిని తయారుచేయవచ్చును. ప్రత్యేకముగా ఖనిజములను కనిపెట్టగలిగినప్పుడు భూస్వాములు, జమీందారులు, మహారాజులు, గవర్నమెంటువారూ వారిని నిరాక్షేపణగా పోషించి లాభము పొందగలరు. అట్టిపని ఎంతో జరగవలసియున్నది. దీని సంగతి ఇదియనిగాని, సత్తువ ఇట్టిదనిగాని మన దేశస్థులకు తెలియదు. జపాను, రష్యాల చరిత్రలు పరిశీలించినచో ఈ శాస్త్రముల శక్తిసామర్థ్యము లెట్టి యద్భుతమైనవో తెలుసుకోవచ్చును. ఆదేశములలో ఖనిజశాస్త్ర వేత్తలు, పరీక్షకులు, ధాతు, గని శాస్త్రజ్ఞులు, ఖనిజపరిశ్రమవిద్యానిపుణులు వేలకొలది పనిచేయుచున్నారు. తెలుగుదేశ మట్టివారితో నిండిపోవాలి. అప్పుడుగాని దేశమంతా కలకలలాడదు. ఇది ఒక రోజులో అయే పని కాదు. అందుచేత ఆంధ్రవిశ్వవిద్యాలయము వారు ఈపనికి తగిన యేర్పాట్లిప్పటినుంచి ప్రారంభింపవలెను. కొంత కాలవిలంబమైననుసరేగాని కక్కుర్తిగా, సంకుచితాలోచనతో చేయవలసిన పనిమాత్రము కాదు. భారతదేశము రత్నగర్భ. దక్షిణమున ఆంధ్రదేశమే ఖనిజ సంపదతో నిండియున్న ప్రదేశము. ఈ విషయమును గుర్తించియే ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు శ్రీ సి. మహాదేవన్‌గారిచేత 'ఆంధ్రదేశమందలి ఖనిజములు - వాటి ఉత్పత్తి స్థానములు' అను పుస్తకమును 1940 లో వ్రాయించినారు. దానిలో సమస్తవిషయములు సూచింపబడి యున్నవి. వజ్రములు, బంగారు, రాగి, గ్రాఫైటు, మాంగనీసు మొదలగు అమూల్యములగు ఖనిజములు మన దేశమం దున్నవి. వీటిని సాధించి దేశము సద్ధరింపవలెనంటే ప్రభుత్వమువారు పూర్తిగా పూనుకొనవలసిఉంటుంది. అట్టి పని త్వరలో కాగలదని ఆశించుచున్నాను. అట్టి తరుణమునకు విజ్ఞానకేంద్రముగాను, జీవగఱ్ఱగాను, ఖనిజశాస్త్రజ్ఞులగు యువకులను నూతనపద్ధతులలో తయారుచేసే ప్రయోగశాలలగాను మన విశ్వవిద్యాలయములోని భూగర్భ శాస్త్రశాఖ విరాజిల్లవలెను. దేశమందలి పరిశ్రమలలో దక్షులగు ధనికులు, విశ్వవిద్యాలయమువారు, దొరతనమువారు కూడి ఒక సంఘముగా నేర్పడి, నిర్వహించవలసిన కార్యమంతకూ తగినట్టి దశవత్సరప్రణాళిక నొక్కదానిని దేశమంతకును సరిపోవునట్టుగా తసుకీతిని నిర్మించి ఆప్రకారము క్రమముగా అమలు జరిపించవలెను.

7. మెట్రిక్యులేషను పరీక్ష-ప్రైవేటువిద్యార్థులు:— ప్రతి సంవత్సరము ఆంధ్రబాలికలు వందలకొలది కాశీవిశ్వవిద్యాలయ మెట్రిక్యులేషనుపరీక్షకు వెళ్లవలసివస్తూంది. ఆంధ్రజనసామాన్యానికి దానివలన మిక్కిలి ప్రయాసప్రయాసలు కలుగుచున్నాయి. ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు ఈకష్టములను లెక్కచెట్టుట లేదు. లెక్కల (**Mathematics**) లో తప్పక పరీక్ష ఇచ్చి తీరవలె నను నిర్బంధమును తొలగించి ఇతరములగు పాఠ్యవిషయములను ఏర్పాటుచేయమని ఎంతకోరినను విశ్వవిద్యాలయమువారు వినిపించుకోలేదు. ఇందుచేత దేశములో అసంతృప్తి కలిగినది. దీనిని గుర్తించి తగిన సదుపాయము చేయుట మంచిది. మెట్రిక్యులేషను పరీక్షకు ప్రయివేటుగా వెళ్లే విద్యార్థులు పాఠశాలలో హాజరు కానందుకుగాను సిండికేటువారు మన్నింపవలసిఉంది. ఈవిషయములో కొన్ని నిబంధన లున్నాయి. వాటిప్రకారము ఎవరికిని లాభముగలుగుటలేదు. కారణములు తెలియవు. అందుచేత అట్టి యువకులు కాశీపరీక్షకు కట్టవలసివస్తూంది. తల్లిదండ్రుల కష్టసుఖములు, బాలబాలికల ప్రయాసలు తెలిసియు విశ్వవిద్యాలయాధికారు లుదాసీనులై యున్నారు.

8. పైన సూచించినట్లు కొన్నివిషయములలో ఆశయాలు వేరుగాను, ఆచరణలు వేరుగాను ఉన్నాయి. కాని ఒక వైపున ప్రభుత్వమువారిని, ఒకవైపున ప్రజలను, మధ్యగా ఉపాధ్యాయులను, విద్యార్థులను కూడగట్టుకుని విశ్వవిద్యాలయసంస్థ నింతవరకు వృద్ధిలోనికి తీసుకొనిరావడము సామాన్యము కాదు. అభిప్రాయాలు హెచ్చు, ఆదాయము తక్కువ ఐతే కార్యములు చేసి ఓహో యనిపించుకోవడం చాలా కష్టము. ఐనను ఆంధ్రవిశ్వవిద్యాలయము ఆంధ్రవికాసానికి కొంత తోడ్పడినదనియే చెప్పవలెను.

వాల్తేరు వసతిగృహములలో తెలుగుజిల్లా లన్నిటినుండి వచ్చిన యువకులు కలసిమెలసి యుండుటచేత అన్యోన్యము కొంత వృద్ధిపొందినవి. వాణిజ్య, పారిశ్రామికశాఖలను నూతనముగా నిర్మించుటచేత అరవలు, కన్నడులు, మళయాళీలు, కనరా, కొచ్చి, తిరువాన్కూరు ప్రదేశముల విద్యార్థులు వాల్తేరువచ్చి ఆంధ్రవిద్యార్థులతో విద్యనేర్చుకున్నారు. ఇట్టి సన్నివేశముచేత మాండలికములగు కళాశాలలలో మెలకలెత్తుటకు అంతగా వీలులేని

ఉన్నతభావములు విశ్వవిద్యాలయ కేంద్రమగు వాల్తేరునందు పొడ చూప నారంభించినవి.

పదార్థవిజ్ఞాన, రసాయన, గణితశాస్త్రములయొక్కా, రాజకీయ, ఆర్థికశాఖలయొక్కా విద్యావిధానములు నూతనముగ ఏర్పాటుచేయబడినవి. బాగా పరిశోధనలుచేసి పేరుగన్న అధ్యాపకులు ఆవిద్యలను గరపుచున్నారు. పరిశోధనాపద్ధతులను విద్యార్థుల కలవడజేయుచున్నారు. ఆంధ్రవిశ్వవిద్యాలయము యొక్క ప్రాశస్త్యమునకు ముఖ్యకారణము ఈ పరిశోధనలను ప్రోత్సహించుటయే. పరిశోధనకై విద్యార్థులకు వేతనములు విరివిగా ఏర్పాటు చేయబడినవి; పరిశోధనచేసే ఉపాధ్యాయులకు శక్త్యనుసారము ఏటేటా ధనము నిచ్చి ఆంధ్రవిశ్వవిద్యాలయము ప్రోత్సహించుచున్నది.

ఈ పరిశోధనాకార్యము క్రమముగా వృద్ధిపొంది దేశాభ్యుదయమునకు మిక్కిలి తోడ్పడుగాక! ఆంధ్రులు విశ్వవిద్యాలయమందు విముఖులుగాక ఇది మాది యను గర్వముతో సర్వవిధముల తోడ్పడుదురుగాక! విశ్వవిద్యాలయాధికారవర్గమువారు దేశనాయకులతోను, ప్రముఖులతోను సంప్రతించుచు వారియొక్క సానుభూతి, సహాయము పొందుదురుగాక! ఆంధ్రవిశ్వవిద్యాలయ నిర్వాహకులు ఆంధ్రులతో క్షీరనీరన్యాయముగా కలసి మెలసి, ఆంధ్రవికాసమునకు, ఆంధ్రోన్నతికి, ఆంధ్రాభ్యుదయమునకు సర్వదా తోడ్పడుదురుగాక! అచిరకాలములోనే యుద్ధము జయప్రదముగా ముగిసి ఆంధ్రవిశ్వవిద్యాలయము యథాస్థానమలంకరించి, నూతనమగు శక్తివికాసములతో ఉత్తరోత్తరాభివృద్ధి పొందుగాక!



# కొన్ని చాటువులు

= శ్రీ కవికొండల వెంకటరావు =

బంధువుల యక్కఱ

అల సుఖమందు వేళలను నక్కఱయుండరు గాని బాంధవుల్,
సిలుగులఁ గుందుచుండు నెడఁ జేరికకున్ జను దేరఁగావలెన్,
సలలిత చైత్రమందున నసహ్యముగాఁ గను లోకబాంధవున్
జలి వణఁకించు కాలమున సౌఖ్యముగూర్పఁగ నుండఁగోరరే?

నీచుల అధికారమదాంధత

గాలిని నింపి బంతి నవకాశముమీఁదికిఁ దన్న, నెత్తిపైఁ
దూలెడు భాతి నీచులను దొడ్డగుణంబుల ప్రోవులంచు సం
శీల జనార్హమైన యల శ్రేష్ఠపదంబుల నిల్పుచున్నఁ, దా
త్కాలిక లభ్యమైన యధికారము సూపుచు విఱ్ఱవీగరే?

సూర్యునిలోని మచ్చలు

ఇనునకుఁ గల్గు మచ్చలను నేర్పరుపన్ దెలియంగరావు, చం
ద్రునకును గల్గు మచ్చ కడుఁ దోఁచుచు నుండెడు నల్లనై- అటుల్
ఘనులకుఁ గల్గు లోపములు కన్పడనేరవుగాని యెంతయున్
గనఁబడు జూవె యల్పులకుఁ గల్గెడు లోపము లంతకంతలై.

పండినచేలు

పొలమును బుష్టిచేసి శ్రమపొందుచు దున్నుచు నాటువేళకున్
జలములు గట్టి మమ్ములను సత్ఫలవంతము సేయు నాకృషీ
వలికి సువర్ణరాసులను భక్తిసమర్పణఁ జేతుమంచునున్
పలికెడు భాతి చేనులు సువర్ణపు వెన్నుల వంగియుండెడిన్.

వృద్ధుల కోపము

ప్రాకటదార్ఢ్యయుక్తమగు ప్రాయము సిల్లినకొద్దిఁ గ్రుద్ధులై
కేకలువెట్టుచున్ బనులు గీఁటుచు నుందురు వృద్ధమానవుల్:
జోకము దప్పి కాలమున శుష్కములై పడిపోవలేక యెం
డాకుల నిల్చి కొమ్మలెకదా రొద మిక్కిలి సేయుచుండెడిన్.




శ్రీ అఘోరవీరభద్రస్వామి

(పక్షితీర్థములోని ఒక శిలాశిల్పమునుండి)

== చిత్రకారుడు : శ్రీ 'మురుగన్' ==



# ఆఫ్రికా రంగంలో

[కథానిక]

= శ్రీ బుర్రా వెంకటసుబ్రహ్మణ్యం =

పోలీసు హెడ్డుకానిస్టేబుపని చేసి రిటైరయి రోణం కిలో మా భూముల వ్యవహారం చూసిపెట్టూ ఉండే మాధవరాయుడి కొడుకు అప్పలస్వామి మిలిటరీ యూనిఫార్ములో లోపలికి వచ్చి, టోపీ తీసి, నాకు నమస్కారం చేసి, "అయ్యా, నన్ను మరచిపోయారా?" అంటే వెంటనే పోలిక పట్టలేకపోయాను. మనిషి నల్ల బడ్డాడు. మీసం తీసేసేడు. ఆ సాయంత్రం చూడలేదు కాని, మొన్నాడు అతను స్నానం చేస్తున్నప్పుడు చూస్తే కుడిచెవి వెనకాతలనుంచి వీపుమధ్యవరకూ సుమారు అంగుళంఅంగుళన్నర వెడల్పున నల్లత్రాచులా పెద్ద మచ్చ. అదేమిటంటే, చచ్చిబతికేనన్నాడు.

చిన్నతనంలో అప్పలస్వామి వాళ్ల నాన్నతో ఎప్పుడూ రోణంకినుంచి మాఊరు వస్తూఉండేవాడు. తొమ్మిది పదేళ్లు వచ్చేసరికి మాఊళ్లో మాతో ఉండిపోయి మాఇంటి పిల్లలతో స్కూలులో చదువుకుంటానని పంతం పట్టి మాఇంట్లో ఉండిపోయాడు. పదేనిమిదేళ్లు మాతోనే ఉన్నాడు. నాలుగోఫారందాకా చదివేడు. ఆ తరువాత చదువుమీాద ఆత్రుత పోయింది. ఇంతట్లో, పోలీసులో ఉద్యోగానికి చూసేవేళకి మాధవరాయుడు చచ్చిపోయాడు. అప్పలస్వామి పెద్దఅన్నగారు సర్కసు పెత్తే అందులో కొన్నేళ్లుండి ఊరూరా తిరిగేవాడు. అయిదారేళ్లు ఆ అన్నగారితోపాటు తనూ పోకిరీగా దేశసంచారం చేసేడు. యుద్ధం వచ్చింది. అప్పలస్వామి వెంటనే సిపాయిగా ప్రవేశించాడు. మొదటి సంవత్సరం అప్పుడప్పుడు కనిపించేవాడు. ఇంకా మన దేశపు పొలిమేరలలోనే ఉన్నానని చెప్పేవాడు. తర్వాత రెండుమూడేళ్ల వరకూ కనపడలేదు. శలవు పుచ్చుకుని ఇదే మళ్లీ రావడం అని చెప్పేడు.

అతను వచ్చిన మొన్నాడు సాయంత్రం మా ఆవిడ "విన్నారా, అప్పలస్వామి దొరసాన్ని పెళ్లిచేసుకున్నాడట"అంది. "వాడి ముఖం! ఎవరు చెప్పేరు?" అంటే, "నౌకరు గురువులు చెప్పే" డంది. చిన్నతనం నుంచీ అప్పలస్వామిని వేధించుకు తినడం గురువులికి అలవాటు. అలా వేధించుకుతింటున్నా గురువులంటే అప్పలస్వామికి అత్యంతమైన అనురాగమూ, గౌరవమూను. గురువులుని పిలిచి అడిగేను. "నిజమే. బాబూ, ఆదొరసానిముండదీ, చిన్నపిల్లాడిదీ కూడా ఫోటోగ్రాఫు పాకటి పెట్లో దాచుకున్నాడు" అన్నాడు గురువులు. "అప్పలస్వామిజీతానికి దొరసానిపెళ్లాం కూడానా?" అంటే "అదేటిబాబూ, అలా అంటారు? అప్పలస్వామికి అన్నీ నేరుస్తే రెండొందలుదాకా ముట్టాయట" అన్నాడు గురువులు.

ఇంతట్లో అప్పలస్వామే హాజరయాడు.

"ఏమిటోయ్, అప్పలస్వామీ, ఎవర్తెనో దొరసాన్ని పెళ్లిచేసుకున్నావట?"అన్నాను.

"దొరసానీ లేదు, పెళ్లీ లేదు బాబూ."

"మరి ఆ ఫోటోగ్రాఫేటి?" అన్నాడు గురువులు.

"ఏదైనా ఫోటో ఉందేమిటోయ్, నీదగ్గర?"

"ఉంది, బాబూ"

తీసుకువచ్చి చూపించాము.

సముద్రపు ఒడ్డున ఒకావిడ చిన్న కుర్రాడిని —పదేళ్ళైనా ఉంటుందో ఉండదో—ఎత్తుకుని అతిహాయిగా నవ్వుతోంది. ఇరవై ఇరవైరె ళ్ళేళ్ళకిపై నుండవు ఆవిడకి. చాలా అందంగా ఉంది.

"ఎవరోయ్, ఇద?"

"నాకూ తెలియాదు, బాబూ. అంటే, సరిగా తెలీదు."

"ఎవరో తెలియకపోతే, నీ చేతి కెలా వచ్చింది?"

"అది తా ఒక పెద్ద కథ బాబూ. మీరు ఓపిక పట్టి వింటానంటే చెప్తాను."

మాధవరాయుడిలాగే ఇతననూను. కథ చెప్తానని కాని, సమాచారం చెప్తానని కాని మొదలుపెట్టే ఒక పట్టున ముగించడు. ఏమైనా చెప్తానంటే భయం.

"ఆవి డెవరో చెప్పమంటే చెప్పక కథ చెప్తానంటావేమిటోయ్?"

"ఆవి డెవరో చెప్పడానికే కథ చెప్పాలి, బాబూ"

"అయితే చెప్పు."

"వినండి మరి....................

* * *

"నేను చెప్పబోయేది ఎక్కడ జరిగిందో, ఎప్పుడు జరిగిందో నిలవేసి అడిగితే సమంగా చెప్పనూలేను; చెప్పనూకూడదు. ఉత్తరాఫ్రికారంగంలో జరిగింది. నేను ఆఫ్రికా వెళ్ళిన కొత్తలో జరిగింది. అప్పటికి నేను మూడునాలుగు నెలలు మాత్రమే ఆఫ్రికాలో ఉన్నాను. ఎడారియుద్ధాలు. అపరిమితమైన ఎండలు సుడిగాలులు. అకస్మాత్తుగా టాలాలకి పటాలాలు ఇసుకలో కప్పబడి పోతే ఎవరికీ తెలియదన్నంత ఇసుకధుమారాలు. తోవా తెన్నూ లేని ప్రయాణాలు. ఒక్కొక్కప్పుడు వేలకు వేలమంది. ఒక్కొక్కప్పుడు నలుగురూ అయిదుగురూను. ఒక్కొక్కప్పుడు ఒక్కరే బయలుదేరడం. ఎడారిలో అన్నిరకాల ప్రయాసలున్నూ. పదిహేను ఇరవైమైళ్ళ దూరంలో జర్మను ఇంజనీర్ల క్యాంపు ఉన్నదనీ, ఆక్యాంపునుంచి బయలుదేరి వాళ్లు మా పటాలాల బాటలలో మైన్లు పాతుతున్నారనీ, వాళ్ల క్యాంపు ఎక్కడుందో చూసినస్తే చాలుననీ, ధైర్యం చాలితేనూ, వాళ్లు తక్కువమంది ఉంటేనూ వాళ్లని హతమార్చమనీ, మైన్లు కనిపిస్తే వాటిని వ్యర్థపరచమనీ మాకు హుకుము. నాలో నలుగురికి నేను చెప్పేగు ఈపని. చీకటిపడ్డాక అందరూ ఒక్కటోవని వెళ్ళినా రర్రే, వేగ వేగా తోవలు తొక్కినానరే ఉన్నారు. వేగవేగా వెళ్తేనే సుఖున్న అనుకున్నాము.

చిన్నప్పుడు చెప్పే కథలలో రాజుగారి కొడుకులు బయలుదేరినట్టు నలుగురం నాలుగుదిక్కులకీ బయలుదేరేము, బాగా చీకటి పడ్డాక. ఒక రోజుకి సరిపోయే తిండీ, నీరూ పుచ్చుకుని బయలుదేరేము.

రెండుమూడుసార్లు నాకు వెలుతురు కనపడడం, దాగిదాగి దానిదగ్గరకు చేరడం, ఒకచోట అది కాలి పోతున్న విమానం అవడం, మరొకచోట జర్మనులు విడిచిపెట్టిపోతూ మంటపెట్టిపోయిన యుద్ధసామగ్రి అవడం సంభవించింది. ఎన్నిమైళ్లు అలా నడిచానో నాకే తెలియదు. అర్ధరాత్రి అయినా ఆకాశంమీద విమానాలహోరు అలాగే ఉంది. ఫిరంగిధ్వనులు ఉండి ఉండి ఎడారిని కంపింపజేస్తూనే వచ్చాయి. తెలతెల వారుతూ ఉండగా ఒక గుడారమూ, లోపల దీపపు వెలుతురూ కనిపించాయి. మనుష్యుల గుసగుసలు వినిపించాయి. గుడారంసమీపంలోనే ఒక చిన్న ఇసుక తిన్నె వెనుక దాగి, తుపాకీనుంచి వేళ్లు తియ్యకుండా చూస్తూ ఉన్నాను. చాలాసేపు ఇలా ఉన్నాను. ఇంతట్లో ఒకడు ఎక్కడనుంచో గుడారంలోకి ప్రవేశిస్తున్నాడు. నగంనగంవెలుతురులో పూర్తిగా కనపడడమైనా లేదు. చటుక్కున అతను తిరిగి నేనున్న వైపుకి వస్తున్నట్టు అనిపించింది నిజంగానే దగ్గర కొస్తున్నాడు. అతని కోటుచేతిమీద హిట్లరుముద్ర కనిపించింది. ఒక్క క్షణంలో తుపాకీ పేల్చాను. కొయ్యలా పడి పోయాడు. నా తుపాకీపేల్పు వినగానే గుడారంలోనుంచి ఇద్దరు పైకొచ్చారు. ఒకడు రివాల్వరు పట్టుకున్నాడు. ఒకడు ఏమీ లేకుండా వచ్చాడు. వాడు రివాల్వరు పట్టుకున్నవాడు మరొకవైపు చూస్తూంటే వాడికి

శవాన్ని చూపిస్తున్నాడు. రివాల్వరు పట్టుకున్న వాడి కేసి తుపాకీ పేల్చేను. తప్పిపోయింది. మళ్లీ తుపాకీ పేల్చేను. రెండవవాడు చచ్చిపోయి పడ్డాడు. నేను లేచి నుంచున్నాను. మిగిలినవాడు రివాల్వరు నాకేసి పెట్టి పేల్చబోతున్నాడు. ఇసుకతిన్నె వెనక్కి తప్పుకున్నాను. హఠాత్తుగా ఇసుకతిన్నెమీద కెక్కి తుపాకీ పేల్చాను. పేలుస్తూనే వాడిమీదకి గెంతేను. రివాల్వరుకూడా పేలింది. నాకుడిచేతికీ, శరీరానికీ మధ్య పేలింది. వాడి మీద పడ్డాను. నా కుడిచెయ్యి అంతా రక్తమయం. అతనికి నాతుపాకీదెబ్బ కడుపులో తగిలినట్టుంది. అతని బనీనంతా రక్తం. నే నతనిమీద వాల్తూనే అతని మెడ నాచేతులలో గట్టిగా పట్టుకున్నాను. అతను కదలలేదు. స్పృహతప్పి పడిఉన్నాడు. మెడ వదిలి అతని గాయమూ, నా గాయమూ పరీక్షచేసేను.

నా కంత దెబ్బ తగలలేదు. రివాల్వరుగుండు చేతికి రాసుకుపోయింది. అత నింకా కదలడం లేదు. అతని బనీను తీసి ఎంత దెబ్బో అని చూసేను. దెబ్బ కడుపులో తగలలేదు. పక్కగా నడుముకి తగిలింది. నేను బ్యాండేజి తీసి నాచేతికి కట్టుకుంటున్నాను. ఇంతట్లో అతను లేచి రెండు చేతులతోనూ నా మెడ పట్టుకున్నాడు. రివాల్వరు అతని కాళ్లపై పుంది. నా మెడ పట్టుకుని లేవబోతున్నాడు. రివాల్వరు తీసుకుని అతని రెండుకాళ్ల పిక్కలమీదా పేల్చేను. నా మెడ మీద పట్టు తగ్గింది. విడిపించుకున్నాను. తిరిగి చూసే సరికి నా మొలలో కత్తి తీసి నన్ను పొడవడానికి ప్రయత్నిస్తున్నాడు. రివాల్వరు వాడి గుండెకి పెట్టి పేల్చబోయాను. కత్తి అవతల పారేసి రెండు చేతులూ పైకెత్తేసేడు.

మనిషిముఖంకేసి ఇప్పుడు చూసేను. ముప్పై ఏళ్లుంటాయేమో. మంచి కళాకాంతు లున్న ముఖం.

రివాల్వరూ, కత్తీ, తుపాకీ అన్నీ తీసి దూరంగా పెట్టేను. కాళ్ల పిక్కలమీద తగిలిన గుండుదెబ్బలతో ఇక నతను కదలలేడని నాకు తెలుసును. నాచేతి బ్యాండేజి సరిగ్గా కట్టుకున్నాక, అతని నడుముమీది గాయం నీళ్లతో కడిగి, మందు పోసి, బ్యాండేజి కట్టేను. నడుముచుట్టూ తిప్పేసరికి నాదగ్గర బ్యాండేజి గుడ్డ అయిపోయింది. అతని కాళ్లకి అతని బనీనే చింపి బ్యాండేజి కట్టేను. అంతసేపూ నాకేసి తీక్షణంగా చూస్తున్నాడు. అంతా అయాక లేచికూర్చునేందుకు ప్రయత్నం చేసేడు. నడుముకి ఉన్న బ్యాండేజీతో కూర్చోలేకపోయా డు.

ఒక్క చేతిమీద ఒక్క క్షణం ఆనుకుని ఎక్కడ లేని ఆగ్రహంతోనూ ముఖం చెదిరిపోతూ, చటుక్కున నాముఖంమీద ఉమ్మేడు.

నేను తుడిచేసుకున్నాను.

కోపంతో అతని ముఖం కందిపోతోంది. కోపంతోనూ, దుఃఖంతోనూ!

నీళ్ల బుడ్డికేసి చూపిస్తూ నీళ్లు కావాలని సంజ్ఞ చేసేడు. ఎడారిలో తిండైనా లేకుండా ఉండగలంకాని నీళ్లు లేకుండా ఉండలేము. నీళ్లే ప్రాణం. ఒక్కొక్కరికి రోజుకి ఇన్ని గ్లాసుల నీళ్లని నియమం.

తాగడానికి నీళ్లిచ్చాను. నీళ్లు తాగి కళ్లు మూసుకున్నాడు. ఎత్తుకుని గుడారంలోకి తీసుకువెళ్లేను. నామెడచుట్టూ చేతులు కట్టుకున్నాడు. గుడారంలో పెద్దపెద్ద గుండ్లూ, ఇతరసామగ్రీ కనిపించాయి. అందులో సాధారణంగా మేము రోడ్లలో తవ్వితే కనపడే మైన్లలాకూడా కనిపించాయి కొన్ని. ఇది జర్మను ఇంజనీర్ల క్యాంపే అయియుండాలని నిశ్చయించుకున్నాను. కాని ఈ మనిషిని లోపల పడుకోపెడ్తే ఏమి అల్లరి చేస్తాడో అని భయపడి మళ్లీ అతన్ని పైకి తీసుకువచ్చి, పడక పైకి తెచ్చి అతన్ని దానిమీద పడుకోపెట్టేను.

శవాలకి గొయ్యిలుతీసి పక్కగా పాతిపెట్టేను. గుడారంలోపలికి వెళ్లి ఈసారి పరీక్షగా చూసేను. అక్కడున్న సామగ్రీ, తంతూ చూస్తే మైన్లు రిపేరు చేస్తున్నట్టు అనిపించింది. ఒకమూల ఒక రేడియో సెట్టుంది. పదిపన్నెండు పెట్రోలుతో నిండిన టిన్నులున్నాయి. రెండు తవ్వి పైకితీసి విప్పేసిన పాత మైన్లలా ఉన్నాయి. వీటి రెండిటినైనా కాల్చేసి నిరుపయోగకరంగా చెయ్యాలని నిశ్చయించుకున్నాను. దూరంగా ఒక గొయ్యి తీసి వీటిని

అందులో పాతి పెట్రోలు పోసి అంటించాలి. గునపం లాంటిది ఆసామగ్రిలో కనిపిస్తే దాన్ని పట్టుకుని వెళ్లేను. అతను నాకేసి ఒకటే ధోరణిగా చూస్తున్నాడు. కొంతదూరం నడిచేసరికి అక్కడికి కొంత దూరంలో ఎడారిలో చిన్న చెరువు తవ్వినట్టు నాలుగు గట్లు కనిపించాయి వెళ్లి చూసేను. కాన్వాసుగుడ్డ కప్పిఉంది. క్రింద ఆప్రదేశంనిండా మైన్లు. ఒకదానిమీదొకటి, ఒకదానిమీదొకటీను. చక్కగా పేర్చబడి ఉన్నాయి. ఏమి చెయ్యడమా అని ఆలోచించి, గుడారంలో ఉన్న రెండు పాత మైన్లనీకూడా వాటితో చేర్చి, పెట్రోలుటిన్నులు తెరిచి వాటిమధ్య పేర్చేను. ఒక పెట్రోలుటిన్ను అంటించి పరుగెత్తుకువచ్చేసేను. ఘోరమైన మంటలున్నూ, పగులుతున్న ధ్వనులూను! చటుక్కున ధ్వనులు హెచ్చేయి. బాంబులు పడుతున్న ట్టనిపించింది. నుంచున్నవాడిని గుడారంబైరని నేలకు జేరి పడుకున్నాను. కాసేపటికి అతన్నికూడా తెచ్చి అక్కడ పడుకోపెట్టేను. ఉండిఉండి ఫిరంగులు పేలినట్టు చప్పుడు. మంటలూ! ఎర్రగా కాల్తున్న ఇనుపముక్కలు మాదగ్గరలోకూడా వచ్చిపడ్డాయి. నే నింకా ఏమిటో ఆలోచిస్తున్నాను. ఇంతట్లో అతను ఎలాగో పాకి గుడారంలోకి తల పెట్టి రేడియోసెట్టుతో ఏదో చేస్తున్నాడు. తెలివితక్కువగా చూస్తూ ఊరుకున్నాను. అతను ఏదో మాట్లాడడం మొదలుపెట్టేడు. అప్పటికి బోధపడింది నాకు అతను ఎవడితోనో రేడియోసెట్టుతో మాట్లాడుతున్నా డని. చటుక్కున వెళ్లి రేడియోసెట్టుమీద గునపంపోటు వేసేను. సెట్టు బద్దలయి ఊరుకుంది. నన్ను జర్మనుభాషలో తిట్టడం మొదలుపెట్టేడు. ఇంగ్లీషులో 'యు, నిగ్గర్' అని రెండుమూడుసార్లు అరిచాడు. నేను మాట్లాడలేదు. జోళ్లు తీసి నాకేసి విసిరేడు. నేను పక్కకి ఒరిగి తప్పించుకున్నాను. చేతితో ఇసుక తీసి నామీద కొట్టడం మొదలుపెట్టేడు.

నన్ను'నిగ్గర్' అని తిట్టినతర్వాత, నాబదులు ఒక ఇంగ్లీషుసోల్జరే ఇతన్ని పట్టుకున్నట్టయితే ఇతను ఈవిధంగా ఇంత క్రూరతనంగానూ ప్రవర్తించియుండునా అన్న సందేహం నాకు కలిగింది. ఇంగ్లీషువాడే నాబదులు ఇక్కడుండుంటే ఇత నిలా మీద ఉమ్మితుంటేనూ, కసురుతుంటేనూ, జోళ్లు విసురుతుంటేనూ నాఅంత నెమ్మదిగానూ ఊరుకుండిఉండునా అనికూడా ఆలోచించాను. మా పటాలంలో నాఅంత కోపిష్ఠి లేడని నాకు ప్రఖ్యాతి. ఎదురుమాటంటే సమయం చూసుకుని ఎముకలు చితక్కొట్టే నన్నమాటే. నన్ను చూస్తే తోటివాళ్లందరికీ భయం. అటువంటిది ఇతని ప్రవర్తన చూసికూడా పిల్లిలా ఊరుకోడం మన దేశంలో తెల్లతోలంటే ఉన్న భయభక్తులు ఇతని తెల్లతోలు చూడగానే కూడా రేగడంవల్లనే. ఒకవిధంగా నా మెత్తతనం చూస్తే నాకు సిగ్గేసింది. కాని, అలవాటయిన హీనత్వమూ, అలవాటయిన సిగ్గూను. మొదట్లో తెల్లతోలున్న జర్మనువాడిని చంపడం అంటే ఏమిటో తప్పులా అనిపించేది, ఎంత అర్థం చేసుకున్నా ఎంత చంపాలని ఉన్నాకూడా. ఎదురుగుండా జపానువాడో, మరొకడో ఉంటే అదొక తీరు; తెల్లతోలు వాడిని చంపడం ఒకతీరు. అందులో నాకు కొత్త. రానురాను ఇటలీలో యుద్ధం జరుపుతున్నప్పుడు నాకూ కొత్త తీరి, తెల్లతోలంటే భయభక్తు లణిగాయి. ఇప్పటి కింకా వేరు.

అతనికికూడా అదే కష్టం తోచిం దనుకుంటాను. తెల్లవాడు తెల్లవాడికి చిక్కడం బదులు ఏ అడవి జాతివాడికో చిక్కిన ట్టనిపించిందికాబోలు. రానురాను వాళ్లకీ అలవాటయింది మన సిపాయిలకి లోబడడం.

నేను మళ్లీ బయలుదేరి వెళ్లిపోయేవేళయింది. నాపని జరిగింది. నే నింక ఉండవలసిన కారణం లేదు. ఈ పదిపదిహేనుమైళ్లూ ఇతన్ని మోసుకువెళ్లలేను. నేను వెళ్లి పైఅధికారికి బోధపరచి ఏమైనా చెయ్యవలసినదే. ఇతన్ని ఈస్థితిలో వదిలిపెట్టి వెళ్లవలసినదేనా అని ఆలోచించాను. గుడారంలో వెతికితే నాలుగైదు బిస్కట్లుమాత్రం ఉన్నాయి. మూడు నీళ్లబుడ్లలోనూ కలిపితే ఒక గ్లాసుడు మంచినీళ్లు పూర్తిగా లేవు. ఆ బిస్కట్లూ, మంచినీళ్లూ అతని దగ్గర తెచ్చిపెట్టేను. తిన్నాడు. నాకు బిస్కటొకటి ఇద్దామన్న ఆలోచనైనా అతనికి కలగలేదు. అసలు ఇంకా ఆకలిగా ఉందికాబోలు. పోయిన రక్తంవల్ల మరీ

నీరసించి ఉన్నాడు. నాదగ్గరున్న మాంసంముక్కలూ, రొట్టే తీసి ఇచ్చాను. ఒక్క రొట్టెముక్కమాత్రం నేను తీసుకుని తిని కాసిని మంచినీళ్లు తాగేను.

అతన్ని తీసుకువెళ్లి గుడారంలో పడుకోపెట్టేను. ఎండ హెచ్చిపోతోంది.

అతని నడుముకి కట్టిన బ్యాండేజి రక్తంతో తడిముద్ద అయిపోయి జారిపోతోంది. గాయానికి ఇసుక చేరిందేమోకూడా. బ్యాండేజి విప్పేను. గాయంలో ఇసుక కనపడింది. గాయాన్ని గుడ్డతో తుడుస్తున్నాను. బాధపెట్టిందిలా వుంది. నాచేతుల్ని కసిరినట్టు తోసేసేడు. మళ్లీ తుడవడం మొదలుపెట్టేను. మళ్లీ నా చేతులని తోసెయ్యబోతే పిడికిటితో అతని చేతుల్ని విరక్కొట్టేటంత పని చేసి ఒక చేతితో అతని మెడనీ, చేతుల్నీకూడా నొక్కిఉంచాను. రెండోచేతితో శుభ్రంగా తుడిచి మందు రాసి దూది పెట్టి మళ్లీ బ్యాండేజి కట్టేను.

అంతా అయి నేను లేచేను. అతను ఎందుకో చటుక్కున చంటిపిల్లాడిలా ఏడవడం మొదలుపెట్టేడు. అతనికేసి పరీక్షగానైనా చూడలేదు నేను. నా సామానంతా సర్దుకుని, నేను వెళ్తున్నానని సంజ్ఞ చేసేను. లేచి కూర్చుని,తనుకూడా నాతో వస్తానన్నట్టు సంజ్ఞ చేసేడు. జాలిగా నాకేసి చూస్తున్నాడు. మళ్లీ వచ్చి అతన్ని తీసుకు వెళ్తానని సంజ్ఞ చేసేను. మళ్లీ లేచి కూర్చుని తను కూడా నాతో వస్తానన్నట్టు సంజ్ఞ చేసేడు. వద్దన్నాను. నుంచోబోయాడు. పడతాడేమోనని వెళ్లి నేను పట్టుకున్నాను. నుంచోలేకపోయాడు. ఇతన్ని మళ్లీ తీసుకు వెళ్లేందుకు ఎవరైనా వచ్చేవరకూ ఇతనికి తాగేందుకు నీళ్లుండవని జ్ఞాపకం వచ్చింది. అతన్ని పడుకోబెట్టి, నా నీళ్లబుడ్డిలో రెండు గుక్కలకిమాత్రం సరిపోయే నీళ్లుంచుకుని మిగిలిన నీళ్లు అతని నీళ్లబుడ్డిలో పోసి అతని కిచ్చాను. ఇస్తుంటే నా రెండు చేతులూ అతని రెండుచేతులలోనూ పట్టుకున్నాడు. ముద్దుపెట్టుకుంటున్నట్టు తన తల నా చేతులమీద ఆన్చేడు. నేను చేతులు విడిపించుకుని, వెళ్తున్నానని మళ్లీ సంజ్ఞచేసేను.

ఉండమని సంజ్ఞచేసి, తన నగిషీసిగరెట్టుకేసులో సిగరెట్లన్నీ తీసేసి, కేసు నాకిచ్చాడు. సిగరెట్లు పెట్టి ఇమ్మంటున్నాడేమో అనుకుని నాదగ్గర సిగరెట్లు అట్టే లేవని సంజ్ఞచేసేను. కాదుకాదనీ, సిగరెట్టుకేసు నా కిచ్చేస్తున్నాననీ సంజ్ఞచేసి నాజేబులో పెట్టబోయాడు. నా కొద్దన్నాను. ఆ సిగరెట్టుకేసులోనుంచి తీసిన ఒక ఫోటో అతని చేతిలోఉంది. పోనీ, ఆఫోటో తీసుకో మన్నాడు. ఇదే ఫోటో. అతని భార్యా, పిల్లాడూ అనుకుంటాను. అతని చేతిలోనుంచి ఫోటో తీసుకుని కాసేపు చూసేను. పంట్లాంజేబులోంచి అదే ఫోటో మరొక కాపీ తీసి చూపించాడు. తన భార్యా, పిల్లాడూ అని చెప్పడానికికాబోలు అందులో ఇద్దరినీ నాకేసి చూస్తూ ముద్దుపెట్టుకున్నాడు. ఆ కాపీ తనకనీ, ఈకాపీ నే నుంచుకోవాలనీ సంజ్ఞచేసేడు. ఈఫోటో నాకివ్వడం చాలా అసందర్భం అని నా కనిపించింది. వద్దని ఇచ్చేసేను. అయితే సిగరెట్టుకేసు తీసుకోవాలని దాన్ని నా కివ్వబోయాడు. జ్ఞాపకార్థమై ఏదో ఇవ్వాలని అతను నిశ్చయించుకున్నాడు. సిగరెట్టుకేసు చాలా నగిషీపనిఉన్న సిగరెట్టుకేసు. చాలా ఖరీదైఉండాలి. పోనీ, అతనికి నా సిగరెట్టుకేసు ఇచ్చి అతనిది నేను పుచ్చుకుందామంటే నాకు సిగరెట్టుకేసు లేదు. సిగరెట్టుకేసు అతనికి ఎప్పుడూ కావలసినది.

సిగరెట్టుకేసు వద్దన్నాను. ఫోటో జేబులో పెట్టేడు. ఇకను లాభం లేదనుకుని ఊరుకున్నాను.

నాలుగైదు గంటలు ఎడారిలో ఎండి పటాలం ఉన్న ప్రాంతాలకి చేరుకున్నాను. అన్ని సంగతులూ చెప్పేను. ఒక లారీలో సాయంత్రం బయలుదేరి జర్మనుఇంజనీర్ల క్యాంపు చేరుకున్నాము. గుడారం పీకేసేరు. జర్మనులు వచ్చి అతన్ని రక్షించుకుపోయిన ట్టుంది. అత నెక్కడా లేడు. తీసుకువెళ్లినవాళ్లకి మైన్లని పేల్చిన గుంట చూపించాను.

ఫోటోమాత్రం వాళ్లకి చూపించలేదు. ఎవరికీ చూపించలేదు. చూపించడానికి సిగ్గువల్ల . ఎవరికీ చూపించలేదు. అతని పెళ్లాంఫోటో నాదగ్గరుండడం చాలా అసందర్భం. గురువులు నాకు తెలియకుండా పెట్టె తెరిచి చూసేసే డీవాళ."

* * *

"ఆ జర్మనుఇంజినీరుపేరేమిటి ?" అని అడిగేను.

"నేను కనుక్కోలేదు బాబూ. భాష తెలియదుకా. ఫోటోక్రిందసంతకం చిన్న అక్షరాలున్నాయి చూసేరో లేదో! 'ఫ్రీడాఓబర్మాన్, బర్లీన్, జనవరి 1940'అని. ఆవిడపేరయిఉంటుంది." అన్నాడు అప్పలస్వామి.

పిల్లాడూ, ఆవిడా అయినా ఖులాసాగా ఉన్నారో లేదో అనుకున్నాను, బర్లీనుపై విమానదాడులను గురించి ఆలోచిస్తూ.

---

(2)



కుబేరుడో, అలాంటి ఒక యక్షుడో



అదే విగ్రహమే - వీపువైపు దృశ్యము



చంకలో శిశుపుత్రోనున్న హారీతి



# తుక్కుముక్కల హక్కుచిక్కు

= శ్రీ భమిడిపాటి కామేశ్వరరావు =

మా నవరసపురంలోకల్లా మా సమాజం నమోనా జ్ఞానదీపం. దీన్లో అల్పు లుండరని తెలియడానికి దీన్ని అతీతాంధ్ర సమాజం అన్నారు. ఇందులో ప్రతీసభ్యుడూ విద్యలో అయితేమి, లేక బేవిద్యలో అయితేమి, ఉద్దండుడే. నిర్వాహకవర్గంలో పని వీలుకోసం తొమ్మండుగురినే ఉంచారు. వీళ్లంతా పిడుగులే. అధ్యక్షుడూ, ఉపాధ్యక్షుడూ, అతిజన, మహాజన, తర్జన, భర్జన, గోరోజన, నిరంజనులూ-అన్నట్టు నేనూనూ! తమదగ్గిర అబద్ధం ఎందుకు, కార్యదర్శిని నేనే! మంత్రిత్వం నాదే- చెప్పకపోడమే! అయ్యా! మాతొమ్మండుగుర్నీ నవనిధులన్నా, నవగ్రహాలన్నా కుడా లోపమే గాని పాపం లేదు, ఏమనుకున్నారో! విలాసం, వినోదం, కాలక్షేపం, ఆటలూ, ఆగగింపూ, భోగమూ ఇవిమాత్రం వినయపూర్వకంగా సమాజాదర్శాలుగా పెట్టుగుని, ఇవి సాధించుగోడంలో అవుతూండే ఖర్చుకి ఎంతమాత్రమూ వెనుతియ్యని యథాశక్తిస్వార్థత్యాగం చేస్తూ, చుట్టుపట్ల ఉండే ఆంధ్రమూర్ఖుల్ని (మాసమాజంలో సభ్యులు కానటువంటి ఏకొన్నిరకాలోతప్ప తక్కిన అందర్నీ అన్నమాట!) జ్ఞానవంతుల్నిగా చెయ్యడానికి అంతా కంకణం కడితేగాని లాభం ఉండదని ఉరమగలవాళ్లచేత ఉపన్యాసా లిప్పించడంలో మా దేశసేవ ప్రకటించుగుంటూ, మేం తంటాలుపడుతూంటాము. గతించిన వార్షికోత్సవానికి సమావేశం జరపడానికి మేం చేసిన ఆలోచనా, పడ్డ పాట్లూ, అర్హుల్ని సమ్మానంచెయ్యడానికి (—ఇది సమ్మానయుగం అన్నారు పెద్దలు!) మేం వెచ్చించిన బుద్ధీ, 'జయప్రదం'గా (అనగా మరొళ్లకి ఇంకొళ్లకీ జయం ప్రసాదించేరకంగా) సమావేశం జరిగిన వార్త ప్రకటనచెయ్యడంలో మేం పడ్డ జాగర్తా, అయినాసరే చివరకి మాకొచ్చిన నిష్ఠూర్యమూ, ఈసంగతులు కొంచెం మనవిచేస్తాను! గమనించి న్యాయం విచారించండి. పుణ్యానికి పోతే పాపం ఎదురవడం అన్నా, డబ్బెట్టి తద్దినం కొనుక్కోడం అన్నా, ఏడిచిపోతా డని అనర్హుడికి చేసిన సత్కారణం తస్కారణంగా పరిణమించడమన్నా, ఇదవునో కాదో చిత్తగించండి!

వార్షికోత్సవదినం వారంరోజు లుందనగా ప్రణాళికాలోచనసరించి వాహకులం సమావేశం అయినాం. తర్జనభర్జనులుతప్ప తక్కిన ఏడుగురూ హాజరయారు. అధ్యక్షుడే కుర్చీ 'తీసుకున్నారు.' దీర్ఘచర్చ నడిచింది. ప్రతీతభిసీలూ సమగ్రంగా తలపోశాం. శక్తీ, సామర్థ్యమూ కొలుచుగున్నాం. వీలూ సాలూ గుర్తించుగున్నాం. అగమ్యాలకీ అసాధ్యాలకీ నీళ్లు వొదులుకున్నాం.

అ—వార్షికోత్సవం వచ్చే ఆదివారః పీలేమో!

గో—అసలు వచ్చే శుక్రవారం గావునుగా, ఆరోజే పెట్టండి.

నే—శుక్రవారం అయితే అంతా రారు - బహిరంగసభకి!

గో—అంతా ఎవరూ? అసలు బహిరంగసభ ఎందుకూ అని నా ప్రశ్న.

ఉ—సరిసరి. మన సంస్థ వెల్లడి నిమిత్తం సభ చేసుగోవద్దూ! ఘోషణ అనేది ఈ రోజుల్లో ఎంతేనా అవసరం. ఘోషణవల్లే పోషణ జరగడం!

మ—మనకి ఘోషణ ఎందుకూ?

ఉ—మనం చేస్తూండే దేశసేవ మూర్ఖజనానికికూడా బోధపడగలందులకు.

గో—మన పన్లవల్ల తెలుస్తూనే ఉంటుంది కదా?

అ—నిశ్చయంగా! ఆపన్లన్నీ తిన్నగా తెలియనివాళ్లలో కూడా ప్రచారం చేసి ప్రచలనం కలిగిస్తే ప్రశస్తం కదా!

గో—తెలిసేటట్టు ఒక్క డప్పు వెయిస్తే చాలేమో, టూకీగా వదుల్తుంది!

అ—డప్పు మరీ కఠోరంగా ఉంటుంది. బహిరంగసభే నాజూకైరకమైన డప్పు.

ని—జనానికోసం చేసినపన్లు జనానికి తెలియకుండా ఎల్లా ఉంటాయియా? తప్పు ఏమనీ?

అ—అబ్బ, కొన్నికొన్ని ఉండవచ్చునండీ! అల్లాంటా శేమిటీ! మనం అంతా ఈసమాజం ఉద్యోగపదవుల్లో ఉండటమూ, వ్యవహరిస్తూండటమూ ఇవంతా ప్రజాబాహుళ్యంలో ప్రకటన కావటం అనేది మనకి ఉత్తరోత్తరా శ్రేయస్కరం అవునంటారా, కాదంటారా?

ని—అయితే కావచ్చు కాని మనం జనానికి చేసిందేముందీ?

అ—ఈ దార్ని వెళ్లే గొప్పగొప్ప వక్తల్నీ, కవుల్నీ ఆపి, గంభీరోపన్యాసా లిప్పించలేదా, కావ్యపఠనాలు చెయించలేదా!

ని—ఇప్పించాం, చెయించాం! మనం చేసిం దేముందీ?

అ—ఓయి వెర్రివాడా, అప్పుడు మన పేరు ఎంతమందికి తెలిసిందయ్యా మరీ! మనయాజమాన్యంకింద అవన్నీ జరగనివ్వ డంలో మనం ఎంత ఔదార్యం కనపరిచామో, చూడవేమయ్యా? మన ఆసరా లేకపోతే ఆ ఉపన్యాసపు ముక్కలూ పద్యం ముక్కలూ ఎవ్వడేనా మూమాస్తాడా? అయ్యా, బహిరంగసభ తప్పకుండా ఉండాలి. ఓటుకి పెట్టమంటారా?

ని—అవసరం లేదంటూన్నది నేనొక్కణ్నేగా! ఓ టెందు కూ? మీదే జయం.

అ—ఇది స్థిరపడ్డది గనక, మరి అధ్యక్షుడు ఎవరూ అనేది ఆలోచించుదాం. ఆంగ్లభాషలో ఉన్న "పలితకేశాల్ని మన్నన చెయ్యవలెను" అనే సామెతని బట్టి, ఒకసారి ఒక తాతని పిలిచాం! ఆయన మన్నిగురించి వణుకుతూ ఒకటోరకంగా పొగిడినా, జనం వినిపించుగోక గోలగానే ఉండిపోయారు. మనకి ఏదేనా విరాళం ఇవ్వకపోతాడా అనుకుని మరోసారి ఒక ధనికుణ్ని అధ్యక్షుడుగా తెస్తే అతగాడు ప్రయాణంఖర్చుకూడా మనదగ్గిర వసూలుచేసుకు పోయాడేగాని గవ్వేనా మనకి రాల్చలేదు. ఇంకోసారి, ఎదురుకోలు సన్మానానికి రెండుమూడువందలుకూడా తగలేసి, ఒక మహాధికార్ని పిలవగా, వాడు మన సమాజానికి సెంటుభూమేనా రుద్రభూముల పక్కనేనా మంజూరుచెయ్యలేదు. వేరే ఒకసారి, ఒక పండితుణ్ణి పిలవగా, ఆఘటం మన్నీ ఊర్నీ కలియగట్టి పాడలతిట్టి, ఎవణ్ణీ నోరెత్తకుండా నొక్కేసి, చక్కా పోయాడాయిరి. అందుకని, మనం ఈవిషయం బాగా ఆలోచించాలి.

ని—అన్ని అధ్యక్షులక్షణాలూ మీలోనే ఉన్నాయిగనక, మీరే అంతరంగంలో ఉన్నట్టే బహిరంగంలోకూడా అధ్యక్షుడుగా ఉండరాదూ, అపూటా?

అ—మీరు ఇష్టులుగనక అల్లా అన్నారు. కాని బాగుం టుందా మరీ! లోకానికి వెరవద్దూ?

ని—మూర్ఖలోకానికి జ్ఞానబృందం వెరవవలసినపనేమిటీ?

గో—పోనీ, మన సమావేశ అధ్యక్షపదవికి - ప్రజ్ఞలూ, బిరుదులూ, యోగ్యతాపత్రాలూ గుదిగుచ్చి అభ్యర్థుల్ని దర ఖాస్తులు పంపుగోమంటే బాగుంటుంది. చిన్న దరఖాస్తుఫీజుకూడా పెట్టచ్చు.

అ—మీరు వికటంగా మాట్లాడకండి.

గో—నే నల్లా మాట్లాడవలసిన పరిస్థితులు మీరు కల్పించ కండి-క్షమించి!

అ—ఇప్పుడు విషయం ఏమిటంటే, బహిరంగసభా ధ్యక్షుణ్నిగా ఎవర్ని పిలిస్తే మనకి లాభమూ అని!

గో—అదేనండి నే చెబుతూన్నదీనూ!

నే—నాదొక మనవి. మన్ని ఏకకుండా, ఉభయఖర్చులూ అతడే పెట్టుకుని, గొప్ప ప్రభుత్వోద్యోగంలో వెనక ఉండడంచేత ఘాటుగా విమర్శించడం మానుకుని, ఇప్పుడు విరమణంలో ఉన్న వారిని వెతికి, రాసి, ఒప్పించి, మీతో చెబుతాను. పేరు వొదిలి పెట్టి తీర్మానం రాయండి.

అ—సరి. మరి కార్యక్రమం నిర్ణయిద్దాం.

మ—సమావేశానికి 'ఓపెనరు'కూడా ఉండద్దూ?

అ—అంత అవసరం లేదండి.

మ—అదేమిటండీ అల్లా సెలవిస్తారూ! 'ఓపెనరు' మామూలు సోడాబుడ్డికే అవసరం అయినప్పుడు, సమావేశానికి అవసరం కాకపోడమేమిటీ!

అ—ఈమధ్య అదో ఫాషన్ అయినా, లేకుండాకూడా బోలెడు సభలు జరిగాయి. మీరు ఊరుకుందురూ! అధ్యక్షుడు దొరకడమే దుర్ఘటం అవుతూంటే, మరోఘటంకూడా దొరుకు తాడు ఓపెనరుగా!

మ—అల్లాయితే సరే, పోనీ కొట్టెయ్యండి, ఎల్లానో అల్లా!

అ—ఊహూ కార్యక్రమానికేనా ఏముందీ! నిరుటి కార్యక్రమం దగ్గిర పెట్టుగోడమున్నూ, అప్పటి అసందర్భప్రమే యాలు ఏమన్నా వుంటే విసర్జించి తాజావి ఏమన్నా అవసరం అయితే తగిలించి గ్రంథం నడపడమున్నూ.

ఇంతలో అర్జెంటుగా "నలుగురు రాజుల" దగ్గిర్నించి అధ్య క్షుడుకి ఆహ్వానం రాగా అయనా, సంభాషణలో ఎన్నడూ పాల్గొనక కాఫీమాత్రం గొంటూండే అతిజనుడూ వెళ్లిపోయారు. తక్కిన అయిదుగురం ఉన్నాం. 'కోరం' రెండే! చాలా త్వరగా సమాజకృత్యాలు నెరవేరడానికి 'కోరం' ఒకటిగా ఉంటేనే నయం అనేటువంటి తీర్మానం ఒకటి గోకించడానికి నేను మొదట

పట్టడదాం అనుకుని, అధ్యక్షుడు తను అనవసరం అయిపోయా నని ఇదవుతాడేమో అని మళ్లీ అనుకుని ప్రతివాదన ఉపసంహరించుగుని 'క్షౌరం' రెండుగా లోగడ నిర్ణయింపించాను. అధ్యక్షుడు వెళ్లి పోడంతోటే ఉపాధ్యక్షుడు కుర్చీ అలంకరించాడు—ఇంతమొహం చేసుగుని!

ఉ—సరే. గబగబా చూడండి. మొదట ప్రార్థన. 'జన గణమన......'

ని—తెలుగువాళ్ల ప్రార్థనగా మరోటి ఉంటే నయమేమో!

గో—లక్ష ఉన్నాయి. ఉంటేం, తెలుగువాళ్లందరికీ భర్జిం చేది తెలుగుతో నిమిత్తంలేనిదే అనే సిద్ధాంతం మనం మరిచి పోకూడదు.

ఉ—పోనిస్తురూ, నిరుడుండేదిగా, అదే కానిత్తాం. అయి ద్దానికీ కాద్దానికీ మార్పెందుకూ?

ని—పోనీ, ఎక్కడేనా అందులో 'ఆంధ్ర' రానీండి. వ్యక్తుల్ని బట్టిగదా సంఘం!

నే—అబ్బ! సంఘంకోసం వ్యక్తి పోతేమండీ? అదీకాక, పాడేవాళ్లకి ఇప్పుడు కొత్త అలవాటు ఎల్లా అవుతుందీ! బాగా పాడితే ముక్కలు ఎవైతేం?

ఉ—అది సరి. అల్లానే ఉంచుదాం. తరవాత అధ్యక్ష ప్రారంభోపన్యాసం. సరే. పిదప కార్యదర్శినివేదిక.

నే—సరే, తయారుచేస్తాను.

ని—తెలుగులోనేనాండి?

నే—సరిసరి. మనం తెలుగువాళ్లమని అమోఘనిదర్శనంగా ఉండడానికోసమేనా అది ఆంగ్లంలో ఉండడం కర్తవ్యం కదండీ! అప్పుడుగాని నివేదికకి తగ్గ దర్జా, తగ్గ గాంభీర్యమూ ఉండవ్-అని మీరే అంటారు రేపు.

ని—మూర్ఖజనానికి తెలియద్దూ!

నే—ఒఖ్ఖముక్క తెలియకూడదు.

ని—మరి సభ ఎందుకూ?

నే—ఇందులో ఏదో ఉందిరోయ్ అని మూర్ఖులు భయపడే టట్టు భావ ఉన్నప్పుడే మూర్ఖులు దణ్ణంపెట్టి ఒప్పుగునేది, తెలుసా! అందుకని, ఇంగ్లీషుని వేదిక ప్రశస్తం. సంస్కృతనివేదిక కూడా పనిజరుగుతుందిగాని ఇప్పుడు కష్టం. తేటతెలుగుని మూడు ముక్కల్లో సంగతి ఇదీ అని చెప్పండి, 'చీత్, ఇదిట్రా' అంటాడు సభ కొచ్చిన ప్రతిమూర్ఖుడూనూ!

ని—అయితే మన సంగతి వెల్లడవడం ఎల్లా?

నే—మన సంగతియొక్క వయినాలు వెల్లడవవుకాని మన సంగతి ఏదో గభీరమైంది ఉందని వెల్లడవుతుందిగా!

ని—చిత్తం. మీయిష్టం. నివేదిక యావత్తూ పనిహేసునిమి షాల్లో అయిపోతుందా!

నే—ఇంగ్లీషులో పది నిముషాలే చాలు—నా ఇంగ్లీషు లమకి చెప్పాలా!

ని—తరవాత సభ ముగియచ్చుగా, మరేముంటుందీ!

నే—ముగియచ్చు. కాని కార్యక్రమం ఇంతే అయితే జనం దండిగా రారు. అసలే రారేమో!

ని—అనేక అనవసర జనం ఎందుకూ రావడం? ఇష్టులు వస్తారు. చాలదా?

నే—బహిరంగసభ అని పేరెట్టినా, ఆంతరంగికులుమాత్రమే అక్కడికి వచ్చి, ఆ వచ్చినవాళ్లుకూడా చెప్పుల్లో కాళ్లెట్టుగుని కూచుంటే, అధ్యక్షుడు నీళ్లుకారిపోతాడు, సభ 'జయప్రదం'గా అయిందని పత్రికకి పంపడానికేనా వీలుండదు.

మ—ఏదో ఆకర్షణ ఉంటేగాని అంతా రారు. బాలా దిగా అంతా వస్తేనే శోభ. లేకపోతే దాగుడుమూచ్చీ లాడినట్టుం టుంది.

ని—'అందరూ విచ్చేయప్రార్థితులు' అందాం.

మ—అన్నా సరే రారు. వచ్చినవాళ్లుకూడా, అధ్యక్షుడు ఎల్లా ఉంటాడో చూసేసి, పలుపుల్తో కట్టిపెట్టినాసరే ఆక్కుండా తెంపుగుని పారిపోతారు.

ని—'జనం' అంటే మీ ఉద్దేశం ఏమిటి?

నే—ఉద్యోగులూ, ఆంగ్లోపాసకులూ, విద్యార్థులూ, విద్యా ర్థినులూ, పిల్లలూ తల్లులూ, కుంకుమమ్మలూ బోడెమ్మలూ-వీరూ బస్తీలలో సభాజనం! ఆంగ్లశూన్యులు విస్తారం పల్లెలలో సోద్యం చూడొచ్చే జనం!

ని—వీరందరినీ మన భవనావరణలోకి ఆకర్షించే నిమిత్తం మనకి నిమిత్తంలేని కార్యక్రమం ఇంకా ఉండాలంటారా?

నే—ముఖ్యంగా ఉండాలి!

ని—మన వ్యవహారాలు చూసుగోడానికీ, మన బాధ్యతలు ఎంతవరకు నిర్వహించామో నివేదించడానికీ వీరందర్నీ పోగు చెయ్యడం ఎందుకూ? పెద్దలు నలుగురు చాలరూ?

నే—మీకు ఆంధ్రాభిమానం లేనట్టుందే! అడ్డంగా వాదిస్తూ న్నారూ?

ఉ—కొన్నికొన్ని ఆకర్షకాలు ఉండాలండీ నిరంజనం గారూ! మీ రెరగరులెండి. వెనకణ్ణించీ అల్లానే వస్తోంది. వాదన

క్రియ తెలిసినంతమాత్రాన్ని ప్రతీవాళ్ళూనూ వాదనకి చొరపడడ మేనా! తగ్గండి.

గో—అల్పాహారం పెట్టించండి, అంతా వస్తారు.

ఉ—ఇదా తమ సలహా! నేనే అడగక్కర్లేదు.

నే—చందావసూళ్లు నిత్యఖర్చుకి చాలక ఛస్తున్నాం. మాక జనానికి అల్పాహారాలు కూడానా?

గో—అయితే తమరే సెలవివ్వండి.

గో—దిగ్గంతుల్లాంటి శాస్త్రపండితు లున్నారు. వార్ని సకేశీరంగా రమ్మని పిలిపించి జనానికి బోధ చెయించండి.

నే—అంతమందిలో బోధ ఎల్లాగండీ? ఒక మూర్ఖుణ్ని కూచోపెట్టి బోధించేటప్పుడే గురువు చెవుల్తెంపి చేతులో పెడతాడుగదా, నలభైమందిని కూచోపెట్టి బోధ చెయ్యడం చూస్తున్నాం గదా, ఒకే క్షణంలో మహాప్రజకి బోధచెయ్యడం వీలా? బోధనవాసన కొట్టగానే వక్తని దిగు దిగు అని లేవిడీ కొడతారు.

గో—అయినా సరే సమర్థుల్ని తెచ్చి బలవంతాన్ని ఉపన్యాసాలు చెప్పించి మూర్ఖసభ్యుల అజ్ఞానం పోగొట్టి దేశంయొక్క, అనగా నగరంయొక్క, అనగా ఆసభయొక్క సాధారణ జ్ఞానపు మట్టం లేవగొట్టాలి. ఉపన్యసించేవాడు వేదికమీంచి దిక్కపోతే సరి!

నే—దిక్కపోతే మోసేస్తారు.

ని—పోనీ, మరి ఇతర ఆకర్షణలు ఏమిటి? మీ ఊహ కళలా?

నే—అవును. లలితకళ లున్నాయి. కాని వాటిల్లో చెవికి తగిలే కళలు మాత్రమే సభకి మరీ తాజా!

గో—మన తర్జనభర్జన సోదరుల గానం పెట్టించండి.

నే—వాళ్ల గాలిపాట సభకి చాల్తుందా?

గో—చాలకపోతే చందా వెయిద్దాం.

నే—అదికాదయ్యా! వీళ్ల పాట సామాన్యప్పాట! అది తెగ ఎరుగుదురు గనక సభ్యులు ఆ గానం మెచ్చకపోతే?

గో—పోలీసుని కాపలా వేసి, మెచ్చుగునేటట్టు లాటీలతో తాళం వెయింతాం.

నే—జనం లేచిపోతే?

గో—ఆవరణ గోడ దాటి వెళ్లిపోడానికి అణా అణా టిక్కట్టు పెడదాం.

నే—ఇంతే మీ సలహాలు.

ని—గాత్రపాటా, యంత్రమా మీ రనేది?

నే—యంత్రమయేది గాత్రమయేది లోగడ ఎంతో కొంతమం దని ఆకర్షించి ఉన్నవాడు— ఎంతో మొహమాటం ఉంటేగాని ఊరికేరాడు. ఉల్ఫాగా వస్తే గాని మనకి 'జయప్రదం' కాదు. పోనీ పొత్తిపుణ్యానికే వచ్చి పాడేవాళ్లని ఒప్పుగుందాం అంటే, అప్పుడుకూడా మద్దెల ఫిడేళ్ళలాంటి పరికరాలకి బోలె డివ్వాలి; వచ్చిన జనాని కందరికీ 'క్లోరోఫారం' ఇవ్వాలి.

ని—అయితే ఈమధ్య భరతనాట్యం ఊరేసతోంది, పెట్టించండి.

నే—అందునిమిత్తంకూడా ఖర్చు తప్పదు. అదీ కుదరదండీ!

గో—ఏదీ కుదరకపోతే, ఎందుకయ్యా నీ కీతాపత్రయం? శ్రమ ఘరోగ్లదీ పేరు నీదినా? ఏఖర్చూ కూడదూ? నీసొమ్ము కాదే. సంఘావసరమైన ప్రజ్ఞ గల వ్యక్తిని సంఘం పోషించకపోడం అట్లా ఉండగా, ఆప్రజ్ఞ నేర్చినందుకు శాస్తిగా త్యాగంకూడా వాడే చెయ్యాలనా ఆ రెండూ లేనివాళ్ల వాదన!

నే—కార్యదర్శికష్టాలు తెలుసుగుని మరీ మాట్లాడండి. మీరు కానీ వసూలు ఇవ్వలేదు సరికదా,...

గో—చిత్తం చిత్తం. తమరు అప్రస్తుతాలు రానీకండి. చాలా పుట్టుకి వెళుతుంది.

ఉ—స్వామీ, అసలుసంగతి చూడండి. నాకు అర్జెంటు పనుంది. పోతాను.

గో—నాకు అర్జెంటుపని ఎంతమాత్రం లేదుగాని, నేనూ పోతాను. మొదట కాళ్లూ పట్టుకోను, తరవాత పేరూ జుర్రుకోను.

(అని వాళ్లిద్దరూ వెళ్లిపోయారు. మహాజనుడుగారూ, నిరంజనం గారూ, నేనూ మిగిలాం.)

నే—ఏమయ్యోయ్, మీరేనా ఉండి ఈముష్టికార్యక్రమ నిర్ణయం తుదనెగ్గించాలి.

మ—పోనీ మనవాళ్లచేత ఏదేనా నాటకం ఆడించండి, జనం విరగబడివస్తారు.

ని—నిజమేనండి. మనం విద్యావంతులంగనక, చక్కటి సంస్కృతనాటకం కట్టించండి. బరువుకి బరువూ ఉంటుంది, ప్రతిష్ఠకి ప్రతిష్ఠా ఉంటుంది, ఆనందానికి ఆనందమూ ఉంటుంది. ఒకవేళ మన యత్నం పాడై ప్రదర్శనం ఎంతో ఏడిసినట్టున్నా సరే 'శాకుంతలం' లాంటిది ఆడా లంటాను. చావు తప్పనప్పుడు సరియైనవాడి చేతులో చావమన్నాడు.

నే—నిజమేగాని, మనకి మాటలు తెలియద్దూ, నోరు పెగలద్దూ?

మ—అందుకని, అభినయం ఎక్కువ చేసేసి, మాటలు బాగా తగ్గించేసి, ఆకాస్తినీ తెలుగులిపిలో రాసేసుకుంటే! మూణ్ణిమిషాల్లో ఆడచ్చు!

నే—ఆడచ్చు. మీరు దుష్యంతుడు వేస్తారా ?

మ—బాబో, అదేమిటండోయి, నేను మాఅమ్మకి ఒక్కణ్ణే కొడుకునిగుడాను.

నే—సంస్కృతనాటకాలు రెండుమూడు హృద్యంగా ఉండేవి ఉన్నా అసలు టైం లేదండీ! విన్నారా! అదే అసలు ఇబ్బంది. అదోటీనూ, ఇంతా అంటాలుపడి మనం చివరదాకా ఆడినా, నూటికి నెయ్యిమందికి అది తెలియదు.

ని—అయితే, మనం ఇంగ్లీషువాళ్లంగనక ఆంగ్లనాటకం కడితే, చుట్టుపక్కల్నించి ఆంగ్లేయులుకూడా వస్తారేమో !

నే—రూఢిగా వస్తార్లెండి, వచ్చి మరి వెళ్లరుకుడానూ ! కాని మనకి మాతృభాషాభిమానం లేదని ఎవరేనా అనుకోగల్రుగనక ఇంగ్లీషు మనం మానాలి. సత్తా లేక కాదు, టకటకలాడించెయ్య గలం! తెలుసుగోలేనివాళ్లుకూడా మెచ్చుగుని మరీ పోతారు.

ని—మన కెవరికీ హిందీకూడా రాదుగనక, పోనీ, తెలుగు నాటకం ఎదేనా తియ్యండి, మరి గత్యంతరం లేదు.

నే—అదే నాకు తోస్తోంది. ఒక వెయ్యి తెలుగునాటకా లున్నాయికాని నాబోటిగాడు వేషం వేద్దాం అంటే మంచిది ఒకటే లేదండీ.

ని—పోనీ ఒఖ్ఖ ఆదర్శనాటకం మీరు రాసిపారేసి, తయారు చేసిపారేసి, ఆడేసిపారేసి, ఊరుకోకూడదూ ?

నే—నిమిషం. నేను నాటకం పుర్రకాల్తో రాసేస్తాను. కాని యుద్ధం మూలాన్ని సందేహిస్తున్నాను.

మ—అదే చిక్కొచ్చింది. పోనీ రాయద్దు. పాతది ఎదేనా తియ్యండి. పద్యాలూ రాగాలూ లేకపోతే ఆ నాటకాన్ని తంప కైయ్యాలి, చూసి మరీ తియ్యండి. మీరు పాడగల్రుగా అన్నట్టూ!

నే—పాడతానుగానండీ, కళాదృష్టితో పాడతాను. వినే వాళ్లు కళాయిదృష్టితో విని, మన్ని వృత్తినటుల్తో పోల్చి, తేలిక చేసి చెప్పలుగిరవటేస్తారు.

ని—ఒఖ్ఖనాటికీ గిరవటెయ్యరు. ఇప్పుడు చెప్పలు చాలా ఖరీదు. తెలుసునా ?

మ—అయితే మన సభ్యు లింతమం దున్నారు, ఒఖ్ఖ రాగ నాటకమేనా ఆడలేరుటండీ! రాగనాటకం లేకపోతే జనం ఛస్తే రారు. సుప్రసిద్ధరాగనటుల్ని వచ్చి, ఉచితంగా, ఒక్క అరగంట, ఏదేనా ఆడిపొండర్రా అంటే రారూ ?

నే—వస్తారు. మీరు ఎన్ని వందలు ఇస్తారు పెట్టుబడికి ?

మ—నేను ఉచితం అన్నాను.

నే—నేనూ అంతే అంటున్నాను. వందలు రాకపోకల ఖర్చులనిమిత్తంమాత్రమే! ఆడేది ఉచితంగానే!

ని—పోనీ వచననాటకం ఆడిచూస్తేనండీ !

నే—తద్దినంలా ఉంటుంది.

ని—అందుకనే! వార్షికం అన్నా తద్దినమేగా!

నే—ఇన్ని కళలు తెలిసినవాళ్లం, మనం వచననాటకం సుతరామూ ఆడకూడదు, మన సవిత్రసమాజంగడ్డమీద అటువంటి పని జరగనియ్యకూడదు. తెలుగువచనమ్మోహానికి నాటకం ఏమి టండీ, బోడికి విగ్గులాగా!

మ—పోనీ ఎదేనా పొట్టినాటకం ఆడితే!

నే—మనం అంతా పొడుగేగా! పైగా, జనం ఇంకా పొడుగు ఎదిగితే గాని పొట్టినాటకం అందుకోలేరు. పొట్టినాట కాని కిప్పటి జనం బలాదూర్ !

ని—కార్యదర్శీ! నువ్వే సమర్థుడవయ్యా! ఏదో కార్య క్రమం చూడు. జనాన్ని ఆకర్షించడానికి ఎవేనా ఉపన్యాసాలు పెట్టిస్తే!

నే—పెట్టించావచ్చు, పద్యాలు చదివించావచ్చు.

మ—వెనక సీహ్వనారాయణరావుఫార్సులాంటివి ఉండేవి! అటువంటిఫార్సు ఎదేనా ఆడిస్తే! ముతగరకంఫార్సులు లక్ష ఉంటాయి వెధవ్వి!

నే—నే చెప్తాను వినండి. ఉపన్యాసమూ, కావ్యపఠనమూ, ఫార్సూ- ఈమూడూకుడా మాటలతో పస్లే. అనగా విలవ శూన్యంగా గలవి, గనక మనకి ఖర్చు లేనివి. దేశంలో ఉపన్యాస కులు రకరకాలు లున్నారు. శూన్యవిషయంమీద ప్రసంగించే వాళ్లూ, నియమితవిషయం పుచ్చుగుని అది తప్ప తక్కిన లోక మంతా ముచ్చటించేవాళ్లూ, విషయం నిమిత్తమాత్రంగా పెట్టుగుని స్వంతదస్తరం విప్పేవాళ్లూ, తమరు చెప్పే గొప్పవిషయాన్ని స్వీక రించని సభని చూసి కోపగించేవాళ్లూ— ఇల్లాగా. వీళ్లల్లో అను భవం అయినవాళ్లు రైలుఖర్చులు ముందు పంపిస్తేగాని రారు. తెలివిలేని కార్యదర్శులు అల్లా చేస్తూంటారు. నేను అల్లాంటి పని చెయ్యను.

ని—మరి ?

నే—"నీవంటివాడు ఆంధ్రంలోనూ, భూమిమీదాకూడా లేడూ! నీ ఉపన్యాసం మాఊరిదాకా ప్రవహించింది. మేం అందు లోనే స్నానం రోజూనూ! నువ్వు వచ్చేదాకా ఈ ఊరంతా ఉపోష్యాలుంటారు. పాపం మూటకట్టుకోకు!" అని అతడిమీద కవిత్వం చెబుతూ రాస్తాను. వచ్చేస్తాడు.

ని—వచ్చి ఖర్చుసొమ్ముకి పేచీ పెడితే ?

నే—పెట్టడు. వాడూ చదువుకున్న ఆసామీ కదా! మనంత బరితెగి వీథినిపడతాడా? లోపల ఏడుచు గుంటూ, పనిచేసి పోతాడు. ఒకవేళ నోరుచెడి అడిగినాగానీ

"ఉత్తరంలో రైలుఖర్చు ఇస్తామని ఉంచిటయ్యా! బుద్ధిలేకుంటయ్యా నీకూ? ఈమాత్రం త్యాగం లేందే ఎవరికొచ్చాలయ్యా నీ చవటోపన్యాసం. ప్రజ్ఞ నీకు ఉంచని నువ్వు కనిపెట్టవంతోటే సంఘం నిమిత్తం అది ధార పొయ్యొద్దుటయ్యా! నే చెప్పించెరవాతేనా నేర్చుగోవచ్చునే స్వార్థ త్యాగమూ!" అని మనం కొంచెం జోరుచేస్తిమా, నోరు మూసుగుని రోడ్డుచ్చుసుంటాడు. వాణ్ణి మరి పిలవం. ఇల్లా పడకొట్టేగా వందలాది మైళ్లనించి నేను మెత్తమెత్తటి ఉపన్యాసకుల్ని మన సమాజానికి తోలుకొచ్చిందీ! కాని, యిప్పుడు, గట్టివాళ్లు ఖర్చులు లేందే వచ్చి చేతిచమురు భాగోతం కట్టరు.— అనగా ఉపన్యాసం కక్కరు.

ని—సరే. ఎవర్ని స్థిరపరుస్తారూ!

నే—నాదృష్టిలో ఇద్దరున్నారు. వాళ్ళిద్దరుకూడా కొత్తగిత్తలే. ఒకడు ఖండాంతర పరిశ్రమలనుగురించీ, రెండోవాడు లోకాంతర కవిత్వం గురించీ 'గంభీరోపన్యాసాలు' 'జయప్రదంగా' ఇస్తామని ఊటలూరుతున్నారు. వాళ్లకి ఛాన్సు ఇద్దాం.

ని—సరి. కావ్యపఠనం?

నే—ఒకతను రాత్రివచ్చాడు. తొమ్మిదణాలకాడికి బేరం స్థిరపడచ్చు.

ని—తొమ్మిదణాలు ఏమిటి?

నే—అతని పద్యాలు పావుగంటసేపు మన బహిరంగసభలో అతనే చదవడానికి మనం తరుణం ఇస్తే, ఆంగ్లకవి ఒకడన్నట్టు, మొన్నాడు మన సమాజానికి అర్ధరూపాయి బహుమతీ ఇస్తానన్నాడు.

ని—మీరేమన్నారు?

నే—తొమ్మిదణాలు ఇమ్మన్నాను.

ని—ఎందుకూ?

నే—నిర్వాహకసభ్యుల్లో ఒక్కొక్కడికి ఒకఅణా శేలీగ్గా పంచడానికి వీలునిమిత్తం. అతడు అచ్చుగున్నాడు.

మ—ఇంకా ఎవర్నేనా అల్లాంటి పద్యకర్తల్ని తనతో తీసుగురమ్మనండి. పోనీ ఆరేటుచొప్పునే సమ్మానిద్దాం, వాళ్లని గూడా!

ని—అతడు పాడతాడా?

నే—ఆ. కాని ఆపాట వినపడ్డంతమేర గ్రహబాధలు తొలుగుతాయి అని భయం!

ని—అయితే పద్యస్వారస్యం యావత్తూ ఒఖ్ఖదెబ్బని జనానికి తెలుస్తుం దంటూరా?

నే—తెలియదు. అందుకనే, అటువంటివే, ఆంధ్రమహాజనం మెచ్చడం అని చెప్పానుకదండీ. ఈ మహాజనానికి అల్లా మెచ్చడం అలవాటైపోయింది

ని—అదేం ధర్మం? అటువంటి అభిరుచా మనం జనంలో కలిగించవలిసింది?

నే—ముందే అభిరుచేమిటీ—ముందు వొట్టిరుచి. అనగా తెలియకుండానే మెచ్చడం. అది నవీనమైన ఒక ఆంధ్రకళ!

ని—తెలుసుగునికూడా మెచ్చుగుంటూరేమో! అప్పుడుగాని మెచ్చేమిటీ!

నే—తెలుసుగునా? సాధారణసభ్యుణ్ణి ఎవణ్ణేనా రెక్కట్టుగుని "ఏమిటి ఈ పద్యతాత్పర్యం" అని కనుక్కోండి. "నాయిష్టం నువ్వెవడివ్, కనుక్కోడానికి!" అంటూ కొప్పడతాడో లేదో! సభలో అల్లా అడగరుగదా అని ప్రతీవాడికీ ధైర్యం. 'ఓహో' అంటే తీరిపోతుందని మెచ్చుగుంటున్నారట, దెబ్బలా టెందుకని- నేను చాలామందిని తరవాత కనుక్కుంటే చెప్పారు.

ని—తేరభోజనం పెట్టేవాడు భోక్తల ఎదటికి స్వయంగా వచ్చి 'పదార్థాలు' ఎట్లా ఉన్నాయండీ అంటే, "దివ్యచకోరంగా ఉన్నాయి, స్వర్గతుల్యంగా ఉన్నాయి, ఫస్టుక్లాసుగా ఉన్నాయి" అంటారేగాని, తింటూ మరోమోస్తరుగా మాట్లాడతారా? అదే పూటకూళ్లవనీండి—అనగా టిక్కట్టుపెట్టండి, అప్పుడు యజమాని అడగాఅడగడు, అడక్కపోయినా భోక్తలు ఊరూకోరు!

మ—అబ్బ! చాలా ఆలస్యం అవుతోంది. దిక్కుమాలి ప్రహసనం ఏదేనా ఓటి ఆడిద్దురూ, అక్కడితో సభ విరగడైపోతుంది, తీరిపోతుందీ!

ని—ప్రహసనం నీచం కదా! అందులో పాషండులూ చోరులూ పాత్ర లుండాలిగావునే! అప్పుడుగాని నవ్వు వస్తుందా మరీ? ఏమయ్యా, కార్యదర్శీ!

నే—మీరు చెప్పేది 'సంస్కృత' ప్రహసనంగావును! అదికాదుగా ఇప్పుడూ!

మ—ఏమైతేం, నవ్వు వచ్చేది ప్రతీదీ నీచమే అంటాను! మీరు ప్రహసనాల్లో వేషం వేశారుగా! మీరే అథార్టీ వీటిల్లో చెప్పండి.

నే—చిత్తం. నేనన్నమాటేమిటి, అడ్డమైనవాళ్లూ ప్రహసనంలో వెయ్యొచ్చునండి. నీచత్వానికి తయారీ ఏం కావాలీ?

ని—అంత వీలా?

నే—అవునండి. ఇందులో పాట అవసరంలేదు, కవిత్వం లేదు, తాళం లేదు, మేళం లేదు, వేషంలేదు, పార్టు రానక్కర్లేదు.

ని—అదేమిటీ! మరెల్లా?

నే—పద్యాలైతే మనం మధ్యమధ్య ముక్క సర్దలేంగాని. ప్రహసనంలో మన స్వంతముక్కలూ స్వంతపైత్యమూ, మనం హాస్యం అనుకున్న వికారచేష్టలూ తిట్లూ, సంబోధనలూ కలిపేసి మాటలసంపుటీ అప్పటిదో, పూర్వపుదో తెలియకుండా మొత్తం

మీద పనిచెయ్యడానికి అవకాశా లున్నాయి. ప్రతీచోటికీ కర్త ఛస్తాడా! ప్రహసనం పట్టిచ్చిందా, మనదే ప్రయోజకత్వం. పోయిందా, కర్తని తిట్టిస్తాం.

మ—ఎవడేనా ప్రహసనం రాయడంతోటే నీచుడు. సత్తా ఉంటే గొప్పవేమన్నా రాయాలిగాని, అశ్లీలపు తుక్కుముక్కలు పోసుచెయ్యడానికి తుంటరి ఎవడైనా సరిపోతాడు.

ని—అల్లాంటి ముక్కలన్నీ కంఠతా పట్టి రెండుమూడు సార్లు మన కార్యదర్శిగారే వేషం వేశారుట, అట్టే తిట్టకండి. వీరు అంతకంటె నీచులని అర్థం అవుతుంది.

నే—ఎంతమాత్రం కాదు. నేను ఆ కర్తతో చెప్పకుండా గుప్తదానం మంచిదిగనక, అతని ప్రహసనాల్లో వేసింతరవాత, కర్తముక్కలయొక్క నీచత్వం పోయి, నామూలాన్ని గౌరవం హెచ్చింది ఆముక్కలకి.

ని—కదండిక్కు ఏదీ లేకపోడంవల్ల జనాన్ని ఆకర్షించడానికి మనం 'ప్రహసనం' తీసుగుంటున్నాంగనక, మరి యాగీమాని, ఆ ప్రయత్నం ఏదో చెయ్యండి. జనానికి గానమేనా ఉండాలి, హాస్యమేనా ఉండాలి. సార్వత్రికమైనవి మరి అట్టే లేవు.

నే—గానానికి డబ్బు పొయ్యలేం. దిక్కుమాలి హాస్యానికి సొమ్ము గొడవ లేదు. మనంత విద్యాధికులం దాన్ని చేపట్టడమే దాని జన్మకి మహాదశ! మనం ఇస్తున్న గౌరవమే దానికి వెయ్యి వేలు.

మ—సరే. రొండు ఉపన్యాసాలూ, కావ్యపఠనమూ, ఒక నీచపు ఫార్సూ – ఇవన్న మాట జనాన్ని ఆకర్షించడానికి మనం నిర్ణయించుగున్న శబ్దకళలు.

నే—చిత్తం.

ని—మరి సెలవ్. కార్యక్రమం పూర్తిచేసి, అచ్చుకి పంపెయ్యండి.

నే—సరే. అప్పుడేనా. అధ్యక్షుడి మాట తేల్చుగుని మరీ యిస్తాను.

[తరవాతనించి కంగారు యావత్తూ నాదే అయింది. అల్పాహారాల ఏర్పాటు, డిన్నర్ ఖంజాయింపు, సభలో కూర్చోడానికి కట్టుదిట్టాలు, అధ్యక్షుడి బసగురించీ, ఆశ్రయించిన కవుల్నీ ఉపన్యాసకుల్నీ ప్రణాళికలో జొనపడాన్నిగురించీ తంటాలు— ఇల్లాంటివన్నీ నామీదే నిల్చిపోయాయి. ఇవన్నీ ఓయెత్తూ, ఆ మాయధారిప్రహసనం ఓయెత్తూ అయింది. నే నందులో వెయ్యక తప్పిందికాదు. ఆడవేషానికి మొగాడు కుదరక స్త్రీ వచ్చే ప్రహసనం మానుకుని అయిదారు వేషా లుండే ఓ తుక్కుప్రహసనం తీశాం. మా బృందాన్ని కేకేశాం. నామనట్టు, నటయోగి, హాస్యార్ణవం, హాస్యవానరం, నవురేడు మొదలైనవాళ్ళని. వీళ్ళకీ నాకూగుడా ఫార్సులో ఉండగల తుక్కుమాటలతో లెఖ్ఖలేదు. నా మహాత్యం వల్ల జనం నవ్వేస్తారు. నామనట్టు హాస్యకర్త రాసిన వంకరమాటలకి తరిమిణిపట్టి నునుపుచేసి నవ్వించే జీనియస్ కాని, పార్టు రాదు, చేష్టలేదు, చేతకాదు. నటయోగిది యావత్తూ ఇంగ్లీషునవ్వట, అతడు పల్లెటూళ్ళమ్మటా పట్రలమ్మటా పడి ఫార్సుముక్కలు మాపెట్టుగుని కప్పులూ మెడల్సూ లాగేశాడు. హాస్యార్ణవం ఎప్పుడూ ఇవతలకూడా నవ్వించే మాటలు చెబుతాడుగనక, అతనికి పార్టే అక్కర్లేదు. హాస్యవానరంమొహంకేసి చూస్తే పొద్దస్తమానుకూడా నవ్వుతూన్నట్టు కనిపించడంవల్లనున్నూ, అతనికి కోపం వచ్చేటట్టు మనం తిట్టినప్పుడు అతడికి మరీ నవ్వుమొహం పుట్టడంచేతనున్నూ, అతణ్ణి తెగతిట్టడానికి ఒక మనిషిని పెడితే చాలు అతడిదంతా నవ్వే. నవురేడు ఎంతమాత్రం గానం రానివాడవడంచేత, హాస్యానికి నిధి అని పేరు పొందాడు. ఇంకా ఇవతల నిత్యకృత్యంలో బూతులు మాట్లాడేవాళ్ళనీ, తోరణాలు తెంపేవాళ్ళనీ మేం అవసరాన్నిబట్టి ఉపయోగించుగోడానికి నియమించుగుని, ఎంతమంది కూడితే అంతమందితో రిహార్సల్సు వేస్తూ, పేలవంగా ఉన్నట్టు మాకు తోచినచోట్ల మాటలు లాగేస్తూ, చాలా శ్రమ పడ్డాం! నాకు వీలైనప్పుడల్లా వెళ్లి నేను మా అధ్యక్షుడితో పరిస్థితి చెబుతూండేవాణ్ణే గాని, మా కార్యనిర్వాహక వర్గం మళ్లీ కలియలేదు. కార్యక్రమం వెయించేశాను. లండన్ దిసుమతీ అయిన డాక్టర్ అఖండ్ గారు అధ్యక్షుడు, ఎ. బి. ఘన్ సి. డి. ఖర్ లు ఉపన్యాసకులు,, నవాంకబిరుదకవిగారి కావ్యపఠనం, చివరకి ఫలానా ఫార్సు అనిమాత్రం రాశాం-ఆపేరుతో ఎదైనా సరే ఆడెయ్యచ్చునని.]

వార్షికంరోజు వచ్చింది. 'జయప్రదంగా' జరిగిపోయింది. జనం చాలామంది వచ్చారు. చోటు చాల్లేదు. అబ్బో! స్త్రీలూ వచ్చారు. నాటకాలు షోయాయికామా! ఇక్కడ మేం తేరగా ఆడేవాళ్ళం దొరికాంగా! మొదట కార్యక్రమం ముసుగుముసుగుగా ఉందిగాని, క్రమేపీ తెరిపిచ్చింది. ప్రహసనం రాకుండానే నవ్వతోచ్చారు. అసందర్భాలు జరిగినప్పుడు నవ్వేశారని మా అయిష్టులు అంటారుకాని, రాబోయే ప్రహసనాన్ని తల్చుగుని అని నే నంటాను. నాకు ఓ మెడ లిచ్చారు. వద్దంటే విన్నారు కారు. నటయోగికి నామీద కోపం వచ్చింది. నామనట్టు ఉరెట్టుగుంటా నన్నాడు. అయినాసరే నాకు మెడల్ ఇచ్చారు. మొర్నాడు ఊళ్లో ఒక మహారాజు ఈ ప్రహసనంలో అశ్లీలా లున్నాయి, మర్యాదస్తులు వినచ్చునే గాని ఆడకూడ దన్నాడు. అశ్లీలా లెక్కడ అని అడిగాం. అంతటా అన్నాడు. నమస్కరించాం. తను రాలేదు, అల్లా అని విన్నా నన్నాడు. కొన్నిచోట్ల చప్పగా ఉందని మా మేలుకోరేవా రన్నారు. హాస్యకర్తముక్కలవే అని మేం అనేశాం. కొన్నిచోట్ల జోరుగా ఉందన్నారు. ఆ స్థలాలన్నీ మా స్వరచనే అని చెప్పేశాం. తరవాతరోజు పత్రికలో డాక్టర్ అఖండ్ గారి

అన్యాక్రాంతమైన మా సమాజవార్షికసభ 'జయప్రదంగా' జరిగిం దని పడింది. అంతటితో అయిం దనుకున్నాను. ఒక్కొక్కటే చెప్పనే నక్కర్లేదు. పిల్లలు చెల్లించుకుని గర్వంగా ఆడతానా అని చూస్తూండగా, ఒక ఉత్తరం వచ్చి నా మనశ్శాంతి అంతా పాడు చేసింది. నానాశ్రమలూ పడి, మేం, పోనీ అని జాలిపడి ఓ ఫార్సు ప్రదర్శించాం అన్నా నే, ఆక్షేపణ చెప్పించి! తన ఫార్సట తనకే హక్కుంటట, ఇంతోటి హక్కు తనతో చెప్పకుండా పల్లీగ్గా అది ఆడి మేం భంగపరిచాంట, మాది నేరంట! మొదట్నించీ అనుకుంటూనే ఉన్నాను. ఆఫార్సు అసలు తుక్కురకం. కడంవాళ్లు పట్టట్టారుగాని, లేకపోతే, అంత నాసిరకం నేను తలపెట్టను. ఎంత మంచి ఫార్సుగాళ్లు నాకాళ్లమీద పడ్డారూ తమవి ఆడమనీ! వాళ్ల పేరు నిలిచేటందుకు వాళ్లవి మానేసి, నాకు నచ్చినవాళ్లవి వాళ్లతో చెప్పేదేమి టని ఆడేసి-ఈకీతిగా రచయితల్ని అందర్నీ నిత్యమూ గౌరవిస్తూనే ఉంటాను. వీడి కేం వచ్చిందో! ఈనాటు కార్యక్రమంలో వెయ్యకుండా పల్లీగ్గా ఆడిస్తాను, ఎవడు చూడొచ్చాడో, ఏడివి ఆడద్దని ప్రచారం చేస్తాను. దూరపు ఊళ్లల్లో ఆడిస్తాను, వెనకాలే వస్తాడా? పాండిత్యం లేని ఈమాటలు వాడి ముత్తాత మాటట! పైగా, మేం ఏమి బావుకున్నాం చెప్పండీ, ఇంకోళ్లని ఆనందపరచడానికేకదా మేం తీసుకుంటూ, అతడికి ఇంత ఏడు పెందుకు చెప్పండీ! మేం ఏమీ లాభం పొందలేదే! నీచత్వం అంటే ఇల్లా ఉంటుంది. కష్టపడి ఉన్నా నేమో నాకు ఒళ్లు మండి పోయింది. తక్షణం మా నటబృందాన్నీ, మహాజనుణ్ణీ కేకేశాను. అప్పుడే నిరంజనంకూడా వచ్చాడు. ఆఉత్తరం అందరికీ చూపించాను.

ని—ఇది చిక్కేనండీ! అతడికి రాయకపోయారా?

నే—ఇదోటా! నేను లోగడ మూడుసార్లు ఆడాను. అప్పుడు ఏమయాడు వీడూ?

ని—ఆసంగతి అతనికి తెలియదేమో!

**నామ**— నేను బోలెడుచోట్ల వాక్యాలు దిద్ది వాటికి మెరుగుపెట్టి అందులో ఏకోశాన్నీ స్ఫురించని హాస్యచేష్టలు చేసి, చచ్చి చెడి, జనాన్ని నవ్వించాను. అంత శ్రమ పడితే నాది నేరమా? వీడా అల్లా అనడం!

నట—నేను ఇదే ఆడి మెడల్సుకూడా పుచ్చుకున్నాను. ఇల్లా అని తెలిస్తే ఈ దిక్కుమాలి ముక్కలు కంఠతా పట్టక పోదునే? ఛీ, జిహ్వ కాలిపిం చుకుంటూ!

ని—తొందరపడకు. ఎక్కడని కాలిపిస్తావ్? నీ పెదవి మొదలు గుండెవరకూ ఆదిక్కుమాలి ముక్కలువ్యాపించిఉన్నాయి.

నట—ఏడిశాయి.

నట—ఏడిసింది! ఇందులో ప్రతిముక్కా చెత్తరకపు నిఘంటువులోకూడా ఉంది. రచన వాడిదేమిటే?

నామ—చాలా మాటలు నిఘంటువులోకూడా లేవు. కుళ్లి పోయిన పాతఫక్కీ బజారు సరుకు. అగములుకూడా ఇంతకంటె అరిందాగా రాయచ్చు.

నామ—నే నల్లాంటి ఫార్సులు యాభై రాస్తాను ఎడంచేత్తో.

నట—నేను రాసి ఎవళ్లకీ చూపించను, లాగేస్తారు.

నామ—అసలు ఇతర ప్రహసనాలు లక్ష ఉన్నాయి. ఇదే ఫార్సా, బోడిఫార్సు!

ని—అల్లాంటప్పుడు, ఈచవటమాటల ఫార్సే దిక్కుగా మీ రెందుకు బయల్దేరారయ్యా?

నామ—మా మంచితనంకొద్దీనూ! వాడిపేరు కొంచెం ఈ ప్రాంతాల మూఢుల్లో ప్రచారంచేసిపెడదాం, అహోరిస్తున్నా డని.

ని—మీతో అహోరించాడా?

నట—లేదు. మేం జాలివెయ్యగానే, ఆగలేం! వెంటనే సత్కరిస్తాం! మేం ఏమీ విలువ కోరలేదే? వాడిదేగా పేరూ?

నే—ఆ పేరు అందరికీ తెలుసునుగదా, ఇంకా వేస్తే ఓఘాయిత్యం, పైగా కాగితంకరువురోజుల్లో జాగా కుశలం అని చెప్పేసి కార్యక్రమ పత్రాల్లోకూడా అతని పేరు మేం రాని య్యందే! జనం ఒక వేళ ఆటని తిడితే, అతడిపేరు రుమ్మగ్గా ఉండడం మాకంటె అతడికి ఎంత నయమో తెలుసా!

ని—అతనికి మీరు మొదలే రాయవలిసింది. మనం అర్హులమో అనర్హులమో అతనికి తెలియద్దూ! పాడై తే?

నే—అందుకనే కాదుటయ్యా, అతని పేరు లాగేసిందీ! ఎవడేనా అబుక్కు చదివి వస్తాడేమో అనే భయంచొప్పనా!

ని—హక్కు వొదులుకోమనడం న్యాయమా?

నే—ఉందని స్పష్టంగా అత డేడవవద్దుటయ్యా! ఆ మాటల ఆస్తి వాడిదనీ!

ని—అల్లా ఉంటుందే!

నే—లేందే!

ని—మీరు చదువుకున్నవాళ్లు గదా అని ఊరుకునిఉంటారు. "సర్వస్వామ్యసంకలితం" అని ఉంటుంది.

నే—ఓరి దాని మొహంమండా! దాని అర్థం ఇదా!

ని—అయిఉండాలి కొంతవరకు. నేరాలూ శిక్షలూ ఎందుకు, మీరు కృతజ్ఞతకోసం గుడా తెలియపరచవచ్చును గదా—అనుభవం గల విద్యావంతులు!! కర్తమాటలవల్ల నటుడు పుడతాడు. మీరు ప్రత్యక్షం చేసే ఆనందం గురించి వినడానికి కర్త తగడా?

నే—సరే, యిప్పు డేమిటంటారు?




109 మింట్ స్ట్రీటు, సావుకారుపేట.

## ఇనామూ! ఇనామూ! ఇనామూ!

మా కూందల్ విర్ధిని సీసా ఒకటి కొనువారికి మూడురంగుల అందమైన శ్రీ ప్రతిపి కృష్ణునిపటము బహుమానముగా కొసగబడును.

# కూందల్ విర్ధిని

(రిజిష్టర్డు)

**తలవెంట్రుకలను నల్లగాను, దట్టముగాను, నిశివిగాను పెంపొందించి అందము చేకూర్చును.**

త్వరలోనే మీవూరికి రానున్న మా ప్రతినిధి ద్వారా మీరు స్వయంగా అర్డర్లను ఇవ్వడానికి సిద్ధంగావుండండి.

ఆంధ్రడిస్ట్రిక్టు సోల్ఏజంట్సు:

## సాయిబాబా ట్రేడింగు కంపెని,

తిరువల్లిక్కేణి, మదరాసు.

---

# భారత్ బ్యాంకు లిమిటెడ్,

**హెడ్డాఫీసు:—ఢిల్లీ**

ఛైయిర్మన్:- **సేఠ్ రామకృష్ణ డాల్మియా.** డిప్యూటీ మేనేజింగ్ డైరెక్టర్:-**రాజేంద్రకుమార్ జైన్.**

**ఇండియాలో దిగువచోట్ల అంతటాకూడా అన్నిరకాల ఆధునిక బ్యాంకింగు సౌకర్యములను యొసగును.**

ఆగ్రా (బెలాన్‌గంజ్), ఆగ్రా (జోహ్రిబజారు), అహమ్మదాబాదు, అజ్మీరు, అకోలా, అలహాబాదు, ఆలీఘర్, అంబాలా కన్టోన్మెంటు, అంబాలా సిటీ, అమ్రోటి, అమృతసర్, అమృతసర్ (మిశ్రీ మండి), ఆగ్రాహ్, బన్డా, బెంగుళూరు సిటీ, బెంగుళూరు కన్టోన్మెంటు, బరైల్లీ, బాటాలా, బారౌట్, బీవార్, బెనారెస్, బెజవాడ, భగల్‌పూర్, భివ్వాలా, భివాని, బిజనోర్, బొంబాయి (ఫోర్టు), బొంబాయి (జవేరిబజారు), బులాన్‌ద్‌షహర్, కలకత్తా (క్లయివ్ వీధి), కలకత్తా (బుర్రా బజారు), కలకత్తా (చౌరంఘీ), కాన్పూరు (జైగంజి), కాన్పూరు (జనరల్‌గంజి), చాంద్‌పూరు, చాప్రా, చినియాట్, కొచ్చిన్, కోయంబత్తూరు, డెహ్రాడూన్, ఢిల్లీ (దర్యాగంజి), ఢిల్లీ (చౌరిబజారు), ఢిల్లీ (సాదర్ బజార్), ఢిల్లీ (కొత్త), ఢిల్లీ (చాంద్నీ చౌక్), ఢంపూర్, ఫిరోజ్‌పూర్ కన్టోన్మెంటు, ఫిరోజాబాదు, ఫైజాబాదు, గయ, ఘజియాబాదు, గోన్‌డ, గోరక్‌పూరు, గుజ్రాన్‌వాలా, హాపూరు, హత్రాస్, హిమత్ నగర్, హిస్సార్, హోషియార్‌పూరు, హైదరాబాదు(సింధు), జమ్ము(తవి), ఝూరియా, ఝాన్సీ, జబల్‌పూరు, జలన్‌ధర్ సిటీ, కరాచి, కట్ని, ఖతౌలి, ఖాంగాన్, ఖుర్జా, కిషెంగర్ స్టేట్, కోటా, లాహోర్ (మాల్‌రోడ్డు), లాహోర్ (మహల్లిగేట్), లాహోర్ కన్టోన్మెంటు, లాహోర్ (అనార్కలి), లోహారు, లక్నో (హజ్రత్‌గంజి), లక్నో (అమీనాబాద్), లూధియానా (చౌకు), లయాల్‌పూరు, మద్రాసు (మౌంటురోడ్డు), మాన్‌డి బహాఉద్దిన్, మావ (సబ్ ఆఫీసు బెనారెస్), మిర్జాపూరు, ముత్రా, మీరట్, మోగా, మాన్టుగామెరీ, మొరాదాబాద్, ముల్తాన్ సిటీ, ముజఫర్ నగరు, ముజఫర్‌పూరు, నాగపూరు సిటీ, నాగపూరు (కింగ్సువే), నవాబ్‌షా, పానిపట్టు, పాట్నా, పాట్నాసిటీ, పెషావర్ సిటీ, క్వెట్టా, రాజకోట, రావల్పిండి, రేవారి, రోహటక్, రూర్కీ, సహారాన్‌పూరు, సర్‌గోదా, షియాల్ కోట, సికింద్రాబాదు(దక్కన్), సీతాపూరు, షహజాహాన్‌పూరు, సుక్కూర్, టాండా, తిరుచినాపల్లి, త్రిచూరు, ఉదయపూరు, ఉక్లానా, వార్ధా. దేశమంతటా యింకా బ్రాంచీలు వ్యాపించ మున్నవి.

**దేశసేవార్థమై స్థాపింపబడిన దేశీయసంస్థ.**



ఒరిజినల్



తాజ్‌మహాల్ బ్లూజాగర్ రేజియా వజ్రములు



**A. Abdul Kareem Sahib Sons,**

JEWELLERS,

**Big Bazaar,** **Trichinopoly.**



Registered Trade Mark




ఫాక్టరీ

— రిజిష్టర్డు గ్యారంటీ సీల్డుపాకెట్టు —



Registered Trade Mark

వివిధ ఆకారములలో రంగురాళ్లు మావద్ద సరసమైన ధరలకు లభించును.

క్యాటలాగు ఉచితము.

నాణ్యమైన కెమికల్ వజ్రములు మావద్ద దొరుకును.

---

ఎ. అబ్దుల్ కరీం సాహెబ్ సన్సు,

నగల వర్తకులు,

పెద్దబజారు, : : : ; : తిరుచినాపల్లి

# తుక్కుముక్కల హక్కుచిక్కు

ని—మామూలు ప్రకారం చేసెయ్యండి. ఊరుకోమనండి. ఖర్చులేని పనేగా!

నే—సరే. మీరు రాయండి. చెప్తాను క్షమాపణ.

ని—రాస్తాను. "కర్తకు— నిజమే. మీరు ఏడవవద్దు. ఏం జేస్తాం? మీకు గౌరవం తేవాలని మేంపడ్డ శ్రమకి మీరుచూపిన కృతఘ్నతవల్ల రోజులు ఎల్లాంటివి వచ్చాయో మీరు చూపించారు! ఇష్టులమీద ఎవడేనా ఈపని చేస్తాడా? మీయందు ఎంత అభిమానం ఉండడంచేత మీ పేరు నోటీసులో లేకుండా చేశామో మీ కేం తెలుసూ! కొద్దివాళ్ల పేర్లుమాత్రమే అందులో వేసి, గొప్పవాళ్లవన్నీ తీసేశాం. అందుకని మీ పేరు దాన్లో లేదు. అదికాక, మాకు మరో దిక్కు లేక మీ దిక్కుమాలి మాటలు ఆడుతున్నాం అని మొదట్లోనే మీకు రాసిఉండవలిసిందే. ఆ రాయకుండా ఉండడానికి కూడా గొప్ప కారణం ఉంది. యథార్థం చెప్పాలంటే, మీ రచన దిక్కులేని తెలుగు భాష. పద్యమేనా కాదు, రాగమేనా కాదు, గ్రాంథికమేనా కాదు, ఉన్నతభావరహితం, పాండిత్యశూన్యం, అందరికీ తెలిసిన ముక్కలూ, వీధులో దొర్లే పడికట్లు! అందులోనూ ఎందునా పొందని నీచం అని పెద్దలంతా ఖాయపరచిన హాస్యంతో కూడిన పాకం! ఇటువంటి రచన చేసిన మీకు మేం అనుమతి గురించి రాయడంకంటె మానేస్తేనే మీకు గర్వం తగ్గుతుందేమో అని మాకు తోచి, మీ మేలుకోసమే మీపేరు విసర్జించాం గనక ఆ మేలు స్మరించుకుని మీరు మాకు కృతజ్ఞులై ఉండాలి. 'ఫార్సు' అంటే తుక్కుముక్కలేగదా, మీతో చెప్పే దేమిటని చాలాచోట్ల మీ ప్రదర్శనాలు ఆడుతున్నారు. నాసలహా ఏమిటంటే, మీరు ఆడడానికి వీలులేనివిగాని, ఇవి ఆడితే మనకి మాట దక్కదు రంగంమీద మరణమే అని నటులు అనుకునేవిగాని రచించండి. అల్లా చేస్తే మీ కీబాధ తొలిగిపోతుంది. మన్లో మనమాట! మీరు రాసినవాటికన్నింటికీ కూడా ఆడడపుదోషం పట్టిందంటారా, అయిందేదో అయింది, అచ్చేసినవేవో అచ్చేశారు, మరి అచ్చు వెయ్యకండి. మేం ఎంతో సత్కారణం అని చేసిన పనినే మీరు గొప్ప తిరస్కారణం అని అంటున్నారుగనక, మాట తడబడుతూన్నది మీరేను! మేం సత్కరించకమానం.

ఇట్లు విధేయుడు—"

ఇది నేను పుచ్చుకుని మర్నాడు కర్తకి పారేస్తానన్నాను. మేం ఎవళ్లదార్ని వాళ్లం వెళ్లిపోయాం. నే నాఉత్తరం పోస్టులో వేశానని మావాళ్లందరితోటీ చెప్పేశాను. చెప్పానేకాని వెయ్యలేదు. మంచి చెయ్యడానికి అనుమతిట విన్నారా? చూశారా మా శ్రమకి ఫలితం? ఆనందం వృద్ధిచెయ్యడానికి మాసంటి త్యాగులు నడుంకట్టగా, మాటలగురించి పట్టింపులు పోయే అల్పులున్నారు. ఔర! తుక్కుజీముక్కల్లో ఉందని చెప్పబడే హక్కువల్ల మా కెంత చిక్కొచ్చిందో! కానీండి, మహామహావాళ్లకి తప్పలేదు, మాకూ తప్పలేదు.



సృష్టివైచిత్రి-'కంగారూ' మృగము

# హాలాహలోదయము



= శ్రీ మల్లంపల్లి రామలింగేశ్వరశర్మ =

ఇక నేమో కల దూడివచ్చు నొకసారే యంచు లోకాల యే
లిక లీ రీతిని బాధపెట్టగ సరిక్లీలాఁతిరాజు నో
సిక నెన్నాళ్లకటంచు పట్టను? నిజావేశమ్ము గుప్తమ్ము చే
సికొనఁ జాలడు నింకమీఁదట ప్రదర్శించుఁ లయాకారుఁడై.

తను బాధించిన నొప్పికోదలచు నాతం డాశ్రితమ్మైన జం
తునికాయమ్ములు చచ్చునో యనక కన్నుల్ విప్పి యే రీతి చూ
చును ఆతం డభిమానమాన్యుఁ డిక సాచుఁ హాలహాలత్త్వరం
గని కాయమ్ముల లోకసంతతుల నాఘ్రాణించు నుద్వృత్తుఁడై.

ఇక నేలా యడియాస? దానికిని నంతేలేద? యాతండు ఏ
నిక నిచ్చెఁ సిరినిచ్చె ధేనువునిడెఁ శీతాంశునిఁ గూడ నా
రకయే యాతని రెచ్చగొట్టిరిక క్షీరాంభోధి తా నేమి దా
చికొనంజాలెను దాచుకొన్నదదె వచ్చెఁ హాలహాలమ్మహో!

లేలిహానస్వామి కాలకూటజ్వాల వెడలఁగక్కినయట్టి విధము దోప
సంజరేకల మబ్బు జారి పాథోధిలో పడిపోయినట్టి భావమ్ము దోప
లోనున్న రతనాల నానాద్యుతులుగూడి మిఱుమిట్లు గొల్పిన సరణి దోప
ముక్కోటి వేల్పుల మూర్తీభవించు నభాగ్యరేఖలు స్పష్టపడియె ననఁగ
కడగి నిజనాథు బంధించి కష్టపెట్టి-రనెడు కోపాన నాగకన్యకలు విసము
పుక్కిలించినయట్టుల పొలిచి కాల-కూట-రేఖలు దనరె నప్పాటనంత.

(‘హాలాహలపానము’నుండి.)

తిరుపతి కొండలమీదికి క్రొత్త మోటారు రోడ్డు, ౧





తిరుపతి కొండలమీదికి క్రొత్త మోటారు రోడ్డు, ౨

# చీనిచీనాంబరాలూ, చీటీగుడ్డలూ

శ్రీ
దిగవల్లి వేంకటశివరావు

"వస్త్ర పరిశ్రమకు హిందూదేశమే పుట్టినిల్లు. ప్రపంచములో చరిత్ర అనేది ప్రారంభం కాకపూర్వమే హిందూదేశంలో వస్త్రపరిశ్రమ వున్నట్లు కనబడుతూవుంది" అని బెయిన్సు క్రీ. శ. 1835-వ సం॥ లో రచించిన 'పత్తిపరిశ్రమచరిత్ర' (History of Cotton Manufacture-Baines, 1835· p 2) అనే గ్రంథంలో వ్రాశాడు.

## క్రీస్తుకు పూర్వం మూడువేల సంవత్సరాల కిందటిమాట

హిందూదేశపు జిలుగు వలువలు, రవసెల్లాలు, రంగుల అద్దకాలు మొదలైన వస్త్ర విశేషాలు క్రీస్తు పుట్టకపూర్వం కొన్ని వేల సంవత్సరాల కిందటనే ప్రపంచమంతటా ప్రసిద్ధి జెందివున్నట్లు కొన్ని ఆధారాలు కనబడుతున్నవి. అరేబియాదేశానికి పశ్చిమోత్తరంగా ప్రస్తుతము ఇరాకు, సిరియా, టర్కీరాజ్యాలున్నచోట టైగ్రీసు, యూఫ్రాటీసు నదులకు మధ్యప్రదేశములో మూడువేల సంవత్సరాలకు పూర్వము గొప్ప నాగరికత ననుభవించిన బేబిలోనియా అస్సీరియారాజ్యాలుండేవి. ఈ పురాతన నాగరికతను సుమేరునాగరికత యని చరిత్ర పరిశోధకులు వ్యవహరిస్తున్నారు. ఈ బేబిలోనియా దేశప్రజలు పత్తికి, నూలుకు తమ భాషలో 'సింధు' అనే శబ్దాన్ని వాడేవారు. క్రీస్తుకు పూర్వము ఏడెనిమిది వందల సంవత్సరాల కిందట మధ్యధరా సముద్రతీరమున గొప్ప నాగరికతను స్థాపించి ఐరోపాఖండములోని వివిధ దేశాలకూ విజ్ఞానభిక్షను పెట్టిన గ్రీసుదేశీయులు కూడా తమ గ్రీకుభాషలో 'సిందన్' అనే శబ్దాన్ని వాడేవారు. 'హిందు' అనేది సింధు శబ్దము యొక్క రూపాంతరమే నని భాషాశాస్త్రజ్ఞులూ, చరిత్ర పరిశోధకులూ అంగీకరిస్తున్నారు.

కొన్నివందల సంవత్సరములనుండి పారతంత్ర్యములో పడియున్న ఈ హిందువులకు ప్రాచీనకాలములో ఇంత ప్రాముఖ్యత వున్నదంటే మనల నేలు పాశ్చాత్య ప్రభువులు నమ్మలేక పోయారు. బేబిలోనియా గ్రీకు భాషలలో పత్తికి సింధుశబ్ద ముపయోగించడము కేవలము కాకతాళీయన్యాయంగా సంభవించిన దేమో నన్నారు. బైబిలులో నుదాహరించిన సృష్టిక్రమానికి భిన్నంగా హిందూదేశ నాగరికత అంతకు పూర్వమునాటి దని అంగీకరింపలేక అనాదిసిద్ధములు, అపౌరుషేయములు నని మనము విశ్వసించే వేదములు క్రీస్తుకు పూర్వము 1200 సంవత్సరములకన్న ప్రాచీనములై యుండవని వాదించేవారు.

## మొహెంజోదరో హరప్ప శిథిలములలో వస్త్రవిశేషాలు

ఇలాగ వుండగా ఇప్పటికి కొన్ని సంవత్సరాల కిందట మన హిందూదేశంలో పంజాబురాష్ట్రంలో సింధునదీ తీరమునను, సింధురాష్ట్రంలోను మొహెంజోదరో హరప్పలనే ప్రదేశాల దగ్గర తవ్వగా భూమిలో పూడిపోయి యున్న పురాతన శిథిలాలనేకాలు బయటపడ్డాయి. అందులో కనబడిన నగర నిర్మాణములు, గృహముల పునాదులు, వివిధ శిల్పవిశేషములు, విగ్రహములు, ముద్రికలు, ఇతరవస్తు జాలములును క్రీస్తుకు పూర్వము నాలుగైదువేల సంవత్సరాల కిందట ఈ హిందూదేశంలో ప్రవర్తిల్లిన ఒక విశిష్టమైన ఉత్తమ నాగరిక జీవనమునకు సంబంధించిన వని ప్రాచ్య పాశ్చాత్య పరిశోధకులు ఏకగ్రీవముగా నిర్ణయించినారు. అనేక సాదృశ్యములను బట్టి మొహెంజోదరో హరప్పల దగ్గర బయల్పడిన నాగరికత మన వేదయుగములో నొక ఘట్టమునకు చెందిన దనికూడా పరిశోధకులు నిర్ణయించగలిగారు. అందువలన వేదములు ఇంతకన్న పూర్వకాలమునాటి వని స్పష్టముగా ఋజువుఅయినది.

ఈ శిథిలములలో ప్రాచీనకాలమునాటి వస్త్రవిశేషములుకూడ కనబడినందువల్లను, పత్తిని వడికి దారము పోగులు తీసి వస్త్రములునేసే విధానము వేదములందు కూడా చిత్రవిచిత్రముగా వర్ణించబడియున్నందువల్లనూ హిందూదేశపు వస్త్రపరిశ్రమ అనాదిసిద్ధ మైనదనే సంగతి నిర్వివాదాంశముగా తేలినది.

బేబిలోనియా దేశీయులు పత్తికి 'సిందు' పదము నుపయోగించడమూ, గ్రీకుదేశీయులు 'సిండన్' పదము నుపయోగించడమూ కేవలము కాకతాళీయము కాదనిన్నీ, ఆ దేశాలకు మన దేశమునుండి ఈ పరిశ్రమ వ్యాపించిన దనడానికి సందేహం లేదనిన్నీ తేలినది.

## క్రీస్తుకు పూర్వమునాటి హిందూదేశపు వస్త్రపరిశ్రమ

క్రీ. పూ. 1700 సంవత్సరమున జోసెఫ్ కాలమున ఫారో (Pharoah) అనే ఈజిప్టుదేశపు రాజు జిలుగువలువలు ధరించినా డనిన్నీ, ఈజిప్టులో వస్త్రములు తయారుచేసే కాలంనాటికి హిందూదేశంలో ఈ పరిశ్రమ మంచి అభివృద్ధిలో నున్న దనిన్నీ పైన చెప్పిన సింధునాగరికత బయల్పడక పూర్వమే ఒక గ్రంథకర్త వ్రాశాడు.

గ్రీసుదేశచరిత్రకారుడైన హెరోడోటసు (క్రీ. పూ. 445) ఆకాలంలో హిందువులు నూలుబట్టలనే ప్రధానంగా ధరించేవా రని వ్రాసినాడు. ఆకాలంలో ఈజిప్టు పారశీకరాజ్యముల ద్వారా గ్రీసుదేశానికి హిందూదేశంతో వర్తకవ్యాపారాలు జరిగేవి. గ్రీసుదేశపు మహావీరుడైన అలెగ్జాండరు క్రీ. పూ. 327-వ సంవత్సరంలో హిందూదేశానికి దండయాత్ర చేసినప్పుడు ఆయన ఉద్యోగులలో నొకడైన 'నియార్కసు' సముద్రమార్గముగా క్రీ. పూ. 325 లో హిందూదేశమునకు వచ్చినాడు. ఇతడు మన దేశములో చూచిన విశేషములను గురించి తరువాత కాలమున ఇద్దరు గ్రీసుగ్రంథకర్తలు తమ పుస్తకములలో నుదాహరించినారు. పువ్వులపువ్వుల వస్త్రములు, రంగుల రంగుల అద్దకాలు గల వస్త్రవిశేషాలను హిందూదేశీయులు ధరించుచుండుటను నియార్కసు చూచినాడని క్రీ. పూ. 24-వ సంవత్సరం ఆప్రాంతంలో ఈజిప్టులో పర్యటనం చేసిన స్ట్రాబో అనే గ్రీసుదేశపు భూగోళశాస్త్రజ్ఞుడు తన గ్రంథంలో వ్రాశాడు. ఈజిప్టులో నివసించే గ్రీసుచరిత్రకారుడైన ఏర్రియన్ క్రీ. శ. రెండవ శతాబ్దిలో వ్రాసిన 'ఎరిత్రియస్ సముద్రయాన'మనే గ్రంథములో హిందూదేశములోని కొన్ని పట్టణములలో అరబ్బుగ్రీసువర్తకులు చేసే వ్యాపారాన్నిగురించి వుదాహరించినాడు. దీనినిబట్టి సింధునదీ తీరాన్ని వున్న 'పాటాం' అనే పట్నాన్నుంచి ఎర్రసముద్రతీరమున గల 'అడ్యూలీ' రేవుకు అరబ్బీవర్తకులు హిందూదేశపు నూలుబట్టలను తెస్తూవున్నట్లున్నూ, ఎర్రసముద్రాని కావలి ప్రక్క రేవులకునూ హిందూదేశమున భరుకచ్ఛమునకునూ వర్తకము జరుగుచున్నట్లున్నూ, ముఖ్యముగా రకరకాల నేతబట్టలు కాలికోలనీ మజిలీనులనీ ఆనాటికాలంలో ప్రసిద్ధి జెందిన బట్టల రకాలు 'బరిగాజా' (భరుకచ్ఛము) నుండి ఎగుమతియవుతూ వున్నట్లున్నూ తెలుస్తుంది. అప్పుడుకూడా 'మోసలియా' అని వ్యవహరింపబడే మన మచిలీపట్టణము వస్త్రపరిశ్రమకు ప్రసిద్ధి చెందినట్లున్నూ, వంగరాష్ట్రపు జిలుగువలువలు చాలాప్రశస్తముగా నున్నట్లున్నూ, గంగానదీతీరమున నుత్పత్తియగుటనుబట్టి దానికి గ్రీకువారు 'గంగీ' అని పేరుపెట్టినట్లున్నూ కనబడుతూవుంది. క్రీ. పూ. 321లో భారతదేశంలో మౌర్యసామ్రాజ్యాన్ని స్థాపించిన చంద్రగుప్తుని రాజసభలో గ్రీకురాయబారిగా వున్న మెగాస్తనీసు వ్రాసిన సంగతులవల్ల ఆకాలంనాటి రాజకీయార్థిక పారిశ్రామిక పరిస్థితులు, వాణిజ్యవ్యాపారములను గురించీ తెలుస్తున్నవి.

## క్రీస్తుశకములో భారత దేశవస్త్రపరిశ్రమ దశదిశల వ్యాపించినకథ

క్రీస్తుకుపూర్వమే పెరిగి పెద్దదై మధ్యధరాసముద్ర తీరమునందలి దేశములనెల్ల లోబరచుకొని మహాసామ్రాజ్యమును స్థాపించిన రోమకనగరముతోను, ఆసామ్రాజ్యముతోను హిందూదేశమునకు వాణిజ్యవ్యాపారములు జరిగినట్లు చాలా నిదర్శనము లున్నవి. క్రీస్తుశకములో నీ రోమకసామ్రాజ్య వ్యవహారములలో ననేకములైన మార్పులు కలిగినవి. సామ్రాజ్యము రెండుగా చీలినది. రాష్ట్రపతులు స్వతంత్రులైనారు. క్రీ. శ. 324 లో చక్రవర్తియైన కాన్‌స్టెంటైన్ మళ్ళీ యీసామ్రాజ్యము నేకచ్ఛత్రముగా పరిపాలించాడు. తరువాత పదకొండువందల సంవత్సరాలు ఈ సామ్రాజ్యానికి రాజధానిగా నుండి తురకలకుగూడా రాజధానియైన కాన్‌స్టాంటినోపిల్ అనే రాజధానిని క్రీ. శ. 330 లో నిర్మించాడు. తాను క్రైస్తవుడై ఆ మతాన్ని వ్యాపింపజేశాడు. ఈ సామ్రాజ్యంలోకి మన దేశము నుంచి పారశీకదేశము ద్వారా పట్టుబట్టలు దిగుమతియవుతూ వుండేవి. క్రీ. శ. 350 ఆ ప్రాంతంలో ఇద్దరు పారశీక అగ్నిపురోహితులు చీనానుంచి పట్టుపరిశ్రమను తెచ్చి వ్యాపింపజేశారు. క్రీ. శ. ఆరవ శతాబ్దంలో ఈ సామ్రాజ్యము నేలిన జస్టినియన్ చక్రవర్తి ప్రకటించిన స్మృతిలో సుంకములు విధించే సరుకుల జాబితాలో హిందూదేశపు నూలుబట్టలు కూడా చేరివున్నందువల్ల జస్టినియన్ కాలంలో ఈతూర్పురోమకసామ్రాజ్యంలోకి మన దేశపు సరుకులు ఎంత విరివిగా దిగుమతీ అవుతూవుండేవో ఊహించవచ్చును.

హిందూదేశంలోనుంచి వస్త్రపరిశ్రమ మొదట అరబ్బీదేశానికి వ్యాపించింది. అరబ్బీభాషలో పత్తికి 'ఖ్వట్టాన్' అని అంటారు. ఈశబ్దంలోనుంచే 'కాటన్' అనే ఇంగ్లీషుపదము పుట్టింది. దీనినిబట్టి మన పూర్వులీ భారతదేశంలో నాటిన ఈ పత్తిచెట్టు ప్రపంచంలో ఎంత దూరానికి పాకిందో గ్రహించవచ్చును.

క్రీ. శ. పదవ శతాబ్దంలో ఐరోపాలోని స్పెయినుదేశాన్ని ఏలిన మూరు లనే మహమ్మదీయులు పత్తిపరిశ్రమను అరబ్బీదేశాన్నుంచి తీసుకొనివెళ్ళి స్పెయినులో ప్రవేశపెట్టారు. అది అక్కడనుంచి క్రమక్రమంగా 14-వ శతాబ్దంనాటికి ఇటలీదేశానికి వ్యాపించింది. ఆఫ్రికాలో చాలాకాలం కిందటనే మహమ్మదీయవర్తకులీపరిశ్రమను ప్రవేశపెట్టారు.

క్రీ. శ. 13-వ శతాబ్దంలోనే ఈ పరిశ్రమ హిందూదేశాన్నుంచి చీనా జపానులకు వ్యాపించింది. ఇలాగ ఈ వస్త్రపరిశ్రమ మన దేశాన్నుంచి దశదిశలా వ్యాపించింది. ఈసంగతిని బెయిన్సుగారు 'పత్తిపరిశ్రమ చరిత్ర'లో వ్రాసియున్నారు.

## విదేశయాత్రికుల వర్ణనలు

క్రీస్తుకుపూర్వమునుండీకూడా పడమట ఈజిప్టు బేబిలోను గ్రీసుదేశములతో మనదేశమునకు వర్తకవ్యాపారములు జరుగుచున్నందున మన దేశమునుగురించి వారి గ్రంథములందు ఉల్లేఖనములు కనబడుచున్నవి. వీరి నందరినీ మనవారు యవను లనేవారు. ఇక తూర్పున చీనాదేశంతో మన దేశానికి చిరకాలంనుంచీ మతరీత్యా, వ్యాపారరీత్యాకూడా చాలాదగ్గర సంబంధ ముంటూవుంది. చీనాదేశీయులు బౌద్ధమతమును స్వీకరించినందువల్ల మన దేశము వారికి పుణ్యభూమి. అందువల్ల బౌద్ధయాత్రికు లనేకు లీదేశమునకు వస్తూవుండేవారు. క్రీ. శ. నాలుగవ శతాబ్దిలో నీదేశమునకు వచ్చిన ఫాహియాను, ఏడవ శతాబ్దిలో నీదేశమునకు వచ్చి ఎనిమిదిసంవత్సరము లుండి వెళ్లిన చీనాదేశపు విద్వాంసుడైన హ్యూనిత్సాంగు మన దేశములోని మతధర్మములనుగురించి, నాగరికతనుగురించి, వాణిజ్య వ్యవసాయపరిశ్రమలను గురించి, విజ్ఞానమునుగురించి విపులముగా వర్ణించియున్నారు. క్రీ. శ. పదునొకండవ శతాబ్దములో మహమ్మదుఘజనీ ఈ దేశమునకు ప్రవాసమంపిన అరబ్బీవిద్వాంసు డగు అల్‌బెరూనీ యీదేశములో పదమూడేండ్లు నివసించి హిందూదేశమునుగురించి ఆరబ్బీభాషలో ఒక ఉద్గ్రంథమును వ్రాసియున్నాడు. వీరి రచనలవలన మనదేశముయొక్క పాడిపంటలనుగురించి, పరిశ్రమలనుగురించి, విజ్ఞానసంపదనుగురించి మనకు తెలియుచున్నది. క్రీ. శ. తొమ్మిదవ శతాబ్దములో నీదేశమునకు వచ్చిన అరబ్బీదేశవర్తకులు ప్రపంచములో నింకెక్కడను కూడా తయారు చేయలేనంతటి చక్కని వస్త్రములను ఈ దేశంలో తయారుచేస్తున్నారనిన్నీ,

ఇక్కడి దుస్తులు ఒక బంగారుముద్దుటుంగరములో నుంచి దూర్చగలిగినంత సన్నముగా నున్నవనిన్నీ వ్రాసియున్నారు. క్రీ. శ. 13-వ శతాబ్దిలో నీదేశము నకు వచ్చి తిరిగిచూచిన ఇటలీదేశములోని వెనీసునగరమునందలి సుప్రసిద్ధ వర్తకుడైన మార్కోపోలో హిందూదేశములో అంతటా పత్తిపంట ఒక ముఖ్యమైన పంట అనిన్నీ, ప్రపంచములోకల్లా అతి సున్నితమైనవీ, అంద మైనవీ అయిన బట్టల నీదేశములో- ముఖ్యంగా మన ఆంధ్రదేశంలో తయారుచేస్తున్నా రనిన్నీ వ్రాసియున్నాడు.

## మహమ్మదీయ యుగారంభము

మధ్యయుగంలో స్పెయిను, ఇటలీ, ఆఫ్రికా, అరేబియా, పారశీకము, తురుష్కము మొదలైన దేశాలలో వ్యాపారం చేసే సుప్రసిద్ధవర్త కులందరూ మన దేశంతో విరివిగా వ్యాపారం చేసేవారు. ఇక్కడికి వర్తకం చెయ్యడానికి వచ్చివెళ్లినవా రందరూ ఇక్కడి భాగ్యభోగ్యములనుగురించి తమదేశాలలో వన్నెచిన్నెలతో వర్ణించి చెప్పుతూ వున్నందువల్ల మనదేశపు ధనసంచయములనుగురించీ, రత్నరాసులనుగురించీ, తరుగని బంగారమును గురించీ ఆదేశా లన్నిటిలోనూ కథలు బయలుదేరినవి. అంతట దేశదేశాల వారూ ఇక్కడి ధనకనకవస్తువాహనాలమీద కన్నువేసి ఏదోవిధముగా ఈ ధనమునుచేతజిక్కించుకోవలె నని విశ్వప్రయత్నాలుచేశారు. మహమ్మదుగోరీ మహమ్మదుఘజనీల దండయాత్ర లీయుద్దేశ్యముతో చేసినవే. ఇలాగ ఈ దేశానికి వచ్చిన యవనులు, తురుష్కులు, పారశీకులు, ఆఫ్ఘనులు చాలా మంది ఈదేశముయొక్క పాడిపంటలను, నాగరకతను చూచి ముగ్ధులై ఇక్కడనే స్థిరనివాసము లేర్పరచుకొన్నారు. ఈదేశీయులతో సంబంధ బాంధవ్యములను చేసికొన్నారు. ఇక్కడి మహమ్మదీయులలో నూటికి తొంభయిమూడువంతులు అనేక కారణాలవల్ల పరకమతంలో చేరిన హిందువుల సంతతివారే. మిగిలినవారు పైవిధంగా వచ్చి స్థిరపడిన విదేశాల వారు. ఏమైతేనేమి ఆకాలపు మహమ్మదీయులు ఇప్పటి పాశ్చాత్యులలాగ కొంతకాల మీదేశములో ఉద్యోగములు చేసి వీలైనంత సొమ్మును చే జిక్కించుకొని మూటగట్టుకొని తమ దేశాలకు పోయే పద్ధతి నవలంబించక ఇక్కడనే నెలకొని దీనినే తమ మాతృభూమిగా జేసికొని ఈదేశీయులతో కలిసిమెలిసి ఈదేశముయొక్క అభివృద్ధికోసం సర్వవిధాలా పాటుపడ్డారు. మహమ్మదీయపరిపాలనలో మనదేశీయపరిశ్రమలు, చిత్రకళలు, సంగీత సాహిత్యములు, శిల్పము సర్వతోముఖముగా అభివృద్ధిజెందినవి.

## పాశ్చాత్యవర్తకుల యవతరణము

మొగలాయిచక్రవర్తుల రాజ్యకాలములో ఈదేశానికివచ్చిన పాశ్చాత్య వర్తకు లిచ్చటి అర్థసంపదను చూచి ఆశ్చర్యపడ్డారు. ఈదేశములో తయా రయ్యే జిలుగు వలువలు, రత్నకంబళ్లు, ఇతరవస్తువులు, సుగంధద్రవ్య ములు తమ దేశాలకు తీసికొనివెళ్ళి అమ్మజూపేటప్పటికి ఐరోపాదేశపు స్త్రీపురుషు లటువంటి సున్నితమైన అందమైన, అపూర్వవస్తువుల నిదివరకు చూచినవారు కారుగనుక వీటికోసం ఎగబడి ఈ సరుకులను కనివినియెరు గని ధర లిచ్చి కొనడం ప్రారంభించారు. అందువల్ల పాశ్చాత్యవర్తకు లీసరుకులను మన దేశాన్నుంచి తీసికొనివెళ్ళి నూటికి నూరురెట్లు వంతున కూడా ధరలు పెంచి విక్రయించి అమితలాభాలను పొందడం ప్రారం భించారు. ఈ వ్యాపారం చెయ్యడంలో వుండే అమితలాభాలనుబట్టి అనేక వర్తకసంఘాలు బైలుదేరి హిందూదేశాన్నించి వస్తువులను ఎగుమతిచేసే హక్కు ఇతరులకు లేకుండా తమ కొక్కరికే వుండే ఏర్పాటు చేసుకో దలచి ఆయాదేశముల వర్తకులు తమతమ దేశపు రాజులకు అమితధన మిచ్చి సర్వమక్తావ్యాపారఇజారాపట్టాలు పొంది వ్యాపారం సాగించారు. అప్పటి సరుకుల సంగతీ, ఎగుమతివ్యాపారం సంగతీ చదివితే అది ఒక చిత్రకథలాగ వుంటుంది.

హిందూదేశంలో పత్తిపంటనుకూడా పాడిపంటలతో సమానంగా చూచేవారు. రాట్నాన్ని లక్ష్మిగా పూజించేవారు. వంగరాష్ట్రంలో మొదటినుంచీ మల్‌మల్ అనే జిలుగువలువలు తయారుఅయ్యేవి. తూర్పుసముద్రతీరాన్ని ఉత్కళాంధ్రదేశాలు రంగుల అద్దకాల గుడ్డలకూ, కాలికో లనే సాదాబట్ట లకూ ప్రసిద్ధిజెందినవి. సూరతులో చౌకబట్టలు నేసేవారు. పాట్నాలో విలు వైన వస్త్రాలు తయారుచేసేవారు. మచిలీబందరురంగురుమాళ్ళు, చీటీఅద్ద కాలు, ఉత్తరసర్కారుల 'బెసినెట్' (Basins-Basinets)అనేరకాలు, చెన్నపట్నం లాంగ్‌క్లాతు అనే పొడుగైన తెల్లని తరుచుబట్టలు, ఇంకా పక రకాల బట్టలు పారశీకానికీ, అరబ్బీదేశానికీ, సిరియా ఈజిప్టు అబ్సీనియా ఆఫ్రికాదేశాలకూ ఎగుమతిచేస్తూవుండేవారు. ఇంగ్లీషువర్తకులు రాకపూర్వమే డచ్చి వర్తకులు వీటిని విరివిగా ఎగుమతిచేసేవారు.

## ఐరోపాదేశాలలో అలజడి

హిందూదేశపు బట్టలు చాలా నాణ్యముగానూ, అందంగానూ వున్నం దువల్ల వాటి అమ్మకం ఐరోపాదేశా లన్నింటిలోనూ, ఇంగ్లాండులోనూ విప రీతంగా వృద్ధిఅయి తమ దేశంలో తయారయ్యే రకాలు చెలామణికావటం లేదని గోల బైలుదేరింది. 1678 లో ఇంగ్లాండులో ప్రకటించిన ఒక కరప త్రంలో పిల్లల జుబ్బాలకుకూడా హిందూదేశపు రంగుఅద్దకాలు, చారల కాలికోగుడ్డలు ఉపయోగిస్తున్నా రనిన్నీ, కోటులలోపల అస్తరుగా వేయ డానికిన్నీ, పొట్టిచొక్కాలకున్నూకూడా వంగరాష్ట్రంలోనుంచి దిగుమతి చేస్తున్నా రనిన్నీ, దీనిమీద హెచ్చుపన్ను విధించా లనిన్నీ వ్రాశారు. ఇంగ్లాండులో మల్‌మల్‌గుడ్డవాడకం అన్యాయంగా మితిమీరిం దని ఒకడు 1696 లో వగచినాడు. "పూర్వంనేలమీద అందానికి పరచడానికీ, దిండు మెత్తలకీ, చిన్నపిల్లలకీ, బీదవాళ్ళకీ వుపయోగించే రంగుల చింట్జు అనే రం గుల అద్దకాలగుడ్డలు ఇప్పుడు స్త్రీలందరూ ధరిస్తున్నారు. పూర్వంపనికత్తెలు ధరించడానికి పరువుతక్కువగా ఎంచుకునే హిందూదేశపు కంబళీలను ఇప్పుడు అగర్భశ్రీమంతుల స్త్రీలు చాలా ఉత్సాహంతో ధరిస్తున్నారు. ఇది పరిపాటి అయిపోయింది. నేలమీద పరిచే (చింట్జు) రంగుఅద్దకాల గుడ్డ వీపుమీదికి ఎక్కింది. ఆఖరికి ఇంగ్లాండురాణీగారుకూడా చీనాపట్టువస్త్రములు, హిందూదేశపు కాలికోగుడ్డలు ధరించి అందరికీ మార్గదర్శి అయింది. ఈ బట్టలు మన ఇళ్ళలోకి, మూరుమూలలకు, పడకగదిలోకి ప్రవేశించాయి. తెరలూ, మెత్తలూ, పరుపులూ యీ కాలికాలతోటీ, హిందూదేశపు సరు కులతోటీ తయారవుతున్నాయి. పూర్వం ఇంగ్లాండుదేశపు వున్నితోను, మంచి పట్టుతోను తయారుచేసే స్త్రీల దుస్తులు మన గృహోపకరణములు ఇటీవల హిందూదేశవర్తకులు సరఫరా చేసేవాటితో తయారుచేసేవా"రని 1708 లో డేనియల్ డెఫో (Daniel Defoe) అనే సుప్రసిద్ధపత్రికా విలేఖరి-గ్రంథకర్త వ్రాశాడు.

## హిందూదేశవస్త్రముల నిషేధము

డెఫో వ్రాసేనాటికి కొంతకాలంకిందటనే హిందూదేశపు సరుకులను నిషేధించా లనే ఆందోళన ఇంగ్లాండులో తీవ్రంగా సాగింది. హిందూ

దేశపు పట్టువస్త్రములూ, రంగులద్దకపు నూలుబట్టలూ ఇంగ్లాండులో స్త్రీపురుషులు ధరించకూడదనీ, గృహోపకరణాలకు వాడకూడదనిన్నీ, అలా చేస్తే 200 నవరసులు జుల్మానా విధించబడుతుం దనిన్నీ 1700 సంవత్సరంలో రెండు శాసనాలు చేశారు. కాని 1728 నాటికి కూడా ఈ సరుకులమీద మోజు తగ్గలేదు. ఇది తమ దేశాలకు హానికరంగా వున్న దని ఇంగ్లాండులాగనే తక్కిన యూరోపాదేశాలవారుకూడా నిషేధించడం ప్రారంభించారు. ఇలా చేసినా 1815 నాటికి కూడా హిందూదేశంనుంచి సాలుకు 13,00,000 నవరసుల విలువ గల బట్ట ఎగుమతి అయ్యేది. హిందూదేశంనుంచి ఇంగ్లాండుకు దిగుమతిచేసే నూలుసరుకులమీద నూటికి 10 చొప్పునను, పట్టుసరుకులమీద నూటికి 14 వంతుల చొప్పునను దిగుమతి పన్ను వేశారు. దీనినిగురించి 1831 లో కొందరు వర్తకులు ఇంగ్లాండు దొరతనంవారికి అర్జీ యిచ్చుకున్నారు. ఇంగ్లాండులో యంత్రాలమీద బట్టలు తయారుచేసి హిందూదేశానికి దిగుమతి చెయ్యడానికి విశ్వప్రయత్నాలు చేశారు. హిందూదేశాన్నుంచి దిగుమతి ఆయ్యే తెల్లకాలికో బట్టలమీదా, మజిలిను అనే మల్‌మల్‌జిలుగువలువలమీదా, నాన్కీనులమీదా వేసే సుంకాలు 1787 మొదలు 1814 వరకూ క్రమక్రమంగా వృద్ధిచేశారు. ఇంగ్లాండు దేశాన్నుంచి హిందూదేశానికి అద్దకాలను ఎగుమతి చెయ్యడాన్ని ప్రోత్సహించేటందుకు ద్రవ్యసహాయం చెయ్యడానికి 1783 లోనే శాసనాలు చేశారు. ముప్పైఏళ్ళు ఇంగ్లీషుప్రభుత్వంవారు ఇలాగ ద్రవ్యసహాయం చేసి ప్రోత్సహించారు. క్రమక్రమంగా హిందూదేశపరిశ్రమలను నాశనంచేసి ఎగుమతివర్తకం చంపివెయ్యడానికి ప్రయత్నాలు జరిగాయి. 1757 మొదలు 1829 వరకూ ఎన్నోవిధానాలు అవలంబించారు. అంతట హిందూదేశంలో వస్తువులు తయారుచేసే పారిశ్రామిక వృత్తికళలు నశించి ముడిపదార్థాలను ఎగుమతిచేసి సీమసరుకులు దిగుమతిచేసే దురదృష్టదేశంగా మారిపోయింది.

(England's Debt to India-By Lala Lajpatrai. pp. 121—127)

## ఇంగ్లీషు పరిభాష

పూర్వకాలంనాటి చరిత్ర అలా వుంచి ఇప్పటికి నూరు నూటయాభై సంవత్సరాలకిందట నైనా మన దేశంలో ఏయేరకాల బట్టలు తయారవుతూ వుండేవో వాటిని గురించి మనవాళ్ళు వ్రాసిపెట్టిన చరిత్రలు లేవు. ఆబట్టల రకాలు మచ్చుకైనా యిప్పుడు లేవు. ఇప్పటికీ కొన్నిచోట్లమాత్రం చేనేత నూలుబట్టల పరిశ్రమ కొనవూపిరితో వుంది. పాశ్చాత్యులకూ, ముఖ్యంగా మనల నేలే ఇంగ్లీషువారికీ మాత్రం వాటినిగురించి పూర్తిగా తెలుసును. వాటినిగురించిన వర్ణనలు, చరిత్రలు, ఆ గుడ్డల నమూనాలుకూడా ఇప్పటికీ ఇంగ్లాండులో వున్నవి. మన చేనేతమగ్గాలను, వస్త్రపరిశ్రమను మెల్లిగా నాశనంచేసి ఇంగ్లీషువారు మన ముపయోగించే బట్టల రకాలన్నీ సీమలో తమ మరమగ్గాలమీద తయారుచేయడం ప్రారంభించారు. పూర్వకాలపు బట్టల రకాలకు వుండే పేర్లలో కొన్నిటిని ఆ సీమసరుకులకే నామకరణం చేశారు. ఇప్పటికీ ఇంగ్లీషు వస్త్రపరిశ్రమలో వాడుకలో నుండే అనేకపదాలు మన దేశంలోనుంచి వాళ్ళు గ్రహించినవే.

హిందూదేశానికి పోర్చుగీస్‌వారు ముందుగా వచ్చి పశ్చిమతీరాన్ని మలబారులో వున్న కాలికటు అనే రేవులో దిగి వ్యాపారం ప్రారంభించి నందువల్ల ఈ దేశాన్నుంచి ఇంగ్లాండుకు వచ్చే రకరకాల బట్టలన్నింటినీ ఆ రేవుపేరునుబట్టి కాలికో లనేవారు. ఈమాట ఇంగ్లీషుభాషలో 1540 లో వాడుకలోకి వచ్చిందని ఆక్స్‌ఫర్డు నిఘంటువులో వుదాహరింపబడియున్నది. ఇప్పుడు రంగుఅద్దని సాదా తెలుపుబట్టలనే ఇంగ్లాండులో కాలికో లంటారు. పుస్తకాలఅట్టలకు అంటించే రకరకాల గుడ్డలకు కాలికోఅని పేరువచ్చింది.

హిందూదేశంనుంచి దిగుమతిచేసే అనేకరకాల రంగులలో చుక్కలు గళ్ళు మొదలైన నమూనాల అద్దకాలు వేసిన కాలికో లనే చేనేత బట్టలకు హిందీలో వాడే చింట్, చిట్ అనే పదాలలోనుంచిన్నీ, సంస్కృతంలోని చిత్రకార్పాస మనే శబ్దంలోనుంచిన్నీ 'చింట్‌జ్' అని ఇంగ్లీషువారు పేరుపెట్టారు. ఈపదం ఇంగ్లీషులోకి 1614 లో వచ్చినట్లు ఆక్స్‌ఫర్డు నిఘంటువు చెపుతూవుంది. హిందూదేశపు చేనేతపరిశ్రమను, అద్దకాల పరిశ్రమను అణగద్రొక్కిన తరవాత ఇంగ్లాండుదేశంలో యంత్రాలమీద తయారుచేసే సీమనూలుబట్టలకు పువ్వులు మొదలైన నమూనాలలో రంగులు అద్ది బట్టకు మిషనులో గంజిమెరుగు పెట్టిన గుడ్డలకు 'చింట్‌జ్' అంటున్నారు. వీటిని మనవాళ్ళు చీటీగుడ్డ లంటున్నారు, ఇప్పుడు స్వదేశీమిల్లులలోకూడా చీటీగుడ్డలు తయారుచేస్తున్నారు. శాల్ అనే హిందీ పదాన్నిబట్టి శాలువలకు 'Shawl' అనే ఇంగ్లీషుపదం వాడుకలోకి వచ్చింది.

పూర్వం కిరమూజు (Kermes) అనే కీటకాల శరీరాలలోనుంచి బట్టలకు వేసే ఒకవిధమైన ఎరుపురంగు తయారుచేసేవారు. ఈపదంలోనుంచి ఒక తరహా ఎరుపురంగుబట్టను ఇంగ్లీషువారు క్రెమాయిసీ (Cramoisy) అని ఇప్పటికీ వ్యవహరిస్తున్నారు.

ఉత్తరహిందూదేశంలో కొన్నిచోట్ల బట్టలకు రంగువేయడంలో బంధనవిధాన మనే పద్ధతిని అవలంబిస్తున్నారు. ఈపద్ధతిలో పత్తినిగాని, చిన్నచిన్న నూలుపట్టుపీలికలనుగాని కొన్ని నమోనాలప్రకారము బట్టలకు గట్టిగా అంటగట్టి రంగువేస్తారు. ఆపత్తిపట్టుపీలికలలోనుంచి రంగుచొరకుండా తక్కినచోట్లమాత్రం రంగు అంటుకుంటుంది. ఈపద్ధతికి ఇంగ్లీషులోకూడా Bandna అని వాడుతున్నారు. ఇలాగ పత్తిపరిశ్రమలోను, వస్త్ర పరిశ్రమలోను ఇంగ్లీషువా రుపయోగించే పరిభాషలో చాలాపదాలు మన దేశభాషలలోనుంచి గ్రహించినవే.

తూర్పుఇండియావర్తకసంఘంవారీదేశంలో వ్యాపారం చేసేటప్పుడు ఎగుమతిచేసే కొన్ని బట్టల రకాల పేర్లు చాలా చిత్రంగా వుంటాయి. ఉబ్బెత్తుగా వుండేటట్లు అనేకవిధాలైన బొమ్మలు, వెండిబంగారుజరీపోగులు కలిపి నేసిన వస్త్రములనూ, కేవలమూ జరీతోనే ఆప్రకారం నేసిన కిన్కాబులనూ బ్రోకేడు లని వ్యవహరించేవారు. బందరులోనూ, కాళహస్తిలోనూ తయారుచేసే రంగుల అద్దకం వేసిన చింట్జ్‌పరుపుదుప్పట్లకు ఇంగ్లీషువారు పలంపోరు లనేవారు. పరుపుదుప్పటికి పారశీకభాషలో పెలాంగ్‌పోష్ అని అంటారు. దానినిబట్టి మనవాళ్ళుకూడా దానికి పలంగిపోష్ అన్నారు.

నెల్లూరులో తయారుచేసే నీలవర్ణపు నూలుబట్టలకు సాలె - పురము అనే మాటలను కలిపి సాలెంపోరు లనేవారు. ఈమాట 1598 లో వాడుకలోకి వచ్చిందని ఆక్స్‌ఫర్డునిఘంటువులో వుదాహరింపబడింది.

దేవతావస్త్రాలని ప్రపంచమంతటా ప్రసిద్ధిజెందిన డాకామజిలిన్ అనే మల్‌మల్‌బట్టల పేరును తీసి మన ఢాకామజిలినులాంటి సన్ని

బట్టను యంత్రాలమీద తయారుచేసి పుస్తకంపూదిరిగా మడతపెట్టి అమ్ముతూవున్నందువల్ల దానికి బుక్కుమస్లిన్ అన్నారు. అంతే కాదు. ఒకరకం అంచులేని తెల్లనిబట్టను యంత్రాలమీద తయారుచేసి దానికి 1702 ర. 1703 ర.'మల్లు' అని పేర్లుపెట్టారు.

౨

ప్రత్తిని పండించి, నూలు వడికి, బట్టలునేసే విధానాలను గురించి వేదములలో చిత్రవిచిత్రాలుగా వర్ణించబడివున్నందువల్ల ఈ విద్య మన దేశంలో ఎంత పురాతనమైనదో ఊహించడానికి వీలులేకుండా వుంది.

మానవహస్తములతో తయారుచేశారంటే నమ్మలేనంత సన్నని దారపుపోగులతో, ఎన్నోరకములైననేతలతో,రంగులతో;అలంకారములతో చిత్రచిత్రాల నమూనాల జిలుగువలువలు, రవసెల్లాలూ, క్రీస్తుకుపూర్వం చాలాసంవత్సరాల కిందటినుంచీ ఇప్పటికి నూరు నూటయేబది సంవత్సరాల కిందటివరకూ మన దేశాన్నుంచి ఇతరదేశాలకు ఎగుమతీ అవుతూవుండేవి.

రామాయణంలోనూ, మహాభారతంలోనూ పట్టుబట్టలనుగూర్చి వుదాహరింపబడియున్నందువల్ల ఆకాలంనాటికే మన దేశంలో పట్టుబట్టలు కూడా తయారుఅవుతూవుండేవని నిస్సంశయముగా చెప్పవచ్చును, సంస్కృతములో పట్టుపురుగులు వర్ణించబడినవి. అందులో ఒకటి ఇంద్రగోపము. మన దేశంలో టసర్, ముగ, ఇరీ లనే మూడురకముల పట్టుపురుగులను పెంచి పట్టుపోగులు తీసి పట్టుబట్టలు నేస్తూవుండేవారు. మల్బెరీ అనే పట్టుపురుగును మాత్రము విదేశవర్తకు లిటీవల తీసుకొనివచ్చినా రని కొందరి అభిప్రాయము.

## పట్టుతో సమానమైన నూలు

మన దేశంలో మొదటినుండీ కూడా మేలురకముల నూలుబట్టలకు పట్టుబట్టలతో సమానమైన గౌరవమేవుండేదని చెప్పడానికి చాలానిదర్శనము లున్నవి. సంస్కృతములోను, తెలుగులోనుకూడా కొన్నిశబ్దాలు, పదాలు అమూల్యమైన నూలుబట్టలకూ, పట్టుబట్టలకూ సమానార్థకంగా ఉపయోగింపబడుతున్నవి. పట్ట మనే సంస్కృతశబ్దానికి పట్టు అనిన్నీ, నేసిన పట్టుబట్ట అనిన్నీ, రంగుఅద్దిన వస్త్రవిశేష మనిన్నీ అర్థము లున్నవి. పట్టాంశుకమనగా సంస్కృతంలో సన్నని జిలుగువలువ అని అర్థము. పట్ట మనగా తెలుగులో పట్టునూలు అని అర్థము. ఇప్పటికీ గంజాము, విశాఖపట్నముజిల్లాలలో నాణ్యమైన పనితనము గల సన్నని నూలుబట్టలకు పట్టునూలుబట్ట లంటారు. అవి నేసేవారిని పట్టుసాలె లంటారు.

పట్టుదారంతో సాదాపట్టుబట్టలను నేయడమేగాక రకరకాల రంగులు వేసిన పట్టుతాపితాలు, పట్టుపీతాంబరాలు నేసేవారు. దారానికే రంగులు వేసి వాటితో అనేకరకాల పువ్వులు, కాయలు, తీగలు, వృక్షములు, పశుపక్ష్యాదులు మొదలైనబొమ్మలు, చారలు, గళ్ళు నేతలోనేకల్పించేవారు. జరీపోగులతో అలాంటి చిత్రాలూ, నమూనాలూ వచ్చేటట్లు నేసేవారు.

పట్టుబట్టలలో మేలైన రకాలకు ప్రత్యేకపేళ్ళుండేవి. కాశీపట్టుతాపితాలూ, చీరలూ యిప్పటికీ ప్రసిద్ధిచెందిన రకాలుగా వున్నాయి, 'తాపితా' అంటేనే మేలైన రకముపట్టుబట్ట అని అర్థం. చీనాంశుక మనేది కొన్ని ప్రత్యేకలక్షణములు గల మేలైన పనితనము గల పట్టుబట్ట. దీనిని పాశ్చాత్యులు 'శాటిన్' అని అంటారు. నూలుబట్టలకూ, పట్టుబట్టలకూకూడా అనేకవిధాలైన రంగులు, చాయలు అద్ది రకరకాల బట్టలుగా తయారుచేస్తారు. నూలుపోగులకూ, పట్టుదారాలకూ కూడా రంగువేసి ఆ పోగులతోనూ, జరీపోగులతోనూ నేతలోనే అనేకచారలు, గళ్లు, బొమ్మలు కల్పిస్తారు.

నూలుబట్టలకూ, పట్టుబట్టలకూ అలంకారంచేసే పద్ధతులలో ఇంకా కొన్నితరహాలు వున్నవి. రంగురంగుల దారముపోగులతో నూలుబట్టలమీదగాని, పట్టుబట్టమీదగాని అనేకనమూనాలచారలు, గళ్లు, బొమ్మలు కుట్టే పద్ధతికి బుటేదారీపని అని పేరు. ఇందులో ఇంకా విశేషా లున్నాయి. పట్టుకుచ్చులు, జరీకుచ్చులు, ముత్యాలు, గాజుపూసలు, అద్దపుబిళ్ళలు, వెండి బంగారుపరకు రేకులు కలిపి చమత్కారంగా కుడతారు.

పట్టుబట్టలు, నూలుబట్టలు నేయడము, వాటికి రంగువేయడము, చిత్రవిచిత్రాల నేతలు నేయడము, బుటేదారీపని చేయడము అంతాకూడా చేతితోనే చేసే పనిగనక పనివాళ్ళు చాలా శ్రమపడి చాలాతెలివితేటలూ, పనితనమూ చూపాలి. ఒక్కొక్క బట్ట తయారుచెయ్యడానికే చాలాకాలం పట్టేది. ఇప్పటిలాగ మరమగ్గంమీద శరపరంపరలుగా తయారయ్యేవి కావు. అందువల్ల అలా నేసిన వస్త్రాలు చాలా ఖరీదు వుండేవి. ఒక్కొక్కటి కొన్నివందల వరహాలు, వేలవరహాలుకూడా విలువచేసే అమూల్యాంబరాలుండేవి. వాటిని రాజాధిరాజులు, వారి అంతఃపురస్త్రీలూ, అగర్భశ్రీమంతులూమాత్రమే కొనగలిగేవారు. ఇలాంటి అమూల్యాంబరాలన్నింటికీ మనవారు 'చీనిచీనాంబరా' లనేవారు. చీనాదేశానికీ, చీనాదేశపు సరుకులకూ పూర్వకాలంలో చాలా గొప్ప ప్రఖ్యాతి వుండడమే దీనికి కారణం.

## చీనీ-చీనముల ప్రశస్తి

పూర్వం చాలాకాలంనుంచీ మన దేశానికీ చీనాదేశానికీ రాకపోకలూ, వర్తకవ్యాపారాలూ జరుగుతూవుండేవి. చీనాదేశంనుంచి మన దేశానికి అనేకసరుకులు దిగుమతిఅవుతూవుండేవి. చీనాసరుకులకు చాలా ప్రఖ్యాతి వుండేది. అందువల్ల 'చీనా' అనే శబ్దము మేలురకము అనే అర్థంలో ఉపయోగించేవారు. మన దేశంలో తయారైన వస్తువులను కూడా చీనావస్తువు లనే అనేవారు. ఇప్పటికీ చీనాపంచదార, చీనాకలకండ, చీనారేకు, చీనాపట్టు అనే మాటలను వింటూనేవున్నాము. ఇవన్నీ మొదట చీనాదేశంనుంచి దిగుమతి అయ్యేవి. తరువాత ఆరకాలన్నీ మన దేశంలోనే తయారుఅవుతూవుండేవి.

'చీని'అనేది చీనమనే శబ్దంయొక్క రూపాంతరము. చీనిఅనేమాటకు చీనాదేశపు సరుకులు, ముఖ్యంగా పట్టుబంగారుసరుకులు;- ఫిలిగ్రే (అనగా పూసలతోనూ, తీగెలతోనూ అల్లికపనితో తయారుచేసే నాజూకువస్తువులు) అని సి. పి. బ్రౌనుదొరగారు తమ తెలుగు - ఇంగ్లీషునిఘంటువులో వ్రాశారు. వెండిబంగారుల పూత పూయు మొలాముపనికికూడా చీనీపని అనేవారు. కుట్టుపనిలో ఒకరకం మడుపుకుట్టుకుకూడా చీనీకుట్టు అని పేరు. మేలైన ఒకరకము పట్టుబట్టను చీనాంశుక మని సంస్కృతంలో వ్యవహరించేవా రని పైన చెప్పేవున్నాముకదా! ఇలాగ 'చీనీ' అనే పదమూ, 'చీన' మనేపదమూ మన దేశంలో చాలా పరిశ్రమలలో అనేకసందర్భాలలో వాడుతూవుండేవారు. అనేకవస్తువుల పేర్లకు ఆపేర్లను తగిలించేవారు.

చీనీ అనే పదము ఒకతరహారంగుల అద్దకంలో ఒక సాంకేతిక పదంగా ప్రయోగింపబడుతూవుంది. రంగురంగుల నూలుబట్టలనూ, పట్టుబట్టలనూ తయారుచెయ్యడంలో అవి నేసే పడుగుపేకల దారాలకూ అక్కడక్కడ కొన్నిచోట్ల ప్రత్తినిగాని, పట్టుపీలికలనుగాని బిగించి కట్టి ఆనరువాత రంగులో ముంచగా అలా బంధించినచోట్ల రంగు పొరకుండా తక్కినచోట్ల చాయ అంటుతుంది. అలాగ రంగువేసిన పట్టునూలుపోగులతో నేస్తే రకరకాల గళ్ళుచారలు నేతలోనే తయారవుతవి. ఆబట్టలు చాలా బాగా వుంటవి. ఈ బంధనపద్ధతిలో దారాలకు చాయవేసే పనికే చీనీ అని సాంకేతికనామం వ్యవహారంలో వుంది. ఈవిధంగా నూలుకు చాయవేసే పద్ధతికి చీనాదేశంతో సంబంధ మున్నట్లు కనపడదు. మన దేశంలోనూ, తూర్పున ఇండోచైనాదేశంలోనూ, జావా సుమత్రా బలి మొదలైన ద్వీపాలలోనూ, పశ్చిమమున పారశీకతురుష్క దేశములలోనూ ఈపరిశ్రమ వ్యాపించి వున్నది. చీనాదేశంతో సంబంధం లేని ఈ పరిశ్రమకు ఈ పేరు రావడంలోనే ఈ చీనీశబ్దమూ, చీనాశబ్దమూ ప్రపంచంలో ఎంత ప్రజాదరణకు పాత్రమైనవో తెలుస్తుంది.

పైన చెప్పిన సందర్భములో మన దేశంలో అనాదికాలంనుంచీకూడా మంచి పనితనముతో తయారైన మేలైన రకాల పట్టుబట్టలనూ, జిలుగు వలువలనూ, రవసెల్లాలనూ చీనిచీనాంబరా లని వ్యవహరించడంలో ఆశ్చర్యం లేదు. ఇప్పుడు చీనిచీనాంబరా లనే మాట ఎక్కువ వాడుకలో లేకపోయినా గ్రంథాలలోమాత్రం ఆపదము కనబడుతూవుంది. 'చీనము' అనే పదానికి నూలు వస్త్రవిశేషము అనే అర్థములు రూఢములైయున్నవి. శబ్దరత్నాకరంలో ఈ అర్థములే వుదాహరింపబడినాయి.

## ఢాకామజిలిన్ అనే మల్‌మల్‌బట్టలు

'ఢాకామజిలిన్' అని ప్రపంచంలో ప్రసిద్ధికెక్కిన 'మల్‌మల్' జిలుగువలువల సంగతి ఇప్పుడు చెపితే ఎవ్వరూ నమ్మరు. అవి నేయడానికి తీసే నూలుపోగు ఊదితే ఎగిరిపోయేటంత ఉలిపిరిగా వుండేది. ఆ నూలు వడికినవి మనుష్యుల చేతులో, దేవతాహస్తములో అని ఆశ్చర్యపడేటంత సున్నితమైనది. ఆనూలుపోగులతో నేస్తూవుంటే అది సాలెవాని మగ్గమో, సాలీడుమగ్గమో చెప్పడం కష్టంగా వుండేది. ఈమల్‌మల్ జిలుగువలువలనుగురించి మన దేశంలోనూ, ఐరోపాదేశంలోనూ అనేక ఉపమానాలు వాడారు. దీనిని నీటి ప్రవాహమని, అల్లిన గాలియని, సాయం సమయమున కురిసే మంచు అని కవులు వర్ణించారు. సామాన్యజనులు కూడా వీనిని అనేకపేర్లతో వ్యవహరించారు.

ఔరంగజేబు చక్రవర్తి ఒకమాటు తన కొమార్తెను చూసి ఒళ్ళు కనబడేటట్లు-చీర కడుతున్నా వేమని మందలించగా ఆమె "తండ్రీ, ఈమల్‌మల్ చీరెను నావొంటిచుట్టూ ఏడుసార్లు చుట్టుకున్నానుసుమీ" అని జవాబు చెప్పిందని చెప్పుకుంటారు.

ఈకథ ఢాకా వస్త్రపరిశ్రమ చరిత్రనుగురించి బాట్‌గారు వ్రాసిన గ్రంథములో నుదాహరింపబడి యున్నది.

ఇలాంటికథే ఒకటి గౌతమబుద్ధుని గురించికూడా ప్రచారంలో వుంది. సిద్ధార్థు డొకనాడు గంగద్గామెయను నామె విగతవస్త్రగా తిరుగుచున్నదని భ్రమపడి యామెను మందలించగా ఆమె తనయొంటి విందుగా ఉలిపిరి జిలుగువలువను ధరించియుండుట నాయనకు జూపెను. అప్పటినుండి ధర్మనిష్ఠగల యాడువారెవ్వరున్నూ ఆలాంటి రవసెల్లాలను కట్టుకోకూడదని బుద్ధభగవానుడు శాసించినాడు. గంగద్గామె ధరించిన వలువ కాశీ ఘనరాజు గసల్ రజులుకు బంపిన పలుచని మల్‌మల్ వస్త్రము. శ్రీ హరవిలాస శారదాగారు 'హిందువులఆధిక్యం' మను గ్రంథమున నీ కథను వ్రాసియున్నారు. (చూడు: శ్రీ దాసు దామోదరరావుగారి అనువాదము, పుట 566) (Journal of the Asiatic Society of Bengal Vol VI. 1837; Csoma's Analysis of the Dulva) దీనినిబట్టి ఈ జిలుగు వలువల పరిశ్రమ ఎంత పురాతనమైనదో తెలుస్తూవుంది.

గ్రీసుశిల్పంలోలాగ వస్త్రవిహీనములైన స్త్రీపురుషుల బొమ్మలను హిందూదేశంలో చెక్కరు. అయితే హిందూదేశంలో వివిధప్రాంతాలలో కనబడే అందమైన పురాతనశిలావిగ్రహాలను చూస్తే వాటికి ఒంటిమీద బట్ట వున్నదా లేదా అని అనుమానం కలుగుతుంది. కాని కొంచెము పరికించి చూస్తే ఆవిగ్రహముయొక్క అంగసౌష్ఠవము నావంతయైనా మరుగుపరచనంత ఉలిపిరివస్త్ర మొకటి ఆ అవయవముల నాచ్ఛాదించియున్నట్లు కనపడుతుంది.

వస్త్రములను కుచ్చెళ్ళుపెట్టి కట్టడంలో ఏర్పడే పింజలవల్లను, మడతలుచూపడంవల్లను, బట్టకట్టులో కనబడే మెలికలు, మడతలు చూపడంవల్లను, గాలికి కదలి జీరాడుతున్నట్లుగా గాని, ఎగురుతూవున్నట్లు గాని, శరీరానికి అంటిపెట్టుకున్నట్లుగాని చూపుటవల్లను ఆవస్త్రముల కలరూపు తెలియవలసినదేగాని ఆకస్మికంగా చూస్తే అసలు వాటికి వస్త్రము లున్నట్లే తెలియదు!

వేదశాస్త్రపురాణములలోనూ, కావ్యములలోనూ కూడా ఈ జిలుగు వలువల వర్ణనము వున్నందువల్లను, శిల్పములో సాక్షాత్తుగా కనబడుతూ వున్నందువల్లను, చీనాగ్రీకుదేశయాత్రికుల వర్ణనలలోకూడా కనబడుతూ వున్నందువల్లను ఈ రవసెల్లాలు, దుకూలముల పరిశ్రమ ఎంత ప్రాచీనమైనదో గ్రహించవచ్చును.

కొన్నివందల గజాల పొడుగు గల మల్‌మల్‌గుడ్డ ఒకపౌను కూడా తూగేది కాదు. ఒకగజంవెడల్పు, పదిగజముల పొడుగు మల్‌మల్ వస్త్రముఖరీదు అయిదువందలరూపాయీ లుండేదని ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా అనే ఆంగ్లవిజ్ఞానసర్వస్వంలోనే వ్రాయబడివుంది.

## కాశ్మీరశాలువలు

ఉత్తరహిందూస్థానములో-ముఖ్యముగా పంజాబుకాశ్మీరదేశములలో రకరకాల కంబళ్ళు, ఉన్నిబట్టలు చిరకాలంనుంచి తయారుచేస్తూవుండేవారు. వీటిలోకల్లా కాశ్మీరశాలువలు, చోగాలనే ఉన్నిఅంగీలు దేశదేశాలలో ప్రసిద్ధికెక్కినవి. ఇందులో సాదానేతవి, బుటేదారీపనిచేసినవి అని రెండు రకాలు వుండేవి. మనదేశంలో ఇంగ్లీషువారి రాజ్యం గట్టిపడి వారిదేశంలో యంత్రాలు అభివృద్ధికాగానే స్కాట్లండులో పెయిస్లీ అనే వూళ్ళో మన కాశ్మీరశాలువలలాంటివి మరలమీద తయారుచేసి దిగుమతిచెయ్యడం ప్రారంభించారు. తరవాత కొంతకాలానికి జర్మనీవారుకూడా ఈవ్యాపారం సాగించారు.

## చీటీగుడ్డలు

హిందూదేశంలోని అజంతా అమరావతీచిత్రములలోను, రాజపుత్ర మొగలాయిచిత్రములలోను రంగుబట్టల షోకు స్పష్టంగా కనబడుతూవుంది. సన్నని జిలుగువలువలలోను, కిన్కాబుజరీపట్టుబట్టలలోను రకరకాల బొమ్మలు, చారదోరియాగడినేతలు, నగిషీలు మొదలైన చిత్రకల్పనలు అనేకవర్ణాలలో నేసేవారు. బట్టమీద అద్దకంవేసే బొమ్మలలోను, అంచులలో వేసే బొమ్మలలోను, నమూనాలలోను దేవమనుష్యవర్గములు, భూచర జలచరవర్గములు, పశుపక్ష్యాదులు, పుష్పఫలవర్గములు, వృక్షవిశేషములు, భూగోళఖగోళవిశేషములు, రచనలు ఎన్నో వుండేవి. ఇలాంటి రంగుల్ని అద్దకాలు చేసిన గుడ్డలను సంస్కృతంలో చిత్రకార్పాసము అనేవారు హిందీలో చింట్, చీటీ అనేవారు. పాశ్చాత్యవర్తకులు వీటికి చింట్జ్ (Chintz) అని పేరుపెట్టారు. వీటినే మనవాళ్ళు చీటీగుడ్డ లనేవారు. అద్దకములు, చిత్రములు వేసే ప్రత్యేకవిధానములు, వాటికి లక్షణగ్రంథాలు కూడా సంస్కృతంలోను, దేశభాషలలోను కనబడుతున్నవి.

## రకరకాల రంగుల అద్దకాలు

బట్టలకు రంగులువెయ్యడము రంగుల అద్దకము చాలా పనితనముతో కూడిన ఒక గొప్ప పరిశ్రమగా పరిణమించింది. పైనచెప్పిన చిత్రవిచిత్రాల బొమ్మలు, నగిషీలు, నమూనాలు గల కొయ్యదిమ్మలతో తెల్లని బట్టమీద నల్లని రంగులతో వేయడము మొదలుకొని ఒక్కొకభాగమున కొక్కొక రంగు పూసిన దిమ్మలతో ముద్రించిన రకరకాల వర్ణచిత్రముద్రణమువరకూ గల చిత్రకళ వర్ధిల్లింది. రంగులు తయారుచెయ్యడంలోనూ, రంగులు ముద్రించడంలోనూకూడా అనేకఉపాయాలు కనిపెట్టారు.

## కలంకారీఅద్దకం

ఇనపతీగెలకుంచెనుగాని, ఇనపకలముపుల్లనుగాని చేతితో పుచ్చుకొని బట్టలకు రంగువేసే చిత్రకళకు కలందార్ అనే మాటలోనుంచి కలందారీ అని పేరు వచ్చింది. దీనికే మనవాళ్ళు కలంకారీఅద్దకా లని పేరు పెట్టారు.

ఈ కలంకారీపనిలో ముందుగా గుడ్డను కరిగిన మైనంలో ముంచి ఒక ఇనపతీగెలకుంచెగాని, కలముగాని చేతిలో పుచ్చుకొని దానిమీద కావలసిన గీతలు, నగిషీలు, నమూనాలు, బొమ్మలూ వ్రాతపనిలో చిత్రించి ఆయా చోట్ల కావలసిన రంగు పూసి ఎండబెట్టి తరవాత గుడ్డ ఉడకబెడతారు. అంతట మైనం కరిగిపోయి వ్రాతపని మిగులుతుంది. ఒకరంగు వేసినతరవాత ఇంకొక రంగు వెయ్యడానికి మళ్ళీ గుడ్డను మైనంలో ముంచి దానిమీద మళ్ళీ వ్రాతపని చేసి రంగు పూసి ఎండబెట్టి మళ్ళీ వుడకబెడతారు. ఇలాగ ఎక్కడెక్కడ ఎన్నిరకాల రంగులు వెయ్యా లంటే అన్నిమాట్లు బట్టను మైనంలో ముంచి అన్నిమాట్లు ఆయాచోట్ల వ్రాతపని చేసి కావలసిన రంగులు పూసి ఎండబెట్టి మైనం పోయేటట్లు మళ్ళీ బట్టను వుడకబెడుతూవుండాలి. ఈపని చాలా జాగ్రత్తగా చెయ్యాలి. లేకపోతే రంగులు అలుక్కుపోతాయి. ఈకలంకారీ వ్రాతపని, రంగుల అద్దకం పరిశ్రమ మచిలీపట్నంలోనూ, కాళహస్తిలోనూ ఒక చిత్రకళగా అభివృద్ధిజెంది దేశదేశాలలో ప్రసిద్ధికెక్కినవి. అక్కడ తయారయ్యే సరుకులను పాశ్చాత్యదేశాలకు ఎగుమతిచేసేవారు. బందరుకలంకారీ అద్దకందుప్పట్లమీద రామాయణ మహాభారత ఇతీవలి చరిత్రకు సంబంధించిన చిత్రాలుకూడా చిత్రించేవారు. పారసీ భాషలో దుప్పట్లకు పెలాంగ్‌పోష్ అనేవారు. దానినిబట్టి మనవాళ్ళుకూడా ఈదుప్పట్లకు పలంగిపోష్ దుప్పట్లు అని పేరుపెట్టారు. ఈమాటను నోట పట్టలేక ఇంగ్లీషువర్తకులు వీటికి పలంపోరస్ అనేవారు.

## రోఘన్ అద్దకంపని

ఉత్తరహిందూస్థానంలో-ముఖ్యంగా పెషావరులో రంగుల అద్దకం పని చెయ్యడంలో గుగ్గిలము మొదలైన పదార్థాలు నూనెతో వండి తీగె పాకం వచ్చేటట్లుగా రోఘన్ అనే ఒకవిధమైన జిగురును తయారుచేసి ఆ పాకంతో బట్టల మీద సన్నని గళ్ళు, గీతలు, చారలు, నమూనాలు తీర్చి దానిమీద వెండిబంగారు మొలాము చూర్ణములను చల్లుతారు. లేకపోతే వెండిబంగారువరకురేకులను అంటిస్తారు. ఈజిగురులో సీమసున్నము కూడా కలిపినప్పుడు దీనితో చిత్రించిన నమోనాలు బట్టలమీద ఉబ్బెత్తుగా వుంటాయి. రాజపుత్ర స్థానములో ఒకతరహా జిగురునుగాని, లక్కనుగాని కొయ్యదిమ్మలతో తలపాగాగుడ్డలమీద అద్ది దానిమీద బంగారువరకురేకులను అంటించేవారు. సన్నని ఉల్లిపొరగుడ్డమీద ఇలాగ వేసిన అద్దకాలు చిత్రచిత్రాలుగా వుంటవి.

## బంధన్ అద్దకం

రాజపుత్రస్థానములోను, మధ్యరాష్ట్రములలోను, గూర్జరీ (గుజరాతు) రాష్ట్రంలోను బట్టలమీద వంకరటింకరగీతలు, చారలు, గళ్ళు, బొమ్మలు ముందుగా తీర్చి ఆయాచోట్ల వత్తినిగాని, పట్టుపీలికలనుగాని గట్టిగా బిగించికట్టి రంగు పారకుండా బంధించి ఆబట్టలకు చాయ వేస్తారు. అంతట అలాగ బంధించినచోట్ల రంగు అంటకుండా తక్కినచోట్ల మాత్రమే రంగు అంటుతుంది. ఈపద్ధతికి బంధన్‌పద్ధతి అని పేరు.

## చీనీపద్ధతి

చీనీ అనే రంగులఅద్దకం పద్ధతిలో నిలువుఅడ్డములు నేసే పడుగుపేకల నూలుపోగులకే పైన చెప్పిన బంధనములు చేసి వివిధమైన రంగులు వేస్తారు. అలాగ రంగువేసిన నూలుతో నేసిన బట్టలు చాలా వసందుగా వుంటవి. పంజాబులోను, కాశీలోను, తంజావూరు జిల్లాలో అయ్యంపేటలోను నిలువుఅడ్డము చారలు, గళ్ళు గల రంగుచీరెలు తయారు చెయ్యడంలో ఈపద్ధతితోనే రంగులు వేస్తారు.

## బ్రోకేడులు—కిన్కాబులు

మనదేశపు పట్టుసాలెలు, నేతగాండ్రు పట్టుబట్టలను, నూలుబట్టలను నెయ్యడంలో వర్ణనాతీతమైన పనితనమును, చాతుర్యమును చూపించేవారు. మామూలు పడుగుపేకల నేతలోనే కొన్ని చమత్కారాలు చూపించేవారు. ఇదిగాక సన్నని సూదులవంటి కదుళ్ళను పడుగులోకి దొన్పి రకరకాల రంగుల దారములను నిలువునేతలో కలిపి నేయడంలో బట్టలమీదను, అంచులలోను అనేకరకాల దోరియాలు, చారలు, గళ్ళు, బొమ్మలు ఉబ్బెత్తుగా వచ్చేటటు నేసేవారు. ఇలాగ నేసిన రకరకాల నూలుపట్టుబట్టలను ఇంగ్లీషువారు బ్రోకేడు లనేవారు.

మన దేశంలో పట్టుబట్టల నేతలోనే గాక సన్నని జిలుగువలువల నేతలోకూడా కాయలు, పువ్వులు, తీగెలు, చెట్లు, చేమలు, దేవమనుష్యవర్గ

మునకు చెందిన బొమ్మలు, రకరకాల నగిషీనమూనాలు ఉబ్బెత్తుగా వచ్చేటట్లుగా పట్టునూలు జరీపోగులు కలిపి నేసేవారు.

కాశ్మీరశాలువల నేతలోకూడా 'కనికర్' అనేరకము ఈపద్ధతిలో నేసినవే. అచ్చుపట్టుబట్టలు, పట్టునూలు కలిసినబట్టలు, జరీపోగులతో కలిపి నేసిన కిన్కాబులు (kinkhwab) అనే వస్త్రములు ఈతరగతికి చెందినవే. పైన చెప్పిన నమూనాలలోను, బొమ్మలలోను కొన్ని వెండి బంగారుజరీపోగులు వేసి నేయడం మొదలుకొని కేవలమూ జలతారుతోనే నేసి తయారుచేసిన జరీబట్టలవరకూ అనేకరకాల కిన్కాబులు వుండేవి.

అచ్చుపట్టుద్రోకేములో బట్టలమధ్య పువ్వులున్నూ, అంచులలో కొన్నిరకాల చెట్లబొమ్మలున్నూ వేసేవారు. ఈరకాలలో సూరతుపట్టుబట్టలే చాలా ప్రశస్తమైనవిగా వుండేవి. అచ్చుజరీకిన్కాబులలో కాశీ అహమ్మదాబాదు ఔరంగబాదు జలతారుబట్టలు చాలా ప్రశస్తమైనవి.

## జలతారు పరిశ్రమ

పట్టునూలుబట్టలలో కలిపినెయ్యడానికీ, కేవలము అలంకారముకోసం ఏర్పడిన బుటేదారీపనికీ పనికివచ్చే వెండిబంగారుజలతారుపోగులను తయారు చేయడం ఒక గొప్ప పరిశ్రమగా అభివృద్ధిజెందింది. తలవెంట్రుకలంత సన్నముగా వెండిబంగారు తీగెలను కమ్మెచ్చులలో సాగదీసి అతిసున్నితమైన బద్దెలుగా కొట్టి పట్టుదారములతో కలిపి మెలికలుతిప్పి జరీపోగులను తయారుచేస్తారు. దీనిని అనేకవిధాలైన నూలుపట్టుదారములతో కలిపిన్నీ కలపకుండా ప్రత్యేకము జరీపోగులతోనూ చిత్రవిచిత్రములైన నమూనాలూ, రకరకాల బొమ్మలూ వచ్చేటట్టుగా నేస్తారు. ఈజలతారుపనిలో జరీ, జరపోసు, సరిగ, పైఠాణి, పైఠిణీ, వరఖులకు ఒకలాటు అన రక రకాల పేర్లుగల సరుకులు చేసేవారు. రక రకాల జలతారులు, మొలాముచేసిన రాగి, జలపోతసరుకులు, నక్కీలు బైలుదేరినవి. పంజాబు రాజపుత్రస్థానముల స్త్రీలుధరించే పుల్కారీలనుఐరోపాలోతెరగుడ్డలుగా వుపయోగించేవారు.

## బుటేదారీపని

పట్టునూలు, జలతారుల నగిషీకుట్టుపనికి బుటేదారీపని అని పేరు. ఇది చాలా పురాతనమైన చిత్రకళ. బుటేదారీపని చేసిన దుస్తులూ, బుటేదారీ పని చేసే సూదులూ వేదములలో కూడా వర్ణింపబడివున్నందువల్ల ఇది ఎంత ప్రాచీనమైనదో గ్రహించవచ్చును. బుటేదారీపనిలో సాధారణంగా ఎర్రనూలు బట్టమీద పసుపుపచ్చని పట్టుదారముతో వెనకనుంచి సూదితో కుడతారు. దుస్తులకు, బట్టల అంచులకు అల్లికపని చేసి పట్టుజరీ కుచ్చులు తగిలిస్తారు. కొన్నిచోట్ల గాజుపూసలు, ముత్యాలు కలిపి కుడతారు. కొన్ని చోట్ల బుటేదారీపని చేసిన వస్త్రములలో అద్దపుబిళ్ళలను కలిపి కుడతారు. అద్దాల రవికె లని ప్రసిద్ధి జెందిన బుటేదారీపని చేసిన రవికెలు మన తెనుగుపాటలలోకూడా వర్ణింపబడివున్నవి.

పంజాబులోను, రాజపుత్రస్థానమున జయపురములోను తెరలూ, డాలులకు కుట్టే మెత్తలున్నూ, కాఠియవాడులో స్త్రీలు ధరించే చొక్కాలు, అంగీలు, పిల్లల టోపీలూ బుటేదారీపనితనమునకు ప్రసిద్ధిజెందినాయి. వంగరాష్ట్రంలో ముఖ్యంగా మూర్షిదాబాదులోను, ఇంకా ఇతరచోట్లను కమ్మర్‌బంద్ లనే నడికట్టుల మీద చేసే బుటేదారీపని హిందూదేశంలో కల్లా అందమైనదని ప్రసిద్ధికెక్కింది.





# త్యాగరాజప్రశంస

౧

శ్రీరామాంఘ్రి సరోజయుగ్మమధుసంసేవాప్రమత్తాంతరం
గా! రావోద్భవ దివ్యగాన జలధీ! అవ్యాజ కారుణ్యతే
జోరాశీ! ఇదె నీపదంబుల శిరస్సున్ జేర్చి ప్రార్థింతు, నన్
గారాబంబునఁ ద్యాగరాజ! తనయున్‌గా నెంచి పాలింపుమా.

౨

లోకేశున్ - రఘురాము - దైత్యకులకాలున్ - వేదవేద్యున్ - శ్రితా
నీకార్తిప్రహరున్ - రమావసితహృన్నీరేజు - నప్రాకృతాం

శ్రీ వెదురుమూడి వెంకటకృష్ణారావు

చత్ కళ్యాణతనూవిలాసు నరయన్ శక్యంబె పోతన్నకున్,
నీకున్ గా కిల నేరికైనఁ గవిమాణిక్యంబ వాంధ్రాంబకున్!

3

ఆనందామృతసాగరోర్మిశిఖలం దాబాలగోపాలమున్
స్నానక్రీడలఁ దేల్చు గేయకృతిరత్నవ్రాత మర్పించి, యీ
క్షోణిన్ శాశ్వతజీవమిచ్చి తెలుఁగున్ శోభిల్లఁగాఁ జేసి త
న్నా! నీ యప్పును దీర్ప నాంధ్రులకు నెన్నండేని సాధ్యం బొకో!

4

దురహంకారులు నీకృతుల్ వెలుఁగునన్ ద్యోతించుటల్ సైపమిన్
విరసోక్తుల్ బలుకంగ నీకుఁ గొఱఁతా వీసంబునన్ గూడ? మా
యురవొప్పారెడు చోటఁ బుట్టదని విశ్వేశార్చితప్రాభవిన్
వరగంగన్ వెలివేయు మూర్ఖులకె లోపంబౌను నిక్కంబుగన్.

5

ధరణీదేవకులోచితంబుగను సార్థక్యంబు గాంచంగ శ్రీ
హరిసేవారతి జీవితం బలరఁ జేయన్ గల్గితో సద్గుణా
కర! భవ్యార్థదమైన తావకమనఃకాసారతీర్థాన సే
చరియింపన్ గరుణింపవేఁడెద- నమస్కారంబు భక్తాగ్రణీ!



# పెయింట్లూ, వార్నిషులూ

= శ్రీ పి. గోపాలరావు =

1. నాడు - నేడు

పూర్వం మనదేశంలో చిత్రకారులు వాళ్ల రంగు పనులకు కావలసిన పెయింట్లు (లేపములు), వార్నిషులు వగైరాలను స్వయంగా తయారుచేసుకునే వారు. ఆనాడు పెయింట్లను, వార్నిషులను చెయ్యటం, వాటితో రకరకాల రంగుపనులను చెయ్యటం ఒకే కుటుంబంలో ఉండేవి. అది వారి కులవృత్తిగా ఉండేది. అందువల్ల ఆనాటి పనివాడు తను వాడే రంగుస్వభావాన్ని బట్టీ, వేసేపద్ధతినీ, వెయ్యవలసిన పరిస్థితినీబట్టీ ఆరంగు తయ్యారీపద్ధతిని మార్చుకుంటూ తనకు ఒక శాఖలో గల అనుభవాన్ని రెండవ శాఖలో వినియోగించు కుంటూ చక్కని ప్రావీణ్యమును సంపాదించేవాడు. అతని కుమారుడు తండ్రిఅడుగులలోనే అడుగులేస్తూ, అతనికి సహాయం చేస్తూ, అనుకరిస్తూ, అతని సహాయంతో కొత్త పంథాలు తొక్కుతూ తండ్రితర్వాత తండ్రిస్థానం ఆక్రమించేవాడు. ఈవిధంగా వంశపారం పర్యా వచ్చు కళలు, పరిశ్రమలు చాలా ఉన్నతికి వచ్చాయి.

కాని మన కళలు, పరిశ్రమలు అనుశ్రుతంగా వచ్చే పద్ధతులను తమ స్వానుభవంతో సమన్వయించు కొని సులువుబరువుల నరసి క్రొత్తపంథాలు త్రొక్క గల ప్రాజ్ఞుల చేతులు దాటి స్వార్థపరులైన భేషజులచేత బడి దినదినాభివృద్ధి పొందటానికి బదులు క్షీణించి నశించటం మొదలుపెట్టాయి. తండ్రితాతలనుంచి వచ్చే పద్ధతులను ఆధునికవిజ్ఞానదృష్టితో పరిశీలించి సారము గ్రహించి భేషజాన్ని విడిచిపెట్టటానికి బదులు తమ పద్ధతులు ఇతరులకు తెలిస్తే తమ బ్రతుకుతెరువుకే ముప్పు వస్తుం దనే భయంవల్ల చాలామంది పనివాళ్లు వాళ్ల పూర్వపద్ధతులను సమయానుకూలంగా సంస్కరించుకోవటానికి బదులు వాటి రహస్యాలను పరులకు తెలియకుండా కప్పిపెట్టటమే పరమావధిగా పెట్టుకొని కాలం గడిపారు.



పెయింట్లూ, వార్నిషులను తయారుచేయు రసాయనశాల.

పాశ్చాత్యదేశాల్లోమాత్రం విజ్ఞానదృష్టి ప్రబలటంవల్ల భౌతికరసాయనశాస్త్రాలలో అనేక నూతనపరిశోధనలు జరిగాయి. అందువల్ల రంగులూ, వార్నిషుల తయ్యారీక్రమంలో అనేకమార్పులు వచ్చాయి. పూర్వం కన్న అనేకరకాల ముడిదినుసులు వాడుకలోకి వచ్చినందువల్ల పాతపద్ధతిరంగుపనివాడు క్రమంగా పెయింట్లూ, వార్నిషుల తయ్యారీ విరమించుకొని రంగుపనులను చెయ్యటమే వృత్తిగా పెట్టుకొన్నాడు. పెయింట్ వార్నిషుల తయ్యారీపరిశ్రమ ఒక ప్రత్యేకపరిశ్రమ అయినదాది అది వైజ్ఞానికుల దక్షతక్రింద సర్వతోముఖముగా విజృంభించినందువల్ల రంగుపనివారికి ఆ తయ్యారీలోని ముఖ్యసూత్రాలు అవగాహనచేసుకోవటంకూడ కష్టతరమయింది.

నేడు పాశ్చాత్యదేశాల్లో నూతనవిధులప్రకారం తయారయిన లేపములూ (పెయింట్లు), వార్నిషులూ మన రంగుపనివాళ్లు పాతపద్ధతులలో చాలా ప్రయాసపడి చేసినవాటికన్న మిన్నగా ఉండటంవల్ల మన వారు వాటిని కొనడం ప్రారంభించారు. అందువల్ల మన దేశంలో లేపములను తయారుచేసే పరిశ్రమ పోయి లేపనములను వేయు పరిశ్రమయే మిగిలింది. ఎవరో ఏ దేశంలోనో చేసినవాటిని డబ్బాల డాబు చూచి కొనుక్కొచ్చి వాడుకుంటున్నాం. అంతేకాని ఎందుకు వేస్తున్నామో, ఏది వెయ్యాలో తెలుసుకొని వెయ్యటం లేదు. చివరకు బజారులో మనం అడిగే అసలుసరుకును ఇస్తున్నారో, నకలుసరుకు నిస్తున్నారోకూడా తెలియటం లేదు. నిత్యం పెద్దపెద్ద పెయింటింగుపనులను చేసేవాళ్లలోకూడ, బజారులో 'వైట్ లెడ్' అనే పేరుతో ఇచ్చే రంగులో 'లెడ్' (సీసం) లేదని చెప్పినా, కోపలు వార్నిషు (వాడుకలో 'గోపాలువార్నిషు'గా మారింది) అనే పేరుతో బజారులో గాలను 3 రూ.లు ఖరీదుచేసే వార్నిషులో 'కోపల్' అనే ఉత్తమతరహాజిగురు లేదని చెప్పినా నమ్మలేనివాళ్లు చాలామంది ఉన్నారు.



చాకబారు పెద్దరంగులు ఎండా, గాలితగిలితే ఇలాగు బీటలువారిపోతాయి.

ఇటువంటి పరాధీనత మనకు లేపముల తయారీకి కావలసిన ముడిపదార్థాలు మన రాష్ట్రంలో లేక కాదు. బెరైటిస్ (ముగ్గురాయి), జేగురురాయి, కావిరాయి, గెలీనా, క్రోమైటు మొదలైన ముఖ్యమైన ముడిసరుకులు రాయలసీమలో విశేషంగా ఉన్నాయి. మన దేశంలోని ఖనిజసంపదను వినియోగించుకొంటే మనకు లేని పరిశ్రమ లేదు. ఇట్లుండియు విలువగల ఖనిజములను తెనుగుతల్లిగర్భమునుండి త్రవ్వి, వాగన్లు వాగన్లు బొంబాయి కలకత్తాలకూ, విదేశములకూ రవాణాచేసి త్రవ్వకూలి గిట్టుబాటుఅయితే సంతోషిస్తున్నాము. కావలసిన ముడిసరుకులు అన్నీ ఉన్నప్పటికీ పెయింట్లూ, వార్నిషులూ తయారుచేసి పరరాష్ట్రాలకూ, పరదేశాలకూ పంపటం లేదు. మన ముడి సరుకులను చాలా హీనక్రయానికి ఇతరులకు అమ్మి, వాళ్లు వాటితో తయారుచేసిన పెయింట్లను, వార్నిషులను ఎక్కువ ధరలకు వాళ్లవద్ద కొంటున్నాం. కట్టడాలకు రంగుపూత ఎందుకో తెలియక అవసరవ్యయం మాని అనవసరవ్యయం చేస్తున్నాం.

ఇల్లు కట్టే ప్రతిగృహస్థూ గోడలు పెట్టటానికి ఎన్నో లెఖ్ఖలు వేసి రెండఘుగుల మందానికి తక్కువ కాకుండా చూస్తాడు. ఏమాత్రం తాహతున్నా మంచి రకం ఓకుకలపను వాడతాడు. ఓపినంతలో మంచి పనివాళ్లనే తీసుకొనివచ్చి నగిషీలు చెక్కించి నూరు బల్లతో సహా చక్కని జిలుగుపనిని చేయిస్తాడు. దానితో తన భారం తీరిపోయిందన్నట్లు ఊరుకుంటాడు. గోడల్లో బిగించిన నెల్లాళ్లకే కర్ర రంగు చెడి తెల్లబడితే "తడిస్తే అల్లాకాదూ ?" అనుకుంటాడు. ఏడాది తిరగకుండానే తను మొదట్లో చాలా మక్కువపడి వ్యయప్రయాసల కోర్చి చేయించిన తలుపులు శిథిలమై గాళ్లుపడ్డా, కిటికీ చువ్వలు త్రుప్పుపట్టి, అడుగు కమ్ములు బీటలుతీసి బద్దలైనా ఊరుకుంటాడు కాని "విలువ గల సామాను ఇల్లా పాడయిపోతోందే! దీన్ని సంరక్షించాలి" అనే భావం తట్టదు. ఇందులో కొందరు వాలాయతీ తీర్చుకోవటానికి ఏదో చవుకలో దొరికే పెయింట్లను తెచ్చి పూస్తారే కాని రంగుపూత ఎందుకో తెలుసుకొని తగిన పనిని చెయ్యరు. కట్టడాలను ఎండవానల తాకిడివల్ల శిథిలమవకుండా కాపాడటానికి రంగుపూత అవసరమని గ్రహించటం ముఖ్యం.

2. రంగుపూత రక్షణకా ?

కర్ర, ఇనుము ఎండకు ఎండి వానకు తడిస్తే శిథిలమవటం స్వభావసిద్ధం. కాని "అదంతే" అని ఊరుకుంటే ఎల్లాగ? మధ్యాహ్నపు ఎండలో ఇసుకపుంతలో నడిస్తే కాళ్లు కాలటం స్వభావసిద్ధ మని అల్లాగే



*I use no other than—*
**KERALA SANDAL SOAP**

కేరళ చందన సబ్బు
తప్ప
నేనింకోదాన్ని
వాడుట లేదు.

# కేరళ సబ్బులు

Kerala




**SANDAL SOAP**
**KERALA SOAP INSTITUTE, CALICUT.**

గ్యారంటీగా
పరిశుభ్రమైనవి.

---

శరీరమునకు
చక్కని ఆరోగ్యము, పరిమళము, సౌందర్యము నొసంగుటచే
ఆకర్షణీయమైనవి.

---

తయారుచేయువారు:—

## కేరళ సోప్ ఇన్‌స్టిట్యూట్,
కాలికట్టు.
(ప్రభుత్వసంస)



---



---

నడస్తామా? కాళ్లు కాలకుండా జోడు తొడుక్కుంటాం, ఎండ తగులకుండా గొడుగు వేసుకుంటాం. అల్లాగే శీతోష్ణస్థితులకు కట్టడాలు శిథిలమవకుండా పెయింట్లను, వార్నిషులను పూస్తాం. పెయింటు వెయ్యకపోతే కర్రలో చమురు ఆరి, బుగిలిగాళ్లు పడుతుంది; ఇనుము త్రుప్పుపట్టి, బెత్తులు బెత్తులుగా ఊడి విరుగుతుంది. ఎండలో ఉన్నవానికన్న పందిట్లో ఉన్నవానికి ఎండదెబ్బ తక్కువగా తగిలినట్లే, కట్టడాలమీద ఏదైనా రక్షణ ఇచ్చే పూత ఉంటే ఆ పూతక్రింద నున్న భాగం శీతోష్ణస్థితులవల్ల శిథిలమవదు.

పందిట్లో చల్లదనం దానిమీద కప్పిన ఆకు చిక్కదనంమీద ఎల్లా ఆధారపడుతుందో అల్లాగే పెయింటు నాణ్యాన్నిబట్టి దాని రక్షణశక్తి ఉంటుంది. అగ్నిభయం ఉన్నచోట్ల జింకు రేకులూ, చల్లదనం కావలసినచోట్ల తాటాకులూ ఎల్లా వాడతామో అల్లాగే మన్నవలసిన పరిస్థితులకు తగిన లేపం ఉండాలి. ఏ రంగు పడితే ఆ రంగు, ఎక్కడ పడితే అక్కడ మన్నదు. ఒక్కొక్క వాతావరణంలో మన్నవలసిన లేపాలను ఒక్కొక్కలాగ తయారుచేస్తారు. వాటిలో తనకు కావలసిన రకాన్ని ఏరుకొని పని చెయ్యాలంటే, లేపాల్లో రకాలు ఏరకం ఏపరిస్థితుల్లో ఉపయోగిస్తుందో తెలియాలి.



పిచికారీతో రంగులు వేయుపద్ధతి

రంగులు వేయించటం కట్టడాల రక్షణకుగాని తమాషాకూ షోకుకూ కాదని గుర్తెరిగిన గృహస్థుకూ, రంగుపని అంటే ఏదో వీలుగా దొరికిన రంగును తనకు వీలైన విధంగా పూసి కూలిడబ్బులు ఏరుకోవటం మాత్రమే కాదు- గృహస్థు పెట్టిన ఖర్చుకు తగినట్లు అతని సొత్తుకు రక్షణా, రాణింపూ అవసరమని తన బాధ్యతను గుర్తించిన పెయింటరుకూ పెయింటు (లేపం) అంటే ఏమిటో, ఏరకం ఏపరిస్థితుల్లో మన్నుతుందో బాగా తెలియాలి.

# • గోదావరీనది పుట్టు, పెంపులు •



పుట్టుక : త్ర్యంబకేశ్వర పాదారవింద సన్నిధానములో ఒక చిన్నధారగా బయలువెడలుచున్న గోదావరీనదీమతల్లి.



పెంపు : నాసికవద్ద నవనవలాడుతూ జలజల ప్రవహించుచున్న గోదావరీనదీమతల్లి.

---

ఈ మహానది తన పవిత్రతోయములతో దుర్భిక్ష ధ్వంసమూ, అఘప్రక్షాళనా చేసి
భుక్తిముక్తులను సమకూర్చుచు ఆంధ్రులపాలిటి కల్పభూజ మయియున్నది.




# వర్తమాన పరిస్థితులు

= శ్రీ కూర్మా వేణుగోపాలస్వామి =

ఆంధ్ర నాటకముయొక్క వివిధ క్షేత్రములందలి లోటుపాటులను చక్కబరచి అభివృద్ధిపొందించవలె ననే మహనీయమైన సంకల్పంతో 'ఆంధ్ర నాటక కళా పరిషత్తు' స్థాపితమై పదిహేను సంవత్సరాలకు పైగా కడచిపోయింది. ఇన్ని సంవత్సరాలుగానూ ఈ పరిషత్తుతో కొంచెమో గొప్పో సంబంధం కలిగివున్నవాణ్ణి కావడంచేత దానియెడల నాకు గల బాధ్యతను త్రోసివేయడం నా కిష్టం లేదు. కాని నాటకాల్లో ఆసక్తి గల కొందరు వ్యక్తులు ఏటేటా పోగై వార్షిక సమావేశాలను జరుపుకోవడంకంటే ఈపరిషత్తువల్ల నెరవేరింది మరేమీ లేదు గదా యని విచారపడుతూవుండే పరిషద్భారవాహుల్లో పెక్కుమందివలె నేనూ విచారించకుండా వుండలేను. ప్రతిసంవత్సరమూ కలిశాం, మన ఆంధ్రులిదివరలో ప్రదర్శించి వదలిన నాటకాల్లోని వాటినే కొన్నిటిని ప్రదర్శించాం, ఎంతో చర్చించుకొన్నాం, ఉపన్యాసాలు చేశాం, రవంత తగవులాడుకొన్నాం, ఎన్నో వాగ్దానాలను గావించాం, చివరకు మన ఉద్యోగాల్లో మనం చేరుకొన్నాం! ఆ సంవత్సరపు అధ్యక్షమహాశయులు తమ భుజములమీది కావడిని దించి మరో అభాగ్యుడైన నాటకప్రియుని స్కంధాల మీద మోపడానికి నిర్ణయించుకొన్న నాడే మళ్లీ మనం కలిసేది!!

### గ్రహచార దోషం

ఆంధ్ర నాటక రంగం గ్రహచారం చాలని 'అమెచూర్' సంప్రదాయానికి చెందినది కాబట్టే ప్రాయశః ఈలాటి శోచనీయవ్యవహారాలు కలుగుతూవుంటాయి. నాటకాన్ని నూటికి నూరుపాళ్లు ఒక వృత్తిగా మన మెప్పుడూ పెట్టుకోలేదు. అభినయాన్నే జీవికకు ముఖ్యాధారంగా పెట్టుకొనివున్న పేరుమోగిన మన నటకావతంసులే తమది నాటకవృత్తియని చెప్పుకోడానికి ఇప్పటికిన్నీ భయపడుతూంటారు. ఏ నాటక నోటీసునైనా ఒక్కమాటు తీసుకొనిచూడండి. డిగ్రీల కున్నంతటి మూల్యాధిక్యత అత్యుత్తమమైన అభినయ ప్రావీణ్యానికి లేనట్లు తెలుస్తుంది. అమెచూరు నటకులు ప్రొఫెషనల్ నటీనటుల విషయంలో నిరసనభావంతో ప్రవర్తించడం చూస్తే నాకు మహా కంగారెత్తిపోతుంది. అమెచూరు కంపెనీల హద్దును దాటి ముందుకు మనం కాలిడలేదని నాకు తెలుసు. నూటికి నూరుపాళ్లూ మనం దానిని వొక వృత్తిగా పెట్టుకొంటేనేతప్ప అంతవరకూ మన నాటకరంగం పైకి రాజాలదని నా నమ్మకం. అప్పుడే, అనగా నాటకాన్ని వొక వృత్తిగా పెట్టుకొన్నప్పుడే దానికి మంచి విలువ లభించేదీనీ. కాని అది ఇప్పట్లో సంభవింపబోతుం దని ఆశించడానికి నేను సాహసించను.

### కడచిన పది సంవత్సరాల కథ

కడచిన పదిసంవత్సరాల కాలంలోనూ మనం కొంతవరకు ముందుకు అడుగు వేశా మనడంలో సందేహం లేదు. ఈ పురోగమనం కొంతకుకొంత అభివృద్ధి పొందిన మన అభిరుచులవల్లా, అంతకంటే అధికంగా సినీమాపరిశ్రమతో మనకు గలిగిన సంబంధంవల్లా అయివుంటుంది. ఉదాహరణానికి: నటీనటుల వేషధారణంలోనూ, సజ్జీకరణంలోనూ మన నాటకరంగంలో అమితమైన అభివృద్ధి చేకూరింది. నాటకరంగంమీద నటించే నటకులు తాము ప్రదర్శిస్తూవున్న నాటకపు

కాలంనాటి అసలు వ్యక్తులే యని ప్రేక్షకులకు భ్రమ గొల్పజాలునంతటి నైపుణ్యంతో వేషధారణం చేసుకొను విషయంలో గట్టి ప్రయత్నం జరిగింది. ఇదివరలో ఇట్టి ప్రయత్నం జరుగలేదు; నటకులు ఫలానిఫలాని వారి వేషాలు వేసే సరిపెట్టుకొంటూవుండేవారు ప్రేక్షకులు; ప్రేక్షకులకు వారు ఆ ఐతిహ్యకాలంనాటి అసలు వ్యక్తులనే భ్రమ కలిగేదే కాదు. నాటకమాడుతున్నంతసేపూ వేషధారియొక్క వ్యక్తిత్వమే ప్రేక్షకులకు గోచర మవుతూవుండేది. వస్త్రధారణంలోకూడా ఇప్పుడు మంచిఅభివృద్ధి కలిగింది. కావలసినన్ని వస్త్రాలు ఉండకపోవడంచేత వస్త్రధారణంలో కలిగే అవకతవకలన్నీ ఇప్పుడు రూపుమాశాయి. నటకులు అసలుచారిత్రక వ్యక్తులే యని భ్రమ కలుగుటకు మరో కారణంకూడా తోడ్పడింది. చమ్కీ-జేల్ బూటేదారీమఖ్మల్ డ్రెస్సులనే తగిలించుకోడానికి బదులుగా సరళమైన, సహేతుకమైన వస్త్రధారణం చేసుకొనడమే ఆ కారణం. ఈలాగు వ్రాయడంచేత మొత్తంమీద సర్వసాధారణమైన అభివృద్ధి కొన్ని నాటకాల విషయంలో కలిగిందనే కాని తెలుగువారి నాటకరంగాలలో అసంబద్ధపు, అవకతవక దుస్తులు తగిలించుకొనే నటీనటకులు లేనే లేరని కాదు.

తప్పుడుదారి

ఇవితప్ప ఇతరవిషయాలలో మన మంతగా అభివృద్ధిని పొందలేదని నా అభిప్రాయం. బహుశా అందుకు కారణం నాటకప్రదర్శనవిషయంలో మన మొక తప్పుడుదారి త్రొక్కి-ఉండటం కావచ్చు. నిజానికి మనకు వెనుకనుండి చేయూత నీయగల సంప్రదాయ మేదీ లేదు. మాంచి ఉత్తమస్థానమును ప్రాపించిన సంస్కృతనాటకం మన వెనుకాల వున్నమాట వాస్తవమే; అందులో సందేహం లేదు. కాని మన తెలుగు నాటకము అభివృద్ధిపొందసాగింది పందొమ్మిదో శతాబ్ది చివరి పాదంనుంచే. అంటే 18.5 నుంచే ఆంధ్రనాటకం వికసింపసాగింది. అంతకు పూర్వపు వి నాటకాభాస ప్రాయాలు; తందానపాటలూ, యక్షగానాలూ ఇత్యాదులేగాని రంగస్థలాత్మకమైన నాటకాలు కావు. ఆంగ్లేయసంచారక నాటకకంపెనీలు పార్సీథియేటర్లద్వారా వలసదేశాలకు ప్రయాణంచేస్తూ మన భారతదేశాన్ని సందర్శించిన నాటినుంచే ఆంధ్రనాటక మావిర్భవించింది. పార్సీథియేటర్లద్వారా ఆంగ్లేయనాటకాలతో గలిగిన ఈ కలయికచే విక్టోరియామధ్యకాలంనాడు అత్యున్నత స్థానము నందియుండిన కృత్రిమ - రసభావాత్మక నాటకాల (Melo-drama) తోనే మనకు సంపర్కం ప్రాప్తించింది. ఆ కారణంచేత కల్పితమైన అర్ధ వాస్తవిక (Pseudo-realistic) పద్ధతుల మీదనే మనమూ మన నాటకాన్ని వికసింపజేసుకొన్నాము. అసలు వాస్తవిక (Realistic) నాటకరంగ ప్రసాధన పరికరాలకు అపరిమితమైన ఖర్చవుతుంది. వాస్తవిక నాటకప్రదర్శనానికి మన ఈ దరిద్రదేశంలో ఏదైనా ప్రయత్నం చేశామంటే పడిపోవడమే!

నాటకకర్తలు - రంగస్థల పరిస్థితులు

ఇక మన నాటకకర్తలు - ప్రశస్తమైన భాషలో వ్రాయగలవారున్నారు. రత్నాలవంటి వుద్దేశాలూ వున్నాయి కొందరికి. కాని వీళ్లందరూ రంగస్థలపరిస్థితులను లక్ష్యపెట్టకుండానే నాటకాలను వ్రాస్తూవుంటారు. నాటకరచన పరమరమ్యమైన దనే సంస్కృతోక్తి సాహిత్యక్షేత్రంలో నిస్సందేహంగా యథార్థమైనదే. కాని నాటకాలు చదువుకోడానికిమాత్రమే గాక ప్రదర్శనానికికూడా పనికిరావలసినవి కావడంవల్ల నాటకకర్తలు రంగస్థలవిషయాల్లోకూడా కొంచెం ధ్యానమూనివుండటం సహాయకారిగా వుంటుంది.

ప్రదర్శకుల నెదుర్కొంటున్న పీడకలలు

రంగస్థలంమీది కెక్కించడానికి ముందే కంపెనీకి అంతగా నష్టమేమీ వాటిల్లకుండా ప్రదర్శించడానికి యోగ్యమైన వాస్తవిక నాటక మేదైనా దొరుకుతుందేమో అని ఎంతకాలంగానో నేను ప్రయత్నించాను. కాని గ్రంథకర్త లెత్తుకొనే నాటకవస్తువులే భయానకములైనవి. గ్రంథకర్తకు తన యోగ్యతానైపుణ్యాలను అంతగా ఖర్చుచేసుకోవలసిన అవసరం లేకుండానే పురాణాలనుంచీ, చరిత్రలోనుంచీ అనేకవిషయాలు దొరుకుతాయి నాటకరచనకు. కాని కుబేరసహాయం లేని వాస్తవిక ప్రదర్శనకర్తకవి పీడకలలవంటివి. గ్రంథకర్తకంతగా కష్టమేమీ కలిగించని ఆధునిక సాంఘిక నాటకములుసైతం సమగ్ర గ్రథనావిషయంలో కొరతపడినవి

గానే కనుపిస్తున్నాయి. పాశ్చాత్యదేశాల్లో సాధారణంగా నగటుబూద నాటకానికి మూడుకంటే ఎక్కువ అంకాలు వుండవు. ఎక్కువకుఎక్కువ రంగస్థల పరివర్తనాలుకూడా మూడుసార్లకంటే ఎక్కువ వుండవు. మూడుగంటల కాలావధి గల సాయంతన ప్రదర్శనంలో ప్రేక్షకులు దాహం గీహం తీర్చుకోడానికి గాను ప్రాయశః పది నిముషాల చొప్పున రెండు విశ్రాంతి సమయా లుంటవి. ఆ సమయాల్లో ప్రదర్శనకర్తకు సెట్టింగులను మార్చుకోడానికి అవకాశం బాగా దొరుకుతుంది. కాని భారతీయనాటకంలో రంగాలు అనేకం. వాస్తవికాత్మకంగా వాటిని ప్రదర్శించాలంటే రంగపరివర్తనకే ఎన్నోగంటలు పడుతవి. గ్రంథకర్తలు తమ నాటకాలకు పృష్ఠభూమికగా రంగప్రసాధన మొకటి వున్నదని మనసులో బెట్టుకొని, సాయంతన ప్రదర్శనాల్లో రంగపరివర్తనమే ఒక ప్రధానవిషయం కాకుండు లాగున నాటకములను రచించేయెడల వారు ప్రదర్శకుల కెంతో సహాయపడినవా రవుతారు.

గ్రంథకర్తలు ప్రదర్శనకర్తలమీద ఇన్ని బాధ్యతలు పడవేసేయెడల ముందుముందు నాటకములను సాంకేతికపద్ధతుల (Symbolistic lines) మీదనేగాని వాస్తవిక (Realistic) పద్ధతులమీద ప్రదర్శింపగలుగుటకు వీలేఉండదు.

మూడు పరిమాణాల రంగప్రసాధనలు

వెనకాల బోలెడన్ని కర్టెను లుండడానికంటే మూడు పరిమాణాలు గల ఒకే ఒకవృక్షం అడవినిగాని, పొదరింటినిగాని, తోటనుగాని తలపింపజేయజాలుతుందనీ, ఒక్క స్తంభం ప్రాసాదానికి సరిపోతుందని నా యభిప్రాయం. కాని ఈలాంటి భ్రమ కల్పించడానికి వెలుతురును సమకూర్చడంలో అపరిమితమైన చాకచక్యమూ, నేర్పరితనమూ ఉండాలి. అత్యంతమైన రంగస్థలప్రసాధననైపుణ్యముకూడా వుండాలని దీని తాత్పర్యం. నేర్పరులైన ప్రసాధకులు అనేకచోట్ల లభించగలరనేదీ వొక అదృష్టవిషయం; ప్రదర్శకుడు వొక్క పర్యాయం తన వుద్దేశాలను వారికి వెలిపరిచాడంటే ఇక అతని యభిలషితాలు నెరవేరడంలో కష్టమేమీ వుండదు.

అవకతవక నాట్య, సంగీత మిశ్రణం

ఈ సందర్భంలో ఒకమాట చెప్పవలసివుంది. వినోద ప్రదర్శన విషయంలో ఇది అసలు నాటకమనీ, ఇది గేయాత్మకమైన కామెడీ యనీ, ఇది ఆపెరా యనీ, ఇది నాట్యగాన మనీ, ఇది రివ్వ్యూ అనీ, ఇది వైవిధ్యవినోదప్రదర్శనమనీ స్పష్టంగా విభజించి కనురుచుకోగలిగినంత స్థితిలోకి మన మింకా రాలేదు. నాట్యసంగీతసంమిశ్రణమైన నాటకమే మనకు ఆఖరు గతి. (సంగీతనాట్యసంమిళితమైన నాటక మనే మంచి తరీఖీయతులేని పందెపుగుర్రంమీదనే మనం ఆఖరుకు సవారీచేయవలసింది). ఈ సంమిశ్రణం సముచితవిభాగాల్లో కలిసిందనీ, దీనివల్ల కలిగే ఫలితం అనారోగ్యకరమైనది కాదనీమాత్రం మన మెక్కువకుఎక్కువ ఆశించగలిగింది. సంగీతం లేకుండా, నాట్యంయొక్క కలగలుపు లేకుండా ప్రేక్షకులు మెచ్చుకోగలిగిన నాటకాన్ని ముందే మేధావియైనా, ఏనాడైనా వ్రాయవచ్చు. కాని ఆ సుదినం ఇంకా చాలాదూరంలోనే వున్నట్లు కనబడుతొంది.

ఈ సంమిశ్రణంలోని అవకతవక కలగలుపే మనలను నేడు బాధించేవి. తరుచుగా సంగీతం అపరిమితంగా, మాత్రకు మించి వుండడమూ, కాని సమయంలో నాట్యప్రసంగమూ! ప్రాయః ఈస్థితిగతులలో అభివృద్ధిగావించుకోడానికి ప్రయత్నించవచ్చు. ఒక ఇంగితజ్ఞుడైన ప్రదర్శకుడే ఇందులకు కావలసింది.

స్త్రీపాత్రలు - స్త్రీలు

కడచిన పదిసంవత్సరాల్లోనూ స్త్రీపాత్రలనిమిత్తం పురుషులకుబదులు స్త్రీలనే నియోగించుకోవలె ననే వొక విస్పష్టమైన సంప్రదాయం ఏర్పడింది. అంతకు పూర్వం ఎన్నిసంవత్సరాలుగానో స్త్రీలు స్త్రీపాత్రలను ధరిస్తూవున్నా రనడం వాస్తవమే. కాని అంతకంటే ఎక్కువ తరుచుగా పురుషులే స్త్రీపాత్రలను ధరిస్తూ వచ్చారు. సినీమాయెడల గల జనాదరణ ఆ అభిరుచిని మార్చింది. ప్రేక్షకులు స్త్రీపాత్రలకుగాను పురుషులను అంగీకరించడంలో విముఖత్వం వహించారు.

### రంగస్థలంమీద నటీమణుల వెనుకంజ

కాబట్టి నిరుద్యోగితారకలు పెద్దపెద్దతారలలాగు రంగస్థలంమీద సులభోద్యోగాలను సంపాదించగలిగారు. కాని సినిమాలోకంటె నాటకరంగంమీద అభినయించడం గురదృష్టవశాత్తుగా కష్టతరమవుతుంది. రంగస్థలంమీద నటించే నటీమణులందరికీ-ఎవరికో కొందరికి తప్ప-వారికి కావలసిన కళాసామర్థ్యాలు లేవని, వారి జ్ఞాపకశక్తి దుష్టమైనదనీ, వారు వారి అంతర్గతభావాలను ప్రకటించలేరని, వారి ఉచ్చారణము అశుద్ధమనీ, వారి సంగీతనైపుణ్యాలుపేక్షింపతగినవనీ ప్రేక్షకజనం కనిపెట్టలేకపోరు. స్వాంగధారణం ఆకర్షణీయంగా చేసుకొన్నంతమాత్రంచేత ఈలోపాలు కూడిరావు. కాబట్టే స్థానం, తోట వెంకటేశ్వరరావులవంటి సమర్థులైన పురుషులు ఇంకా స్త్రీపాత్రధారణంలో జనాదరణ పొందుతున్నారనడం ఆశ్చర్యపడదగిన విషయం కాదు.

### అభివృద్ధికి రెండుమార్గాలు

ఈవిషయంలో అభివృద్ధిపరుచుకోడానికి రెండు మార్గాలు కలవని నానమ్మకం. సామర్థ్యం గుప్తంగా ఎక్కడుందో గాలించండి. దాన్ని ప్రోత్సాహపరచండి, రంగస్థల ప్రఖ్యాతియందు గల విలువను నటీజీవికయందు బాసక్తిగల ఏయువతికైనా విశదపరచండి కాని ఈవిధానంవల్ల ఫలితం కలుగుతుందని నేనంతగా ఆశించను. లేక దొరకిన సామగ్రినే అత్యుత్తమంగా పరిణమింపజేయడానికి అనంతమైన సహనంతో ప్రయత్నించండి. ఇది సాధ్యమని నాకు తెలుసు. నటీనిర్మాణమంతా కొన్ని సంవత్సరాలు గడపినతరువాత మరొకరు వచ్చి ఆమెను తీసుకుపోతారనీ, ఆమె తప్పనిసరిగా వెండితెరవైపునకే మొగ్గుతుందనీకూడా నాకు తెలుసు. కాని ఇందువల్ల నిరుత్సాహపడ నవసరం లేదు. ఒక్క కళావతినైనా సృష్టింపగలిగామని తృప్తిపడవచ్చు.

### నాటకాలమీద సినిమాల పోటీ

రంగస్థలంమీద పైకివచ్చిన వ్యక్తిసామర్థ్యం సినిమా పరిశ్రమకు మళ్లుతుందనుకోవలసిందే. అది సహజమే. సినిమాకంపెనీలు పెద్ద పెద్ద జీతాలిస్తవి. నాటకరంగంమీది పనితో పోల్చుకొనేయెడల సినీమాపని అంతకంటే ఎంతో సులభమైంది. కళాసేవకులు నాటకరంగంమీద చూపించవలసినంత ధ్యానమూ, వ్యక్తిత్వమూ సినిమాలో చూపించనక్కరలేదు. సినిమాఅభినయం జ్ఞాపకశక్తి కొంతమాత్రమూ ధక్కానివ్వదు. సినిమాలో ఒకవేళ అభినయం పాడైనయెడల మరికొన్ని అడుగుల సెల్యులాయిడ్ ఖర్చు పెట్టుకుంటే మళ్లీ బాగవుతుంది. కాని నాటకంలో అభినయం రవంత పాడైతే చాలు నాటకమంతా పాడవుతుంది. కాబట్టే నాటకంకంటే సినిమాయే ఎక్కువ లాభకరమైందీ, సులభమైందీ అని భావిస్తున్నారు కళాసేవకులు.

### లాభసాటి మార్గం

కాని ఫిలింరంగాభినయంలో పనిలేని దీర్ఘావకాశాలెన్నో దొరుకుతుంటాయి. ఆసమయాల్లో కళాసేవకులు నాటకప్రదర్శనాలకు తోడ్పడవచ్చు. అందువల్ల ప్రేక్షకులను స్వయంగా కలుసుకోడానికి వారికి అవకాశం దొరుకుతుంది. కళాసేవకులు సమర్థులే యైనయెడల వారి జనాదరణ మరింత ఎక్కువవుతుంది. ప్రస్తుతం ముడిఫిలిము (Raw film) లో కలిగిన కొరతవల్ల సినిమాపరిశ్రమలోకూడా అంత ఎక్కువ పని వుండదు; పరిమితంగానే వుంటుంది. ఈసమయంలో కళాసేవకులు ఎక్కువ పరిశ్రమ చేయవలసిన రంగస్థలంమీద శిక్షణ పొందారంటే అది వారి కెంతో లాభదాయకమవుతుంది. సినిమాపరిశ్రమా, నాటకప్రదర్శనాలూ పరస్పర సహకారం చేసుకొని వర్తించేయెడల కళాసేవలో ఎంతో సాధించవచ్చునని నానమ్మకం.

### నాటకశాలలకే గతిలేదు

ఈ సందర్భంలో నాటకాన్ని సినిమా ఎట్లా లోగొన్నదీ చూస్తే వినోదం కలుగుతుంది. 15 ఏండ్ల క్రిందట ఆంధ్రదేశంలో నాటకశాల లేని పట్నంగాని, పెద్దనగరంగాని కనిపించేదే కాదు. ఈనాడు నాటకాలాడాలంటే నాటకశాలలగల పట్నం ఒక్కటైనా వుంటుందో వుండదో! ఏదైనా నాటకమాడుకోవలెనంటే ఇప్పుడు మనకు దొరికేది సినిమాశాలే. దాన్నే తాత్కాలికంగా నాటకశాలక్రింద మార్చుకొని ఉపయోగించుకోవాలి. సినిమాహాలులో ప్రేక్షకులు కూచునే ఏర్పాట్లూ, ప్రసాధనపరికరాలూ, రంగస్థలపరిమాణ

## కొండాపురము (నైజాము)లో దొరికిన ప్రాచీన వస్తుసంగ్రహము

(క్రీస్తుశక ప్రారంభకాలమునాటివి)

2



రకరకాల నగిషీలతోనూ, నమూనాలతోనూ, చిత్రకల్పనలతోనూ అలంకృతములై యున్నని మెరుగు పెట్టబడిన ఎర్రమంటి పాత్రల తునకలు

మూ నాటకప్రదర్శనాని కెంతమాత్రమూ తగినవిగా వుండవు. అట్టి నాటకశాలయొక్క అద్దెకూడా అపరిమితంగా పెరిగిపోయింది. గుంటూరువంటి ఒక పెద్ద పట్నంలో చూసుకోండి! ఒక్క ప్రదర్శనానికి చెల్లించవలసిన అద్దె రు 135 మొదలు రు 200 వరకూ ఉంటుంది. హాలు ఏనాడు దొరకగలదో అదీ నిశ్చయం లేదు. మనం నాటకం ఏర్పరుచుకొనేనాడు దొరుకుతుందో దొరకదో!

### బహిరంగరంగస్థలాల్లో బయలాటలే గతి

నాటకా లాడుకోవడానికి ఒక నాటకశాలను నిర్మించుకొని భరించవలెనంటే అది అమితవ్యయదాయకం. అందువల్ల కలిగే లాభమూ, అస్థిరమైనది—ఏ వ్యాపారస్థుడినైనా ఆకర్షిస్తుం దనటానికి. ఈ తంటాల నుంచి బయటపడవలెనంటే అనావృతబహిరంగశాలలకే (బయలాటలు) మళ్లాలి. గతసంవత్సరం నవంబరు మాసంలో మేము ఆంధ్రయూనివర్సిటీలో ఈవిధానాన్ని ప్రయోగించిచూశాం. మా నాటకశాలవల్ల మాకైన ఖర్చు చాలా స్వల్పం. అతినిపుణులైన రంగప్రసాధకుల సహకారంతో నాటకాలను ప్రేక్షకులకు ప్రసాదింపగలిగాం. ప్రేక్షకు లొక్కొక్కమారు అయిదువేల మందికంటేగూడా మించుతూవచ్చారు. ఈనాటకాలను ప్రదర్శించినవిధానమూ, ప్రేక్షకులు కూచోడానికి చేసిన ఏర్పాటూ ప్రతివాడూ చూడగలిగేలాగూ, వినగలిగేలాగూ చేయుబడినవి. ప్రేక్షకు లీ నూతనోద్దేశాలతో పరిచయము కలిగియున్నందున వారూ మాకు చాలావరకు తోడ్పడిరని చెప్పకోవడం ముదావహమైన విషయం. కొద్దిలో ఈలాటి ప్రయోగాలు ఏలూరు, విశాఖపట్నాలలోగూడా జరిగాయని విన్నాను. సుడిగాలీ, వానావంగడూ ఏమీ లేకుండావుంటే అనావృతనాటకశాలలే ఈ దేశానికి తగినవని నా అభిప్రాయం. సముచితమైన ఏర్పాట్లు చేయుబడేమొడల ఆవృతనాటకశాలలకంటే అనావృతాలే అధికసౌఖ్యదాయకములవుత వనుకొంటాను.

### నాటకరంగం కలకాలమూ రెక్రూటింగు క్షేత్రంగా ఉండవలసిందేనా?

ఇంకా ఎంతోకాలంవరకూ మన నాటకరంగం అమెచూరుపద్ధతులమీదనే నడుస్తూవుంటుందనీ, సినీమాపరిశ్రమకు పాత్రలను తరిఫీదుచేసి భర్తీచేయుటకు రిక్రూటింగు క్షేత్రంగా ఉండగలదనీ నాకు తడుతూవుంది. కాని ఇందువల్ల మనం ధైర్యం కోలుపోరాదు. క్రొత్త ప్రయోగాలు (Experiments) జనుల అభిరుచిని అభివృద్ధిపరచవచ్చు. ప్రదర్శనపుఖర్చును తగ్గించే అనావృతనాటకశాల మన ప్రయోగాలు సాధ్యములయ్యేలాగు చేస్తుంది. అభివృద్ధిపొందిన నాటకరచన, సంకేతాత్మకములైన సెట్టింగులు, జాగ్రత్తతోకూడిన స్వాంగధారణం, ఉత్సాహవంతులైన నటులు, అనావృతనాటకశాలలు, ఇంగితజ్ఞులు మేధావంతులు నగు సదస్యులు-ఇత్యాదులతో ప్రస్తుతకాలపు రంగస్థలాన్ని ఎంతైనా అభివృద్ధి పొందించగలుగుతాము.



# హే భగవన్!

శ్రీ కల్లూరి అహోబల
రావు



సీ. అంతరాళంబెల్ల నావరించిన నిన్ను
దేవాలయమున బంధించు టేల?
పరిశుభ్రగాత్రుఁడై వరలుచుండెడి నిన్ను
జలకంబులాడించు తలఁపులేల?
ప్రకృతిసంపదలచే రమణీయుఁడగు నిన్ను
శృంగారమును జేయు చింత లేల?
విరుల సౌరభముచేఁ బరిమళించెడి నిన్ను
చెలువుపుష్పములఁ బూజించు టేల?

గీ. ఆఁకలిఁ ద్యజించియున్న నీ యాత్మ కరయ
షడ్రసోపేతభోజనసమితి యేల?
నిత్యపరిపూర్ణ! దురితరాహిత్యహృదయ!
భక్తమందార! నీ కిదే వందనంబు!

సీ. పున్నమజాబిల్లి ముసువుగుర్మంబుల
యంతరార్థంబు నొక్కింతఁ దెలిసి
రిక్కల మిణుకులో నిక్కయాడెడి యాట
వెలది యొయ్యారంపు తళుకు లరసి
'కొక్కరోకో'యను కోడికూఁతఁ జెలంగు
హెచ్చరికనినాద ముచ్చరించి
చివురుజొంపాలలోఁ జెలువారు సౌహార్ద్రి
తత్త్వసారము నిండుతమిని గ్రోలి

గీ. బాలపసిపాపముసినవ్వుపస యెఱింగి
విరుల నెత్తా: సొంపుసంబరము లరసి
నిన్నుఁ జింతించువాఁడె సంపన్నుఁ డరయ
భక్తమందార! నీ కిదే వందనంబు!

సీ. శిలయందు వజ్రంబు మొలిపించి నీదివ్య
శక్తిస్వరూపంబు జాటినావు
నారికేళఫలంబునందు నీరము బోసి
నీరహస్యంబు వర్ణించినావు
ఫణిఫణాగ్రమునందు భవ్యమాణిక్యంబు
చిత్రించి నీగుట్టు చెప్పినావు
అండంబులోపల నడఁగించి పులుగు నీ
దివ్యమాహాత్మ్యంబు దెల్పినావు

గీ. చిత్రవర్ణంబు పూఁతకుఁ జేర్చినావు
కూర్చినాఁడవు ప్రకృతికి గొప్ప చెలువు
ప్రకృతిమధురస్వరంబులఁ బాడినావు
భక్తమందార! నీ కిదే వందనంబు!

# వారప్రవృత్తి

= శ్రీ చివుకుల వెంకటరమణశాస్త్రి =

ఆదివారము, సోమవారము, మంగళవారము, బుధవారము, గురువారము, శుక్రవారము, శనివారము అను నీయేడున్ను వరుసగా భారతదేశమందేగాక ఇతరదేశము లన్నిటిలోను ఆయా దేశభాషలలో ఎట్టి మార్పును లేక సృష్ట్యాదినుండి నేటివరకు అవిచ్ఛిన్నముగా సుప్రసిద్ధవ్యవహారమును గనుచున్నవి. ఈ క్రమము సమస్తభూమండలమందును ఎట్టి వ్యత్యాసమును పొందకుండుటను బట్టి ఈ క్రమమునకు పుష్కలమగు ఉపపత్తి అవశ్యముండితీరవలయును. అద్దాని నీ చిన్నివ్యాసమున నాకు తోచినంతవరకు క్లుప్తముగా ప్రదర్శింతును. ఈవారములు 7 ఏల కావలెను, ఈ క్రమమే ఏల ఉండవలెను అనునది ముఖ్యవిమర్శనీయము.

ఈ 7 పేర్లలో ఒకభాగము ఆది, సోమ మొదలగు సంజ్ఞలును, రెండవది 'వారము' అను శబ్దమున్ను. అందలి రెండవభాగము ఈ 7 లోను సమానముగా నుండి, మొదటి సంజ్ఞాభాగము మాత్రము మార్పుచెందుచున్నది. ఈ 7లో మొదటిదగు 'ఆది' తప్ప మిగిలిన 6న్ను చంద్ర, కుజ, బుధ, గురు, శుక్ర, శని లను గ్రహముల పేర్లుగా సుప్రసిద్ధముగా నున్నందునను, జ్యోతిశ్శాస్త్రమందు కక్ష్యాక్రమముచే చంద్ర, బుధ, శుక్ర, రవి, కుజ, గురు, శని లను ఏడుగ్రహము లని చెప్పబడియుండుటచేతను పరిశేష న్యాయముచే ఆదివార మన రవివార మని పర్యవసన్నమగుచున్నది. అందువల్లనే మన దేశములో బాలురకునయితేను ఆదివారాదులకు రవ్యాదిగ్రహము లధిపతులని బోధింపబడుచున్నది. ఇంగ్లీషుభాషలోను, తదితరభాషలన్నిటిలోనుగూడ రవ్యాదిగ్రహములకు ఆయా భాషలలోని పేర్లను వారమునకు పొందికచేసి వాడబడుటచే యావద్భూమండలమందునుగూడ గ్రహములకు, నీవారములకు సంబంధము నందరంగీకరించి వ్యవహరించుచున్నట్లు అప్రతిహతముగా చెప్పనగును. ఇక, నీ యేడింటికి సాధారణమగు 'వార' శబ్దార్థము గొకింత విచారింతము. "సూర్యాదివారము, తడప-లేక పర్యాయము, సమూహము, వాకిలి, క్షణము, కుబ్జవృక్షము, శివుడు, గుజ్జము" మొదలగు అర్థములు వారశబ్దమున కున్నట్లు నిఘంటువులవల్ల తెలియుచున్నది. ఇందు మొదటిదగు 'సూర్యాదివారము' అనునది వారశబ్దార్థముగా నిఘంటువులు చెప్పుటవల్ల నీ వారశబ్ద మొక పారిభాషికపద మని తెల్లమగుచున్నది. లోకమున 'వృద్ధి'శబ్దము అభివృద్ధి, వడ్డీ మొదలగు అర్థములను బోధించుచున్నను "వృద్ధిరాదైచ్" అను పాణినిసూత్రమునుబట్టి ఎట్లు వైయాకరణులు వృద్ధిశబ్దమున కొక పారిభాషికార్థమును చెప్పుచున్నారో, అట్లే ఈవారశబ్దముగూడ పారిభాషిక మనినపుడు, వారశబ్దపూర్వోచ్చరితములగు రవ్యాదిశబ్దముల ననుసరించి, తద్విషయబోధకమగు జ్యోతిశ్శాస్త్రపరిభాష ననుసరించి యీవారశబ్దార్థము నిరూపింపబడుట సమంజసము.

మన కగోచరమగు విషయమును మనకు బోధించుటకొరకే శాస్త్ర మేర్పడినది. శాస్త్ర మనగా శాసనము చేయునది. ప్రత్యక్షముగా ఆయా ఇంద్రియములతో ఆయా విషయములను కనుగొనుట, అనుపడునట్టి ఒక వస్తువునుంచి అగపడని వస్త్వంతరము నూహించుట మొదలగు లోకసిద్ధమగు సమస్త ఉపాయములచేతను ఏవిషయము మనకు బోధపడదో అట్టి విషయమును బోధించునది శాస్త్రము. అనగా ఇహలోక, పరలోకములందు మనుజునకు స్వభావముచే గల్గు సుఖప్రాప్తి, దుఃఖనివృత్తి యను కోర్కెలను సిద్ధింపజేయుటకు అనేక ఉపాయములను బోధించి మనలను శాసించుటచే నద్దానికి శాస్త్రమని పేరు గలిగియున్నది.

ఈశాస్త్ర మన వేదము, వేదాంగములుమాత్రమే. వేదాంగములలో నొకటగు జ్యోతిశ్శాస్త్రము "ఒకపర్యాయము తూర్పున రవి ఉదయించుటతో నుపలక్షితమగు కాలముగాన వారము" అని నిర్వచించినది. అనగా సూర్యోదయమునుండి తిరిగి సూర్యోదయమువరకు గల కాలము 'వార' మను పరిభాషతో చెప్పబడినది. ఈలక్షణములో సూర్యోదయముతో నుపలక్షితకాలము నేల వారముగా పరిగ్రహింపవలెను? చంద్రోదయముతో నుపలక్షిత కాలము నేల గ్రహింపరాదు? ఇట్లే కుజాదిగ్రహములలో ఒక్కొక్క దానితో నుపలక్షితమగు కాలము నేల గ్రహింపరాదు? అటులనే ఒక నక్షత్రోదయముతో నుపలక్షితకాలము నేల గ్రహింపరాదు? వీటిలో దేనినైనను గ్రహింపనగునా? అటులైనచో నివి యన్నియు సమానకాలము లగునా? సమానములు కానిచో దేనిని గ్రహించి దేనిని పరిత్యజింపవలయును? అట్లొకదానిని పరిగ్రహించుటకు, మిగిలినవాటిని పరిత్యజించుటకు కారణము లెవ్వి? ఈ మొదలగు ప్రశ్నలు పరంపరగా పొడగట్టుటవలన వీటి సమాధానము కుదిరినగాని ఈ'వార' శబ్దమునకు పారిభాషికమగు అర్థము బోధపడదు.

భూమిచుట్టును అనేకనక్షత్రములు, రవ్యాదిగ్రహములును తిరుగుచుండుట మనకు అనుభవములో నున్నది. అందొక కాల

ములో ఒక్కొక్క గ్రహముగాని, నక్షత్రముగాని తూర్పున ఉదయించుట, తిరిగి అదియే కొంతకాలమునకు నెత్తిపైకి తిన్నగా (Meridian) వచ్చుట, తిరిగి అదియే కొంతకాలమునకు పశ్చిమమున అస్తమించుట, తిరిగి ఉదయించుట మనము చూచుచుండుట వలన ఇవన్నియు ఇంచుమించు రోజు కొకమారు భూమిచుట్టు తిరుగుచున్నట్లు ఆబాలగోపాలము ప్రసిద్ధిగానున్నది.

ఇందు నక్షత్రములలో ఏదొక్కటి అయినను తూర్పున ఉదయించినదిమొదలు తిరుగ తూర్పున ఉదయించుటకు 60 ఘడియల కాలము పట్టును. కాని రవ్యాదిగ్రహములుమాత్రము మట్లుగాక 60 ఘడియలకంటె కొంత హెచ్చుకాలమునకు తిరిగి తూర్పున ఉదయించుచున్నవి. ఈవిషయము మనకు మిగిలిన గ్రహములకంటె మిక్కిలి సులభముగా చంద్రోదయములవల్ల గ్రహింపగల్గుచున్నాము. ఈరోజు చంద్రోదయకాలముకంటె రేపటి చంద్రోదయకాలము సుమారు 2 ఘడియలు ఆలస్యముగా నుండుట సార్వజనీనము. దీనిని బట్టి గ్రహ, నక్షత్రముల కక్ష్యలు (Orbits) వర్తులాకారములని తేలుచున్నది. ఒక కుమ్మరిచక్రము వాని ప్రేరణచే పశ్చిమాభిముఖముగా తిరుగుచుండు ననుకొందము. ఆచక్రముమీద A అను ఒక స్థిరమగు చిహ్నము త్రిప్పువాని ముందుకు ఎన్నిపర్యాయములు వచ్చునో అన్నిపర్యాయములు ఆచక్రము తిరిగిన దందుము. ఇది ఒక్కొక్క చుట్టుకు 10 నిముషముల కాలము పట్టె ననుకొందము. ఈ చక్రముమీదనే తూర్పుకు నడచుచున్న ఒక పురుగు ఉండు నట్లు ఉదాహరణ చూచినచో, ఆపురుగు సమముగా 10 నిముషముల కొకమారు త్రిప్పువాని ముందరకు రాక 11 లేక 12 నిముషముల కొకమారు త్రిప్పువాని ముందుకు వచ్చును. ఇట్లే A చిహ్నమువంటి స్థిరచిహ్నములగు అశ్విన్యాదినక్షత్రములతోను, తూర్పునకు తిరుగు చున్న పురుగులవంటి రవ్యాదిగ్రహములతోను గూడిన జ్యోతిశ్చక్రమును ప్రవహవాయువు (భూమికి చాలాఎత్తులో నుండి, కొన్ని శక్తివిశేషములు గల గాలి) అను కుమ్మరి నిరంతరము సమానవేగముతో సృష్ట్యాదినుండి లయపర్యంతము త్రిప్పుచుండును.

అందుచే అశ్విన్యాదినక్షత్రములు స్వతస్సిద్ధమగు ప్రాగ్గమనము లేక, కేవల ప్రవహవాయు ప్రేరణచేమాత్రము నిరంతరము పశ్చిమాభిముఖముగా తిరుగుచున్నవి కావుననే వాటి ఉదయము ఎల్లపుడు సమానముగా 60 ఘడియల కొకమారు అగుచుండును. దానికే నక్షత్రదినము (Sideral day) అని పేరు. కాని రవ్యాది గ్రహములు ఈనక్షత్రములతోపాటు పశ్చిమాభిముఖముగా ప్రవహవాయుప్రేరణచే తిరుగుచూ, స్వశక్తి (Property of Matter) యనదగు అనిర్వచనీయమగు ఒకానొక సామర్థ్యముచే తూర్పునకు నడచుచున్నవి కావున వీటి ఉదయముతో నుపలక్షితమగు వారము 60 ఘడియలకంటె హెచ్చుగా నుండును. పదార్థశక్తులు పరస్పర విలక్షణములుగాన, ఈగ్రహముల గమనముగూడ పరస్పర విలక్షణమున్ను, ప్రతిక్షణవిలక్షణమున్ను ఐయుండును. (Vide: Stewart's Light, Chap VI) ఈస్వశక్తికిన్ని, ఈ'వార' అను పారిభాషికపదమునకును కొంత సంబంధమున్నట్లు ఊహింప వీలుగనుపించుచున్నది. కావుననే, రవిచంద్రులుతప్ప మిగిలిన గ్రహములకు కొంత కాలము ఋజుగమనము (Direct Motion), మరికొంతకాలము వక్రగమనము (Retrograde Motion) నుండుట చూచుచున్నాము. వక్రగమన మనగా వర్తులాకారమార్గమందు ఒక ప్రధానాపేక్షతో (when compared with a main matter) వెనుకకు నడచునట్లు భాసించుటయేగాని వాస్తవముగా వెనుకకు పోవుట కాదని ఈ క్రింది వుదాహరణవల్ల గ్రహింపవచ్చును.

A, B, C, D, E అనువార లైదుగురు ఒక ఫర్లాంగు చుట్టుకొలత గల గుండ్రని క్షేత్రముచుట్టు తిరుగుటకు ఒక నిర్దిష్ట ప్రారంభబిందువునుండి ఒకేసమయమున బయలుదేరి రనుకొందము. వీరల వేగము క్రమముగా నిముషమునకు 5, 4, 3, 2, 1 గజములు, ఆరంభబిందువునుండి బయలుదేరిన 22 నిముషములవరకు అందరు ఋజుగతిలో నున్నను, ఆరంభబిందువునుండి వరుసగా 110,88,66,44,22 గజముల దూరములో నుందురు. అపుడు A కు B మొదలగువారు వరుసగా 22,44,66,88 గజముల వెనుక నుందురు. అపుడు A సమముగా ఆరంభబిందువుకు 180° దూరములో, అనగా వృత్తార్ధములో నుండును. ఆపైనిముషమునుండి హెచ్చు వేగము గల A కు మిగిలినవారు వెనుకకు బదులు ముందున్నట్లగుపడెదరు. A యొక్క ముఖము మార్పుచెందుట ఇందుకు కారణము. ఇట్లారంభబిందువునుండి బయలుదేరిన 44 నిముషములకు A ఆరంభస్థానమును చేరును. అపుడు వానికి E అనువాడు 44 గజముల ముందున్నట్లు భాసించునుగాని 176 గజములు వెనకనున్నట్లు భాసింపడు. ఇదియే చాపీయరేఖాగణితశాస్త్రము (Spherical Geometry and Spherical Trigonometry) యొక్క సంప్రదాయము.

కాన గ్రహముల గతి ప్రతిక్షణవిలక్షణముగాన వీటిలో నొక్కొక్కదాని వుదయముతో నుపలక్షితమగు వారము, లేక దినము సమముగా (Correct) ఇంత యని నిరూపింప వీలులేదు. పరమాధిక (Maximum) పరమాల్ప (Minimum) దినమానములుమాత్రము చెప్పవీలగును. ఈక్రింద అన్నిగ్రహములకు వుదయోపలక్షితదినముల ప్రమాణములు ప్రదర్శింతును.

| | పరమాధిక | పరమాల్ప |
|---|---|---|
| | ఘ. విఘ. | ఘ. విఘ. |
| రవిదినము | 60-11 | 60-8 |
| చంద్రదినము | 62-30 | 61-50 |
| కుజదినము | 60-5 | 59-55 |
| బుధదినము | 60-20 | 59-40 |

| గురుదినము | 60-2 | 59-58 |
|---|---|---|
| శుక్రదినము | 60-15 | 59-45 |
| శనిదినము | 60-2 | 59-59 |

ఈ దినప్రమాణములందలి తారతమ్యమునుబట్టి భూమికి దగ్గర చంద్రగోళమును, ఆపైని వరుసగా దూరదూరములో బుధ, శుక్ర, రవి, కుజ, గురు, శనులయొక్క గోళములున్ను వున్నట్లు సుకరముగా గ్రహింపనగును. దగ్గరలోనుండు గ్రహముయొక్క కక్ష్యా (Orbit) ప్రమాణము అల్పముగాన, స్వల్పకాలములో పూర్తిగా తిరుగుటకు, తద్వారా ఆ గ్రహముయొక్క గతి శీఘ్రమగుటకు వుపపత్తి కుదురును. అట్లే గ్రహకక్ష్య దూరమైనకొలది కక్ష్యాప్రమాణము హెచ్చగుటకును, తద్ద్వారా ఆ గ్రహముయొక్క గతి మందమగుటకును వుపపత్తి కుదురును. (**Vide: Surya Siddhanta and Dynamical Astronomy**)

వైదికవాఙ్మయము ననుసరించి చంద్రగోళము చాలా ప్రధానమైనది. మనము అన్ని ఇంద్రియములతోను చేయు అన్నిపనులను ముందు మనస్సుతో సంకల్పించినగాని ఆవల చేయజాలము. అట్లు అందరి మనస్సులయొక్క కేంద్రస్థానమగు సమష్టిరూపమే చంద్రగోళ మని శాస్త్రహృదయము.

మరిన్ని నదియొక్క ఈవలితీరమం దున్నవానికి ఆవలియొడ్డున దూరదూరములో నున్న వృక్షాదులు వాస్తవముగా నదిఒడ్డునకు చాలాదూరములోను, పరస్పరభిన్నదూరములోను ఉన్నప్పటికి అవి అన్నియు ఒక్కచోటనే, ఆవలియొడ్డున కాన్పించు విధమున భూమికి దూరదూరములో నున్న చంద్ర, బుధ, శుక్ర, రవి, కుజ, గురు, శని నక్షత్రకక్ష్యలు అన్నియు మిక్కిలి దగ్గరలోనుండు చంద్రకక్ష్యలోనే మన కగపడుచుండును.

పై రెండు కారణములనుబట్టియు చంద్రగోళమునకు ఎక్కువ ప్రాశస్త్యము నిచ్చి, ఊర్ధ్వలోకములతో మనకు సంబంధమును గలుగజేయునట్టియు, క్రమముగా జన్మాంతరములందు ఆయాలోకప్రాప్తి యను ఫలమును, క్రమముగా నిశ్శ్రేయసమును మనకు చేకూర్చు క్రతువులు, వుపాసనలు మొదలగు వైదికకర్మలన్నియు ఈచంద్రలోకమే ద్వారముగా గలిగియున్నందున, పై రవ్యాదిదినములలో హెచ్చుప్రమాణము గల్గియున్న చంద్రదినమును, తత్ప్రయుక్తవిశేషముల నన్నిటిని 'చాంద్రమానము' అను విశేషశీర్షికతో శాస్త్రము వినియోగమును బోధించుచున్నది. ఇక మిగిలిన రవి, కుజ, బుధ, గురు, శుక్ర, శని దినములు 6 లో బుజు, వక్రాది భేదములతో నొప్పు దినములను ఒకొక్క చుట్టులో సగటుచేయగా (**Average**) ఘ 60-10 వచ్చును. ఇది రవియొక్క సగటుదినమావమైనది. అందువల్లనే "వారస్యాస్య దేకవారంహి ప్రాచ్యాంశు రవి సంక్రమః" అను శాస్త్రము రవి పేరుతో వారము నుదాహరించినది. మరిన్ని మిగతా గ్రహముల దినములవలె ప్రతిదినము అత్యంత మార్పును చెందక ఈ రవిదినము కొద్దితేడాగా సమానముగా నుండును. గనుకనుగూడ మిగతాగ్రహములపేర్లతోగాక సూర్యుని పేరుతో వారమును బొందికచేసినది. మరిన్ని ఈరవిదినప్రమాణములో ఈషద్వైషమ్యముగా మిగతా అన్నిగ్రహములకు ఒక వారము (పర్యాయము) చక్రభ్రమణము సిద్ధించుచున్నది.

ఇట్టి కారణములచే సూర్యోదయమునుంచి తిరిగి సూర్యోదయమువరకు గల కాలమునకు 'వార'మను శబ్దము పరిభాషింపబడినది. దీనికే కువాసరము,దినము, సూర్యసావనదినము లేక సావనదినము (**Solar Day**) అని పేర్లు.

ఈవారమునకు ప్రారంభకాల మెపు డనునది విమర్శనీయము. మరిన్ని రవ్యాది అన్నిగ్రహములకు ప్రతివారముతోను అవిశేషముగా సంబంధ మేర్పడియుండగా ఆదివారము, సోమవారము అను మొదలగు విశేషవిభజనకు కారణ మేమనియు విమర్శింపవలయును.

వైదికవాఙ్మయములో పూర్వపక్షమతము లేక విరోచనసిద్ధాంతము, సిద్ధాంతమతము లేక ఇంద్రసిద్ధాంతము అను విభాగము గలదు. విరోచనసిద్ధాంతమందు ప్రత్యక్షమే ప్రమాణరాజము; మిగిలినవి తదనుసారులు. ఇంద్రసిద్ధాంతమందన్నో శబ్దప్రమాణము ప్రమాణమూర్ధన్యము; మిగిలినవి తదనుయాయులు. ఉభయమతములందును ప్రత్యక్షమన ఇంద్రియగోచరమగునది; అనుమానమనగా ఇంద్రియగోచరమగు ధూమాదిలింగమునుబట్టి గోచరముగాని అగ్ని మొదలగువాటి నూహించుట; ఉపమానమన ఉదాహరణనుబట్టి గ్రహించుట ఇత్యాదులు సమానము.

కాని శబ్దప్రమాణలక్షణవిషయమై ఉభయసిద్ధాంతములలో కొద్ది భేద మున్నది. విరోచనసిద్ధాంతమందు శబ్దప్రమాణ మనగా యథార్థవక్తయగు ఆప్తుడగు మనుజునివాక్యము. ఇంద్రసిద్ధాంతమందు శబ్దప్రమాణ మనగా యథార్థవక్తయు, సర్వజనులకు ఆప్తుడును అగు ఈశ్వరవాక్యరూపమగు 'వేదమే' శబ్దప్రమాణము.

ఇంద్రసిద్ధాంతమునుబట్టి ప్రతిపదార్థమును అధిష్ఠానదేవతోపేతము - అనగా ఆదిత్యు డను దేవతచే అధిష్ఠింపబడిన నేత్రమే నేత్రేంద్రియము. అట్లే వహ్ని యను దేవతచే అధిష్ఠితమగు సూర్యచంద్రుల 12 భాగల అంతరమే పాడ్యమితిథి. ఇక విరోచనసిద్ధాంతమునుబట్టి కేవలపదార్థమేగాని, పదార్థాతిరిక్తమగున దేమియులేదు. అనగా కేవల నేత్రమే నేత్రేంద్రియము. అటులనే రవిచంద్రుల మధ్యనుండు 12 భాగల దూరమే పాడ్యమితిథి.

ఇట్లే ఇంద్రసిద్ధాంతముప్రకారముకక్ష్యాక్రమముచే పైనచెప్పబడిన చంద్ర,బుధ, శుక్ర, రవి, కుజ, గురు, శనులయొక్క కక్ష్యలు (**Orbits**,అన్నియు ప్రత్యేకముగా నొకొక్క దేవతచే నధిష్ఠింపబడియుండురు. అట్టి అధిష్ఠానదేవతలు సర్వకాలమందును ఆయాకక్ష్యల

నధిష్ఠించియున్నను, వాటిలో నొక్కొక్క కక్ష్యాధిష్ఠానదేవతయొక్క ముఖము కొంతకాలముమాత్రమే భూమికి అభిముఖముగా నుండును. అన్ని కక్ష్యాధిష్ఠానదేవతలయొక్క ముఖమున్ను ఏకకాలమందు భూమికి అభిముఖముగా ఒక ప్రళయకాలమందు తప్ప ఇతరమగు ప్రపంచస్థితికాలములో ఎప్పుడును ఉండదు.

ఈ కక్ష్యాధిష్ఠానదేవతలయొక్క ముఖములు ఒక హోరా (Hour) కాలములో నొక్కొక్కటి చొప్పున మారుచుండును. హోర యన లగ్నములో సగభాగము. దినములో 12 లగ్నములుగాన దినమునకు హోరలు 24. కాన ఈనాడు వారప్రారంభమందు, అనగా ఈనాటి 1-వ హోరలో రవికక్ష్యాధిష్ఠానదేవతయొక్క ముఖము భూమికి అభిముఖముగా నున్నచో ఈనాటి రెండవహోరలో కక్ష్యాక్రమము పైనుంచి క్రిందకు 1 శని 2 గురు 3 కుజ 4 రవి 5 శుక్ర 6 బుధ 7 చంద్ర. గాన రవికక్ష్యకు క్రింది దగు శుక్రకక్ష్యాధిష్ఠానదేవతయొక్క ముఖము భూమికి అభిముఖముగా నుండును. అనగా శుక్రకక్ష్యాధిష్ఠానదేవతముఖము భూమికి అభిముఖమగు కాలమే రెండవ హోరాప్రారంభకాల మగును. ఇట్లే పూర్వహోర సమాప్తియగు కాలమున్ను, పరహోర ఆరంభమగు కాలమున్ను ఆ కక్ష్యాధిష్ఠానదేవతాముఖము భూమికి అభిముఖముగా మారుట మీదనే ఆధారపడియున్నది. అందుకొరకే రోజులో ఈ 24 హోర లను విభాగ మేర్పడెను.

క్రిందిపట్టిక చొప్పున 24 హోరలతో ఆదివారముపూర్తికాగా 25-వ దగు చంద్రహోరతో, లేక చంద్రకక్ష్యాధిష్ఠానదేవతయొక్క ముఖముభూమికి అభిముఖముగానుండు సమయప్రారంభముతో చంద్రవారము, లేక సోమవారము ప్రారంభమగుచున్నది. కావుననే ఆదివారము వెంబడి సోమవార ముండుట ఉపపన్నమగుచున్నది.

ఇట్లు దినమునకు 24 హోరలుగాన ఏడు గ్రహముల కక్ష్యాధిష్ఠానదేవతలు మూడుపర్యాయములు వరుసతిరుగగా $3 \times 7 = 21$ హోరలు పూర్తియగును. నాల్గవ పర్యాయములో మూడు కక్ష్యాధిష్ఠానదేవతలు మారగా, నాల్గవ కక్ష్యాధిష్ఠానదేవతతో మరుసటి వారము ప్రారంభమగును. కావుననే ఏకక్ష్యాధిష్ఠానదేవతతో నే వారము ప్రారంభమగునో ఆవారము ఆగ్రహముపేరుతో పొందిక చేయబడి, సృష్ట్యాదినుండి నేటివరకు సమస్తభూమండలమందును సర్వులచేతను అప్రతిహతముగా వ్యవహరింపబడుచున్నది. ఈ ఈ రహస్యమును సూర్యసిద్ధాంతమందు

"మందామరేజ్యభూపుత్రసూర్యశుక్రేందు జేందవః
పరిభ్రమం త్యథోధస్థాః క్రమశ శ్శీఘ్రగామినః
మందాదధఃక్రమేణ స్యు శ్చతుర్థా దివసాధిపాః
హోరేశా స్సూర్యతనయా దధోధః క్రమశ స్తథా"

పైవిధముగా వెలిబుచ్చిన తద్గ్రంథకర్త సృష్ట్యాదిలయ

| ఆదివారమునాటి 3 | వ హోరలో | శుక్రుని | క్రింద దిగు | బుధ | కక్ష్యాధిష్ఠానదేవతముఖము | భూమికి | అభిముఖముగా | నుండును. |
|---|---|---|---|---|---|---|---|---|
| 4 | ,, | బుధుని | ,, | చంద్ర | ,, | ,, | ,, | ,, |
| 5 | ,, | చంద్రుని | ,, | శని | ,, | ,, | ,, | ,, |
| 6 | ,, | శనికి | ,, | గురు | ,, | ,, | ,, | ,, |
| 7 | ,, | గురునకు | ,, | కుజ | ,, | ,, | ,, | ,, |
| 8 | ,, | కుజునకు | ,, | రవి | ,, | ,, | ,, | ,, |
| 9 | ,, | రవికి | ,, | శుక్ర | ,, | ,, | ,, | ,, |
| 10 | ,, | శుక్రునకు | ,, | బుధ | ,, | ,, | ,, | ,, |
| 11 | ,, | బుధునకు | ,, | చంద్ర | ,, | ,, | ,, | ,, |
| 12 | ,, | చంద్రునకు | ,, | శని | ,, | ,, | ,, | ,, |
| 13 | ,, | శనికి | ,, | గురు | ,, | ,, | ,, | ,, |
| 14 | ,, | గురునకు | ,, | కుజ | ,, | ,, | ,, | ,, |
| 15 | ,, | కుజునకు | ,, | రవి | ,, | ,, | ,, | ,, |
| 16 | ,, | రవికి | ,, | శుక్ర | ,, | ,, | ,, | ,, |
| 17 | ,, | శుక్రునకు | ,, | బుధ | ,, | ,, | ,, | ,, |
| 18 | ,, | బుధునకు | ,, | చంద్ర | ,, | ,, | ,, | ,, |
| 19 | ,, | చంద్రునకు | ,, | శని | ,, | ,, | ,, | ,, |
| 20 | ,, | శనికి | ,, | గురు | ,, | ,, | ,, | ,, |
| 21 | ,, | గురునకు | ,, | కుజ | ,, | ,, | ,, | ,, |
| 22 | ,, | కుజునకు | ,, | రవి | ,, | ,, | ,, | ,, |
| 23 | ,, | రవికి | ,, | శుక్ర | ,, | ,, | ,, | ,, |
| 24 | ,, | శుక్రునకు | ,, | బుధ | ,, | ,, | ,, | ,, |
| 25 | ,, | బుధునకు | ,, | చంద్ర | ,, | ,, | ,, | ,, |

పర్యంతము నిరంతరము సహస్రప్రభాభాసమానమగు కీర్తిని ప్రాచ్య పాశ్చాత్యదేశీయవిజ్ఞానములలోకెల్ల భారతీయవిజ్ఞానాతిశయమును వేనోళ్ల చాటుచు ఆచంద్రతారార్కము శాశ్వతముగా విరాజిల్లు ననుట కెవరును వెనుదీయరని నా విశ్వాసము. అట్టివాడు శ్రీ సూర్యుడుగాక అన్యు డెవడగును?

ఈవిధముగా రవికక్ష్యకు 4 వది చంద్రకక్ష్య, దానికి నాల్గ వది కుజకక్ష్య, దానికి నాల్గవది బుధకక్ష్య, దానికి నాల్గవది గురు కక్ష్య, దానికి నాల్గవది శుక్రకక్ష్య, దానికి నాల్గవది శనికక్ష్య, దానికి నాల్గవది రవికక్ష్య అగుచున్నవి.

కావుననే 1 ఆదివారము, 2 సోమవారము, 3 కుజ, లేక మంగళవారము, 4 బుధవారము, 5 గురువారము, 6 శుక్రవారము, 7 శనివారము; 8-వగి తిరిగి పైయుక్తిచే రవివారము, లేక ఆదివారమే యగుచున్నది. కావుననే వారము లేడు. అంతకు హెచ్చుగాని, తక్కువగాని యుండ వీలులేదు.

ఇట్టి క్రమమునకు, సప్తసంఖ్యకు ఉపపత్తి కుదరగా నీ యేడింటిలో ఏఒకదానినైనను మొదటనుంచి లెక్కించుటకు అవి శేషముగా అవకాశము గల్గియుండ, ముందు ఆదివారముతోనే ఏల వారములను లెక్కింపవలె ననునది విమర్శింతము. ఆది యనగా ప్రారంభ మను అర్థము సుప్రసిద్ధము. దేనికి ప్రారంభ మను నాశంక కలుగగా, ప్రపంచమంతటను నీ ఆదివారాదిగా వారములను లెక్కించుచు వ్యవహరించుచున్నందున ప్రపంచసృష్టికి ఆది, లేక ప్రారంభ కాలము అని తేలుచున్నందున సృష్ట్యాదికాలమునుగూర్చి ఒకింత విమర్శింతము.

ప్రకృతము అనేకగ్రహములు (Planets), వాటికి సంబం ధించిన ఉచ్చలు (Apogees), వాటి పాతలు (Nodes) ఇవన్నియు నకు ఆకాశమందు భిన్నభిన్నస్థానములందు కనుపించుచున్నవి. వాటి చలనముగూడ భాసించుచున్నది. ఆరంభకాల మెప్పుడును అన్నియు నొక నిర్దిష్టారంభస్థానమందుండి బయలుదేర కాలమే కావలయును.

స్కూళ్లలో ఆటలలోగూడ (Sports) మైలుదూరము పరుగెత్తుఆట (One mile race) లో అందుకు సిద్ధపడిన పిల్లల నందరను ఒక నిర్దిష్ట ఆరంభస్థానమందు చేర్చి ఒకేకాలములో అందరను పరుగెత్తుట కారంభింపజేయుట మనము చూచుచున్నాము. అటులనే పరమేశ్వరుడు కల్పాదియందు నీగ్రహ, తదుచ్చ, పాతల నన్నిటిని సృష్టిచేసి ఒకే నిర్దిష్టారంభస్థానమగు మేషాదియం (First point of Aries) దుంచి, అటనుంచి వారలకు చలనమును ప్రారంభింపజేసెను. కాన ప్రకృతమందలి గ్రహముల భిన్నభిన్న స్థానములు వారల గతులను (Velocity) బట్టి వీరందరు ఆరంభ బిందువునందు ఎంతకాలముకిందట నుందురు అని లెక్కించగా, నీ తారణసంవత్సరాదికి 195, 58, 85,045 సంవత్సరములకు పూర్వ మందు చైత్రశుద్ధ పాడ్యమి ఆదివారమునా డగును. అంతేగాని పాశ్చాత్యులు కొందరు చెప్పిన క్రీ. పూ. 4004 గాని, జోసెఫ్ స్కాలిగర్ (Joseph Scaliger) చెప్పిన క్రీ. పూ. 4713 గాని ఇత్యాది పురుషుల బుద్ధికి స్వేచ్ఛగా తోచినట్టి తేదీలు ఎంతమాత్రము గావు. అవన్నియు గణితయుక్తిసహములుగాక యుక్తిశూన్యములే యగును. ప్రపంచము ఎప్పుడు అనాదిఅయినను, ఒక కల్పకాలము స్థితియు(432,00,00,000)తిరిగి కల్పకాలము ప్రళయమున్ను అగును. అట్టి కల్పాది ననుసరించి నేటికి 195,58,85,045 అని చెప్పబడినది. సృష్ట్యాది ఆదివారముతో ప్రారంభమగుటకనే నేటికిని అన్ని దేశములందును ఆదివారాదిగా వారములను లెక్కించుట అప్రతి హతముగా వ్యవహారములో నున్నది.

ఇకను వారప్రవృత్తి సూర్యోదయముతో ప్రారంభమా, లేక ఎప్పుడు వారము ప్రారంభ మగు ననునది విమర్శింతము.

భూమండలీయమధ్యరేఖపై (Equator) పరస్పరసమానము లగు దూరములో 4 స్థానములను శాస్త్రము నిర్ణయించినది. ఆ స్థానములు ప్రకృతపు గ్రీనిచ్‌నుండి లెక్కించివేసిన రేఖాంశల (Longitudes) ప్రకారము 76° యున్ను, భూమధ్యరేఖయు కలసిన స్థాన మొకటి; 166° యున్ను భూమధ్యరేఖయు కలసినది రెండవది; 256° యు భూమధ్యరేఖయు కలసినది మూడవది; 346° యు, భూమధ్యరేఖయు కలసినది నాల్గవది. ఇందు ఒక స్థానములో సూర్యోదయ మగునపుడే రెండవస్థానములో మధ్యాహ్నము, మూడవస్థానములో సూర్యా స్తమయము 4-వ స్థానములో అర్ధరాత్రియు నగును. ఇట్టి గణనా సౌకర్యముకొరకే శాస్త్రము ఈ నాలుగు స్థానములను నిర్దేశించినది.

సృష్ట్యాదికాలము ఇందలి మొదటిస్థానములో అర్ధరాత్రియు, రెండవస్థానములో సూర్యోదయకాలమును, మూడవ స్థానములో మధ్యాహ్నమును, నాల్గవస్థానములో సూర్యాస్తమయకాలమున్ను అగును. కాన ఆయాదేశప్రాంతవాసులు ఈప్రకారము వారముల ప్రారంభమును గ్రహించుచో, వైదికసిద్ధాంతముప్రకారము తత్కా లీనవారాధిపగ్రహకక్ష్యాధిష్ఠానదేవతాభిముఖ్యరూపమగు, సోపపత్తిక మగు వారఫలమును పొందగల్గుదురు.

పైకక్ష్యాక్రమ మంతయు భూకేంద్రకపద్ధతి (Geo-centric System) ననుసరించి శాస్త్రము బోధించినది. మరియొక పద్ధతిలో నీవారముల క్రమము ఎంతమాత్రము కుదరనట్లు తోచుచున్నది.

పాశ్చాత్యులు 15 శతాబ్దమువరకు నీభూకేంద్రకపద్ధతినే అవ లంబించి, అనంతరమునుంచి నేటివరకు అనేకులచే అనేకరకములగు మార్పుల నొందించి ప్రకృతము సూర్యకేంద్రకపద్ధతి (Heliccentric System) ననుసరించియే గ్రహగతులను నిర్ణయించుచున్నారు.

(Nautical Almanack). ఈక్రింద క్లుప్తముగా వారల మార్పుల కాలముల నుదాహరించుదును.

1500 A. D. Copernicus of Greece
1550 ,, Tykobrahio of Sweden.
1609 ,, Kipler.
1687 ,, Newton
1582 ,, Gregory XIII
1610 ,, Galileo
1898 ,, W. H. Pickering.
1892 ,, Barnard
1901 ,, A. Hinks
1906 ,, Perrine
1908 ,, Melotte
914 ,, Nicholson
1600 ,, Tycho Brahe
1675 ,, Roemer of Denmark.
1725 ,, Bradley
1851 ,, M Fowcault
1921 ,, International Astronomical Conference
1931 ,, ,,

(Vide: History of Astronomy)

ప్రకృతము వారల అమలులో నున్న సూర్యకేంద్రకపద్ధతి ప్రకారము సూర్యునకు క్రమముగా బుధ, శుక్ర, భూమి (ఇచట భూమికి చంద్రు డుపగ్రహము) కుజ, గురు, శనులు దూరదూరములో నుందురు. చంద్రుని (ఉపగ్రహముకావున) గ్రహములలో లెక్కింప నవసరముకాదు. అపుడు బుధ, శుక్ర, భూమి, కుజ, గురు, శనులు అను 6 ను, యురేనస్, నెప్ట్యూన్, ప్లూటో అను మూడును మొత్తం 9 గ్రహములు వ్యవహరింపబడవలెను. అందుచే ప్రకృతము తొమ్మిది వారములను లెక్కింప సమంజసముగాని, ప్రాచీనపు ఏడువారములను లెక్కించుట ఆపద్ధతిలో సమంజసముగా తోచుటలేదు. Bodes - Law ప్రకారము మరికొన్ని గ్రహము లుండవలెను. అవి ప్రకృతము గోచరముగానంతవరకు ఈ 9 వారములతో వ్యవహరించవలెను. మరియొక గ్రహము గోచరించినపుడు వారసంఖ్య పెరుగవలెను. లేక చంద్రుని గ్రహముగా గ్రహించుచో, కుజ, గురు, శనులకు గల ఉపగ్రహములనుగూడ సాజాత్యముచే గ్రహింపవలసివచ్చును. అన్నిటిని గ్రహించుచో వారముల సంఖ్య పుష్కలత్వము నొందును. అట్లే Revolution Theory ను, Vibration Theory ను విమర్శించినచో వారముల సంఖ్య ఇంకను పెరుగును.

లేక 15-వ శతాబ్దమునకుకాని, లేక ఏదో ఒకకాలమును ఏర్పరుచుకొని ఆకాలమునకు పూర్వముగాని అందరిచేతను తెలుసుకొనబడిన గ్రహములకుమాత్రమే వారములను ఏర్పరచుదుమను ఒక సంప్రదాయము (Convention) చేయునెడలగూడా సూర్యునినుంచి బుధ,శుక్ర,భూమి, చంద్ర, కుజ, గురు, శనులనుమాత్రమే ఆపద్ధతిలో గ్రహించినను, వెనుక మనము తెలుసుకున్న కక్ష్యాక్రమములోని నాల్గవ గ్రహము మరుసటి వారాధిపతి యగు నను నియమానుసారముగా 1 భూవారము, 2 శనివారము, 3 చంద్రవారము, 4 బుధవారము, 5 కుజవారము, 6 శుక్రవారము, 7 గురువారము అను నీక్రమము సిద్ధించును.

అట్లుగాక "The Earth's heleocentric longitude differs from the sun's geocentric longitude by 180°" అను నియమానుసారము విమర్శించి పై సూర్యకేంద్రక గ్రహముల కక్ష్యాక్రమములో సూర్యుని స్థానమునకు భూమిని, భూస్థానమునకు సూర్యుని మార్చినచో అపుడు కక్ష్యాక్రమము భూమినుండి చంద్రుడు (ఉపగ్రహముగాన భూమిదగ్గర నుండుట నంగీకరించి), 2 శుక్రుడు, 3 బుధుడు, 4 సూర్యుడు, 5 కుజుడు, 6 గురువు, 7 శని అను క్రమము సిద్ధించును. లేక పైనుండి 1 శని, 2 గురువు, 3 కుజుడు, 4 సూర్యుడు, 5 బుధుడు, 6 శుక్రుడు, 7 చంద్రుడు అను క్రమము సిద్ధించును.

"మందాదధః క్రమేణస్యు శ్చతుర్థా దివసాధిపాః" పైనుంచి క్రిందకు నాల్గవగ్రహము వారాధిపతి యగు నను పూర్వయుక్తి ననుసరించి 1 శనివారము, 2 రవివారము, 3 సోమవారము, 4 మంగళవారము, 5 శుక్రవారము, 6 గురువారము, 7 బుధవారము, 8 తిరిగి శనివారము అను క్రమము సిద్ధించును.

మరిన్ని సృష్ట్యాదికాలము 195,58,85,045 సం. లని అంగీకరింపక, క్రీ. పూ. 4004 గాని, క్రీ. పూ. 4718 గాని ఆరంభకాలమని అంగీకరించుచో ఆదివారము ప్రారంభవారముకాక, మరియొకటి ఒక్కొక్కమతమున ఒక్కొక్కవారము ఆరంభవార మగుచుండును.

కాన పాశ్చాత్యులున్ను, వారిచే బోధలనొందిన యూనివర్సిటీ పట్టభద్రులున్ను ఈవిషయమునుగూర్చి సమగ్రముగ విమర్శ లేక, పరిశోధనయొనర్చి, ఉపపత్తితో గూడిన వారముల క్రమమును నిర్ణయించి, అట్టిక్రమమును లోకమునంతట, లేక పాశ్చాత్యనాగరికతా దేశములలోనైనను ముందు అమలుజరిపించుటగాని, లేక ఉపపన్నములగు వారక్రమమును బట్టి గణితవిధానములను మార్చుటయో, లేక సూర్యకేంద్రకగణితవిధానమునకును, ఇపుడు లోకప్రసిద్ధమగు వారక్రమమునకు ఉపపన్నమగు సంబంధమును కుదుర్చుటయో, ఎద్దియో ఒక విమర్శనాపూర్వకనిర్ణయము చేయగోరుచు ప్రకృతమింతతో నీవిషయమును ముగించి, పాఠకమహాశయులకు వదలివేయుచున్నాను.